## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100068717

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit,<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయసూచిక.

# ధ్యానము.

శ్లో॥ సద్యోద్యచ్ఛవి భృద్విశుద్ధ దహరాకాశే పరాలింగితే।
దృశ్యాదృశ్య విలక్షణ స్థల వసత్సోమార్క బింబోజ్వలే।
దీర్ఘాస్యాంతర భోగిభోగ నిలయే దివ్యర్షి సంసేవితే।
శస్తాఖండ సుఖప్రదే పరమ గీతాధాత్రి నోఽవానఘే॥

శ్లో॥ నానాజీవ లలాటలేఖన కళాప్రేంఖన్మనీ షాయతే।
ప్రావృడ్భీమ పయోధ రారవ మిళద్గంభీర భావోదయే।
సర్వామ్నాయ పురాణ నిష్కుట నటత్పేశ స్వరదాభాలకే।
ద్వైతాద్వైత వివర్జితే పరమ గీతాధాత్రి నోఽవానఘే॥

శ్లో॥ నీరాగార్ద్ర కలా కలాప కలనే నిర్వాణ పాంథప్రియే।
బాహ్యాభ్యంతర శబ్దరూప విలయస్థానే రణద్రూపిణి।
శ్రీకంఠాత్సృత సర్వమంగళ సుశబ్దవ్రాత సంశోభితే।
త్వాంతర్జ్యోతిషి ధారయే పరమ గీతాధాత్రి నోఽవానఘే॥

శ్లో॥ దళదప్రేం ఖదదభ్ర శుభ్ర దహరాభ్రధ్వాన గంభీర భా।
షిణి భాస్వచ్ఛతకోటి దీప్తి నిలయే లోకత్రయోత్పత్తి సం
స్థితి సంహార విచక్షణే సకల విద్వత్పూజ్య పాదాంబుజే।
నవ శృంగాటక నిష్కుటే పరమ గీతాధాత్రి నోఽవానఘే॥

శ్లో॥ సకల స్థావర జంగమాంతర నినాద బ్రహ్మరూపోజ్వలే।
భవరోగార్తి హరౌషధప్రద మురారేర్వక్త్ర పద్మాత్సృతే।
సదసత్తత్త్వ వివేక విస్ఫురిత నిత్యానంద సంపత్ప్రదే।
శతపత్రాంచిత లోచనే పరమ గీతాధాత్రి నోఽవానఘే॥

ఓం. తత్. సత్.

# శతపత్రము.

## 85

గీతమన్నను, గానమన్నను "పాట" యని యర్థము. దీనిని కొందఱు
గీతయనియుఁ జెప్పుదురు. నాటకములయందును, సంగీత సభలయందును
కొందఱు విద్వాంసులు గానము సేయుచుండుట మీరు చూచి యుందురు.
ఆ గానము సర్వజనులకు వచ్చునదికాదు. వచ్చినవారికైనను పరిశుద్ధము
లైన జంత్రిగాత్రము లుండవలయును. సంతోషకరమైన సమయము కావల
యును. ఇన్నియున్నను వానికి కంఠస్థమైయున్న పాట ముగిసిపోఁగానే నోరు
మూఁత పడిపోవుచున్నది. అటుపైన వినఁదలఁచుకొన్నను వినఁజాలము ఇది
బాహ్యేంద్రియ వ్యాపారములోఁజేరిన శబ్దరూపమైన గానము. కాఁబట్టి
కాలపరిచ్ఛేదమునకు లోఁబడుచున్నది. ఒకప్పుడుండి మఱియొకప్పుడు
లేకుండ పోవుచున్నది ఒక ప్రదేశములో ఒకనికి లభించుచున్నది, మఱి
యొక ప్రదేశములో మఱియొకనికి లభింపకపోవుచున్నది. సర్వకాల సర్వా
వస్థలయందును సర్వజనులకు అందుపాటులో నుండునది కాదు, అందువల్ల
ఇట్టి గానము పూజనీయమైనదని చెప్పరాదు.

బాహ్యములైన శబ్దరూపములు నోరు కంఠ పెదవులు, కన్నులు
బాగుగ మూసికొని తమలోఁదాము ఆలకించినచో అర్థము తెలియని మనో
హరమైన గానమొకటి వినఁబడునని యింతకు మున్నొకప్పుడు తెలుపఁబడి
యుండెను సమస్తజీవులు దీనిచే రక్షింపఁబడుచున్నవి కనుక దీనికి 'ఓంకార'
మనిపేరు కలిగినది. సర్వభూతములయందు ప్రణుతికెక్కి యుండుటచే 'ప్రణవ'
మని పేరు వచ్చినది. మనము విన్నను, వినకున్నను, మేలుకొనియున్నను,
నిద్రించుచున్నను మన ప్రయత్నమెంత మాత్రములేక తనకుఁదానే
యీ గానము పాడుచుండును అది లోపల ధ్వనించుచుండునంతవఱకు శరీరము
సురక్షితముగ నుండును ఆ గానము లేకపోఁగానే శరీరము నశించుచున్నది.
జీవులను వృద్ధిచేయు ప్రజాశక్తి దీనియందు ప్రసిద్ధమై యుండుటచేతను, దీని

నుపాసించు యోగులకు ఆత్మబలము వృద్ధియగునట్లు చేయును "బృహద్వృద్ధౌ" అను సూత్రమునుబట్టి యీ గానమునకు 'నాదబ్రహ్మ' యనిపేరు. శబ్ద బ్రహ్మయనియుఁ జెప్పుదురు. కుండలి స్థానమున చిత్ప్రకాశముతోఁ గూడుకొని భగవత్తత్త్వమునందే యీ గాన ముద్భవించుచున్నది. ఈ గానము నందు ప్రకాశించు చిత్కళలో అమృతప్రద లక్ష్యార్థమైన భగవత్తత్త్వము నిష్కళారూపమై యున్నది. సమస్తగానములలో ఈ గానమే పూజ్యనీయమైనది. ఐశ్వర్యవంతమైనది, ప్రకాశమానమైనది. గొప్పనుపినములలో గూడినది, సర్వజన సేవ్యమైనది, అందువలన 'భజసేవాయాం' అను సూత్రమునుబట్టి యీ గానమును 'భగవద్గీత' యందురు. నాదబిందు కళలకు అతీతమై గుణకర్మాదుల నంటకయుండు పరిశుద్ధతత్త్వమును అంతర్లోచనాను నిశ్శబ్దముగ మననము సేయుట భగవద్గీతయని యోగీశ్వరుల మతము

జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, పంచవాయువులు, మనస్సు, బుద్ధి, చిత్తము, అను పదునెనిమిది స్రోతవలచే ఆత్మకిరణములు ప్రవృత్తి వ్యాపారములకు వ్యాపించుచున్నవి. "అయగతౌ" అను సూత్రము వలన ఈస్రోతవలకు అయనములనిపేరు. ఒకొక్కమార్గమునఁబోవు కిరణములను మరలించి కేంద్రస్థానమునకుఁ జేరవేయు పద్ధతికి యోగశాస్త్రములో అధ్యాయనమనియు, అధ్యాయమనియుఁ బేరు పదునెనిమిది మార్గముల నధిగమించి ఆ మార్గములన్నిటిని ఒక్కస్థానమునకుఁ జేర్చి స్వస్వరూప ధ్యానముచేసినచో పదునెనిమిది యధ్యాయములలో నిర్దిష్టమైన ఆత్మగానము (భగవద్గీత) పర్యాప్తమగుచున్నది మనసేంద్రియములు బహిర్గతము లగుచుండ ఆత్మగానము అలవడనేరదు

లోకములో ప్రారబ్ధమని చెప్పఁబడు పూర్వకృత కర్మఫలము ననుభవించుచు నేయి సర్వదా ఆత్మగానము (భగవద్గీత)ను అభ్యసించుచుండునో అనఁగిలవాఁడె ముక్తుఁడు, సుఖవంతుఁడు నగును, వానికి కర్మ అంటదు. తామరాకునకు జలమంటదుకదా; అట్లే ఆత్మగానము నభ్యాసము చేయు

వాసిన స్వర్ణస్తేయము (బంగారు దొంగిలించుట), సురాపానము (బ్రహ్మహత్య గురుపత్నీగమనము మొదలైన మహాపాపములుగాని, సామాన్య పాపములు గాని, యెప్పుడు నంటవు. అట్టివి చేయడని భావము. ఆదరణీయమైన ఆత్మ గానము ఏస్థానమున పారము సేయఁబడు చున్నదో ఆస్థానముననే సర్వ తీర్థములును, ప్రయాగాదులును ఉండును. 'తీర్థమనఁగా తరింపఁజేయునది, ప్రయాగమనఁగా లెస్సయైన దేవపూజ' యని తెలియవలయును. భౌతికమైన జలములు, నగరములునని యూహించుట పొరపాటు. మఱియు ఏస్థానమున భగవద్గీత వర్తించుచున్నదో ఆకుండలి స్థానమందే దేవతలు ఋషులు మొదలైన దైవపరాయణుల ఆత్మకళలు తోడగుచుండును.

నిర్మలమైన, నిష్కళరూపమైన యీ యాత్మగానము (భగవద్గీత) ఎచ్చట చదువఁబడుచున్నదో, చనువఁబడుచున్నదో చదివింపఁబడుచున్నదో, ఆలకింపఁబడుచున్నదో అచ్చటనే భగవత్తత్త్వము సర్వదా నివసించియుండును ఇది నిశ్చయము. భగవత్తత్త్వమునకు ఈగానమే ఉత్తమమైన ఆత్మవిద్య, జీవులయందలి ఆత్మబలమును పెంపొందించునది, భగవత్తత్త్వమునకు స్వకీయమైనది, పలుకులచే వర్ణింపగాని పరము తానైనది, అర్థమాత్రాక్షర స్వరూపమైనది, నిత్యమైనది ఇందునకు సంశయములేదు శిష్యుల హృదయ తాపములను, గుణకర్మములను హరించు సంకల్ప తత్త్వ స్వరూపుఁడును, జ్ఞానములో, ఆనందములోఁ గూడినవాఁడు నైన గురువుచే నిర్మలాంతః కరణుఁడును, అర్జునకీర్తి సమన్వితుఁడునగు అర్థవిద్యార్థి ప్రత్యక్షముగ బోధింపఁబడినది. మనోవాక్కాయ కర్మలవృత్తులనెఱుగు ప్రేరక తానైనది. శ్రేష్ఠమైన ఆనందము కలిగినది శుద్ధతత్త్వమనెడు అర్థములో, నిర్మలమైన జ్ఞానములోఁ గూడినది.

పదునెనిమిది మార్గములఁ జరించువాఁడు ఒక్క కోటనిలిచి యాత్మగానమునఁ దానందించుటకు వీలుపడదు. కనుక ఆమార్గములనెల్ల అవరోధించి తన్నుఁదానే మరల్చుకొని పవనములను, మానసేంద్రియములను

స్వాధీనమునకుఁ దెచ్చుకొని చలనములేని మనస్సు గలవాఁడై యెవఁడైతే నిరంతరము పదునెనిమిది యధ్యాయముల ఆత్మగానము (భగవద్గీత) పర్యాప్తముగ అభ్యాసముచేయుచున్నాఁడో వానియందు జ్ఞానము సిద్ధాంతమగుచున్నది. అటుపిమ్మట నిత్యశుభ ప్రతిపాదకమైన ఉత్తమస్థానమును పొందుచున్నాఁడు. ఒకటేసారి సంపూర్ణముగా అభ్యసింపఁజాలనివాఁడు ఒకసారి యర్థము, ఇంకొకసారి మఱియొక యర్థము అభ్యసింపవచ్చును. అట్టివానికి దివ్యలోకమును దానముచేసినంత పుణ్యము లభించును, ఇందు సంశయములేదు. ఒక్కొక్కసారి మూఁడవపాలు అభ్యసించువారికి సుఖస్థానము పొందఁదగిన శుచిత్వము కలుగుచున్నది. ఆఱవభాగము నభ్యసించువారికి అమృతమును సేవించినంత ఫలము కలుగుచున్నది. నిర్మలమైన భక్తితో నిత్యము ఒక్కొక్క యధ్యాయమును సాధించువానికి కామాది శత్రువులవలనఁ గలుగు దుఃఖమును బోఁగొట్టు ఆలోకన బలము కలుగును. అంతకంటెఁ దక్కువగనైనను ఏకాంతమాత్రము అభ్యసించుచుండినను శుభఫలము నొసఁగును. తుట్టతుదకు ముక్తి నొసఁగును. ఆత్మగానము నుచ్చరించుచు మరణించినవాఁడు ఉత్తమగతిఁ బ్రాపించును.

ఇంతకుఁ బూర్వము మహాపాపములలోఁ గూడియుండినవాఁడే అయినప్పటికి ఆత్మగానముయొక్క ప్రయోజనమును వినుటయందాసక్తుఁడగునేని వైకుంఠస్థానమును పొందును. సర్వవ్యాపియైన పరమాత్మతత్త్వముతోఁగూడి ఆనందించును. నియతములైన కర్మలఁజేయుచు ఆత్మగానము యొక్క ప్రయోజనమును మిక్కిలిగ ధ్యానించువాఁడు జీవన్ముక్తుఁడని తెలియఁదగును. అతఁడు దేహము వదలిన వెనుక మోక్షస్థానముఁజెందును. ఈలోకములో జన్మమునకుఁ గర్తలు, భోక్తలునైన అనేకులు ఆత్మగానము నాశ్రయించి పాపములను బాగుగ పోఁగొట్టుకొని అగానమునే పొందుచున్నారు. అందువల్ల వారు ఉత్తమమైన పదమును పొందినవారగుచున్నారు. ఈ యాత్మగానమును వ్యక్తముఁ గావించుకొనుచు ఎవఁడైతే

దానియందలి గొప్పతనమును గుర్తింపఁడో వాని గీతావ్యక్తీకరణము నిర ర్థకమగును. అట్టి వానికి శ్రమమాత్రమే మిగులుచున్నది. మహిమతోఁ గూడిన యీగానము నెవఁడైతే యభ్యాసము చేయుచున్నాఁడో వాఁడా ఫలమును పొందుచున్నాఁడు. దుర్లభమైన గతిని బ్రాపించుచున్నాఁడు.

పూజనీయమైన ఆత్మగానమనెఁడు పుణ్యశాసనమును ఎవఁడైతే ప్రయత్న పూర్వకముగా వ్యక్తముఁ గావించుకొనుచున్నాఁడో అట్టిస్వయం రక్షణ శీలుఁడు భయము, శోకము మొదలైన అవలక్షణములనుండి విడువ బడినవాఁడై సర్వముతానైన పదమును బ్రాపించుచున్నాఁడు ఆత్మగాన మును స్వభావముగ అనువర్తించు ప్రాణాయామయోగికి పూర్వజన్మమునఁ జేయఁబడిన పాపము లుండనేయుండవు. ఇట్టి స్వభావము కుదిరినవాడు పూర్వజన్మములోనైనను దుష్కర్మ చేసియుండఁడని భావము. జలముతో దినదినము శుద్ధిచేయుటవలన దేహముమీఁది మురికి పోవుచున్నది. అద్యం తములులేని అతిదీర్ఘ మైన కాలప్రమాణమునందు ఏ కొన్నిసంవత్సరములో (సకృతుగా) ఆత్మగానముచే శుద్ధిసేయఁబడినను జన్మకారణమైన మలిన కర్మ నశించి పోవుచున్నది.

శ్లో॥ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నందనః॥
పార్థోవత్స స్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్॥

"ఉపనిత్తులన్నియు గోవులు. ప్రపూరకుఁడు గోపాల నందనుఁడు, పార్థుఁడు వత్సము. అందు పూరింపఁబడునది మరణ రాహిత్యకారణమైన. పూజనీయమైన ఆత్మగానము. ఈయమృతమును భుజించువాఁడు ధ్యాన యోగి."

వివరణము॥ జీవతత్త్వము ఏ స్థానమున ఈశ్వరతత్త్వమును బొందు చున్నదో ఆస్థానము "ఉపనిషత్" అనబడును. పంచజ్ఞానేంద్రియములు, మనో బుద్ధి చిత్తాహంకారములు ఏస్థానమున భగవత్తత్త్వములో లయించుచున్నవో

ఆ స్థా న ము "ఉ ప ని ష త్" అ న బ డు ను. జ్ఞాత యేస్థాన మున నిలిచి శబ్దాది సమస్తవిషయ భోగాదుల, రాగద్వేషాదుల భావవికార ముల గుణకర్మాదుల విస్మరించి యాత్మరతిసుఖమున వినోదించుచుండునో అస్థానము "ఉపనిషత్" అనబడును. నాదబిందుకళలు, శబ్దరూపములు ఏస్థానమున బుట్టుచున్నవో, ఏ స్థానమున లయించుచున్నవో ఆ స్థానము "ఉపనిషత్" అనబడును. బంధకారణములైన చిత్తవృత్తులన్నియు ఏస్థాన మున దహింపబడుచున్నవో (కూటదాహే) అకూటస్థానము "ఉపనిషత్" అనబడును. సర్వధర్మములకు మూలమైన ఆత్మధర్మమేస్థానమున సిద్ధాం తము చేయబడుచున్నదో సర్వరహస్యములు ఏ స్థానమున గాపాడబడుచు న్నవో అస్థానమునకు "ఉపనిషత్" అనిపేరు. ఇట్టి యుపనిషత్ స్థానము సర్వశరీరముల యందుండుటచే పైశ్లోకములో "ఉపనిషదః" అని బహు వచనముగ వ్రాయబడినది.

"గౌః" అనగా స్వర్గమునకు, ఆవునకు, వాక్కునకు, వజ్రాయుధము నకు, దిక్కునకు, నేత్రమునకు, సూ ర్య కి ర ణ ము న కు, భూమికి, జలమునకు, బాణమునకు, పేరగునని అమరకోశము నానార్థవర్గమున జెప్ప బడినది. ఈశబ్దము బహువచనములో గావః = గోవులు, అని చెప్పబడును. ఆత్మసంయమ సిద్ధాంతులైన యోగీశ్వరులు శాశ్వత సుఖానందములకై యే స్థానమును పొందుదురో ఆస్థానము (జ్ఞానభూమిక) స్వర్గమగును. ఇట్టి సుఖాత్మకమైన కూటస్థానము సర్వశరీరములయందుండుటచే గావః అని బహువచనముగ జెప్పబడినది. "షద్ౡవిశరణ గత్యవసాదనేషు, "గమ్ౡ గతౌ" అను సూత్రములవలన ఉపనిషచ్ఛబ్దమునకు, గోశబ్దమునకు నొక టే యర్థము వచ్చును. (ఊర్ధ్వకుండలి స్థానమని భావము) మఱికొందఱు గోశబ్దమునకు జ్ఞానవాక్యమని యర్థము చెప్పుదురు. ఇక గొందఱు పశుపర ముగ జెప్పుదురు. ఇవియు ఒప్పుకొనదగినవే.

దివ్యసుఖమునకు నిధానమైన ఊర్ధ్వకుండలి స్థానము కామాది గుణ సాంకర్యముచే దూషితముకాకుండ కాపాడుకొను అర్హవిద్యార్థులకు గోపాలు రనిపేరు. వీరికానందము సమకూర్చు భగవత్తత్త్వము, గోపాలనందనః" అనబడును.

ఈ భగవత్తత్త్వముచేతనే కేంద్రస్థానమునుండి ఆత్మగానమనెడుఅమృతము పూరింపఁబడుచున్నది. "దుహ ప్రపూరణే" అను సూత్రమువలన గోశబ్దవాచ్యమైన ఉపనిషత్ స్థానమున ఆత్మ గానామృతమును పూరించు భగవత్తత్త్వము 'దోగ్ధ' యనఁబడును.

గోపాలనందనుఁడనఁగా గొల్లవాని కొడుకైన భౌతికకృష్ణుఁడనియు, దోగ్ధ యనఁగా ఆవుపాలుపితుకుటలో నైపుణ్యముగలవాఁడనియు కొందఱు ఉపమానముకల్పించిచెప్పుదురు కాని వీరనుకొనినభౌతికవ్యక్తి కృష్ణుడుగొల్లవానికిపుట్టినవాఁడుకాఁడు, పాలుపితికినవాఁడుకాఁడు కాఁబట్టియీ ఉపమానము సరిపోదు.

"పా పానే, పా రక్షణే" అనుసూత్రములవలన ఆత్మగానామృతమును పానముసేయుటే ప్రయోజనముగఁ గలఁవాడు, రక్షణోపాయమునకై గురువును యాచించువాఁడు పార్థుఁడు, ఇట్టి విద్యార్థి భౌతికదేహముచేఁ బెద్దవాఁడైనను విజ్ఞానమునకు శిశుప్రాయుఁడే కనుక "పార్థోవత్సః" అని చెప్పబడినది. పార్థుఁడనఁగా భారతములోఁ జెప్పఁబడిన భౌతికవ్యక్తి కౌంతేయుఁడని కొందరందురు. ఈయర్థము నాధ్యాత్మికు లొప్పుకొనరు. "ధ్యైచింతాయామ్" అను సూత్రమువలన "సుధీః" అనఁగా జ్ఞానయోగముచే భగవత్తత్త్వమును లెస్సగఁ జింతించువాఁడు ఇట్టి జ్ఞానయోగి మాత్రమే ఆత్మగానామృతమును భుజించువాఁడు.

అంతర్వీథిలో ఉపనిషత్ స్థానమున ధ్వనించు ప్రణవనాదములోఁ నిశ్శబ్దమైన, నిరాకారమైన గుణకర్మాదులకతీతమైన, అస్మత్పద లక్ష్యార్థమైన నేనే నేనని భావించు భావమే పూజనీయమైనఆత్మగానము (భగవద్గీత) అనిపేరు. ఇది యిట్లుండ ఉపనిషత్తులనియు, గీతలనియు లోకములో కొన్ని పుస్తకములుకూడ కనఁబడుచున్నవి. నాలుగువేదములలో అందందు ఆత్మతత్త్వమును గుఱించి వివరించు జ్ఞానవాక్య సముదాయములను విడదీసి వెఱువేఱు పుస్తకములుగ ప్రచురించి వీనికి ఉపనిషత్తులని పేరుపెట్టిరి. వీనిలో నూటయెనిమిది యుపనిషద్గ్రంథములు మాత్రము తఱచు చదుపఁబడుచున్నవి.

భారతములోను, భాగవతాది పురాణములలోను ఆత్మజ్ఞానమును బోధించు కొన్ని ఘట్టములకు గీతలని పేరుపెట్టి వేఱువేఱు గ్రంథములుగ వాడుకొనుచున్నారు. అవధూతగీత, అష్టావక్రగీత మొదలైన కొన్ని గీతలు

పురాణములతో సంబంధములేక ప్రత్యేక గ్రంథములుగఁ గనఁబడుచున్నవి ఈగీతాపుస్తకములన్నియు నించుమించుగ ముప్పదియాఱు కెక్కువగ, నలువదికి తక్కువగ వాడుకయందుండినట్లు తెలియుచున్నది. ఊర్ధ్వకుండలి స్థానమున ధ్వనించు ఆత్మగానములో నిత్యశుభ ప్రతిపాదకమైన భగవత్తత్త్వమున్నదనియు, దాని రహస్యము తెలిసి యుపాసించువాఁడే తత్త్వజ్ఞుడనియు ఉపనిషత్తులు, గీతలు, బ్రహ్మసూత్రములు, సమస్తగ్రంథములు ఘోషించుచున్నవి. అందువలన ఉపనిషత్తులు, గీతాగ్రంథములుకూడ అర్థవిద్యార్థులకు ఉపయోగకరములే. సర్వభూతములయందు ధ్వనించునది యొకటే సత్యమైన గీత, దాని నెఱుఁగక పోవుటచే పెక్కువిధముల గీతలు కావలసి వచ్చినవి.

గ్రంథరూపమునఁ గనఁబడు గీతలన్నిఁటిలో మిక్కిలి వ్యాప్తి గలిగినది భగవద్గీత, ఇందుకుఁ గారణములేకపోలేదు. విద్యయందును, విజ్ఞానమునందును, సాటిలేని అర్థకవులచే వ్రాయఁబడినది. ఆధ్యాత్మికులకు, లౌకికులకు, సజ్జనులకు, దుర్జనులకు, సదాచారులకు, దురాచారులకు, యోగులకు, భోగులకు, త్యాగులకు, ఏరకము మనుష్యులకు ఏయంశములు గావలయునో అవి యన్నియు లభించుటచే మద్రాసు మోరుమార్కెట్టువలె సర్వజన సంసేవ్యమై యున్నది. భారతగ్రంథము ద్వారా లోకోన్నతకీర్తి విరాజితులైన మహాపురుషుల నామములిందు తగులఁజేయఁ బడినవి. అదియుఁ గాక రంగనాథరామాయణములో కాలనేమి కథవలె ఈభగవద్గీతాగ్రంథము భారత యుద్ధచరిత్రముతో జతగూర్చబడినది. భీష్మపర్వము 13 అధ్యాయము మొదలు 42 అధ్యాయమువఱకు 30 అధ్యాయములు భగవద్గీతా పర్వములోఁ జేర్పఁబడినవి. అంతేకాక ఈగ్రంథముఁ జదువు విద్యార్థులకు గొప్ప ఫలము లభించునని వరాహపురాణము మున్నగు మఱికొన్ని గ్రంథములలో ఉగ్గడింపఁబడినది. ఈ కారణముల చేతనో, మఱి యేకారణముల చేతనో పురాణములయందు విశ్వాసముగల భారతీయులేకాక మతాంతరులు, ఖండాంతరులు కూడ చదువుచున్నారు.

భారతగ్రంథము తొట్టతొలుత జయమనుపేర ఎనిమిదివేలు, ఎనిమిది నూర్లుశ్లోకములుగ రచింపఁబడినట్లు ఆదిపర్వము 1 అధ్యాయము 87 శ్లోకమువల్ల తెలియుచున్నది. మఱియొకప్పుడు ఇరువదినాలుగువేలు శ్లోకములు

కలిగియుండెననియు, ఇంకొకప్పుడు ఉపాఖ్యానములతోఁ గూడ నూఱువేలు శ్లోకములు కలిగియుండెననియు ఆదిపర్వము 1 అధ్యాయము 108-109 శ్లోకములలోఁ జెప్పఁ బడినది.

శ్లో॥ ఇదంశతసహస్రంహి శ్లోకానాం పుణ్యకర్మణామ్।
సత్యవత్యాత్మజేనేహ వ్యాఖ్యాత మమితౌజసా॥

అని యాదిపర్వము 62 అధ్యాయము 14 శ్లోకమునుబట్టిచూడ నూఱు వేలు శ్లోకములుగల భారతమంతయు సాత్యవతేయుఁడే రచించినాఁడని చెప్ప వలసి వచ్చుచున్నది. సౌతికాలమునాఁటికె పైశ్లోకము రీతిగ నూఱువేలుశ్లోకములు పూరింపఁబడి యుండినవనియు, భగవద్గీతకూడ అప్పటికే భారతములోఁ జూడఁబడు చుండెననియు ఆదిపర్వము ఒకటి రెండు అధ్యాయములు పదివిన వారికిఁదెలియును. అప్పటికి ఏపర్వములో ఎన్ని అధ్యాయములు, శ్లోకములుండెనో ఆవిషయ మాదిపర్వము రెండవయధ్యాములో వ్రాయ బడినది. దానినిబట్టి యిప్పటి మద్రాసు ప్రతి మహాభారతము 18 పర్వములు విమర్శింపఁగా సౌప్తిక, స్త్రీపర్వములలోను, మౌసల మహాప్రస్థానిక పర్వములలోను, సరిగనే యున్నవి. అశ్వమేధ ఆశ్రమవాస పర్వములలోఁ బదునాలుగధ్యాయములు తక్కువయున్నవి తక్కిన పన్నెండు పర్వములలోఁ అనఁగా ఆదిపర్వము నందలి కథానేపమును, సభాపర్వము నందలి అధిక శ్లోకములను గలుపుకొని లెక్కింపఁగా 223 అధ్యాయము లెక్కువ కనబడు చున్నవి. సౌతికాలమునకుఁ పిమ్మట కవీశ్వరులచె నిట్టిమార్పులఁ జెందిన మహాభారతము అంతకుముందు మాత్రము మార్పుఁజెంది యుండదని యేమినమ్మకము? ఈ విషయమై యెనుబదినాల్గవ పత్రములోఁ గొంత వ్రాయఁబడియుండెను.

పుప్పది యధ్యాయములచే వర్ణింపఁబడిన భగవద్గీతాపర్వము కొంత దూరము భౌతికముగను; కొంతదూరము ఆధ్యాత్మికముగను దోఁచు చుండును. ఇందలి వ్యక్తుల స్వభావములను విమర్శించినను భౌతిక గాథ రచించిన కవిచేతనే ఆధ్యాత్మికగాథ రచింపఁబడి యుండవచ్చునని చెప్ప లేము. ఇందుకు దృష్టాంతములు గ్రంథములో అందందుఁ జూపఁబడును. పదునైదవ యధ్యాయము చదివిన పిమ్మట నలువదినాల్గవ యధ్యాయము

ప్రారంభించి చదివినచో కథ సందర్భోచితముగ అన్వయించును. ఈ నడుమనుండు అధ్యాయము లన్నియు వైకల్పికములుగనే కనఁబడుచున్నవి. మఱియు నశ్వమేధ పర్వమునందలి అనుగీత, ఉద్యోగపర్వము నందలి సనత్సుజాతీయము, ఇఁకనిట్టి యనేక ఘట్టములు వైకల్పికములుగనే కనఁబడును. కనుక నిట్టి మహత్తరములైన సద్గ్రంథములను స్వార్థత్యాగులైన గొప్పవేదాంత పండితులెవరోతయారుచేసి లోకోపకారమునకై విఖ్యాత గ్రంథములలోఁ జేర్చియుందురని యూహింపఁ దగియున్నది. ఇది యిట్లుండనిచ్చి గ్రంథము చదివి చూతము.



# శత పత్రము.

# 86



## శ్రీ మహాభారతము భీష్మపర్వము 13 అధ్యాయము.

జనమేజయునకు వైశంపాయనుఁడు చెప్పుచున్నాడు:- ఓ భారతా! గవల్గణుని కుమారుఁడు విద్వాంసుఁడు, త్రికాలవేది, సర్వవిషయములను ప్రత్యక్షముగఁ జూడఁగలిగినవాడునైన సంజయుఁడు యుద్ధభూమినుండి వచ్చి దుఃఖముతో పడిపోయినవాఁడై భారత పితామహుఁడు భీష్ముఁడు రణ నిహతుఁడయ్యెనను విషయము చింతాపరుఁడైన ధృతరాష్ట్రునకు దెలియఁ జేసెను

(భీష్ముడు యుద్ధములో పడిపోయినాఁడు, చూచివచ్చిన సంజయుఁడు దుఃఖములోఁ బడిపోయినాఁడు. ధృతరాష్ట్రుఁ డంతకుముందే విచారములోఁ బడిపోయినాఁడు.)

సంజయుఁడు చెప్పుచున్నాఁడు:- భరతవంశములో శ్రేష్ఠుఁడవైన ఓ మహారాజా! నేను సంజయుఁడను. నీకు నమస్కారము. భారత పితామహుఁడు శంతనుపుత్రుఁడు భీష్ముఁడు కొట్టఁబడెను. యుద్ధవీరులలో విలుకాండ్రలో ప్రధానుఁడు కురుపితామహుఁడు భీష్ముఁడిప్పుడు బాణములపై ఒరగియున్నాఁడు. ఓరాజా! ఎవనిబలము నాశ్రయించి నీకుమారుఁడు జూదమాడెనో ఆభీష్ముఁడు యుద్ధములో శిఖండిచే మిక్కిలి కొట్టఁబడి శయనించియున్నాడు. కాశీపురములోఁ బ్రతిఘటించిన రాజుల నెల్లర నొకటేరథముతో నెవఁడు జయించెనో, పరశురాము నెదుర్కొని యుద్ధముచేసి యెవఁడు భ్రాంతుఁడుకాలేదో, అతనిచే కొట్టువడలేదో అట్టి భీష్ముఁ డిపుడు శిఖండిచే కొట్టువడెను. శౌర్యములో మహేంద్రునివంటివాఁడు, స్థిరత్వములో హిమాలయమువంటివాఁడు, గాంభీర్యములో సముద్రమువంటివాఁడు, ఓర్పులో

భూమివంటివాఁడు. బాణములనెడు కోఱలు, ధనుస్సనెడునోరు, ఖడ్గమనెడు నాలుకగల నృసింహమూర్తివంటివాఁడు నీతండ్రియైన భీష్ముఁడిపుడు పాంచాల కుమారుచే పడఁగొట్టఁబడెను. యుద్ధప్రయత్నమునందు గొప్పదైన పాండవసైన్యము ఎవనిఁజూచి సింహమునుగాంచిన పశుగణమువలె భయముచేఁ గంపించునో శత్రుసంహారకుఁడైన ఆభీష్ముఁడు దుష్కరమైన కార్యముఁజేసి పదిదినములు మనసైన్యమును రక్షించి సూర్యుఁ డస్తమించినట్లు పోయెను. ఇంద్రుఁడు వర్షించినట్లు ఎవఁడైతే వేలకొలఁది బాణములను వర్షించి పదిదినముల యుద్ధములో వేయికోట్ల యోధులను గొట్టెనో అతఁడు గాలిచే విఱుగఁగొట్టఁబడిన వృక్షమువలె భూమిమీదఁబడి శయనించియున్నాఁడు. ఓరాజా! అట్లుపడుట కష్టఁడుకాని భీష్ముఁడు నీచెడుతలంపువల్లనే పడెను.

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 14 అధ్యాయము.

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాఁడు:- ఓ సంజయా! ఇంద్రునితో సమానుఁడు కురుపితామహుఁడు నాతండ్రి భీష్ముఁడు శిఖండిచే ఎట్లు కొట్టఁబడెను. రథమునుండి యెట్లు పడిపోయెను? తండ్రికొఱకు బ్రహ్మచారియైనవాఁడు బలవంతుఁడు దేవతలతో సమానుఁడు భీష్ముఁడు లేకపోఁగా అటుమీఁదట నాపుత్రులెట్లుండిరి? మహాప్రాజ్ఞుఁడు పురుషులలో శ్రేష్ఠుడు గొప్పసత్త్వము బలము, ఉత్సాహముగలవాఁడు భీష్ముఁడు హతుఁడు కాఁగానే నామనస్సు లేకుండపోయినదాయేమి? పురుషులందఱలోను, కౌరవులలోను శ్రేష్ఠుఁడు వీరుఁడు కంపములేనివాఁడు భీష్ముఁడు హతుఁడైనాఁడనివిని నామనస్సుగొప్ప దుఃఖమును జెందుచున్నది. యుద్ధమునకు నడచునప్పు డెవ్వరాయనను కూడియుండిరి? ముందెవరు నడచుచుండిరి? ఆయనతోకూడ ఎవరు నిలిచియుండిరి? ఎవరు మిక్కిలిగఁ బరివేష్టించియుండిరి? ఓ సంజయా! రథికులలో, క్షత్రియులలో శ్రేష్ఠుఁడు, శత్రుసైన్యముల నద్భుతముగఁ గొట్టుచుండువాఁడునగు భీష్ముని ఏశూరులు వెంబడించియుండిరి? చీఁకటిని హరించు సూర్యునివలె ఎవఁడు శత్రుసైన్యములను హరించుచు, శత్రువులకు భయము పుట్టునట్లు దుష్కరమైన కార్యముచేసెనో అట్టిభీష్ముని ఎవఁడు నిలువరించెను? సంజయా! అప్రతిహతమైన కార్యముఁజేయు శంతను

పుత్రుని పాండవులెట్లు వారింపఁగల్గిరి? అని మఱియుఁ బెక్కువిధముల విలపించెను.

ఇఁకను జెప్పుచున్నాఁడు: ఓ సంజయా! సర్వాస్త్రముల వశీకరణము నెఱిఁగినవాఁడు, శాంతము, ఓర్పుగలవాఁడు మంచి మనోబలముగలవాఁడు భీష్ముఁడు హతుడుకాఁగా మిగిలిన సైన్యమంతయు హతమైనట్లే తలఁతును. వృద్ధిని గురువునుజంపి రాజ్యమును సంపాధించుటకు పాండవులు కోరిరి కాబట్టి ధర్మమునకంటె అధర్మమే బలిష్ఠమై ప్రాపించినదని తలఁచు చున్నాఁడను. పెక్కుసారులు క్షత్రియవీరుల నెల్లర జయించిన పరశురాముని చే కొట్టుపడని భీష్ముఁడిప్పుడు శిఖండిచే కొట్టువడెను. యుద్ధదుర్మదుఁడైన భార్గవునికంటె ద్రుపదపుత్రుఁడైన శిఖండి తేజస్సునందును, బలమునందును గొప్పవాఁడగును సంజయా! పాండవులతో భీష్మునకు యుద్ధమెట్లు జరిగినదో భీష్మునకెవరు తోడైయుండిరో చెప్పుము. ఓ సంజయా! నాతండ్రి పరులచే పడఁగొట్టఁబడగా బాపగాంత్రైన దుర్యోధనుఁడు, కర్ణుఁడు, శకుని, దుశ్శాసనుఁడు ఏమనిరి? పడిన భీష్ముని జూచి నాపుత్రులు శోకించుచున్నారని తలఁతును. నాచెడుతలంపువలన భీష్ముఁడిట్లు పడరానివిధమునఁ బడెను మందుఁడైన దుర్యోధనుని చేష్టలవల్లకలిగిన దుఃఖమును నేను వినఁబోవు చున్నాఁడను. నాకుమారుని మందబుద్ధివల్ల కలిగినది అన్యాయమో! యమో! యుద్ధమెట్లు జరిగినదో చెప్పుము.

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 15 అధ్యాయము.

సంజయుడు చెప్పుచున్నాడు:- ఓ మహారాజా! నీప్రశ్నము నీకుఁ దగినట్లేయున్నది. ఇందు దుర్యోధనుని తప్పులేదు. ఈదోషమునకు నీవే పాత్రుడవు. ఎవఁడైతే తన దుశ్చరితముచే తాను అశుభమును ప్రాపించుచున్నాఁడోఁ వాఁడు దానిచేతనే సిగ్గును, శంకను పొందఁదగి యుండును. మహారాజా! మనుష్యులలో ఎవఁడు కేవలము నింద్యకార్యముఁ జేయుచున్నాఁడో వాఁడు లోకమునకు వధ్యుఁడు ఇకఁ వ్యర్థముగఁ జింతింపక నేఁజూచిన విషయము వినుము.

ఎవని యనుగ్రహముచే మిక్కిలి యుత్తమమైన, దివ్యమైన జ్ఞానము లభించినదో! ఇంద్రియములకంటె అతిశయమైన దృష్టి, దూరశ్రవణము,

భూతభవిష్యద్వర్తల నెఱుఁగు జ్ఞానము, ఉద్వర్తనుల కార్యకారణముల నెఱుఁగు తెలివి, ఆకాశగమనము, యుద్ధములో ఆయుధములు తగుల కుండ తిరుగు మహిమ కలిగినదో అట్టి ధీమంతుఁడైన పారాశర్యునకు నమస్కరించి అద్భుతమైన భారత యుద్ధమును జరిగినది జరిగినట్లు చెప్పుచున్నాఁడను; ఓరాజా! వినుము.

ఓ రాజా! అటు పిమ్మట దుర్యోధనుఁడు దుశ్శాసనునితో నిట్లు చెప్పెను;- దుశ్శాసనా! చాలకాలమునుండి అనుకొనినట్లే కురు పాండవ సమాగమము కలిగినది. మనకుఁగల సర్వసైన్యములను, సర్వరథికులను భీష్ముని రక్షించుటకై నియోగింపుము. మన మాయన నొక్కని రక్షింతుమేని ఆయన పాండవులను, పాంచాలురను, సృంజయులను అందఱను పడఁ గొట్టఁగలఁడు శిఖండి అంగనాపూర్వుఁడు కనుక వానితో యుద్ధము చేయనని భీష్ముఁడు పూర్వమేమనకు జెప్పియున్నాఁడను రక్షణోపాయములేని సింహమును నక్క చంపఁగలదు. కాఁబట్టి భీష్ముని రక్షించుటకు. శిఖండిని వధించుటకు మనవారందఱు ప్రయత్నముతో నిలువవలయును. పూర్వపశ్చిమ దేశములవారు, దక్షిణ దేశమువారు, ఉత్తర దేశమువారు శస్త్రాస్త్ర కోవిదులైన సర్వయోధులు మన తాతను రక్షింపవలయును. జంబుకముచే సింహమునువలె శిఖండిచే భీష్ముని పోఁగొట్టుకొనరాదు. ఉత్తమౌజుఁడు, యుధామన్యుడు అర్జునునకుఁ జక్రరక్షకులుకాఁగా అర్జునుఁడు శిఖండికి రక్షకుఁడగుచున్నాఁడు. భీష్మునిచే వదలివేయఁబడి అర్జునునిచే రక్షింపఁబడుచున్న శిఖండి భీష్ముని కొట్టకుండుటకు ఎట్లు చేయవలయునో అట్లు చేయుము.

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 16 అధ్యాయము.

సంజయుఁడు చెప్పుచున్నాఁడు:- ఓ ధృతరాష్ట్రమహారాజా! అటుపిమ్మట రాత్రి కడచిపోఁగా యోధులు యుద్ధమునకై ఒకరినొకరు ప్రోత్సహించు శబ్దములతో మిక్కిలి కోలాహలముగ నుండెను. శంఖారావములు, దుందుభి స్వనములు, గుఱ్ఱముల సకిలింతలు, భటుల సింహనాదములు, ఏనుఁగుల ఘీంకారములు, రథచక్రముల నేమి ధ్వనులు, యోధులగర్జాస్ఫోటన శబ్దములు సర్వత్ర నిండిపోయెను. ఓ మహారాజా! సూర్యోదయానంతరము

కురుపాండవులయొక్క గొప్పసేనలు చక్కఁగ నియోగింపఁబడ్డ పరస్పరము సమీపములో నిలిచెను. రాజేంద్రా! నీకుమారులయొక్కయు, అదేవిధముగా పాండవులయొక్కయు సైన్యములు దుస్సహములైన గొప్పశస్త్రాస్త్రముచేతను, కవచములచేతను విరాజిల్లుచుండెను ఏనుఁగులు బంగారుతో అలంకరింపఁ బడిన రథములు అన్నియు మెఱుము (మెఱపు) లతోఁ గూడిన మేఘముల వలె ప్రకాశించుచుఁ గనఁబడుచుండెను. రథికసైన్యము గొప్పనగరమువలె నుండెను. అందు నీతండ్రియైన భీష్ముఁడు పూర్ణచంద్రునివలె మిక్కిలి ప్రకాశించుచుండెను. ఓ రాజా! యోధులు ధనుస్సు, గదఖడ్గము మున్నగు శుభ్రములైన ఆయుధములతోఁ దమతమ సైన్యములలో నిలచియుండిరి. రథికులు, అశ్వికులు, గజారోహకులు, పదాతులు దట్టముగ నిలిచిరి. ఉభయసైన్యములయందును పైకెత్తఁబడిన టెక్కెములు బహువిధాకారములతోఁ గనఁబడుచుండెను. వేలకొలఁది గజారోహకులు సువర్ణ రత్నాభరణములు ధరించి అగ్నివలెను, సూర్యునివలెను వెలుఁగుచుండిరి. యుద్ధమునందు వాంఛగల గొప్పవీరులు మహేంద్రునివంటి లక్షణములతో సన్నద్ధులై కనఁబడుచుండిరి ప్రకాశించు ఆయుధములతో, తలత్రాణ కంకటాదులతో రాజులు సేనాముఖమునఁ జేరియుండిరి.

శకుని, శల్యుఁడు, సైంధవుఁడు, అవంతీప్రభువులైన విందానువిందులు, కైకేయులు, కాంభోజపతియైన సుదక్షిణుఁడు, కళింగపతియైన శ్రుతాయువు, జయత్సేనుఁడు, అయోధ్యాపతి బృహద్బలుఁడు, కృతవర్మ ఈ పదిమంది అక్షౌహిణీపతులు గొప్పదక్షిణలిచ్చి యాగములు చేసియుండినవారు. వీరుగాక ఇంక అనేకులు నీతిమంతులైనరాజులు, రాజపుత్రులు, మహారథులు దుర్యోధనునకు వశవర్తులై తమతమ సైన్యములతోఁ జేరియుండిరి. పదునొకండవదైన కౌరవసైన్యము అన్నిసైన్యములకు మొదటిదై భీష్ముఁడెచ్చట నుండెనో అచ్చటనే యుండెను. మహారాజా! తెల్లనిరుమాలు, తెల్లనిగొడుగు తెల్లని కవచముగల భీష్ముఁడు చంద్రునివలె ప్రకాశించుచుండెను. వెండి రథముపై తాళధ్వజముగల భీష్ముని కురుపాండవులు తెల్లని మేఘము చంద్రునివలె చూచిరి. విజృంభించిన సింహమును అల్పజంతువులు చూచినట్లు ధృష్టద్యుమ్న పురోగములైన సృంజయులు భీష్ముని జూచిరి. మఱియు దుష్టద్యుమ్నాదులైన యోధులందఱు భయపడుచుండిరి. శ్రీమంతములైన

పదునొకండు అక్షౌహిణుల బలము నీపక్షమునను అట్లే యేడక్షౌహిణుల బలము పాండవుల పక్షముననుజేరి ప్రళయసముద్రములవలె నుండెను. ఇట్టి సైన్యముల నిదివరకు చూడలేదు. వినలేదు.

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 17 అధ్యాయము.

సంజయుఁడుచెప్పుచున్నాఁడు:-వ్యాసభగవానుఁడు కృష్ణద్వైపాయనుఁడు చెప్పియుండినట్లే రాజులెల్లరు తమతమ సైన్యములతోఁ గూడుకొనివచ్చిరి. అప్పుడు సూర్యునియందును గ్రహ నక్షత్రలయందును కొన్ని దుశ్శకునములు తోఁచినవి. కాకులు, నక్కలు, కూసినవి. పిశాచములు శరీరములతో కనఁబడినవి. భీష్ముఁడు ద్రోణుఁడు నీకొఱకు యుద్ధము చేయువారై యుండియు ఉదయములేవగానే పాండవులకు జయముగలుగవలయునని దినదినముదీవించుచున్నారు. సర్వధర్మములను గుర్తెఱిఁగిన నీతండ్రి దేవవ్రతుఁడు రాజులనెల్లరఁబిలిచి యిట్లు చెప్పుచున్నాఁడు ఓ క్షత్రియ వీరులారా! మీకు స్వర్గమునకైయిదేద్వారము తెఱవఁబడినది. ఈమార్గముననే మహేంద్రలోకమును బ్రహ్మలోకమునుపొందుఁడు. మనపూర్వులచేతను వారికంటెపూర్వులచేతను నియతమైనవైదికమార్గమును నిర్మలాత్ములై సంభావింపుఁడు. నాభాగుఁడు, యయాతి, మాంధాత, నహుషుఁడు, నృగుఁడు మున్నగువారు ఇట్టికార్యములచేతనేయుత్తమపదవిఁ బొంపించిరి. క్షత్రియులు శస్త్రమరణము జెందుటే సనాతన ధర్మమగును. కాని యింటనుండి రోగములచే మరణించుట ధర్మము కాదు. ఇట్లు భీష్మునిచే బోధింపఁబడిన రాజులు ఉత్తమ రథములతో శోభిల్లుచు వారివారి సైన్యములలోనికిఁ బోయిరి. కర్ణుఁడు భీష్మునియందలి విరుగుతో మంత్రి బాంధవ సమేతుఁడై యుద్ధరంగములో ఆయుధము వదలిపోయెను. కర్ణుని యెడఁబాటుగలిగిన నీకుమారులు, రాజులు సింహనాదములతో పది దిక్కులు ధ్వనింపఁజేయుచు యుద్ధమునకు వెడలిరి.

తెల్లని గొడుగులచేతను, టెక్కములచేతను, గజ తురగ స్యందన పదాతి వర్గములచేతను సైన్యములు శోభిల్లుచుండెను. భేరీ మృదంగాదుల ధ్వనులచేతను, రథములనెమి స్వనముల చేతను భూమి కంపించు చుండెను. సువర్ణ భూషణాలంకృతులైన మహారథులు అగ్నిచే జ్వలించు పర్వతములవలె ప్రకాశించు చుండిరి. కౌరవ సైన్యాధిపతియైన భీష్ముఁడు తాళధ్వజ

ముచే సూర్యునివలె వెలుఁగుచు నిలచియుండెను, మనరాజులందఱు గొప్ప ధనుస్సులు దాల్చి నియమము నతిక్రమింపక భీష్ముని పరివేష్టించియుండిరి. గోవాసన దేశాధిపతి శైబ్యుఁడు గొప్పయేనుఁగునెక్కి సర్వరాజులతోఁగూడి యుండఱకంటెముందు అశ్వత్థామ యెచ్చట పోవుచున్నాఁడో అచ్చట పోవుచుండెను. శ్రుతాయువు, చిత్రసేనుఁడు, పురుమిత్రుఁడు, వివింశతి, శల్యుఁడు, భూరిశ్రవస్సు, వికర్ణుఁడు ఈయేడుగురు మహారథులు. గొప్ప ధనుస్సులు ధరించి భీష్మ పురోగములై యశ్వత్థామ ననుసరించి పోవుచుండిరి. స్వర్ణమయమైన వేదికా ధ్వజముతో ద్రోణుఁడు పోవుచుండెను. పెక్కునూర్లవేల సైన్యముల నాకర్షించు రత్నమయమైన నాగధ్వజముతో దుర్యోధనుఁడు పోవుచుండెను. ఈయనముందట పౌరవులు, కాళింగులు, కాంబోజులు, క్షేమధన్వుఁడు, శల్యుఁడు నుండిరి. మగధరాజు (జరాసంధ పుత్రుఁడుగాక యింకొక రాష్ట్రాధిపతి) వృషభధ్వజముగల గొప్పరథముపైనెక్కి శత్రుకర్షనుఁడై సేనాముఖమున నడచుచుండెను. తూర్పుదేశమునుండివచ్చిన గొప్ప సైన్యము అంగరాజుచేతను, (ఇచ్చట అంగరాజనఁగా కర్ణుఁడుగాక ఇంకొక రాష్ట్రాధిపతియని తెలియవలయును) కృపునిచేతను, కాపాడఁబడుచు ముందుభాగమున నడచుచుండెను. మఱియు నూఱువేలు రథములు, ఎనిమిదివేలు గజములు, అఱువదివేలు గుఱ్ఱములుగల గొప్పసైన్యముతో సైంధవుఁడు సేనాముఖమును కాపాడుచు బోవుచుండెను. అఱువదివేల రథములతో, పదివేల యేనుఁగులతో సర్వకళింగాధిపతియైన శ్రుతాయువు కేతుమంతునితోఁ గూడి పోవుచుండెను. తెల్లని గొడుగుతో, స్వర్ణభూషణములతో, చామరాది లాంఛనములతో కేతుమంతుఁడు గొప్పయేనుఁగునెక్కి పోవుచుండెను. దేవేంద్రునివంటి తేజస్సుచే ప్రకాశించుచు గొప్ప యేనుగునెక్కి భగదత్తుడు పోవుచుండెను. అవంతీశ్వరులైన విందానువిందులుకూడ భగదత్తునివలెనే గొప్ప యేనుఁగులనెక్కి కేతుమంతు ననుసరించి పోవుచుండిరి. ఇట్లు సర్వయోధులచే వ్యూహము రచింపఁబడినది.

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 18 అధ్యాయము.

సంజయుడు చెప్పుచున్నాడు;- మహారాజా! అటుపిమ్మట యుద్ధము చేయవచ్చిన ఉభయబలముల యందలి యోధులు తారసించుటచేఁ బుట్టిన శబ్దము ముహూర్తకాలములో హృదయము కంపించునట్లు వినఁ

బడెను. శంఖదుందుభుల ధ్వనులచేతను, ఏనుఁగుల ఘీంకారముల చేతను రథనేమి స్వనముల చేతను, భూమి పగిలిపోవునట్లుండెను. గుఱ్ఱముల సకిలింతల యొక్కయు, యోధుల గర్జనముల యొక్కయు గొప్పశబ్దములచే క్షణకాలములో ఆకాశము నిండిపోయెను. ఉభయ సైన్యముల యందును గొప్ప సంచలనము కలిగెను. స్వర్ణాభరణములచే అలంకరింపఁబడిన యేనుగులు, రథములు మెఱపులతోఁ గూడిన మేఘములవలె ప్రకాశమానములై కనఁబడినవి. కనకమయములైన కేతనములు అగ్నిశిఖలవలె వెలఁగొందుచుండెను. బంగారు కవచములు దొడుగుకొనిన యోధులు సూర్యునివలె వెలుఁగుచుండిరి.

ప్రకాశమానములైనఆయుధములను, అంగుళిత్రాణములను, తనుత్రాణములనుధరించిఅగ్నివలెను, సూర్యునివలెను, వెలుఁగుయోధులు సేనాముఖమున నుండిరి. ఓరాజా! నీకుమారులుదుశ్శాసనుఁడు.దుర్విషహుఁడు, దుర్ముఖుఁడు, దుస్సహుఁడు అదేవిధముగా వివింశతి, చిత్రసేనుఁడు మహారథుఁడైన వికర్ణుఁడు, సత్యవ్రతుఁడు, పురుమిత్రుఁడు, జయుఁడు, భూరిశ్రవస్సు, శలుఁడు, వీరందఱు భీష్ముని వెనువెంటనేయుండి ఆయనను కాపాడుచుండిరి. మఱియు నిరువదివేలమంది రథికులు వీరి ననుసరించి పోవుచుండిరి. శూరసేన, శైబ్య, వసాతి, సాల్వ, మత్స్య, అంబష్ఠ, త్రైగర్త, కైకయ, సౌవీర, గాంధార, పూర్వ, పశ్చిమోత్తర, దేశముల యందలి శూరులు గొప్ప రథసమూహముతో భీష్ముని రక్షించుచుండిరి. గొప్ప వేగముగల పదివేల యేనుఁగులతో మగధరాజు ఆసైన్యము ననుగమించుచుండెను. రథములకు చక్రరక్షకులు, గజములకు పాదరక్షకులు నియమింపఁబడి యుండిరి పదునొకండు అక్షౌహిణుల సంఖ్యగల నీకుమారుని సైన్యము యమునానదియందలి జలమువలెఁ గనఁబడుచుండెను.

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 19 అధ్యాయము.

ధృతరాష్ట్రుఁడు చెప్పుచున్నాఁడు:-సంజయా! పదునొకండు అక్షౌహిణుల సైన్యములతో బలసియుండు కౌరవ వ్యూహమునుజూచి యుధిష్ఠిరుఁడు తన స్వల్పసైన్యముతో నెట్లు సమకట్టెను? దైవాసుర నర గంధర్వ వ్యూహముల నెఱిఁగిన భీష్ముని కౌంతేయుఁడెట్లు ప్రతిఘటించెను?

సంజయుఁడు చెప్పుచున్నాఁడు:- ఓ రాజా! నీకుమారుని సైన్యముల వ్యూహమునుజూచి ధర్మరాజు ధనంజయునితో నిట్లు చెప్పుచున్నాఁడు. "నాయనా! అర్జునా! స్వల్ప సైన్యముతో గొప్పసైన్యమునుదాఁకి యుద్ధము చేయవలసివచ్చినప్పుడు సూచీముఖవ్యూహము రచించుట మంచిదని బృహస్పతి చెప్పియుండెను. ఇప్పుడు మనసైన్యము అల్పముగనే యున్నది. కనుక మహర్షివాక్యము ప్రకారమే చేయవలయును. ఈ మాటవిని యర్జునుఁడు యుధిష్ఠిరునకుఁ బ్రత్యుత్తరముఁ జెప్పుచున్నాడు. రాజోత్తమా! దానినే రచించెదను. అచలము, వజ్రము, అను నామములు కలది, శత్రువులకు జయింపరానిది, దేవేంద్రునిచే బోధింపబడినది. దానిని రచింతును, ఎవడు యుద్ధములో గాలివలెరేఁగి శత్రువులకు సహింపరానివాఁడగునో ఎవనిఁజూచి దుర్యోధనాదులైన కౌరవులెల్లరు సింహమును గాంచిన నీచమృగములవలె వెనుకకుఁ దిరుగుదురో అట్టియోధాగ్రేసరుఁడు రణవిశారదుఁడు, భీముఁడు మన సైన్యములయందు మొదటివారిలో మొదటివాఁడై సేనాముఖమున నిలుచును. శత్రువీరుల తేజములను హరించుచు యుద్ధముచేయును. మహేంద్రు నాశ్రయించిన దేవతలవలె మన మెల్లరము ఓమునే యనుసరింతము క్రోధోద్రేకముచే భయంకరముగ యుద్ధముసేయు భీమునిఁ జూచుటకు లోకములో నెవఁడును జాలడు. అని చెప్పి ధనంజయుఁ డదేవిధముగ వ్యూహముఁ బన్ని తన స్థానమునకుఁ బోయెను.

ఎదుటవచ్చు కౌరవులఁ జూచి పాండవ సైన్యములు గంగాప్రవాహమువలె నెమ్మదిగ ముందునకు నడచెను. ఈసైన్యములకు భీముఁడు మొదటివాఁడై యుండెను. తరువాత ధృష్టద్యుమ్నుఁడు, నకులుఁడు, సహదేవుడు ధృష్టకేతుఁడు పోవుచుండిరి. ఆవెనుక అక్షౌహిణీసేనతో సోదరులతో పుత్రులతో విరాటుఁడు స్వజన రక్షాపరుఁడై నడచుచుండెను. నకుల సహదేవులు భీమునికిఁ జక్రరక్షకులుగ నుండిరి. అభిమన్యుఁడు ద్రౌపదీ పుత్రులు మంచి వేగముగలవారై వెనుకప్రక్క నుండి భీముని గాపాడుచుండిరి. వీరి నెల్లరఁ గాపాడుచు ధృష్టద్యుమ్నుఁడు గొప్పరథము నెక్కి శూరులైన రథికముఖ్యులతో బోవుచుండెను. తరువాత భీష్ముని వధించుటకుఁ బ్రయత్నపడిన శిఖండి యర్జుననిచేఁ గాపాడఁబడుచుఁ బోవుచుండెను. పాంచాల కుమారులైన యుధామన్యుఁడు ఉత్తమౌజుఁడు అర్జుననకుఁ జక్రరక్షకులుగ నుండిరి.

అర్జునునివెంట గొప్ప బలముగల సాత్యకి, కైకేయులేవురు, ధృష్టకేతుఁడు, చేకితానుఁడు పోవుచుండిరి. భీముఁడు వజ్రాయుధమువంటి దృఢమైన గద ధరించి సముద్రమున్న ఎండించువానివలె వేగముగఁ జరించెను.

అప్పుడర్జునుఁడు "ఓ భీమా! అదే ధృతరాష్ట్రతనయులు ఇఁక గొప్పదైన నీబలముఁ జూపుము" అని చెప్పఁగా అందుకు సర్వసైన్యములు మెచ్చుకొనెను. గొప్ప నడకొండలవంటి యేనుఁగుల దండుతో ధర్మరాజు సైన్యమధ్యమునఁ బోవుచుండెను. అక్షౌహిణీ సైన్యముతో పాంచాలపతియైన యజ్ఞసేనుఁడు పాండవులకొఱకు పరాక్రమించువాఁడై విరాటు ననుసరించి పోవుచుండెను. మఱియు కనకాభరణములను నానావిధ లాంఛనములను ధరించినవారు సూర్యచంద్రులకు సమానులైనవారు రథికు లనేకులు వీరివెంటఁ బోవుచుండిరి. సోదరులతో, పుత్రులతోఁగూడిన ధృష్టద్యుమ్నుఁడు వెనుకప్రక్కనుండి ధర్మరాజును గాపాడుచుండెను. ఉభయ బలములయందలి పతాకములనెల్ల నధఃకరించుచు అర్జునుని రథమునందలి కపికేతనము ప్రకాశించుచుండెను. భీమునికి సహాయులుగా ఆయుధపాణులైన అనేక శతసహస్రముల పదాతులు ముందు నడచుచుండిరి. ఆ వెనుక పదివేల యేనుఁగులు నడచుచుండెను. భయంకరమైన గద ధరించి సూర్యునివలె దుర్నిరీక్ష్యుఁడై సైన్యమును దహించువానివలెఁ గనఁబడు భీముని సమీపించుటకు, చూచుటకు యోధులెవ్వరును చాలకుండిరి.

అర్జునునిచే రక్షింపఁబడి అన్నిప్రక్కల పాండవులచే కాపాడఁబడుచు మనుష్యలోకములో నెవ్వరికి జయింపరాకయుండు వజ్రమనుపేరుగల వ్యూహముతో పాండవులు నీసైన్యములను ప్రతిఘటించి నిలిచిరి. వాయురాకాశాది పంచభూతములయందు కొన్నిశకునములు కనఁబడినవి. (అవి పాండవులకు శుభమును, కౌరవులకు కీడును సూచించును) యుద్ధమునం దుత్సాహముగల పాండవులు ఈవిధముగా నీసైన్యములతో ప్రతిఘటించి అగ్రభాగమున గదా పాణియై నిల్చియున్న భీమునిజూచుచు (మన) యోధుల యెముకలలోని సారమును పీల్చివేయువారివలె నిల్చిరి.

# శ్రీ మహాభారతము భీష్మపర్వము 20 అధ్యాయము.

ధృతరాష్ట్రుఁడు చెప్పుచున్నాఁడు:- ఓ సంజయా! సూర్యోదయము కాఁగా ముందుగా యుద్ధమునకుఁ గడఁగినవారెవరు? భీష్ముఁడు కన్నాకుగ నుండు మనవారా? భీముఁడు కన్నాకుగనుండు పాండవులా? ఎవరుత్సాహవంతులై యుండిరి? అప్పుడు వాయుసహితులైన సూర్యచంద్రులెవరికి వక్రించి యుండిరి? ఏప్రక్కన నక్కలు మొఱుఁగుచుండినవి? ఏపక్షమున యువకుల ముఖములు మంచి వర్ణములు కలిగి ప్రసన్నములుగ నుండెను? అది యంతయు యథారీతి నాకుఁజెప్పుము.

సంజయుఁడు చెప్పుచున్నాఁడు:- రాజా! రెండు సైన్యములు సమముగనే ముందునకుఁజెరవచ్చినవి. సంతోషమునందును, ముఖకళలయందును రెండు సైన్యములు సమానమే ఉభయబలములయందును ఏనుఁగులు, రథములు, గుఱ్ఱములు సమముగఁ గ్రిక్కిరిసి యుండెను రెండు సైన్యములు దుస్సహములై భయంకరములుగ నుండెను రెండు సైన్యములు స్వర్గజయము నభిలషించుచునే యుండెను ఉభయ సైన్యములు సత్పురుషలచే నిండి సమ్మర్దముగనుండెను, కౌరవులు పశ్చిమాభిముఖులై నిల్చియుండిరి పాండవులు పూర్వాభిముఖులై యుద్ధప్రయత్నము చేయుచుండిరి కౌరవసేన దైత్యసేనవలెను, పాండవులసేన దేవసేనవలెను (కనఁబడుచుండెను) పాండవ సైన్యమునకు వెనుక ప్రక్క అగ్ని వెలుఁగుచుండెను. వాయువు వీచుచుండెను. కౌరవసైన్యములున్న వైపు కుక్కలు మొఱుఁగుచుండెను. నికుమారుని సైన్యమునందలి యేనుఁగులకు మదధారలు లేకుండెను. దుర్యోధనుఁడు పద్మమువంటివర్ణముగల యేనుఁగునెక్కి శ్వేతచ్ఛత్రముతో, వందిమాగధ సంస్తుతులతో కౌరవసేనా మధ్యముననుండెను. అతనిని కనిపెట్టుకొని శకుని పార్వతేయ గాంధారసైన్యములతో నిలిచియుండెను. సర్వసైన్యములకు ముందుభాగమున వృద్ధుఁడగు భీష్ముఁడు తెల్లని గొడుగుతో, తెల్లనిధనుస్సుతో, శంఖముతో, తెల్లనిరుమాలుతో తెల్లనిటెక్కముతో, తెల్లనిగుఱ్ఱములతో తెల్లని పర్వతమువలె ప్రకాశించుచుండెను. ఇతనిసైన్యముతో సర్వకౌరవులుఁజేరియుండిరి. ఇంకను బాహ్లీక, అంబష్ఠ, సింధు, సౌవీర, పంచనదదేశముల క్షత్రియులు శూరులెల్లరుఁ జేరియుండిరి. ఈరాజులవెనుక ఎఱ్ఱని గుఱ్ఱములతో బంగారు రథముతో మహాత్ముఁడైన ద్రోణుఁడు మహేంద్రునివలె నుండెను. సైన్య

మధ్యమున సైంధవుఁడు, భూరిశ్రవస్సు, పురుమిత్రుఁడు, జయుఁడు, సాల్వ మత్స్య కైకయ దేశాధిపతులు సమర సన్నద్ధులైయుండిరి. కృపుఁడు, శక యవన కిరాత సైన్యములు పార్శ్వముల నుండెను. పదివేల రథములతో సంశప్తకులు అర్జునునితో మత్సరించుచు నడచుచుండిరి.

ఓ రాజా! నీ సైన్యమునందు అగ్రభాగమున నూఱువేల యేనుఁగులు ఏనుఁగులకు నూరురెట్లు రథములు, రథములకు నూరురెట్లు గుఱ్ఱములు, అశ్వములకు పదిరెట్లు విలుకాండ్రు, వారికి పదిరెట్లు చర్మాయుధముల వారు. ఈ విధముగ భీష్మునిచే నియోగింపఁబడి యుండెను. దినదినము భీష్ముఁడు ఈవిధముగా మానుష దైవాసుర గాంధర్వ వ్యూహముల రచించి తాను ముందు నిలుచుచుండెను. రథసమూహములచే విస్తారమై సముద్ర మువలె ఘోషించు కౌరవసైన్యము భీష్మునిచే వ్యూహముగ రచింపఁబడి అనంతరూపమై భయంకరమైయుండెను. పాండవుల సైన్యమట్టిది కాకపోయి నను దానికి కృష్ణార్జునులు నియంతలగుటచే దానినికూడ గొప్పదనియే తలఁతును.

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 21 అధ్యాయము.

సంజయుఁడు చెప్పుచున్నాఁడు;- భీష్మునిచే వ్యూహముగ రచింపఁ బడిన గొప్పదైన కౌరవరాజ సైన్యముఁజూచి యుధిష్ఠిరుఁడు మనోవేదనఁ జెంది వివర్ణుఁడై యర్జునునితో నిట్లు చెప్పుచున్నాఁడు. "గొప్ప బాహుబలము గల ధనంజయా! భీష్మునిచే శాస్త్రోక్తముగ నిర్మింపఁబడిన వ్యూహము భేదింపరానిది. పితామహుఁడైన భీష్ముఁడు ఎవరికొఱకు యుద్ధము చేయు చున్నాఁడో ఆధార్తరాష్ట్రులతోఁ బోరుటకు మనకెట్లు శక్యమగును? మనము ససైన్యముగ యుద్ధములో ఉత్తిష్ఠులమగుట సంశయముగ నున్నది." శత్రు సంహారకుఁడైన యర్జునుఁడు నీ సైన్యమును విషణ్ణుముగఁజూచి యుధిష్ఠి రునితోఁ జెప్పుచున్నాఁడు. ఓ రాజా! కేవలము అధికులను శూరులను బాగుగ తర్ఫీదు పొందినవారలను అధిక సంఖ్యాకులను అల్పసంఖ్యాకులైన వారలెట్లు గెలువవచ్చునో దానిని నీకుఁజెప్పెదను. సహనభావముకలిగి బుద్ధిచేఁ దెలిసికొనుము. దీనిని నారదుఁ డెరుగును. భీష్మద్రోణు లెఱుఁగు

దురు. ఈయర్థమును దేవాసురయుద్ధ సమయమున మహేంద్రాదులకు బ్రహ్మ బోధించియుండెను. "శత్రువుల జయింపఁదలఁచిన వారెవరైనను ధర్మముచేతను, సత్యముచేతను, అహింసచేతను గెలిచినట్లు కేవలము బల ముచేతను, వీరత్వముచేతను గెలువఁజాలరు. ధర్మమును, అధర్మమును, లోభమును దెలిసికొని నిరహంకారులై ప్రయత్నముతో యుద్ధముసేయుఁడు. ధర్మమున్నచోట జయముండును." అని దేవతలకు బోధించియుండెను. ఓ రాజా! అదేవిధముగా మనకు జయము నిశ్చయమని తెలిసికొనుము.

నారదుఁడు చెప్పినట్లు కృష్ణుడున్నచోట జయముండును. జయమను నది కృష్ణుని వెంబడించుటయందు అలవాటుపడి యున్నది. ఈ గోవిందుడు అంతములేని తేజస్సుగలవాఁడు శత్రు మధ్యమున వ్యథలేనివాఁడు సనాతన పురుషుఁడు కనుక ఈయన యున్నచోట జయముండును. పూర్వమీయన శ్రీహరియైయుండి దేవాసుర యుద్ధములలో దేవతలకు జయముగలిగించెను. మన మీయన నాధారము చేసికొని దేవేంద్రాదులనైన గెలువవచ్చును. త్రిభువన సామ్రాజ్యమునైన పొందవచ్చును. ఈయన మనకు జయముఁ గలిగించును నీకు కొంచెమైనను శ్రమయుండదు. యీ సంగతి నేనెఱుఁ గుదును.

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 22 అధ్యాయము.

సంజయుఁడు చెప్పుచున్నాఁడు:- తరువాత యుధిష్ఠిరుఁడు భీష్ముని సైన్యమును నెదిరించుటకు తన సైన్యమును బురికొల్పెను. ఉద్దేశించినట్లు ఆ సైన్యములు క్రమము దప్పక స్వర్గముఁ గోరుచు పరస్పరము ప్రతి ఘటించెను. అర్జునిచే రక్షింపఁబడిన శిఖండి సైన్యము మధ్యభాగమున నుండెను. ధృష్టద్యుమ్నుఁడు భీముని యాజ్ఞతి చొప్పున నడచుచుండెను. సాత్యకి దక్షిణభాగమున సేనలఁ గాపాడుచుండెను. యుధిష్ఠిరుఁడు మణి కనకమయము, కాంచన కుంభ విరాజితమునగు రథముపై దంత శలా కాభిరామమైన శ్వేతచ్ఛత్రము వెలుఁగ గజ సైన్యముల నడుమ నుండెను. మహర్షులు ప్రదక్షిణముగ వచ్చి యుధిష్ఠిరుని నుతిసేయుచుండిరి. సిద్ధు బ్రహ్మర్షులు, స్తోత్రము చేయుచుండిరి. పురోహితులు శత్రువధమును గుఱించి యుగ్గడించిరి. జపములచేత, మంత్రములచేత ఓషధులచేత స్వస్త్యయనము

జెప్పుచుండిరి. అప్పుడు యుధిష్ఠిరుఁడు వేయి గోవులను, ఫలములను, పుష్పములను, అదేవిధముగా బంగారు నాణెములను బ్రాహ్మణులకు దానము సేసి దేవేంద్రునివలె యుద్ధమునకు వెడలెను.

ఆయుధము లేకయే మనుష్యులనుగాని, యేనుఁగులనుగాని యెవఁడైతే తన బాహు బలము చేతనే భస్మము సేయఁగలఁడో! సింహమువలె, ఆఁబోతువలె మత్తుఁడై భయంకరమైన రూపముతో నకుల సహదేవులతోఁ గూడుకొని యెవఁడైతే నీసైన్యములపై నడచుచున్నాఁడో అభీముని జూచి నీవారందఱు బురదలోఁ జిక్కిన యేనుఁగులవలె పరితపించిరి. భూలోకములో ఎవనికి సాటివచ్చు విలుకాడు మఱియొకఁడు లేఁడో ఆకపిధ్వజుడైన యర్జునుఁడు గాండివమును, బాణములను ధరించి కృష్ణునిచే సంగ్రహింపబడిన రథమునందుండెను. తెల్లని గుఱ్ఱములు, మంచి చక్రములుగల ఆరథము బంగారు చిరుగంటలతో మేలుకట్లతో సూర్యుని వలెను, అగ్ని వలెను, వెలుఁగుచుండెను. ధృతరాష్ట్ర మహారాజా! అట్లు సైన్యమధ్యమున నుండు రాజపుత్రులైన అర్జునునితో కృష్ణు డిట్లు చెప్పుచున్నాఁడు "ఎవఁడు రోషముతో శత్రువుల మిక్కిలి మాడ్చివేయు చున్నాఁడో ఎవఁడు బలముతోఁ గూడుకొని సింహమువలె మన సైన్యమును హరించుచున్నాఁడో, ఎవనిచే మున్నూఱు అశ్వమేధ యాగములు చేయఁ బడినవో అభీష్ముడు కురు వంశమునకు పతాకవంటివాఁడు. సూర్యుని గప్పిన మేఘములవలె కౌరవ సేనలెల్ల ఆయనను పరివేష్టించి యున్నవి. నీవా సైన్యములఁ జంపి ఆయనతో యుద్ధము కావింపుము.

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 23 అధ్యాయము.

సంజయుఁడు చెప్పుచున్నాఁడు:- ధార్తరాష్ట్రుల సైన్యమునుజూచి యుద్ధము సేయుటకై సమీపించియుండు అర్జునుని మేలుకొఱకు కృష్ణుఁ డిట్లు చెప్పుచున్నాఁడు. "అర్జునా! నీవు శుచివై యుద్ధరంగమునకు అభిముఖముగ నిలిచి శత్రువులు నీచే జయింపఁబడుటకై దుర్గాదేవిని స్తోత్రము సేయుము." అని యిట్లు కృష్ణుఁడుచెప్పఁగా అర్జునుఁడు యుద్ధలో రథము నుండిదిగి చేతులు జోడించుకొని బహువిధముల స్తోత్రము చేయుచున్నాఁడు. (ఈస్తోత్రము 13 శ్లోకములతో వర్ణింపఁబడినది.) తరువాత మానవులయందు

వాత్సల్యముగల దుర్గాదేవి అర్జునుని భక్తి తెలిసికొని శ్రీకృష్ణునియెదుట ఆకాశమున నిలిచి చెప్పుచున్నది. "ఓరీ పాండుకుమారా! నీవు పూర్వము నరుఁడను ఋషీశ్వరుఁడవు, శ్రీమన్నారాయణుని సాహాయ్యము వడసినవాఁడవు. యుద్ధములో శత్రువులకు మహేంద్రాదులకుసైతము అజేయుఁడవు. స్వల్పకాలములోనే శత్రువుల గెలువఁగలవు" అని యిట్లు వరమిచ్చి క్షణములో అంతర్ధానమునొందెను. అర్జునుఁడు దేవిచే వరముఁబొంది తనకిఁక జయము తప్పదని నిశ్చయించి సంతుష్టుఁడై రథమెక్కెను. కృష్ణార్జునులిద్దఱు ఒకటేరథమునవిల్చి దివ్యములైన శంఖములు పూరించిరి. ఇదంతయు వ్యాసుని అనుగ్రహమున నేను తెలిసికొంటిని. నీకుమారులు దురాత్ములు, క్రోధమునకు వశపడినవారు. కనుకనే కృష్ణార్జునులను నరనారాయణులని తెలిసికొనలేకపోయిరి. కాలపాశమునకు జిక్కిరి ద్వైపాయన నారదాదులు నివారించినను గ్రహించుకొనలేక పోయిరి. ధర్మమున్నచోట కృష్ణుఁడున్నాడు. కృష్ణుఁడున్నచోట జయమున్నది.

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 24 అధ్యాయము.

ధృతరాష్ట్రుఁడు చెప్పుచున్నాఁడు;- ఓ సంజయా! ఎవరి యోధులు సంప్రీతులై యగ్రభాగమున యుద్ధము సేసిరి? ఎవరుత్సాహవంతులై యుండిరి? ఎవరు దీనులైయుండిరి? హృదయము కంపించుయుద్ధములో ముందుగ ఆయుధ ప్రయోగము చేసిన వారు మనవారా? పాండవులా? నాకామాట చెప్పుము. పుష్పహారముల పరిమళము, గర్జించు యోధుల వాక్కులు, ప్రదక్షిణములు ఎవరి సైన్యమున నుండెను?

సంజయుఁడు చెప్పుచున్నాఁడు:- ఓ రాజా! ఉభయసైన్యముల యోధులు సంతోషముగనే యుండిరి. ఉభయత్ర పుష్పహారముల సౌరభము సమముగనే యుండెను. సైన్యములు గుంపుచేరుటచేఁ గలిగిన సందడి, వాద్య విశేషములు, శంఖ భేరీధ్వనులు, ఏనుఁగుల ఘీంకారములు, ఉత్సాహ భరితులైన యోధుల పరస్పర వీక్షణములు, సింహనాదములు, ఇవన్నియు నుభయ బలములయందును అతిశయముగనే యుండెను. (20 అధ్యాయములోను ఇంచుమించుగ నిట్టి సంభాషణమే వర్ణింపఁబడినది.)

ఓం. తత్. సత్॥

# శత పత్రము.

# 87



## శ్రీ మహాభారతము భీష్మపర్వము 25 అధ్యాయము.

ధృతరాష్ట్రుఁడుఁ చెప్పుచున్నాఁడు

మూ॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ॥ 1

తా॥ ఓ సంజయా! ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున యుద్ధకాములై చేరిన నావారు, పాండవులు ఏమిచేసిరి?

వివరణము॥ ఈక్షేత్రములో మన కథాకాలమునకుముందు, వెనుక పెక్కుయుద్ధములు జరిగినవి. కోట్లకొలఁది ప్రాణులు నష్టమగుటయు, ఉద కు దేశము పరాక్రాంతమగుటయు, చరిత్రములవల్లఁ దెలియుచున్నది ఇప్పు డు పేర్కొనబడిన భారత యుద్ధమునందేకాక మఱికొన్ని యుద్ధముల లో సైతము ప్రముఖులైన యోధులందఱు అధర్మముగనే వధింపఁబడిరి. పాండవులు ధర్మమువదలి యధర్మముతో జయించినట్లు ద్రోణపర్వము 191 అధ్యాయమునందును, శల్యపర్వము 62 అధ్యాయము నందును శ్రీకృష్ణు ని వాక్యములవల్లనే తెలియుచున్నది. అదిగాక గ్రంథములో వర్ణింపఁబోవు విషయము ప్రథమ శ్లోకములో సూచింపఁబడుట సాంప్రదాయాచారము. ఇట్లుండ దీనిని ధృతరాష్ట్రుఁడు ధర్మక్షేత్రమని పేర్కొననేల? అనిప్రశ్న. ఇందుకు సమాధానము:- తొలుత ధర్మముగనే యుద్ధము సేయవలయునని క్షత్రియులకు నిబంధన యుండినది. అంతేకాక యజ్ఞము, దానము, తపస్సు మొదలైన వైదిక ధర్మములుకూడ ఆక్షేత్రమునందు నిర్వహింపఁబడుచుండి నవి. అందువలన ధర్మక్షేత్రమనియు, కురువంశ ప్రభువులకు హక్కు గలిగియుండుటవలన కురుక్షేత్రమనియు దానికి రూఢినామము లేర్పడినవి. దానినిబట్టి గీతాగ్రంథకర్తలుకూడ ఆనామములనే వాడియుందురు. మరియు

నిందాఁక పర్ణింపఁబడిన యధ్యాయములలోని విషయమునుబట్టి చూచినచో ఈశ్లోకమునందలి ధృతరాష్ట్రుని ప్రశ్నము సందర్భోచితముగ నుండదు. కావున ఈఘట్టము సౌతిభారత రచనకుఁ బూర్వమే ప్రక్షిప్తము సేయఁబడి యుండవచ్చునని కొందఱు విమర్శకులు చెప్పుదురు.

విశేషార్థము.- మోక్షరూపమైన ఆత్మధర్మమును సాధింపఁదగిన అభ్యాసములన్నియు ఈశరీరమునందే యున్నవి అందువలన శరీరము ధర్మక్షేత్ర మనఁబడును. మఱియు కురుక్షేత్రమనఁగా అన్నముతోఁ బెరిగిన స్థూల శరీరమని కొందఱు వేదాంతులు చెప్పుదురు. ఈశరీరమునందు జీవుని విషయ సుఖములకు లాగుకొనిపోవు గుణములు (అభ్యాసములు) కొన్నియు, శాశ్వతమైన మోక్షసుఖమునకు లాగుకొనిపోవు గుణములు కొన్నియు నున్నవి. పరస్పరము వీనికి పుట్టినపోటీ ఆధ్యాత్మిక యుద్ధ మనఁబడును. ఈశరీరము జీవతత్త్వముచే ఓపించుచున్నది. ఒకప్పుడు కాలముచే ఉపద్రవమునకు గుఱియగుచున్నది. కాఁబట్టి దేహమునకు రాష్ట్రమనిపేరు. ఇట్టి యుపద్రవస్వరూపమైన దేహమును ధరించినవాఁడు దేహమే నేనని యభిమానించుకొనినవాఁడు ధృతరాష్ట్రుఁడు. దేహమే నేననుకొనుటచే శరీరసుఖములను సమకూర్చు లోభాదిగుణములను నావారనుకొనుచున్నాఁడు. అవసానమున నైతము వీనిచేతనే సుఖము దక్కునని భ్రాంతుఁడగుచున్నాఁడు. ఈభ్రాంతి పుత్రమోహ మనఁబడును.

ఉపద్రవ రూపమైన మోహముచే విశ్వసింపఁబడి దానితో సంబంధించియుండు గుణములకు ధార్తరాష్ట్రులని పేరు. పాండువనఁగా తెల్లని వర్ణము గలది దేహమునందలి జ్ఞాననాడియు, అందలి చిత్కళయుతెల్లనివె. సుఖస్వరూపమైన చిత్కళకు ముప్పు కలుగకుండ కాపాడు గుణములకు పాండవులనియు, పాండుపుత్రులనియు పేరు. ఇంద్రియములను లెస్సగ జయించిన శుద్ధబుద్ధి సంజయుఁడనియు, అజ్ఞానమనెడు ఉపద్రవమును ధరించిన మలినజీవుఁడు ధృతరాష్ట్రుఁడనియు కొందఱు వేదాంతులు చెప్పుదురు. దీనిని కొంచెము విచారింతము.

అంతఃకరణము మలినమైనప్పుడు జీవుఁడు మలినుఁ డగుచున్నాఁడు. అంతఃకరణము పరిశుద్ధమైనప్పుడు జీవుఁడు పరిశుద్ధుఁడగుచున్నాడు.

అప్పుడు జీవవృత్తులు లేకుండ పోవుచున్నవి. కనుక జీవుఁడనెడు పేరుకూడ లేకుండ పోవుచున్నది. జీవుఁడు శుద్ధుఁడా? అశుద్ధుఁడా? అను సంగతి యంతఃకరణమును బట్టియుండును. అంతేకాని బుద్ధి పరిశుద్ధమై యుండు టయు, జీవుఁడు మలినుఁడై యుండుటయు పొసఁగదు.

ఎటువంటి దుష్పథవర్తనుల యందైనను ఈవృత్తి మంచిదికాదని తన లో తనకే యేదో యొకటి బోధించుచుండును. ఇట్లు బోధించునది సుభాషిత మనబడును. ఈ సుభాషితమే సంజయుఁడనియు, ఉపద్రవమును ధరించు మోహమే ధృతరాష్ట్రుఁడనియు కొందరాధ్యాత్మకు లందురు. బౌతిక యుద్ధచరిత్రమునందును ధృతరాష్ట్రుఁడు మోహమునకు ఆదర్శపురుఁడేకదా?

సంజయుఁడు చెప్పుచున్నాఁడు

మూ॥ దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా।
ఆచార్యముపసంగమ్య రాజా వచన మబ్రవీత్॥ 4

తా॥ అప్పుడు రాజైన దుర్యోధనుఁడు వ్యూహముగఁ దీర్పఁబడియుండు పాండవ సైన్యమునుజూచి ఆచార్యుని సమీపమునఁజేరి మాటచెప్పుచున్నాఁడు

విశే॥ ప్రారబ్ధములోలేనిది కావలయుననియు, ప్రారబ్ధము తీఱిపోవునది పోఁగూడదనియు ప్రయత్నించు గుణము లోభమనఁబడును ఇది మోహమువలనఁ గలుగుచున్నది అన్యవస్తువును హరింపజూచుటచే పోరాటము వచ్చును. ఇది యోధనమనఁబడును. తనదిగాని యర్థమునకై పెట్టుకొన్న పోరాటమువలనఁ గలుగు ఫలము దుఃఖమే. (దుష్కరంయోధన మస్యాస్తీతి దుర్యోధనః, సుష్ఠుయోధన మస్యాస్తీతి సుయోధనః, యుధసంప్రహారే) ఇట్లు దుఃఖకరమైన పోరాటము పెట్టుకొనువాఁడు దుర్యోధనుఁడు. మిక్కిలి పోరాటములు జరుపు స్వభావముగలవాఁడు సుయోధనుఁడు. భౌతిక గ్రంథమునందును దుర్యోధనుని స్వభావమిట్టిదే కనుక ఆధ్యాత్మిక భావమునందు ఇతని లోభమున కాదర్శముగఁ దీసికొనవచ్చును.

ద్రోణాచార్యుఁడు కురుపాండవులకు విద్యాగురువని భారతకథలలోఁ జెప్పఁబడినది. కాని ద్రోణ శబ్దమునకు అర్థమును విమర్శించినను, భౌతిక గ్రంథమునందియున చరిత్రమును విమర్శించినను కుటిలుఁడని తెలుచున్నది.

కాఁబట్టి యాధ్యాత్మిక భావమునందీయనను కౌటిల్యమునకాదర్శముగఁ దీసి కొనవచ్చును. పాండవానీక మనఁగా ఆత్మసుఖమున కనుకూలమైన గుణ సముదాయము.

మూ॥ పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య మహతీంచమూమ్।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా॥ 3.

తా॥ ఓయాచార్యా! నీ శిష్యుఁడు బుద్ధిమంతుఁడు నైన ద్రుపద పుత్రునిచేఁ రచింపఁ బడినఁ గొప్పదైన యీపాండవ సేనా వ్యూహము జూడుము.

విప॥ పాండవుల సైన్యము గొప్పదని దుర్యోధనుఁ డెన్నఁడును జెప్ప లేదు. అల్పమైన దనియు, బలములో సైతము చాలనిదే యనియుఁ జెప్పు చుండెడువాఁడు. మఱియు దానిని వజ్రవ్యూహముగ నియమించినవాఁ డర్జును డు కాఁగా ద్రుపద పుత్రునిచే ననుటయు, "రచింపబడిన" అను క్రియాపద ము మూలములోఁ గనఁబడక పోవుటయు, పాఠకులకు సంశయకారణము లగుచున్నవి. " ఓ రాజా! నీ సైన్యము అంతము, రూపము లేనిది, భయం కర మైనది. పాండవులసైన్య మట్టిదికాదు ఐనను కృష్ణార్జునులు నియంత లగుటచే అదియు గొప్పదే యనుకొందును" అని ఇదివఱకు (భీష్మ 20అధ్యా) సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పినట్లు విని యుంటిమి.

"నీశిష్యుఁడు, బుద్ధిమంతుఁడు" అనుటచే ధృష్టద్యుమ్నుఁడు వ్యూహ రచనయందు నేర్పరియను భావము వ్యక్తమైనను ద్రోణునకంటెఁ జిన్న వాఁడేయన యూహింపఁదగి యున్నది. అటులైన ద్రోణునకుఁ దెలియని వజ్రవ్యూహము ధృష్టద్యుమ్నుఁడు కల్పించియుండుననియు, వ్యూహకల్పనము చేతనే పాండవ సైన్యము మునుపటికంటె గొప్పదైయుండుననియు దుర్యోధను డు నమ్మినట్లైనా? ఇది నిజమేయైనప్పుడు ఇట్టి ముగ్ధుఁడు కౌరవ సామ్రాజ్య మును పాలించుటకు యోగ్యుఁడగునని విశ్వసించిన పెద్దమనుష్యుల పొర పాటును సమర్థించుటకేమైన నాధారముండునా?

విశే॥ ప్రారబ్ధములోలేని యర్థము కావలయునని కోరునది లోభము కనుక దీనికి ఋజుమార్గము పనికిరాదు. వక్రస్వభావమే దీనికి సహా

నిచ్చు ఆచార్యుఁడు కాఁబట్టి "కౌటిల్యమా! సుగుణవర్గమును జూడు" మని చెప్పుచున్నది. మఱియు ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుని వధించుటకు పుట్టివచ్చిన వాఁడు. భీష్మునిగాని మఱియే యోధునిగాని తాఁకి యెదుర్చుటకు సమర్థుఁడు అని నిశ్చయించి పాండవు లితనికి సర్వసైన్యాధిపత్య మిచ్చిరి. (ఉద్యో 150 అధ్యా) తరువాత కార్యమంతయు నితని ప్రయత్నము మీఁదనే సాగింపఁ బడినది. యుద్ధప్రయత్నమునందు ధృష్టద్యుమ్నుఁ డుండినట్లు మోక్షముకొఱకు జేయు అభ్యాసయోగములయందు గట్టిప్రయత్నముండినచో వక్ర స్వభావము నశించుచున్నది. కావున ఆధ్యాత్మిక భావమునందు ధృష్టద్యుమ్నుని పురుష ప్రయత్నమునకు ఆదర్శముగఁ దీసికొన వచ్చును.

ఇఁకను "తవ శిష్య" అను పదమునకు నీయొద్ద విద్య నేర్చుకొన్న వాడని సామాన్యమైన యర్థమున్నను ఇచ్చట వేఱొక యర్థమున్నది. నిపు నశింపఁగా మిగిలియుండువాడని కాని, నీకంటె నధికుఁడని కాని, యర్థము తెలుచున్నది. మోక్ష విద్యాభ్యాసములు లోభాదివర్గమునకంటె సంఖ్యయందు తక్కువయైనను ప్రయత్నమునందెక్కువ యగుటచే పాండవ సైన్యము గొప్పదని చెప్పవచ్చును.

మూ॥ అత్రశూరా మహేష్వాసా భీమార్జున సమాయుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥ 4.

తా॥ ఈపాండవ సైన్యములో శూరులు గొప్ప ధనుస్సులు గలవారు యుద్ధమునందు భీమునితోను, అర్జునునితోను సమానులు యుయుధానుఁడు (సాత్యకి) విరాటుఁడు, మహారథుఁడైన ద్రుపదుఁడు (మహారథుఁడనఁగా పదివేల విలుకాండ్రతో ఒంటరిగ నిలిచి యుద్ధముచేయఁగల శూరుఁడు)

విశే॥ భారతవీరులలో ధైర్యమునందు భీముఁడు, పౌరుషమునం దర్జునుఁడు పేరుగాంచినవారు ముఖ్యముగ పాండవ విజయమునకు వీరి ధైర్య పౌరుషములే యాధారమని చెప్పవచ్చును. ధైర్యముగలవానికి శత్రువులు భయపడుదురు. కనుక ఆధ్యాత్మిక యుద్ధ చరిత్రమునందు ధైర్యమునకు భీముని, పౌరుషమునకు అర్జునుని ఆదర్శముగఁదీసి కొనవచ్చును, యుయుధానుఁడు అర్జునునియొద్ద విద్యనేర్చుకొన్న కృతజ్ఞతతో గురు ఋణముఁ దీర్చుకొ

నుటకు వచ్చినవాఁడు. గురుసేవయందింత శ్రద్ధగలవాఁడు మఱియొకఁడు లేఁడు. కాఁబట్టి యితని గురుసేవకు ఆదర్శముగఁ దీసికొనవచ్చును. విరాటుఁడు "మీరుకాపాడిన రాజ్యము, ధన మాన ప్రాణములు మీవే" యని యుధిష్ఠిరునితోఁ జెప్పుటేకాక యావజ్జీవము అదేవిధముగ వర్తించినవాఁడు కావున నీతనినాత్మ సమర్పణమున కాదర్శముగఁ దీసికొనవచ్చును. ద్రుపదుఁడు రెండుసారులు కౌరవ సామ్రాజ్యవాదులచే పరాభవము పొందినవాఁడు ఇఁక నట్టిది లేకుండుటకై పాండవులతోఁ జేరినవాఁడు మృత్యువువలని పరాభవము తప్పిపోవుటకు సత్సంగతి కారణ మగుచున్నది. కాన సత్సంగతి కితని నాదర్శముగఁ దీసికొనవచ్చును.

మూ॥ ధృష్టకేతు శ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్।
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః॥ 5.

తా॥ ధృష్టకేతుఁడు, చేకితానుఁడు, బలవంతుఁడైన కాశిరాజు, కుంతిభోజ వంశజుఁడైన పురుజిత్తు, నరులలో శ్రేష్ఠుఁడైన శైబ్యుఁడు.

వి॥ ధృష్టకేతుఁడు – శిశుపాలుని కుమారుఁడు నకులుని భార్యయైన కరేణుమతికి సోదరుఁడు, కుంతిదేవి చెల్లెలైన సాత్వతికి పౌత్రుఁడు. ఇతని తండ్రిని శ్రీకృష్ణుఁడు చంపినను ఇతఁడు ద్వేషింపక పూర్వబాంధవ్యమును గుఱుతు పెట్టుకొని పాండవులకుఁ దోడువచ్చెను. కావున అధ్యాత్మిక యుద్ధ చరిత్రమునందితనిని "ప్రజ్ఞానము (గుఱుతు)" అని చెప్పవచ్చును. చేకితానుఁడు యదువంశ ప్రభువు బలవంతుఁడు ముఖ్యబంధువు కాకున్నను కృష్ణార్జునుల యందలి సుహృద్భావముతో వచ్చిన వాఁడు. అందువలన సౌహార్దమున కాదర్శముగఁ దీసికొనవచ్చును. భారత దేశమునందలి పుణ్యక్షేత్రములలోఁ బవిత్రమైనది కాశి. "కాశిం పురీం రాజయతీతి కాశిరాజః రాజ్యదీప్తౌ" అను సూత్రమును బట్టి దీనిని పాలించు ప్రభువు పవిత్రుఁడుగ నుండినచో యీ పట్టణము పవిత్రముగ విరాజిల్లి యుండును. కాశిరాజ కన్య బలంధర భీమునకు భార్యయైనట్లు ఆదిపర్వము 95 వ అధ్యాయములోఁ జెప్పఁ బడుటచే కాశిరాజు పాండవులకు ముఖ్యబంధువైనను అధ్యాత్మిక చరిత్రమున పారిశుధ్యమునకే యితని నాదర్శముగఁ దీసికొనవచ్చును.

పురజిత్తు:-కుంతీదేవి పెంపుడుతండ్రికి ఔరస పుత్రుఁడు యుధిష్ఠిరుని మేనమామ. ఇతఁడు, కుంతియు ఏకోదరులు కాకపోయినను సోదరీ వాత్స ల్యముతో యుద్ధనకుఁ దోడు వచ్చిన వాఁడు కాఁబట్టి యితని సోదర్య మని చెప్పవచ్చును. శైబ్యుఁడు శిబివంశములోఁ బుట్టిన చిత్రరధుడు. (ద్రోణ 23 అధ్యా॥) శైబ్యుఁడైన గోవాసనుని కన్య దేవిక యుధిష్ఠిరునకు భార్యయైనట్లు ఆదిపర్వము 95 అధ్యాయములోఁ జెప్పినందున ఈ చిత్రరథుఁడు ముఖ్య బంధువే యైనను ఆధ్యాత్మిక చరిత్రమున భౌతిక బాంధవ్యముతోఁ బని లేదు. "నృ నయే" అను సూత్రమువలన నరపుంగవుఁడనఁగా మానసేంద్రి యములను, పవనములను: అంతశ్శత్రువులను సర్వమును స్వాధీనము గావించుకొను వారిలో శ్రేష్ఠుఁడని యర్థము తేలును. త్యాగి కాని వానికి మాన సేంద్రియములు వశపడవు. శిబిచక్రవర్తి మహాత్యాగియగుట లోకవిదితము. ఆవంశమువాఁడని పేర్కొన బడినందున నితనియందు త్యాగము రూఢి యగుచున్నది. అట్లగుటచే శైబ్యుఁడనఁగా శిబికి సంబంధించిన త్యాగమని చెప్పవచ్చును.

మూ॥ యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వఏవ మహారథాః। 6

తా॥ శూరుఁడైన యుధామన్యుఁడు, బలముగల ఉత్తమౌజుఁడు, సుభద్రాపుత్రుఁడైన అభిమన్యుఁడు, ద్రౌపదీపుత్రులేవురు (ప్రతివింధ్యుఁడు, శ్రుతసోముఁడు, శ్రుతకీర్తి, శతానీకుఁడు, శ్రుతసేనుఁడు) వీరందఱుమహారథులె.

వి॥ యుధామన్యుఁడు, ఉత్తమౌజుఁడు, పాంచాల వీరులు గొప్ప శౌర్యము, బలము గలవారు కనుకనే అర్జునునంతటి వానికిఁ జక్రరక్షకులుగ నియమింపఁబడిరి వీరి నామములు కూడ వీరి కర్థముగనే యున్నవి. "విక్రాంతః, వీర్యవాన్" అను రెండు పదములకు ఒకటే యర్థము వచ్చును. వీరి విశేషనామములఁ బట్టిచూచినను, భౌతిక చరిత్రమును బట్టి చూచి నను వీరియందు విక్రమము, ప్రాబల్యము వ్యక్తము లగుచున్నవి. కావున ఆధ్యాత్మిక యుద్ధచరిత్రమున వీరివి విక్రమము ప్రాబల్యము అని చెప్ప వచ్చును. అభిమన్యుఁడు పూర్వజన్మమున సోమపుత్రుడైన "వర్చ" యను వాఁడు. అర్జున పుత్రుఁడై పుట్టి పదునాఱేండ్ల ప్రాయములో కృష్ణార్జునులు

లేని దినమున యుద్ధములో విక్రమించి శత్రుసైన్యములో నాల్గవ భాగమును వధించి తాను మరణించునని ఆదిపర్వము 67 అధ్యాయములో జెప్పఁబడినది. శత్రుకర్షణమునందు ఇంతకు మించినవాఁడు మఱిలేఁడు. కాఁబట్టి అధ్యాత్మిక చరిత్రమునందితని ఉత్కర్షణమని చెప్పవచ్చును. ద్రౌపదేయులు;- స్థైర్యము వలనఁ గలిగినది యేకాగ్రత. ధైర్యమువలనఁ గలిగినది. పురోగమనము, పౌరుషము వలనఁ గలిగినది నిగ్రహము. దిదృక్షుత్వము వలనఁ గలిగినది చిత్కళాదర్శనము, జిజ్ఞాసవలనఁ గలిగినది సంతుష్టి యుని అధ్యాత్మికయుద్ధ చరిత్రమునఁ బేర్కొన వచ్చును.

మూ॥ అస్మాకంతు విశిష్టాయే తాన్ నిబోధ ద్విజోత్తమ।
నాయకా మమసైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమితే॥ 7.

తా॥ ఓ ద్విజోత్తమా! మనవారిలో శ్రేష్ఠులు, నాసైన్యమునకు నాయకులు ఎవరో వారిని నీకు జ్ఞాపకము కొఱకు (గుఱుతుకొఱకు) చెప్పుచున్నాఁడను వారిని తెలిసికొనుము.

వివ॥ ఉభయసైన్యములలో ఎవరెంతమాత్రము వారో, ఎవరి నెట్లు నివారింప వలయునో ఆసంజ్ఞలన్నియు ద్రోణుఁడెఱిఁగినట్లు మఱియొక రెఱుఁగరు. ఇఁక దుర్యోధనుఁ డేమి విశేషము చెప్పఁదలఁచు కొన్నాఁడో! మును

విశే॥ "ద్విజోత్తమ" అనుటచే ఉపనయనాది శ్రౌత కర్మలవలన సంస్కరింపఁ బడినవాఁడని తెలియుచున్నదేకాని ఆత్మజ్ఞానముచే ఆచార్యుఁడైనట్లు సాదృశ్యములేదు. ఈవర్గములోఁజేరిన వారందఱు నిట్టియాచారములచేతనే శిష్టులమైతిమని నమ్ముకొనియుందురు. అందువలన నిట్టివారలు జయముఁ గాంచఁజాలరు.

మూ॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి ర్జయద్రథః॥ 8

తా॥ నీవు, భీష్ముఁడు, కర్ణుఁడు, యుద్ధములో జయముగల కృపుఁడు, అశ్వత్థామ, వికర్ణుఁడు, సోమదత్త పుత్రుఁడైన యూపకేతుఁడు (భూరిశ్రవస్సు) జయద్రథుఁడు. (సైంధవుఁడు)

వివ॥ కొన్ని ప్రతులలో జయద్రథునిపేరు లేదు. కర్ణుఁడు భీష్మద్రోణులచే నిష్కారణముగఁ దిరస్కరింపఁబడి విసుగుఁ జెందుటవలన భీష్ముఁడుండినంతకాలము నేను యుద్ధము చేయనని విరమించుకొని పోయియుండెను. భీష్ముఁడు పడిపోయిన తరువాతనే కర్ణుఁడు యుద్ధములో పాల్గొనుండెను. ఇట్లుండ భీష్ముని యుద్ధారంభదినమునందే కర్ణుని ఉగ్గడించినామనఁగా భీష్మునకిది యమంగళకరము, అవమానకరము, అపరాధము కాదా!

అదిగాక పాండవయోధులలో ఒకరిద్దఱుదప్ప తక్కిన యక్షౌహిణీపతులు సామాన్య యోధులు కూడ వారి వారి బల పౌరుషములతో, విశేష నామములతో గొప్పగా వర్ణింపబడినారు. కౌరవ యోధులలో యక్షౌహిణీ పతులనైనఁ దిన్నఁగ పేర్కొనలేదు. అందు జయద్రథుఁడొక్కఁడుమాత్రము విశేషనామములేవియులేక సామాన్య నామముతోఁ బేర్కొనఁబడినట్లు కొన్ని ప్రతులలోఁ గనఁబడుచున్నది. క్షత్రియ స్వభావముగల బ్రాహ్మణుఁడొక వేశ్యను మోహింపఁగాఁబుట్టి, తల్లి దండ్రులచే అడవిలోనే జారవిడువఁబడి శంతనునిచేఁ బెంపఁబడిన సంకీర్ణాపవిద్ధ శిశువు కృపుఁడు శంతనుని యబ్యాగత పుత్రుఁడని పేరుదెచ్చుకొని కౌరవుల యన్నముచేతనే పెరిగి వృద్ధుఁడైనవాఁడు. "అర్థమునకు పురుషుఁడు దాసుఁడగుచున్నాఁడు. నేను అర్థ బద్ధుఁడనై కాపురుషునివలె కౌరవులపని చేయుచున్నాడఁను. యుద్ధములో నేను చావకుండ నీకుజయము గలిగింతు"నని యుధిష్ఠిరునకు వరమిచ్చినవాఁడు. పదునెనిమిది దినముల యుద్ధములో ఎవ్వని కొట్టినాఁడో। యెవ్వనిచే గాయ పడినాఁడో తెలియకుండ మిగిలిపోయినవాఁడు అట్టికృపు నొక్కనిమాత్రము "సమితింజయుఁ"డని పేర్కొనుటచూడ భౌతికచరిత్రమునందలి దుర్యోధనుఁడిట్లు చెప్పియుండఁడని విమర్శకుల మతము.

విశే॥ భీష్ముఁడు సత్యమును, ధర్మమును పాటించువాఁడే త్యాగము గలవాఁడే కాని ఆగుణములయందు కొంచెము స్ఖాలిత్యములుకూడ కలిగియుండినట్లు ఇతని భౌతికచరిత్రమువల్ల తెలియుచున్నది. బౌద్ధత్వమునందు మాత్రము స్ఖాలిత్యము కనఁబడదు. దానిచేతనే శత్రువులకు భయంకరుఁడుగాఁ గనఁబడుచు కౌరవ రాజ్యమును గాపాడుచు వచ్చినాడు. కాబట్టి ఆధ్యాత్మిక యుద్ధచరిత్రమున నితని బౌద్ధత్వమున కాదర్శముగ దీసికొన

వచ్చును. కర్ణుఁడు అర్జునునిమీఁద మత్సరము వహించి తానుచెడి కౌరవుల ను చెడఁగొట్టినవాఁడు. కనుక ఆధ్యాత్మిక చరిత్రములో నితనిని మాత్సర్య మని చెప్పవచ్చును. కృపుఁడు చేయదగినంతపని చేయక అశ్రద్ధవహించి యజమానున కపజయము కలుగఁజేసిన నిస్పృహుఁడు. అందుచే నితని నాధ్యాత్మిక చరిత్రములో నిస్పృహయని చెప్పవచ్చును. అశ్వత్థామ మితి మీఱిన క్రోధముచే ఘోరకృత్యములొనర్చి శత్రువుచే పరాభవింపఁబడి తనకుముందున్న మాకందీ సంస్థానమును పోగొట్టుకొని వలసపోయినవాఁడు. ఇతని నాధ్యాత్మిక చరిత్రమున క్రోధమనవచ్చును.

వికర్ణుఁడు దుర్యోధనునిసోదరుఁడు. ఇతఁడు ధర్మమును గుర్తించి మా ట్లాడఁగలవాడేకాని మాటచెల్లించుకొనలేని యస్వతంత్రుఁడు. ఆ కారణము చేతనే దుష్టవర్గముతో నితఁడుకూడ చెడవలసివచ్చెను కావున నితని నా ధ్యాత్మిక చరిత్రమున అస్వతంత్రతయని చెప్పవచ్చును భూరిశ్రవస్సు:- శినివంశమువారిపై పగదీర్చుకొనవలయుననెడు అసూయతో సోమదత్తుఁడు తపస్సుచేయఁగా పుట్టినవాడు అసూయతోనే పెరిగినవాఁడు పదునాల్గవనాటి యుద్ధములో శిని పౌత్రుఁడైన సాత్యకిని జంపబోయి తానే చచ్చినవాడు. ఆధ్యాత్మిక చరిత్రములో అసూయకితని నాదర్శముగ దీసికొనవచ్చును. జయద్రథుఁడు అరణ్యవాసకాలములో ద్రౌపది నెత్తుకొని పోవుటకు ప్రయ త్నించి యవమానింపబడినవాడు. అందుపై మఱికొన్ని కారణము లేర్పడి నందున పదునాల్గవనాటి యుద్ధములో తాజచ్చుటేగాక అన్యాయముగా పాడదల చిన మఱి పెక్కుమందిని నాశముచేసిన దుష్కామి. ఆధ్యాత్మిక చరిత్రమున నితని కామమున కాదర్శముగ దీసికొనవచ్చును.

మూ॥ అన్యేచ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః।
నానాశస్త్ర ప్రహరణా స్సర్వేయుద్ధ విశారదాః॥　　9.

తా॥ (పైశ్లోకములోఁ బేర్కొనఁ బడిన వారె గాక) ఇతరులుకూడ అనే కులు శూరులు వివిధములైన ఆయుధప్రయోగముల నెఱిఁగినవారు (కలరు) వీరందఱు యుద్ధములో సమర్థులు, నాకొఱకు జీవితములు వదలువారు.

వి॥ పైఁజెప్పఁబడిన క్రోధ మాత్సర్యాదులే కాక ఇంకను రాగద్వేషా దులు మఱికొన్ని గుణములుకూడ లోభమునకుఁ దోడుపడునవి యున్నవని యిందువలనఁ దెలియనగును.

**మూ॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభి రక్షితమ్।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్॥ 10.**

టీక:- అస్మాకం=మనయొక్క, బలం=సైన్యము, భీష్మాభిరక్షితం= భీష్మునిచే లెస్సగ రక్షింపఁబడుచున్నది, ఏతేషాం=వారియొక్క, బలం=సైన్యము, భీమాభి రక్షితం=భీమునిచే లెస్సగ రక్షింపఁబడుచున్నది. తత్= అది, అపర్యాప్తం=చాలినదికాదు, ఇదంతు=ఇదియైతేనో, పర్యాప్తం=చాలినంత యున్నది

తా॥ మన సైన్యము భీష్మునిచే లెస్సగ రక్షింపఁ బడుచున్నది. వారి సైన్యము భీమునిచే లెస్సగ రక్షింపఁబడుచున్నది. అది చాలనిది. ఇది యున్నను చాలినది.

వివ॥ ఈ శ్లోకమునకు అనేకు లనేక విధముల అర్థము చెప్పుచున్నారు. అపర్యాప్త శబ్దమును వ్యాఖ్యాత లందఱును "అస్మాకం బలం" అను శబ్దములతో సమన్వయము చేయుచు వచ్చినందున అనేక భిన్నాభిప్రాయములు కలుగవలసి వచ్చినది.

"అపర్యాప్తము, అనలము," అను రెండు పదములకు ఒకటే యర్థము. అగ్ని యెన్ని వస్తువుల భక్షించినను ఇంకఁజాలునన్న మాట యుండదు. కనుకనే యగ్నికి అనలుఁడని పేరువచ్చినది కామియగువాఁడెన్ని విషయముల ననుభవించినను చాలునన్నమాటయుండదు. అందువల్లనే కామమునకు అనలమని పేరువచ్చినది. (ఉద్యో 27 అధ్యా 39 శ్లో॥) తృణకాష్ఠాదు లెన్నియున్నను అగ్నికి చాలకపోయినట్లు, విషయాదులెన్నియున్నను కామమునకు చాలకపోయినట్లు, పరసైన్యము లెన్నియున్నను కౌరవసైన్యము నెదిరించుటకు జాలవను బుద్ధితో తన సైన్యము నపర్యాప్తముగ దుర్యోధనుఁడు చెప్పియుండవచ్చునని కొందఱందురు.

అనుత్తమము, అనర్ఘము, అగణ్యము, అపరిమితము, అనిర్వాచ్యము, అనిర్దేశ్యము అను శబ్దములవలె అపర్యాప్తమనఁగా పర్యాప్తమునకు మించినదని మఱికొందఱు చెప్పుదురు. (ద్రోణపర్వము 67 అధ్యా 2 శ్లోకములోను

ఇట్టిభావమే సూచింపఁబడినది.) లోభబుద్ధివాని కెంతయున్నను ఇఁకఁజాలు నని సంతుష్టిఁజెందఁడు దుర్యోధనుఁడట్టివాఁడే కనుక పాండవులకంటె నాలు గక్షౌహిణుల సైన్యమెక్కువ యున్నను సంతుష్టిఁజెందక తనకింకను సైన్య ము చాలనియట్లే భావించియుండునేమో యని వేఱొకకొందఱు సమర్థించు చున్నారు.

సపత్నీ సోదరుఁడైన యుయుత్సుఁడు పాండవపక్షపాతియని తెలిసియుం డుటచేతను, కృప, ద్రోణ, భీష్ములు పాండవహితమును గోరువారనియనుమాన ముండుట చేతను అక్షౌహిణీపతులైన శల్యుఁడు, విందానువిందులు కౌరవ పక్షమున నున్నను పాండవులకు ముఖ్యబంధువులగుటచేతను, అక్షౌహిణీపతి యైన కృతవర్మయు, నారాయణ గోపాలురును శ్రీకృష్ణుని సంబంధు లగుట చేతను, బాహ్లికాదులు ఉభయపక్షములవారికి సమానముగ జ్ఞాతులగుట చేతను, విశ్వాసపాత్రుఁడైన కర్ణుఁడు భీష్మునిమీఁది కోపముతో సపరివారముగ యుద్ధ విముఖుఁ డగుటచేతను, తక్కిన సైన్యయును లెక్కించిన పాండవ సైన్యమునకంటె తక్కువగఁ గనఁ బడుటచేతను మనసైన్యము చాలనిదని వెల్లడిగఁ జెప్పక గూఢార్థముగఁ జెప్పియుండునని మఱికొందఱుచెప్పుదురు.

శిఖండి బాణములనుండి తన్నుఁదాను రక్షించుకొనఁ జాలని భీష్ము డు నాయకుఁడుకాఁగా అతనిచే రక్షింపఁబడు సైన్యము చాలనిదే యగునని యిఁకఁ గొందఱిమతము. దూరమునఁ గనఁబడుచుండు సైన్యమును 'ఇది' యని చెప్పుటయు, తనచుట్టుఁ బరివేష్టించియుండు స్వసైన్యమును "అది" యని చెప్పుటయు స్వభావ విరుద్ధమనుట ప్రత్యక్షముగఁదెలిసిన రహస్యము. అందువల్ల అది పాండవసైన్యము అపర్యాప్తము (చాలనిది) ఇది మనసైన్యము పర్యాప్తము (చాలినది) అని నిత్యానందుని యల్పహృదయమునకుఁ దోఁచిన రీతి అను వాదము వ్రాయఁబడినది.

వి॥ గణితశాస్త్రములో ఒక లెక్కకు సత్యమైన "అన్సరు" ఒకటే యుండును. అసత్యమైన అన్సరు లనేకములుగనుండును. అట్లే పురుషుని యందు సాత్త్విక గుణముల సంఖ్య తక్కువయు, రాజస తామస గుణముల సంఖ్య యెక్కువయు, నుండునని యెఱుఁగునది

మూ॥ అయనేషుచ సర్వేషు యథాభాగ మవస్థితాః!
భీష్మమేవాభి రక్షంతు భవంత స్సర్వ ఏవ హి॥ 11.

తా॥ మీరందఱు నియమము ప్రకారము ఎవరెవరి హద్దులో వారుండి సర్వరీతుల భీష్మునే కాపాడవలయును.

వివ॥ శిఖండి బారిఁ బడకుండ భీష్ముని రక్షించుటకుఁ జేయఁబడిన యేర్పాటులు 15 అధ్యాయములో వర్ణింపఁబడి యుండెను. శిఖండి భీష్మునిపైఁ బడి వధించు నప్పుడు కృపద్రోణులు పాండవపక్షపాతులై యుపేక్షించినను, అటుగాక పాండవులకు జయముఁ గలిగింపఁగోరి యుద్దేశపూర్వకముగ భీష్ముఁడే శిఖండి బారి బడినను కార్యము చెడును కనుక మఱియొక సారి హెచ్చరించుట మంచిదే.

విశే॥ కామలోభాదుల కార్యవిజయ మంతయు పెద్దత్వము మీదనే యాధారపడి యుండును. సుగుణసంఘాతముచే పెద్దత్వము పడిపోయిన యెడల తమ పని యంతయు చెడిపోవుచున్నది. కావున విశేష కుత్సితోపాయములతో దానిని కాపాడుకొనవలసి వచ్చినది.

మూ॥ తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చై శ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్॥ 12.

తా॥ కౌరవులలో వృద్ధుఁడు, ప్రతాపవంతుఁడు నగు తాత ఆ దుర్యోధనునకు సంతోషము గలిగించుచు హెచ్చు స్వరముతో సింహనాదము చేసి శంఖము పూరించెను.

విశే॥ పితామహుఁడనగా గొప్పరక్షకుఁడని యర్థము. ఉద్ధతులెప్పుడును స్తోత్రప్రియులుగ నుందురనుటకు సాదృశ్య మీ శ్లోకమున గనఁబడుచున్నది.

మూ॥ తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః।
సహసైవాభ్య హన్యంత సశబ్దస్తుములోఽభవత్॥ 13.

తా॥ తరువాత శంఖములు, భేరులు, పణవములు, తమ్మటలు, గోముఖములు సత్వరముగ వాయింప బడినవి. ఆ వాద్యముల శబ్దము అంతట నిండినది.

విశే॥ సుగుణములుగాని, దుర్గుణములుగాని ప్రకోపించినప్పుడు శరీరము నందలి ధమనినాడుల వేగమెక్కువ యగుటయు, నాడీప్రకాండమునందు దశవిధ నాదములు అతిశయముగ వినబడుటయు యోగీశ్వరులకు అనుభవైకవేద్యము.

మూ॥ తతశ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ।
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః॥ 14

తా॥ తరువాత తెల్లని గుఱ్ఱముల బూన్చిన గొప్ప రథమునందుండు మాధవుడు, (కృష్ణుడు) పాండుకుమారుడైన అర్జునుడు దివ్యములైన శంఖములను మిక్కిలి పూరించిరి.

విశే॥ యదుకులములో మధుడను రాజర్షివంశములో బుట్టినవాడు మాధవుడు. "మా" అనగా లోకజననియైన ఐశ్వర్యాధి దేవత ఆయధిదేవత యెవనికి వశవర్తినియై యున్నదో అట్టివాడు మాధవుడు. శత్రువులను అడల జేయువాడు. మాధవుఁడు అని లౌకిక గ్రంథములలో జెప్పుచుందురు. బాహ్యాంతర శత్రువుల గంపింపఁ జేయునట్టియు, మహాశక్తి స్వరూపిణి యైనట్టియు. యోగవిద్య "మా" అనబడును. అవిద్య యెవనికి వశమైయుండు నో అట్టి యార్యగురువు మాధవుడని ఆధ్యాత్మికుల మతము.

"కృషవిలేఖనే" అను సూత్రమును బట్టి ప్రళయకాలమున సర్వజీవులు దేనిచే సంకృష్టము లగుచున్నవో; ఇంద్రియ గోచరములైన శబ్దరూపాది సమస్త విషయములు, ఐహికాముష్మికములైన భోగములు దేనిచే నికృష్టము లగుచున్నవో; పవనములు, మనోబుద్ధీంద్రియములు, దేనిచే నుత్కృష్టము లగుచున్నవో; శిష్యుల హృదయతాపములు, గుణకర్మాదులు, సుఖదుఃఖములు పుణ్యపాపములు దేనిచే సమాకృష్టము లగుచున్నవో; లోకములో సాధుకంటకములైన దుష్టసంతానములు దేనిచే వ్యవకృష్టము లగుచున్నవో అట్టి సర్వాకర్షణ యంత్రము భగవత్తత్త్వము "కృష్ణః" అని చెప్పబడును. అట్టి భగవత్తత్త్వము తానైన ఆర్యవిద్యా గురువు కృష్ణుఁడు, శుచిశబ్దమునకు, అర్జున శబ్దమునకు ఒకటే యర్థము కనుక అర్జునుఁడనఁగా శుచిత్వముగల, ఆర్యవిద్యార్థి. ఆధ్యాత్మిక యుద్ధ చరిత్రమునందు కృష్ణార్జున సంవాదమనగా గురు శిష్య సంవాదమని తెలియవలయును.

మూ॥ పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః॥ 15.

తా॥ శ్రీకృష్ణుఁడు పాంచజన్యమనెడు శంఖమును, అర్జునుఁడు దేవదత్తమనెడు శంఖమును పూరించిరి, భయంకరమైన కార్యము జేయు భీముఁడు పౌండ్రమనెడు శంఖము పూరించెను. (పంచజన సంబంధం పాంచజన్యం, దేవైర్దత్తం దేవదత్తం, పుండ్ర సంబంధం పౌండ్రమ్.)

విశే॥ మానసేంద్రియముల కీశ్వరుఁడైన వాఁడు, బహ్మానందముచే పులకితుడైనవాడు హృషీకేశుఁడు. సంతోషప్రదమైన కీర్తిధనమును జయించినవాడు ధనంజయుడు,

మూ॥ అనంత విజయం రాజా కుంతీ పుత్రో యుధిష్ఠిరః।
నకుల స్సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ॥ 16.

తా॥ కుంతీపుత్రుడైన యుధిష్ఠిర మహారాజు అనంత విజయమనెడు శంఖమును, నకుల సహదేవులు సుఘోషము, మణిపుష్పకము అనెడు శంఖములను (పూరించిరి.)

విశే॥ "కుంతి" అనఁగా ప్రాణపము శబ్దించు స్థానమని కొందఱు వేదాంతు లందురు (గ్రంథములలో జూడలేదు) దుస్సంకల్పములచే ప్రాణవస్థానము మలినము కాకుండ కాపాడినవాడు కుంతిపుత్రుడు. అధ్యాత్మిక సంగ్రామమున కామలోభాదులచే కదలింప బడక ఆత్మస్థానమున స్థిరులై యుండినవాడు యుధిష్ఠిరుడు. లౌకిక యుద్ధ చరిత్రమునందైనను తిక్కనార్య భారతమును వదలి మూలముఁ జూచినచో యుధిష్ఠిరుడు స్థిరుడనియే తెలియుచున్నది. కాబట్టి అధ్యాత్మిక చరిత్రమున నితని స్థైర్యమున కాదర్శముగఁ దీసికొన వచ్చును. సర్వగుణములు శమించి పోయినపిమ్మట మిగిలియుండునది స్థైర్యమే యగుటచేత మోక్ష సామ్రాజ్యమునకు ప్రభువదేయని చెప్పవచ్చును నకులుఁడు రూపముచే మిక్కిలి దర్పనియుండనియు, సహదేవుడు జిజ్ఞాసువనియు పురాణప్రసిద్ధము. (మహాప్రస్థానిక 2 అధ్యా) అందువలన అధ్యాత్మిక చరిత్రమున వీరిని దిదృక్షుత్వమునకు, జిజ్ఞాసకు ఆదర్శముగఁ దీసికొన వచ్చును.

మూ॥ కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖండీచ మహారథః।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః॥ 17

మూ॥ ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే।
సౌభద్రశ్చ మహాబాహుశ్శంఖాన్ దధ్ముఃపృథక్పృథక్॥ 18

తా॥ ఓ ధృతరాష్ట్ర మహారాజా! మేలురకము ధనుస్సుగల కాశిరాజు, పదివేలమంది విలుకాండ్రతో ఒంటిగ నిలిచి యుద్ధముచేయగల శౌర్యవంతుఁడైన శిఖండి, ధృష్టద్యుమ్నుఁడు, విరాటుడు, అపజయమన్న మాటే లేని సాత్యకి, ద్రుపదుఁడు, ద్రౌపది పుత్రులు, గొప్ప భుజబలముగల అభిమన్యుఁడు అందఱున్నియెడల వేఱువేఱుగ శంఖములను పూరించిరి. (ఇచ్చట శంఖ నాదములను వర్ణించుటలో మనకవీశ్వరులు కౌరవయోధులకుఅన్యాయము చేసినారు.)

విశే॥ శిఖండియనువాఁడు కొన్నాళ్లుస్త్రీగాను, కొన్నాళ్లు పురుషుడుగాను ఉండినాడు. సంపూర్ణమైనస్త్రీకాదు, సంపూర్ణమైన పురుషుఁడుకాదు క్లీబరూపుఁడు అని యుండందు వినియుంటిమి. అట్లగుటచే స్త్రీపురుషులకుండునట్లు వినియందు పర్యాప్తమైన రాగముండదు. విరాగియనియే యూహింపవలయును. విరాగభావమే వైరాగ్యము. వైరాగ్యవాసనసోఁకినంతనే ఔద్ధత్యము పడిపోవుచున్నది. భీష్ముని పడఁగొట్టుటకే పుట్టివచ్చినాఁడని భౌతికగ్రంథములోను చెప్పఁబడినది. కావున ఆధ్యాత్మిక చరిత్రమునందు ఔద్ధత్యమునుపడఁగొట్టు వైరాగ్యమునకితని నాదర్శముగ చీసికొనవచ్చును.

మూ॥ సఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।
నభశ్చ పృథివీంచైవ తుములో వ్యనునాదయన్॥ 19.

తా॥ ఆ (శంఖముల) ధ్వని అంతట నిండినదై ఆకాశమును భూమిని కూడ ధ్వనింప జేయుచు ధార్తరాష్ట్రుల హృదయములను పగులఁ జేసెను.

విశే॥ ఈ శ్లోకములో వర్ణింపబడిన భావములు 20, 21 అధ్యాయములలో వర్ణింపబడిన కథకు విరుద్ధముగ నున్నవి. అందుచేతనే యీఘట్టము భౌతిక చరిత్రమున జేర్పదగినది కాదని విమర్శకులందురు. పౌరుషమునకు గురుబలముతోడై ప్రణవము విశేషముగ ధ్వనించినప్పుడు కామలోభాది

శత్రువర్గము విదారిత మగుననుట ఒప్పుకొన దగిన విషయమే. కాబట్టి ఇది యాధ్యాత్మిక యుద్ధచరిత్రమని నమ్మదగియున్నది.

మూ॥ అథవ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః॥ 20.
హృషీకేశం తదావాక్య మిదమాహ మహీపతే।

తా॥ ఓ రాజా! అటుపిమ్మట (ఉభయబలములవలన) ఆయుధములు పడు సమయముకాగా కపిధ్వజుడు, పాండుకుమారుడు నగు అర్జునుడు ధనుస్సు పైకిదీసి సవరించి పట్టుకొని అచటజేరియుండు ధార్తరాష్ట్రులజూచి అప్పుడు శ్రీకృష్ణుని గూర్చి యీమాట చెప్పెను. (ఇచట భౌతిక యుద్ధమును వర్ణించుచో కవి యుద్దేశమైన యెడల ఎదురుపడిన యోధులతో దలపడి పోట్లాడుట దప్ప ఇక నేదో మాట్లాడవలసిన నిమిత్తము కనబడదు.)

అర్జునుఁడు చెప్పుచున్నాడు:-

మూ॥ సేనయో రుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత॥ 21
యావదేతాన్ నిరీక్షేహం యోద్ధుకామా నవస్థితాన్।
కైర్మయాసహయోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే॥ 22
యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః॥ 23

తా॥ ఓ అచ్యుతా! (స్థానభ్రంశములేనివాఁడా) ఈ యుద్ధప్రయత్నమునందు నాతోయుద్ధము చేయఁదగినవారెవరో (అట్లు) యుద్ధముచేయుగోరివచ్చి యుండువారిని నేను చూడదగినంత వఱకు జూచెదను. చెడుబుద్ధి గల దుర్యోధనునకు ప్రియముచేయఁగోరి యెవరెవరువచ్చి ఆయుధ ప్రయోగము చేయుచున్నారో వారినెల్లరఁ జూచెదను. నా రథమును రెండు సైన్యముల నడుమ నిలుపుము. అర్థసౌలభ్యము కొఱకు విభక్తిప్రత్యయముల యందచ్చటచ్చట కొంచెము మార్పుచేయఁబడుచుండును.)

వివ॥ ఉభయసైన్యములయందలి యోధులెల్లరు ఇందాకఁ బార్థునిచేఁ జూడఁబడినవారే. లెక్కింపఁబడినవారే. పరస్పరావలోకనములు, పౌరుషోక్తులు, సింహనాదములు, శంఖారావములుఁ బరఁగించిన వారేయని కడచిన భౌతిక చరిత్రమునందలి యధ్యాయములలోఁ జదివియుంటిమి. ఇప్పుడు

ఆయుధములు పడుచుండు సమయములో నట్టనడుమఁగూర్చుండి యింకొక సారి యందఱఁ జూడదలఁచుటయు, అనేక యోజనముల వైశాల్యము గల భూమి నాక్రమించియుండు సైన్యమునందలి యోధుల నొకచోట నిలుచుండి సామాన్య నేత్రములతోఁ జూచుటకు వీలగునని యూహించుటయు జూడ ఆధ్యాత్మిక గ్రంథరచనకుఁ గారణముగఁదెచ్చి పెట్టుకొన్న సమస్యయే కాని మఱియొకటి కాదని విమర్శకుల భావము.

– ఓం. తత్ సత్.



# శత పత్రము.

# 88



## శ్రీ మహాభారతము భీష్మపర్వము 25 అధ్యాయము.

సంజయుఁడు చెప్పుచున్నాఁడు.

మూ॥ ఏవముక్తోహృషీకేశో గుడాకేశేన భారత।
సేనయో రుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్॥ 24
భీష్మద్రోణ ప్రముఖత స్సర్వేషాంచ మహీక్షితామ్।
ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి॥ 25

తా॥ భరతవంశములోఁబుట్టిన ధృతరాష్ట్ర మహారాజా! యుద్ధసన్నాహమునఁజేరిన వారిలో శ్రేష్ఠుఁడైన అర్జునునిచే నిట్లుపలుకఁబడిన శ్రీకృష్ణుఁడు రెండు సైన్యములనడుమ భీష్మద్రోణాది సర్వభూపాలురయెదుట ఉత్తమమైన రథమునునిలిపి "ఓ పార్థా! యిచట కూడిన కురువీరులను జూడుము" అని చెప్పెను.

విశే॥ "గుడః సన్నాహః, గుడం అకతీతి గుడాకః, గుడాకానాంఈశః గుడాకేశః, గుడరక్షాయాం, అక అగ కుటిలాయాం గతౌ, గుడ స్స్యాద్గోళకే హస్తే సన్నాహేక్షు వికారయోః (విశ్వప్రకాశః)" గుడ మనఁగా బెల్లము, గోళము, హస్తము, సన్నాహము అని విశ్వప్రకాశ నిఘంటువులోఁజెప్పఁబడినవి. ఇచ్చట మనకుఁగావలసినది సన్నాహమేకనుక "గుడాకాః" అనఁగా యుద్ధసన్నాహమున కుటిలముగఁజేరినవారని తెలియవలయును. వారిలో శ్రేష్ఠుఁడు గుడాకేశుఁడని భావము. సాత్త్వికములు, అసాత్త్వికములునైన రెండు విధముల గుణసమూహములకు నడుమనిల్చి అసాత్త్వికగుణములఁ బరిశీలింపుమని గురువు శిష్యునకు బోధించుచున్నాడు.

మూ॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్।
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా॥26
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయోరపి।
తాన్ సమీక్ష్య స కౌంతేయ స్సర్వాన్ బంధూ నవస్థితాన్॥ 27.
కృపయా పరయావిష్టో విషీద న్నిదమబ్రవీత్॥

తా॥ ఆత్మరక్షణార్థియైన అర్జునుడు అచ్చటనుండు తండ్రులను, తాతలను, గురువులను, మేనమామలను, సోదరులను, పుత్రులను, పౌత్రులను మామలను, మంచిభావముగల మిత్రులను చూచెను. కుంతీపుత్రుడైన అర్జునుఁడు రెండు సైన్యములయందును జేరియుండు సర్వబంధువులనుజూచి కేవలము కరుణా విషాదములతోఁగూడినవాఁడై ఇట్లుచెప్పెను.

వివ॥ తనతో పోట్లాడఁగల ప్రతివీరులు కౌరవసేనయం దెవరెవరు కలరనుట యిప్పుడు క్రొత్తగఁ దెలిసికొన వలసిన విషయముకాదు. వారిని చూచుట, ప్రతిఘటన ప్రయత్నము చేయుట. అన్నియు నింతకుముందు అధ్యాయములలోనే వర్ణింపఁబడినవి. ఐన నిచట ఆధ్యాత్మిక గ్రంథరచనకు గౌరవముగ నింకొకసారి శత్రుయోధులఁ జూడవలయునని యర్జునుడు కోరెను. శ్రీకృష్ణుఁడు ప్రతిపక్షులఁ జూడుమని చెప్పెనుఁ కాని అర్జునుఁడు మాత్ర మనుకొన్నట్లు లోకపక్షము వారినే చూచి యూరకొనలేదు. ఈ కాలపు వేదాంతోపన్యాసకుల పుణ్యమువలననో, నిత్యానందుని దురదృష్టము వలననో, తన చాంచల్యము వలననో, ఉభయబలములఁ జూచెను. అందువల్లనే "కృపయా పరయా విష్టః" (శ్రేష్ఠమైన కరుణతో నిండిపోయినాఁడు.) అని వర్ణింపఁ బడినది,

వారణావతమున లక్క యింటిలో అన్నమున కాసించుకొని వచ్చిన నిరపరాధుల నార్వురఁ గాల్చినప్పుడు గాని, అంతకు పూర్వము ద్రోణాచార్యులకు రాజ్యము సంపాదించి పెట్టుటకై పాంచాలరాజ సైన్యముల నుక్కడంచు నప్పుడు గాని, ఖాండవారణ్యమున అటవిక జనులను అనాథ జీవులను, సాధుజంతువులను సైతము నిర్దాక్షిణ్యముగ బట్టి వధించునప్పుడు గాని, రాజసూయ మిషమున నానారాజ్యములపై దండెత్తి ద్రవ్యమునకై నిర్వైరులైన రాజకుమారుల నవమానించి హింసించు నప్పుడుగాని, యుద్ధ

ప్రకటనము లేని పౌలోమ కాలకేయ నివాతకవచుల నగరములపై నాకస్మికముగఁ బోయి వారినెల్లరఁ జిత్రవధ గావించు నప్పుడుగాని, ఘోషయాత్రా మిషమున జిరమిత్రుడైన గంధర్వపతిని పరాభవించు నప్పుడుగాని, సింధు రాజు కొఱకై వచ్చిన సౌవీరరాజ కుమారులఁ దునుమాడు నప్పుడుగాని, ఉత్తర గోగ్రహణమునాడు సమ్మోహనాస్త్రముచే కురు వీరులకు మరణ తుల్యమైన యవమానము గావించునప్పుడు గాని, ఈకురుక్షేత్ర యుద్ధరంగములో నైనను ఒక ఘడియకుముందు భీష్ముని మీదికి శిఖండిని, కురు కుమారుల మీదికి భీముని ప్రోత్సహించుచు సైన్యముల బురికొల్పుచు దాను విజృభించుచుండు నప్పుడుగాని, కృపయనగా నెట్టిదో యెఱుగని యర్జుననకు శత్రువులు తారసించి యాయుధముల గుప్పించునప్పుడు శ్రేష్ఠమైన కృప గలిగినది.

అదియు బుద్ధదేవునివలె సర్వభూతములయందు సమానముగ గలిగిన కృపగాదు. రావణ హిరణ్యాక్షాది రాక్షసవీరులవలె, సింహవ్యాఘ్రాది క్రూర మృగములవలె, కంస, జరాసంధాది క్షత్రియులవలె స్వపక్ష జనులయందే కలిగిన కృపకాదు. ఉభయపక్షములయందును తనవారుగఁదలఁపఁబడిన వారిని జూచుటచే తాత్కాలికముగఁగలిగిన ముగ్ధప్రేమ. శస్త్రోపజీవుల తర గతిలోఁజేరిన అర్జునుని జీవితముననిట్టి కృపగలుగుట కిదే మొదటి పర్యాయముకాఁబట్టి యిది శ్రేష్ఠమైన కృపయని ఒప్పుకొనవలసినదే అర్జునుఁడు చెప్పుచున్నాడు.

> మూ॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణయుయుత్సుం సముపస్థితమ్। 28
> సీదంతి మమగాత్రాణి ముఖంచ పరిశుష్యతి।
> వేపథుశ్చ శరీరేమే రోమహర్షశ్చ జాయతే॥ 29

తా॥ ఓ కృష్ణా! యుద్ధముసేయు వాంఛతోఁజేరియుండు స్వకీయమైన యీ జనమునుజూచి నాశరీరాంగములు వివశములగుచున్నవి. ముఖముమిక్కిలి వాడిపోవుచున్నది. దేహమునవణకు పుట్టుచున్నది. పులకరించినది కూడ. (అర్థసౌలభ్యము కొఱకైన వచనవిభక్త్యాదుల మార్పులగమనింపరాదు)

విశే॥ స్వజనమును జూచుటచే కలిగినదుఃఖము మమకారముతోఁగూడినదే కాని నిర్వ్యాజమైన కృపతోఁగూడినది కాదు. దీనినాధ్యాత్మికులు శ్రేష్ఠమైన కృపయని యొప్పుకొనరు.

మూ॥ గాండీవంస్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే।
నచశక్నోమ్యవస్థాతుం భ్రమతీవచమే మనః॥ 30

తా॥చేతినుండి గాండీవము (ధనస్సు) జారిపోవుచున్నది. దేహమునందలి చర్మమంతయు దహింపఁబడు చున్నది. నామనస్సుచలించు చున్నట్లున్నది. ఇటనుండుటకుసైతము అసమర్థుఁడనగు చున్నాడను.

మూ॥ నిమిత్తానిచ పశ్యామి విపరీతాని కేశవ।
నచ శ్రేయోఽను పశ్యామి హత్వాస్వజన మాహవే॥ 31

తా॥ ఓ కేశవా! శకునములు అపలక్షణములుగా కనబఁబడుచున్నవి. యుద్ధములో స్వకీయులనెల్లరఁజంపిన తరువాత శుభమును కూడఁజూడలేను

విశే॥ బ్రహ్మత్వము, ఈశ్వరత్వము ఎవనియందు సముత్పన్నములగుచున్నవో అట్టివాడు కేశవుఁడని అమరకోశ వ్యాఖ్యాతలుచెప్పిరి.

శ్లో॥ క ఇతి బ్రహ్మణోనామ ఈశోఽహం సర్వదేహినామ్।
ఆవాం తవాంగే సంభూతౌ తస్మాత్కేశవ నామవాన్॥

"కః" అనునది బ్రహ్మనామము, నేను సమస్త శరీరధారులకు ఈశుఁడను. మేమిరువురము నీయందు సంభవించిన వారలమే అందువలన నీవు కేశవనామము కలవాఁడవగుదువు. (హరివంశము.) 'నారాయణాద్బ్రహ్మ జాయతే, నారాయణా ద్రుద్రోజాయతే' (నారాయణోపనిషత్తు) "కో బ్రహ్మాత్మని లార్కేషు, సుఖశీర్షజలేషు కమ్" (విశ్వప్రకాశః) "కః" అనఁగా బ్రహ్మ, ఆత్మ, వాయువు, సూర్యుఁడు. "కం" అనఁగా సుఖము, శిరస్సు, జలము ఇవన్నియు ప్రణవస్వరూపమైన ఆత్మగానమునందిమిడి యున్నవి. (క్లైశబ్దే, ఈశ ఐశ్వర్యే)

అనేక కల్పములనుండి నానాజంతు యోనులయందుఁ బుట్టుచు గిట్టుచు భౌతికములైన సుఖ దుఃఖములకు అలవాటు పడిన జీవుఁడు ఆయలవాటుల నన్నిఁటి నొక్కసారి త్రుంచి వేయవలయుననిన ఆరంభములో విషాదమున మునుగుననుట పొరపాటుకాదు. ఎందుకనిన ఆశలేకున్న ఆర్థిక సమస్య పడిపోవు చున్నది. దేహయాత్ర సాగదు. స్థానికములైన హక్కు

లను కాపాడు కొనుటకైనను భౌతికవాదులకు ఔద్ధత్యమే శరణ్యము. తక్కిన యభ్యాసము లన్నియు దాదాపుగ నిట్టివే. ఈ యభ్యాసములే తనకు సుఖమును, లాభమును, చేకూర్చు చున్నవనియు, తన కాప్తబంధువులివే యనియు నమ్మకొని యుండును. దేహములో ఇవన్నియు నాతో బుట్టినవి, నాతో నివసించుచున్నవి, కాపాడుచున్నవి, సుఖపెట్టుచున్నవి, ఇవి లేకపోయిన నాఁడు నేనిఁక సుఖఁము గాంచఁ జాలనుఁ జీవింపఁ జాలను. అనిభావించుచున్నాఁడు. అందువల్లనే వాని వినాశమును శంకించి విషాదమున మునుగ వలసి వచ్చినది.

మూ॥ న కాంక్షే విజయం కృష్ణ నచ రాజ్యం సుఖానిచ।
కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా॥ 32.

తా॥ ఓ కృష్ణా! నేను జయమును కోరను రాజ్యమును, సుఖములను గోరను. గోవిందా! మాకు రాజ్యముతోఁ బనియేమున్నది? భోగములతో జీవితముతో నైనను పనియేమున్నది.

విశే॥ భౌతికయుద్ధ చరిత్రములోని యర్జునుఁడు ధార్తరాష్ట్రులఁ గనికరింపడు. విజయమును, రాజ్యమును వలదనఁడు. యీ విషయ మింతకు ముందు గ్రంథములో పెక్కుచోట్ల వ్యక్తమగుచు వచ్చినది. ఉద్యోగపర్వము 47 అధ్యాయములో మఱింత స్పష్టముగ వ్రాయబడినది అదియట్లుండుఁగాక! గుణకర్మాదులు నశింపఁగా ప్రారబ్ధము మిగిలియుండునని చెప్పలేము ప్రారబ్ధము తీఱినదనగా దేహఋణము తీఱినదన్నమాటే. ఇఁక జీవితముతోను, భోగములతోను పనిలేదన్నమాట నిజమే కోరికలే నశించిపోవుచుండగా విజయమును, రాజ్యమును కోరననుమాటయు ఒప్పుకొనదగినదే "గౌః" అనఁగా సుఖస్థానమని యింతకుముందు చదివియున్నాము. అట్టిస్థాన మెవని సొమ్మైయున్నదో అతఁడు గోవిందుఁడు. (గాంవిందతీతి గోవిందః, విద్ఌలాభే)

మూ॥ యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖానిచ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ॥ 33.

తా॥ మాకు ఎవరి ప్రయోజనముకొరకై రాజ్యమును, భోగములను, సుఖములను కోరదగియున్నదో అట్టివారందరు ప్రాణములను, ధనములను, త్యజించి యుద్ధమునందున్నారు. (సౌభద్ర ద్రౌపదేయాది కుమారులు సైతము యుద్ధములోనే యున్నారని భావము.)

విశే॥ పురుషుఁడు ఏయే గుణములతోఁగూడుకొని భౌతికసుఖముల ననుభ వించుచు వచ్చినాఁడో ఆగుణము లన్నియు విచ్ఛిన్నములై పోఁగా ఇంద్రియ వ్యాపార మంతయు ఆఁగిపోవు చున్నది. మనోవృత్తులు అణఁగి పోవుచున్నవి ఆధ్యాత్మిక సామ్రాజ్యమును కోరునదికూడ మనోవృత్తియే. కనుక అదియు నశించినదనియే చెప్పవలయును. అట్లుండ నట్టి సామ్రాజ్యమును ఎవని కొఱకెవడు కోరవలయును? సుఖదుఃఖముల ననుభవింపఁ దగిన వృత్తు లన్నియు నశింపనైయుండ అటుపిమ్మట రూపనామ క్రియలులేని యాత్మ దేనితోఁ గూడుకొని యనుభవింపవచ్చును? అని యిట్లు అపరిపక్వదశయం దున్న విద్యార్థికి ఆరంభములో సంశయము కలుగు చున్నది.

మూ॥ ఆచార్యాః పితరః పుత్రా స్తథైవచ పితామహాః।
మాతులా శ్శ్వశురాః పౌత్రా స్స్యాలా స్సంబంధిన స్తథా॥ 34

తా॥ ఆచార్యులు, తండ్రులు, తాతలు, మేనమామలు, కన్యాదాతలైన మామలు, అదే విధముగా కొడుకులు, మనుమలు, బావమఱఁదులు, అట్లే సంబంధులు (వియ్యముల వారుకూడ ఉన్నారని భావము.)

విశే॥ ఆధ్యాత్మిక సామ్రాజ్య పీఠమునకు మొదటి సోపానము వైరా గ్యము. అంతకుముందు పురుషునకుఁగల ప్రకృతి బంధువు లందఱి యంద లి వాత్సల్యమును నిగ్రహించినఁగాని సంపూర్ణ వైరాగ్యము కలుగదు. అట్టి బంధుప్రేమ ఒక్కసారి త్రెంపివేయ వలయుననిన అనుతాపము కలుగు చున్నది అదియుఁగాక ప్రకృతి సుఖముల ననుభవించుచుండు వానికి అందుకు దగిన గుణములన్నియు తన్ను రక్షించునవిగాను, హితము నెఱి గించు నవిగాను, సుఖపెట్టునవిగాను, ఇట్లే పెక్కువిధముల తనకు సంబం ధించినవిగానే తోఁచుచుండును. ఆగుణములను (అభ్యాసములను) వదలు కొనుట మొదట కష్టముగనే కనఁబడును.

మూ॥ ఏతాన్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన।
అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే॥ 35.

తా॥ మధుసూదనా! వారిని హింసించుటచే మూఁడులోకముల రాజ్య ము లభింపఁదగిన కారణమున్నను, నేనే వారిచే హింసింపఁబడినను వారిని హింసించుటకు ఇష్టపడను. ఇఁక పృథివి నిమిత్తమై యేమనవలయును?

విశే॥ "మన్యతే అభిలష్యత ఇతిమధు. మనజ్ఞానే, మాద్యం త్యనేనేతి మధు. మదీహర్షే" అభిలాషచేఁ దలపబడునది, మదవికారములకు సంబంధించినది. విషయానందము. అందువల్ల దీనిని మధువని చెప్పవచ్చును. (షూద క్షరణే హింసాయాంచ) అట్టి విషయానంద రూపమైన, రజోగుణసంకలితమైన మధువును ఖండించినవాడు మధుసూదనుడు మధువనగా నొక రాక్షసుడనియు వాడు హరిచే వధింపఁబడి నాడనియు భౌతికగ్రంథములలో వర్ణింపఁబడినది.

"లోక్యతే సర్వమస్మిన్నితి లోకః లోకృ దర్శనే, రాజృదీప్తౌ" స్థూల సూక్ష్మ కారణ శరీరములయందు, జాగ్రత్స్వప్న సుషుప్తులయందుజీవతత్త్వముచే నేది చూడబడుచున్నదో, దీప్తిమంత మగుచున్నదో అది యంతయు త్రిలోక రాజ్యము. అట్టి త్రిలోక రాజ్యము జెందియుండినను అందు ప్రారబ్ధ మనుభవించుటకు జీవునియందు అభ్యాసము లన్నియు నుండవలసివచ్చును. కాబట్టి ఆగుణములను నశింపజేయుటకు ఇష్టపడడు. (మహపూజాయామ్) ఈ మూడవస్థల కంటె గొప్పది తురీయము. అంత గొప్ప పదవి లభింపబోవు చుండగా ఇందాఁక సౌఖ్యకారణములై యుండిన గుణములను వ్యర్థముగ జంపుకొననేల యని భ్రాంతుడైన శిష్యుడడుగుచున్నాడు.

మూ॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన।
పాపమేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః॥ 36.

తా॥ (జన్మబంధమునకు జిక్కిన వారిని పీడించువాఁడు. జనార్దనుడు "అర్దపీడాయామ్") ఓ జనార్దనా ధార్తరాష్ట్రుల జంపుట వలన మాకేమి సంతోషము కలుగబోవుచున్నది. ఈ యాతతాయుల జంపుటచే మాకు పాపమే ముట్టుకొనునేమో!

శ్లో॥ అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః।
క్షేత్ర దారాపహర్తాచ షడేతే హ్యాతతాయినః॥

అగ్గిపెట్టువాఁడు, విషము పెట్టువాఁడు, హత్యగావించుట కాయుధముఁ బట్టుకొని వచ్చువాఁడు, ధనము నపహరించువాఁడు, భూముల నపహరించువాఁడు, కులస్త్రీలనపహరించువాఁడు ఈయాఱుగురు ఆతతాయులనబడుదురు. అట్టివారిని వధించుటవలన పాపమురాదు అని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. భౌతిక చరిత్రమును బట్టిచూడఁగా కౌరవులు దాదాపుగ నీయాఱు తరగతులలోఁ జేర్పఁదగిన వారేకాని స్వజనులఁ జంపరాదన్న నీతియొకటి యడ్డము వచ్చుచున్నది.

మూ॥ తస్మాన్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్।
స్వజనంహి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ॥ 37.

తా॥ అందువలన స్వబాంధవులైన ధార్తరాష్ట్రులను మనము చంపదగినవారలము కాము. ఓ మాధవా! మన చుట్టములను జంపి మనమెట్లు సుఖవంతుల మగుదుము. (కొన్నిప్రతులలో "ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్" అనియున్నది.)

శ్లో॥ బంధుర్వధార్హదోషోఽపి న బంధుర్వధ మర్హతి।
త్యాజ్యస్తేనైవ దోషేణ హతః కిం హన్యతే పునః॥

బంధువు చంప దగినంత దోషము కలవాడైనను అట్టి బంధువును త్యజింపవలయును గాని చంపరాదు. ఆదోషముచేతనే చచ్చినవాడగుచున్నాడు. మరలఁ జంపబడుటయేమున్నది. (భాగవతము 10 స్క. 54 అధ్యా. 40 శ్లో)

మూ॥ యద్యప్యేతే నపశ్యంతి లోభోప హతచేతసః।
కులక్షయ కృతందోషం మిత్రద్రోహేచ పాతకమ్॥ 38
కథం నజ్ఞేయ మస్మాభిః పాపా దస్మాన్నివర్తితుమ్।
కులక్షయ కృతందోషం ప్రపశ్యద్భి ర్జనార్దన॥ 39

తా॥ కులమును నాశముగావించుటచే కలుగుదోషమును, మిత్రులకు ద్రోహముచేయుటలో కలుగుపాపమును లోభబుద్ధిచే మతిచెడిన ఆధార్తరాష్ట్రులు ఒకవేళ చూడకపోయినను ఓ జనార్ధనా! కులక్షయ కృతమైన దోషమును తెస్సగఁజూచుచున్న మనచేతను అట్టిపాపమునుండి తప్పించుకొనుటకు తెలియరానిదగుట యెట్లు?

విశే॥ (37-38-39) శరీరములో బహుకాలమునుండి జీవునితోఁగూడియుండు గుణములన్నియు జీవునికి స్వకీయములుగనే తోఁచుచుండును. ఆయభ్యాసములవల్లనే సుఖపడుచుంటినని నమ్మినవాఁడు ఆగుణములు నశించినమీదట నేను సుఖింపఁజాలనని దిగులుపడుచుండును. కులమనఁగా సమూహమని యర్థము. అట్టిగుణ సముదాయము నశింపగా అందువల్ల జీవయాత్రకు కలుగఁబోవు లోపములెట్టివో ఆగుణములు తెలిసికొనఁజాలవు. అభ్యాసములన్నియు తప్పిపోయిన తరువాత మఱెట్టి యిక్కట్టులు పడవలసివచ్చునో బాగుగఁజూడఁగలిగిన జీవుఁడీ సంగతి తెలిసికొనకుండుట యెట్లు?

మూ॥ కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః।
ధర్మేనష్టే కులం కృత్స్న మధర్మోఽభి భవత్యుత॥ 40

తా॥ కులము క్షీణింపఁగా శాశ్వతములైన కులధర్మములు నశించు చున్నవి. ధర్మము నశింపఁగా అధర్మము బలిసిపోయి కులమునంతటిని పరిభవించు చున్నదికదా?

విశే॥ "ధర్మః పుణ్యే యమే న్యాయే స్వభావాచారయోఃక్రతౌ।
ఉపమాయా మహింసాయాం కార్ముకేచ నిగద్యత" (విశ్వప్రకాశః) ధర్మశబ్దము పుణ్యమునకు, యమధర్మరాజునకు, న్యాయమునకు, స్వభావమునకు, ఆచారమునకు, కర్మయజ్ఞమునకు, ఉపమానమునకు, అహింసకు, కోదండమునకుఁ పేరగుచున్నది.

"ధరతి విశ్వం ధర్మః, ధరతిలోకానితి ధర్మః, ధ్రియతేవా జనైరితి ధర్మః, ధృఞ్ ధరణే" విశ్వమును ధరించునది ధర్మము. లోకుల ధరించునది ధర్మము. జనులచే ధరింపఁబడునది ధర్మము.

పురుషునియందలి గుణసముదాయము నష్టమగుచుండఁగా ఆగుణసమూహముచే ధరింపఁబడియుండు ఆచారములు నశించుననుటకు సంశయములేదు. ఆచారముక్షీణింపఁగానే అనాచారము మించి కులమును పరిభవించుచున్నది (అధఃకరించు చున్నది) కదా? అందువల్ల ముందున్న తన యభ్యాసములఁబోకొట్టు కొనఁజాలనని భ్రాంతుడైన శిష్యుఁడు చెప్పుచున్నాడు.

మూ॥ అధర్మాభి భవాత్ కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః॥ 41.

తా॥ ఓ కృష్ణా! వార్ష్ణేయా! అధర్మముచే కులము పరిభూత మగుచుండగా కులస్త్రీలు వికృతముగఁజేయఁబడుచున్నారు. స్త్రీలు వైకృత్యముఁ జెందగా వర్ణసంకర మగుచున్నది.

విశే॥ "స్యాద్ధర్మ మస్త్రియాం పుణ్యం శ్రేయసి సుకృతంవృషః" (అమర. కాలవర్గము 25 శ్లో॥) ధర్మము, పుణ్యము, శ్రేయము, సుకృతము, వృషము అను పదములన్నియు సమానమైన యర్థముకలవి. వృషః అనఁగా శ్రేష్ఠుఁడనియుఁ జెప్పుదురు. భక్తులకు వాంఛితార్థములను వర్షించుటచే వృషనామము కలిగినదందురు, "వృషాహి భగవాన్ ధర్మః, వృషు సేచనే

అని యార్యోక్తి యున్నది. వృషపదమునకు సంబంధించినదే వార్ష్ణేయపదము. శిష్యులు యాచించిన అర్థమును వర్షించుగురువు వార్ష్ణేయుఁడు.

"సమ్యగ్ఘన్యత ఇతి సంఘాతః హన హింసా గత్యోః" అను సూత్రము వలన లెస్సగ గూర్చబడినది సంఘాతము. "స్త్యాయంతి సంఘాతీభవంతి గుణా అస్యామితి స్త్రీ, ష్ట్యైష్ట్యై శబ్ద సంఘాతయోః" అను సూత్రమును బట్టి పురుషునియందు ఏయే స్థానములలో గుణములు సంఘాతము చేయబడుచున్నవో ఆయా స్థానములు స్త్రీ లనఁ బడును. ఆస్థానములలో అంతకుముందు జీవుడనుభవించుచుండిన విషయానందము తప్పిపోవుచున్నది. అందు వలన ఆస్థానములు వికృతములగుచున్నవి. "దుష వైకృత్యే"అను సూత్రము వలన దూష్యములనిపించుకొనుచున్నవి. ఆస్థానములలో విషయ సుఖములు పడిపోయినను పూర్వానుభవమువలన విషయవర్ణన మింకను మిగిలియుండును. దానిలోనె వైరాగ్య వర్ణనము కలియుటచే వర్ణసంకర మగు చున్నది. (సమ్యక్కరోతీతి సంకరః వర్ణస్తుతౌ) ఒకవిషయము వర్ణింప బడుచోట రెండు విషయములు వర్ణింపఁ బడుట వర్ణసంకరము ఇట్లగుటచే క్రొత్తగ కొన్ని కష్టములు వచ్చునేమో యని శిష్యునకు సంశయము కలుగు చున్నది.

మూ॥ సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ
పతంతి పితరోహ్యేషాం లుప్త పిండోదక క్రియాః॥ 42

తా॥ కులనాశకులకు, కులమునకు నరకప్రాప్తికొఱకే పైఁజెప్పినవర్ణ సంకరమేర్పడుచున్నది. వీరిపితరులు పిండోదక క్రియలు లేనివారై పతితులగుదురు సంకీర్ణులు సామాన్యముగఁ దంత్రులకు ముప్పుగడపువారుగ నుం దురని భావము.

వి॥ వృత్తులను నశింపఁజేసినవారికి, వారిగుణ సముదాయమునకు అంతకుముందున్న సుఖము తప్పిపోవుచున్నది. సంతోషము చెడు చున్నది. దుఃఖము గలుగుచున్నది. దుఃఖమేనరకమని చెప్పబడును. ప్రవృత్తి నివృత్తి వాసనా సమ్మేళనముచే జీవుఁడానందము బెందజాలక పతితుడు కావచ్చు ననియు ఊహింపఁదగియుండును. అని శిష్యుఁడు విభ్రాంతుడగును.

మూ॥ దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకర కారకైః।
ఉత్సాద్యంతే జాతి ధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥ 43

తా॥ కులమును నాశముగావించు వారిదోషములు వర్ణసంకరమునకు గారణములగుచున్నవి. ఆదోషములచే జాతిధర్మములు, శాశ్వతములైన కుల ధర్మములు చెడఁగొట్టబడున్నవి. (అర్థసౌలభ్యముకొరకు అందందు విభక్తులు కొంచెము మార్పుతో వ్రాయఁబడు చుండును.)

విశే॥ "జనీప్రాదుర్భావే" జాతియనగా ఒకప్పుడు పుట్టునది. కులము నిట్టిదే జన్మముచేఁగలిగిన ఆచారములు జాతిధర్మములనఁబడును, కులముచే నియమింపఁబడిన ధర్మములు కులధర్మములనఁబడును. జాతులు, సంఘ ములు ఒకప్పుడుండి యింకొకప్పుడు లేకుండబోవు స్వభావముగలవనిమనమె ఱుఁగుదుము. కనుక ఈ జాతిచేతను, కులముచేతను నిర్వహింపఁబడు ఆ చారములు శాశ్వతములనిచెప్పుటకు వీలుపడదు. జీవుఁడు ప్రవృత్తియందు వర్తించినంతవఱకు మాత్రమే జాతిధర్మముండును. ప్రవృత్తిపోఁగా జాతిపో వుచున్నది. దానికి సంబంధించిన ధర్మములు పోవుచున్నవి. అజ్ఞానులకు మాత్రమే యీధర్మములు శాశ్వతములుగఁ గనఁబడును.

మూ॥ ఉత్సన్నకుల ధర్మాణాం మనుష్యాణాం జనార్దన।
నరకే నియతం వాసో భవతీత్యను శుశ్రుమ॥ 44

తా॥ ఓ జనార్దనా! ఏవరిచే కులధర్మములు చెడఁగొట్టబడు చున్నవో ఆ మనుష్యులకు శాశ్వతముగ నరకమునందే నివాసమగుచున్నదని వినుచు న్నారము.

మూ॥ అహోబత మహత్పాపంకర్తుం వ్యవసితా వయమ్॥
యద్రాజ్య సుఖలోభేన హంతుం స్వజనముద్యతాః॥ 45

తా॥ అయ్యయ్యో! మనముగొప్పపాపముచేయనుంటిమి. అదెట్లనిన రాజ్యసుఖ ములయందలి దురాశతో మనచుట్టములనే చంపుటకు ప్రయత్నపడితిమి.

మూ॥ యదిమా మప్రతీకార మశస్త్రం శస్త్ర పాణయః।
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్॥ 46.

తా॥ ఆయుధము లేక ప్రతీకారము సేయ నొల్లకయుండు నన్ను ఆయుధ హస్తులైన ధార్తరాష్ట్రులు యుద్ధములో హింసించినను నాకది మిక్కిలి క్షేమమే యగును.

విశే॥ గుణములను నశింప జేయ దగిన సాధనలు లేనప్పుడు అట్టి ప్రయత్నముకూడ లేనప్పుడు అగుణములు పురుషుని పొందుకొను చున్నవి. కామాది గుణసమ్మేళనము ప్రాకృతపురుషులకు క్షేమముగనే కనబడును.

"రణేమాం హన్యుః" శబ్దస్థానమున సన్ను పొందుదురుగాక. (రణశబ్దే, హనహింసాగత్యోః)

సంజయుడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఏవ ముక్త్వార్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్।
విసృజ్య సశరం చాపం శోకసం విగ్నమానసః॥　47

యుద్ధభూమిలో రథమునందున్న యర్జునుఁడు పై విధముగాఁజెప్పి దుఃఖముతో చలించిన మనస్సుగలవాఁడై బాణములతోఁగూడ కోదండమును వదలివేసి కూర్చుండెను.

ఇది శ్రీ మహాభారతము భీష్మపర్వములో అర్జున విషాదయోగమనెడు ఇరువదియైదవ అధ్యాయము.

ఓం. తత్. సత్.



# శతపత్రము

# 89



## శ్రీ మహాభారతము భీష్మపర్వము 26 అధ్యాయము.

సంజయుడు చెప్పుచున్నాఁడు:—

మూ॥ తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణా కులేక్షణమ్।
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః॥ 1.

తా॥ ఆవిధముగా కరుణతో నిండిన వాఁడై కన్నుల నీరు నింపుకున్న అర్జునునిఁ గూర్చి శ్రీకృష్ణుఁడు ఈ మాట చెప్పుచున్నాడు.

విశే॥ భూతదయ గలఁవాడు, సంసారసాగరము నెట్లు దాఁటుదునా యని దుఃఖించువాడు గురూపదేశమునకు అర్హుఁడగును భారతములో బేర్కొన బడినఁ అర్జునునియం దీ లక్షణములు కనఁబడినందుననే శ్రీకృష్ణు డతనికి తత్త్వోపదేశము చేయుటకుఁ గారణమేర్పడినది. అని కొందఱు వ్యాఖ్యాత లందురు. మఱియు

"దయా సర్వభూతేషు. క్షాంతి రనసూయా శుచి రనాయాసో
మాంగళ్య మకార్పణ్య మస్పృహచే త్యష్టావాత్మగుణాః"

సర్వభూతములయందు దయ, ఓర్పు, పరులయందు దోషమారోపింప కుండుట, నిర్మలత్వము, ఆయాసము కలుగఁజేసికొనక మనశ్శాంతిని కాపాడుకొనుట, శుభమైన స్థితిని పొంది యుండుట, ధనముండియు దరిద్రుడు గాకుండుట, ఐహిక వాంఛ లేకుండుట, అను నీయెనిమిదియు స్వభావ గుణములు అని ప్రమాణవాక్యముఁ జూపుదురు. పైఁజెప్పఁబడిన గుణము లన్నియు అర్జునునియందు సమగ్రముగఁ గలవన్నమాట భారత విమర్శకు లు ఒప్పుకొనరు. ఇతనికిఁ గలిగిన శోకము సైతము కార్యవైముఖ్యమును

సూచించునే కాని సంసార తరణోపాయము నాకాంక్షించుట లేదు అందు వల్లనే యీ ఘట్టము భౌతికము కాదని విమర్శకుల వాదము.

భగవానుడు చెప్పుచున్నాడు;-

మూ॥ కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్।
అనార్య జుష్ట మస్వర్గ్య మకీర్తి కర మర్జున॥ 2.

ఓ యర్జునా! అనార్యులతో కూడుకొని యుండఁదగినది సుఖస్థానము నకు సంబంధపడనిది. అపకీర్తిని కలుగఁ జేయునదియైన యీ మనోవైకల్య ము విషమస్థితియందు ఎందుకు నిన్ను జెందినది?

విశే॥ కామాది శత్రువుల జయింపనున్న ఆధ్యాత్మిక యోదుఁడు అర్జునుడుగ (నిర్మలుఁడుగ) నుండవలయును విషమ మనఁగా నివృతి ద్వంద్వము. (సాటలేనిది) మనోవికారములులేని వానికే అట్టిస్థానము వశ మగుచున్నది. ఆస్థానముననే ఆత్మ విజయము, శాశ్వత సుఖము, కీర్తి సిద్ధాంతము లగుచున్నవి. కాఁబట్టి విషమస్థానమునే కశ్మలము కలుగరాదని గురువు బోధించుచున్నాఁడు.

మూ॥ క్లైబ్యం మాస్మ గమః పార్థ నైతత్త్వయ్యుప పద్యతే।
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥ 3.

తా॥ ఓ పార్థా! (రక్షణమును యాచించువాఁడా) పురుషులకు, స్త్రీల కు సైతము ఉండరాని నపుంసక భావమును పొందకుము. ఇది నీయందు పొందఁ దగినదికాదు. శత్రువుల తపింపఁ జేయువాఁడా! (శ్రేష్ఠమైన తపము గలవాడా!) నీ మనస్సు నందలి స్వల్పమైన దుర్బలత్వమును వదలివేసి ఉద్యుక్తుడవు కమ్ము (అంతశ్శత్రువుల జయించుటకు శరీర బలమున కంటే ఆత్మబలము ముఖ్యము. కాబట్టి యిట్లు చెప్పబడినది)

అర్జునుఁడు చెప్పుచున్నాడు:-

మూ॥ కథం భీష్మమహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన॥ 4.

తా॥ ఓ శత్రు సంహారకా! మధుసూదనా! పూజార్హులైన భీష్మ ద్రోణు లను యుద్ధరంగమున బాణములతో నే నెట్లు ప్రతిఘటింతును?

విశే॥ ఆధ్యాత్మిక చరిత్రమున గురువు తొలుతనే కామాది శత్రువులను జయించి యుండుటచే అరిసూదన అని శిష్యుఁడు సంబోధించుచున్నాడు. ప్రకృతి వ్యాపారములలోఁ దనకు మిక్కిలి సన్నిహితములై తోడుపడుచుండు ఔద్ధత్యమును, కౌటిల్యమును గురుభావమున సన్మానించి యుండును కనుక వాని నెట్లు ప్రతిఘటింతునని సంశయించుచున్నాఁడు. ఆధ్యాత్మిక యోధులచే లెస్సగ ఎన్నఁబడు కూటస్థానము సంఖ్యము. (ఖ్యాఁప్రకథనే) అంతర్లక్ష్యమును పొందు ఆధ్యాత్మిక దృక్కిరణములు ఇషువు లనబడును. (ఇషగతౌ) అట్టి కూటస్థానమున ఆధ్యాత్మిక దృక్కిరణములతో ఔద్ధత్యమును, కౌటిల్యమును అనుసంధించుట కెట్లు వీలుపడునా యని శిష్యుఁడు సంకోచించుచున్నాఁడు.

మూ॥ గురూ నహత్వా హి మహానుభావాన్।
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే।
హత్వార్థకామాంస్తు గురూ నిహైవ।
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్॥ 5.

(1) టీ॥ మహానుభావాన్ = మహానుభావులైన, గురూన్ = గురువులను అహత్వాఏవ = హింసింపకయే, భోక్తుం = భుజించుటకు, ఇహలోకే = ఈలోకములో, భైక్ష్యమపి = సేవవల్లనో, యాచనవల్లనో, కూలివల్లనో సంపాదించిన అన్నమైనను, శ్రేయోహి = మేలుకదా? గురూన్ = గురువులను, హత్వా = హింసించి, రుధిర ప్రదిగ్ధాన్ = రక్తముచే తడుపఁబడిన, భోగాన్ = భోగములను, అర్థకామాన్ = అర్థకామములను, ఇహైవ = ఈలోకములోనే, భుంజీయ = అనుభవింతును.

తా॥ మహానుభావులైన గురువులను హింసింపకయే భుజించుటకు లోకములో సేవవలనఁగాని, యాచన వలనఁగాని, కూలివలనఁగాని, సంపాదింపఁబడిన ద్రవ్యము మేలుకదా? (భిక్షా సేవార్థనా భృతిః అమరకోశము) గురువులను హింసించి రక్తముచే తడుపఁబడిన అర్థకామములను ఈలోకములోనే అనుభవింతును. (పరమార్థములేదని యిందువలనఁ దెలియుచున్నది) భారతములో పాండవులు కొంతకాలము పశులను సేవించియు, యాచించియు జీవించుటకలవాటు పడియుండిరి. కనుక గురుజనవిధేయుఁడైన యర్జునుఁడిట్లు చెప్పుట లెస్సగనే యున్నది.

(2) టీ॥ ఇహ = ఇచ్చట, అర్థకామాన్ = ద్రవ్యము నపేక్షించువార లను, మహానుభావాన్ = (ధనార్జనవృత్తినే) గొప్పగ అనుసరించు భావము గలవారలను,హత్వా = హింసించి, రుధిరప్రదిగ్ధాన్ = రక్తసిక్తములైన, గురూన్ భోగాన్ = గొప్పభోగములను, హత్వాఅపి = పొందియుండియు, ఇహలోకే = ఈలోకములో, భైక్ష్యమేవ = సేవాలబ్ధమైన పదార్థమునే, భుంజీయ = అనుభవింతును, (ఇట్టిది) భోక్తుం = భుజించుటకు, శ్రేయోనహి = మేలైనది కాదుకదా?

తా॥ అర్థముచే బద్ధులమై నపుంసకులవలె కౌరవులకు లోఁబడి పని చేయుచుంటిమని (భీష్మపర్వము 43 అధ్యాయములో) చెప్పినందున వీరెంత మహానుభావులైనను అర్థకాములే. ఇట్టి యర్థకాములైన గురువుల హింసించి రక్తసిక్తములైన గొప్పభోగములనుపొంది యీలోకములో కొంత అనుభవింతునుబో, అప్పటికైనను నేను సేవకుఁడనేకాని స్వతంత్రప్రభువును కాను. సేవాలబ్ధమైన యర్థము భైక్షముక్రిందనే చేరుచున్నది. ఇంత శ్రమించియు తుదకు భైక్షమునే కుడువవలసి వచ్చినప్పుడు అది మేలైనది కాదుకదా?

(3) టీ॥ మహానుభావాన్ = మహానుభావులైన, గురూన్ = గురువులను హత్వా = చేరి, భోక్తుం = అనుభవించుటకు, భైక్ష్యం = సేవాఫలము, శ్రేయఏవ = మేలైనదే (ఐనది) ఇహలోకే = ఈలోకములో, నభుంజీయహి = అనుభవింపఁ జాలనుకదా? (కాఁబట్టి) అర్థకామాన్ = అర్థమునందు కోరికఁ బుట్టించు, గురూన్ = గురువుల, హత్వా = చేరి, రుధిరప్రదిగ్ధాన్ = పంచకోశావృతమైన అహంకారముచే లెస్సగ సంచితము చేయఁబడిన, భోగాన్ = భోగములను, ఇహైవ = ఇచ్చటనే, భుంజీయ = అనుభవింతును.

తా॥ ("హనహింసాగత్యోః" అనుసూత్రమువలన "హత్వా" అనఁగా "హింసించి" యనియు "కూడుకొని" యనియు రెండర్థములు వచ్చును. "రుధిర్ ఆవరణె" అను సూత్రమువలన రుధిరమనఁగా రక్తమునకును, పంచకోశావేష్టితమైన అహంకారమునకును పేరగును. "దిహ అనుచయే" అనుసూత్రమువలన దిగ్ధమనఁగా పూయబడినదానికి, సంచితము గావింపఁ బడిన దానికిఁ బేరగును)

మహానుభావులైన గురువులఁజేరి యనుభవించుటకు సేవాఫలము మేలైనదేయైన నిది యీలోకములోనే యనుభవించుటకుకాదు. కాఁబట్టి యర్థ

మునందు కోరిక గలుగఁజేయులౌకిక గురువులఁజేరి అహంకారముచే సంచితము గావింపఁబడిన భోగముల ననుభవింతును.

(4) టీ॥ శ్రేయః = మోక్షరూపమైన, భైక్ష్యం = గురుసేవాఫలము, భోక్తుమపి = అనుభవించుటకైనను, ఇహలోకే = ఈలోకములో, గురూన్ = గొప్పవైన, అర్థకామాన్ = అర్థములను, కామములను, హత్వా = చెడఁగొట్టుకొని, మహానుభావాన్ = మహానుభావులైన, గురూన్ = గురువులను, హత్వా = చేరి, రుధిరప్రదిగ్ధాన్ = అహంకారలిప్తములైన, భోగాన్ = భోగములను, ఇహ = ఈలోకములో, నభుంజీయ ఏవహి = అనుభవింపకయే పోదునుకదా

శ్రేష్ఠమైన సేవాఫలము అనుభవింపనగునని నమ్మికొని ఐహికములైన గొప్ప అర్థములను, కామములను చెడఁగొట్టుకొని గొప్ప అనుభవముగల గురువులఁబొందితినా? ఈలోకములో అహంకారలిప్తములైన (ప్రారబ్ధరూపములైన) భోగములను అనుభవింపజాలకపోదును.

5 టీ। మహానుభావాన్ = మహానుభావులైన, గురూన్ = గురువులను, హత్వా = పొంది, భైక్ష్యం = గురుసేవాఫలమైన, శ్రేయః = మోక్షము, ఇహైవలోకే = ఈలోకములోనే, భోక్తుం = అనుభవించుటకు, నహి = కాదుకదా?, అర్థకామాన్ = అర్థములను, కామములను, హత్వా = పొంది, రుధిరప్రదిగ్ధాన్ = అహంకారలిప్తములైన, గురూన్‌భోగాన్ = గొప్పభోగములను, ఇహఅపి = ఇచ్చటఁగూఁడ, భుంజీయ = అనుభవింతును.

తా॥ గురువులఁజేరి సేవించుటచేఁగలుగు మోక్షము ఈలోకములోనే యనుభవించుటకు తగినదికాదు. అర్థకామములఁబొంది యైహికములైన గొప్పభోగముల ననుభవింతును.

మూ॥ నచైత ద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః।
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥ 6.

తా॥ ఎవరిని హింసించి మనము జీవించుటకు ఇష్టపడమో ఆధార్తరాష్ట్రులే యెదుట నిల్చియున్నారు. వారిని మనము జయింతుమో మనలవారు జయింతురో! ఏసమస్యగొప్పదో! దానినిసైతము మనమెఱుఁగము.

విశే॥ భీష్మపర్వము 21, 23 అధ్యాయములలోను, అంతకు పూర్వ కథలలోను పాండవులకే జయము కలుగునని సిద్ధాంతము చేయబడినది. ఈశ్లోకములో జయము సంశయింపఁ బడుచున్నది. కనుకనే యీఘట్టము అధ్యాత్మిక చరిత్రములోఁ జేర్పఁ దగినదని విమర్శకుల మతము.

కామలోభాదులైన అంతశ్శత్రువుల తుదముట్టించినా మనఁగా కోరికలన్నియు నశించిపోయిన వన్నమాటే. ఇంకను ఎంతోకాలము జీవింపవలయునను కోరిక సైతము కామమున కంటె వేఱైనది కాదు. కనుక వారు నశింపఁగా మనకు జీవితాశయు పోవుచున్నది. మనము జయించినచో బ్రహ్మానందముఁ జెందుదుము. వారు జయించినచో విషయానందముఁ జెందుదుము. అట్టి ధార్తరాష్ట్రులు మన యెదుట నిల్చియున్నారు. ఏపక్షము వారికి జయము కలుగునో! ఏ యనుభవము గొప్పదో! మన మెఱుఁగము.

మూ॥ కార్పణ్య దోషోప హత స్వభావః।
పృచ్ఛామి త్వాం ధర్మ సంమూఢ చేతాః।
యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే।
శిష్యస్తేఽహం శాధి మాంత్వాం ప్రపన్నమ్॥ 7.

తా॥ ఓ కృష్ణా! ప్రారబ్ధ వశమున లభించిన సొమ్మును సరిగా ఉపయోగించుకొనక పోవుటచే కలిగిన పరితాపము వలన నా స్వభావము చెడఁ గొట్టఁ బడినది. ధర్మము తెలిసికొనుటలో మూఢచిత్తుఁడనై యున్నాఁడను. నీ శిష్యుఁడను. నిన్ను శరణొందిన వాఁడను. నన్ను ఆజ్ఞాపింపుము. నాకు ఏది మంచిదగునో నిన్ను అడుగుచున్నాడను. నాకు ( ధర్మమును ) నిశ్చయించి చెప్పుము.

విశే॥ పూర్వము చేసియుండిన సత్కర్మఫలము ప్రారబ్ధ రూపమున కలిసి వచ్చినను గురుసూత్రము దెలియని వాఁడు దానిని సుఖవంతముగ ఉపయోగపెట్టుకొనఁ జాలఁడు. అందువలన తాపత్రయమునకుఁ జిక్కుచున్నాఁడు. స్వస్వరూపము చెడఁగొట్టఁ బడుచున్నది. అటువైన ఆత్మరక్షణధర్మసూత్రమును తెలిసికొనఁ జాలని మూఢచిత్తుఁ డగుచున్నాడు. అట్టి విద్యార్థి గురువును జేరి ఓదేవా! నేను నీయాజ్ఞకు పాత్రుడను. నిన్నే శరణొందితిని. నాకు ఏది శాశ్వతమైన ముక్తియగునో దానిని చెప్పుము. నేను

మూఢుడనై యడుగుచున్నాడను. నన్ను ఆజ్ఞాపింపుము. అని ప్రార్థించు చున్నాడు.

మూ॥ నహి ప్రపశ్యామి మమాపనుద్యా।
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్।
అవాప్య భూమా వసపత్న మృద్ధం।
రాజ్యం సురాణా మపి చాధి పత్యమ్॥ 8

తా॥ భూలోకములో శత్రురహితము, సమృద్ధమునైన సామ్రాజ్యము పొందియు, దేవలోకాధిపత్యము సంపాదించియు ఇంద్రియములనుశుష్కింప జేయు శోకమును తొలఁగించు సూత్రమేదో దానినెఱుగనుకదా!

విశే॥ పురాకృత కర్మఫలముచేతను, ఈజన్మమున జేసిన సుకృతము చేతను ఐహికాముష్మికములైన భోగభాగ్యానుభవ సామ్రాజ్యములఁబ్రాపించియు ఇంద్రియములదహించు విషయతృష్ణానలము నార్పివేయు ఆత్మరక్షణా ధర్మ సూత్రమేది కలదో దానిని లెస్సగ కనిపెట్టఁజాలను కదా! అని శిష్యుఁడడుగు చున్నాడు.

సంజయుఁడు చెప్పుచున్నాడు.

మూ॥ ఏవముక్త్వాహృషీకేశం గుడాకేశః పరంతపః।
నయోత్స్య ఇతి గోవింద ముక్త్వాతూష్ణీం బభూవహ॥ 9

తా॥ పైశ్లోకములలో వెల్లడింపబడినరీతిగాజెప్పి యుద్ధసన్నాహనియతు లలో శ్రేష్ఠుఁడు, శత్రువుల సంతాపింపఁజేయువాడు, (శ్రేష్ఠమైన తపముగల వాడు) నగు అర్జునుఁడు (నేనిఁక) యుద్ధముచేయనని హృషీకేశుఁడైన గోవిందునితో జెప్పియూరకుండెను. (విశేషార్థము సులభము)

మూ॥ తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత।
సేనయో రుభయో ర్మధ్యే విషీదంత మిదంవచః॥ 10

తా॥ ఓ భారతా! ధృతరాష్ట్రా! రెండు సైన్యములనడుమ వ్యసనపడు చున్న అర్జునిఁగూర్చి శ్రీకృష్ణ పరమాత్మహాస్యము చేయువానివలె ఈ మాట చెప్పెను.

విశే॥ బహుకాలానుగతమైన పరిచయముచే కలిగిన మమకారము వలన దుర్గుణములయందును పురుషునకు కాఠిన్యము కలుగుట దుర్లభము.

అట్లగుటచే వానిని ఖండింపనోపక సుగుణ దుర్గుణముల నడుమ ఊరకుండ వలసి వచ్చినది.

శ్రీ భగవానుఁడు చెప్పుచున్నాఁడు.

మూ॥ అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః॥ 11.

తా॥ ఓ యర్జునా! శోకింపఁ దగని వారిని గూర్చి నీవు శోకించు చున్నా డవు. పైగా బుద్ధిమంతుని మోస్తరుగా మాటలాడుచున్నాఁడవు. ప్రాణములు పోయిన వారిని గూర్చికాని, పోనివారిని గూర్చికాని జ్ఞానులు అనుతాపము పొందరు.

వివ॥ యుద్ధరంగమున ఆయుధమును బట్టి నిలిచిన యోధులెల్లను చంపుటకు, చచ్చుటకు ఒప్పుకొని వచ్చిన వారేయని భావము. తమ మరణ మునకుఁ దామె శోకింపఁని స్థితియందున్నవారు కనుక మఱి యొకరి లక్ష్య ములోను వీరు శోకింపఁ దగనివారే. అంతేకాక అధర్మపరులైన ఆతతాయుల పక్షమున యుద్ధమునకు వచ్చిన వారు గురువులైనను, బంధువులైనను, మిత్రు లైనను, శోకింపఁదగనివారే. భీష్ముఁడు, ద్రోణుఁడు, కృపుడు, కృతవర్మ బాహ్లికుఁడు, భగదత్తుఁడు ద్రుపదుఁడు, విరాటుఁడు మొదలైన కొందఱు యోధులు బహుకాలము జీవించినవారు, ప్రపంచముపై విసుగుపుట్టి చావున కెదురు చూచునంతటి వృద్ధులు కావున వీరు శోకింపఁ దగనివారే

విశే॥ శరీరమునకు, ఆత్మకు సంయోగ ముండునంత వఱకు ప్రాణ వాయులు శరీరమున సంక్షిప్తములై యుండును. శరీరాత్మలు వియోగము నొందునపుడు వాయువులు శరీరము నుండి తొలగిపోవు చున్నవి. ప్రాణవా యువులతో, గూడి యుండునవి, వేఱగునవి, శరీరములు మాత్రమే (శరీర స్థాణమే. అమరకోశః) అట్టిశరీరములు స్థిరములు కావని యెఱుఁగుటచే వాయువులతోఁ గూడియుండు శరీరముల గుఱించి కాని, వాయువులు వెడలి పోయిన శరీరముల గుఱించికాని జ్ఞానులు శోకింపరు. ప్రాణమయ కోశము పంచకోశములలో నొకటి. దాని నతిక్రమించి పోయినవాఁడు అరూఢుఁడు. పోవనున్నవాఁడు ఆ రురుక్షువు. అట్టి ప్రాణమయ కోశము నధిగమించి పో వుటలోఁ గాని, దానిని కూడుకొని యుండుటలోఁ గాని, నిత్య శుభప్రాప్తి కెట్టి

లోపమురాదు. కాఁబట్టి దాని నతిక్రమించి పోయిన వారిని గూర్చికాని, అతిక్రమింపని వారిని గూర్చికాని, జ్ఞానులు అనుతాపముఁ జెందరు.

మూ॥ నత్వే వాహం జాతునాసం నత్వం నేమే జనాధిపాః।
నచైవ నభవిష్యామ స్సర్వే వయ మతః పరమ్॥ 12.

తా॥ నేను ఒకప్పుడును లేకపోవు వాఁడను కాను. నీవు లేక పోవు వాఁడవు కావు. యీ రాజు లెల్లరును లేకపోవువారు కారు. ఇఁకమీద సైతము మన మందఱము లేకపోవు వారలము కాము. (త్రికాలముల యందును ఉందుమని భావము.)

విశే॥ నేను, నీవు, వారు అను పదములు ఉపచారార్థము తీసికొనినవే కాని శాశ్వతమైన పృథగ్భావముతో తీసుకొనినవి కావు. ఉత్తీర్ణులయందు ఏకత్వమే భావింపఁబడునని నమ్మవలయును.

శ్లో॥ యస్తుసాక్షిణ మాత్మానం సేవతే ప్రియముత్తమమ్।
తస్యప్రేయా నసా వాత్మా న నశ్యతి కదాచన॥

మనో బుద్ధీంద్రియములకు సాక్షి, ప్రియము, ఉత్తమమునైన పరిశుద్ధాత్మను ఎవఁడు భజించుచున్నాఁడో వానికి ప్రేమాతిశయమైన ఆయాత్మ యెప్పుడైనను నశింపదు (వేదాంత పంచదశి 12-71)

మూ॥ దేహినోఽస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా।
తథాదేహాంతరప్రాప్తి ర్ధీరస్తత్ర నముహ్యతి॥ 13

తా॥ దేహధారియైన పురుషునకు ఈదేహమునందు బాల్యము, యౌవనము, వార్ధకము అను నవస్థలు ఒకటిపోయినతరువాత మఱియొకటి ఏప్రకారము వచ్చుచున్నవో అప్రకారముగానే యీదేహము పోయినతరువాత మఱియొక దేహము వచ్చుచున్నది. ఈవిషయమున జ్ఞాని మోహముఁ జెందఁడు. బాల్యముపోయి యౌవనము వచ్చునప్పుడు, యౌవనము పోయి వార్ధకము వచ్చునప్పుడు దేహ స్వరూపమునందు మార్పు కలుగుచున్నదేకాని, పురుషుడు చావడు. అట్లే యీశరీరముపోయి యింకొక శరీరము వచ్చినప్పటికి పురుషుఁడు చావడు. "దేహినః" అనుటచే దేహాభిమానముతోఁ గూడిన ప్రాకృత జనులకుమాత్రమే దేహాంతరప్రాప్తి నియమము వర్తింపఁబడినది. కాని పరిపూర్ణజ్ఞాన సిద్ధాంతులకులేదని యూహించుకొనవలయును.

మూ॥ మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః।
అగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వభారత!॥ 14.

తా॥ ఓ భారతా! కౌంతేయా! శ్రోత్రాదులైన యింద్రియములు, ఇంద్రియ వ్యాపారములోఁజేరిన శబ్దస్పర్శాది విషయములు ఇవన్నియు పురుషునకు శీతోష్ణములను, సుఖదుఃఖములను కలిగించు చుండును. (అంతేకాదు ఒకప్పుడు) వచ్చుచున్నవి. (ఇంకొకప్పుడు) వినాశము కలిగియున్నవి. ఎల్లప్పుడు ఒకటేవిధముగ నిలిచియుండునవికావు. కనుక నిట్టి శీతోష్ణాది క్లేశములను ఓర్చుకొనుము. ఇచ్చట వర్ణింపఁబడిన విషయము భౌతిక యుద్ధ చరిత్రమునకుఁ బనికివచ్చునదికాదు. కాఁబట్టి యిది యాధ్యాత్మిక గ్రంథముగ అంగీకరింపఁబడుచున్నది.

మూ॥ యంహి నవ్యథయం త్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖ సుఖం ధీరం సోఽమృతత్వాయకల్పతే॥ 15.

తా॥ యోధాగ్రేసరులలో శ్రేష్ఠుఁడవైన అర్జునా! దుఃఖములు, సుఖములు ఆగంతుకములేగాని నిత్యములుకావు కనుక వానిని సమముగఁజూచి సహించుకొను పాటవముగల యే పండితాగ్రేసరుడైతే పైఁజెప్పఁబడిన ఇంద్రియవిషయాదులు కదలింపఁజాలవో అతఁడే అమృతస్వరూపమైన మోక్షపదము పొందఁదగినవాఁడు. మానసేంద్రియములచేఁ జలింపని స్థితి స్థైర్యమనఁబడును. స్థైర్యముగలవాఁడే ఆధ్యాత్మిక సామ్రాట్టు.

శ్లో॥ కిం విద్యయా కిం తపసా కిం త్యాగేన శ్రుతేనవా।
కిం వివిక్తేన మౌనేన స్త్రీ భిర్యస్య మనోహృతమ్॥

ఎవనిమనస్సు స్త్రీలచే హరింపఁబడినదో (వానికిఁక) విద్యచేతను, తపస్సుచేతను, త్యాగముచేతను, సద్వాక్య శ్రవణముచేతను, ఏకాంత వాసముచేతను, మౌనముచేతను ఎంతమాత్రము ప్రయోజనము లేదనిభావము. (భాగవ. 11 స్కం 26 అ. 12 శ్లో)

శ్లో॥ పుంశ్చల్యాప హృతంచిత్తం కోన్వన్యోమోచితుం ప్రభుః।
ఆత్మారామేశ్వర మృతే భగవంత మధోక్షజమ్॥

దృశ్యములైన విషయములనన్నిఁటిని అధఃకరించునట్టియు, స్వస్వరూపముచే క్రీడించునట్టియు భగవంతుఁడైన పరమేశ్వరుఁడు దప్ప జారస్త్రీచే

అపహరింపఁబడిన చిత్తమును ఆమెనుండి వదలించుటకు ఏప్రభువు కలఁడు? (భాగవ 11 స్కం. 26 అ. 15 శ్లో)

శ్లో॥ కామ నామ్నా కిరాతేన వికీర్ణా ముగ్ధచేతసః।
నార్యో నర విహంగానా మంగబంధన వాగురాః॥

ముగ్ధచిత్తలైనస్త్రీలు నరులనెడు పక్షులదేహములను పట్టుకొనెడు వలలుగా కామదేవుఁడను వేటకానిచే విడువఁబడినారు. (మహోపనిషత్తు 3-45 ఈశ్లోకము యాజ్ఞవల్క్యోపనిషత్తులోను చదివినట్లు జ్ఞాపకము.)

శ్లో॥ విషం విషయ వైషమ్యం నవిషం విషముచ్యతే।
జన్మాంత రఘ్నా విషయా ఏకజన్మహరం విషమ్॥

విషయార్థములయందు సమత్వము లేకపోవుటే విషమని చెప్పఁబడును కాని విషము విషమని చెప్పఁబడదు. విషము ఒక జన్మమునే హరించును విషయములు మఱుజన్మమునసైతము బాధించుచున్నవి (మహోపనిషత్తు 3 అ. 54-55) అను ప్రమాణ వాక్యములఁబట్టి మానసేంద్రియములచేఁ జలింపని ధీరుఁడే మోక్షాధికారి.

మూ॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽంత స్త్వనయోస్తత్త్వదర్శిభిః॥ 16.

తా॥ అశాశ్వత వస్తువునకు స్థిరమైన యునికిలేదు శాశ్వతవస్తువునకు నాశములేదు. ఈ రెంటియొక్క పర్యవసానము తత్త్వజ్ఞులకు గోచరించుచుండును. శరీరములు ఒకప్పుడు నశించునవి యను సంగతి యందఱెఱిగినదే దేహముతో గూడిన పవనేంద్రియములు వానిచే లక్షింపఁబడు శీతోష్ణాదులు, సుఖ దుఃఖములు ఇవన్నియు స్థిరముగ నుండునవి కావు. కనుక వీని వియోగమునకై శోకించినను నిష్ప్రయోజనము. దేహేంద్రియములకు, గుణకర్మాదులకు అతీతమైన ఆత్మ యెన్నఁటికి నాశములేనిది. దీనిని గుఱించి శోకింపవలసిన కారణమేలేదు. ఇఁక దేనిని గుఱించి శోకింపవలసి వచ్చినదని గురువు అడుగుచున్నాఁడు,

మూ॥ అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్।
వినాశ మవ్య యస్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి॥ 17.

తా॥ ఈ విశ్వము (జగత్స్వరూపమైన స్థూలశరీరము) సర్వము దేనిచే వ్యాప్తమై యున్నదో అట్టి పరిశుద్ధాత్మ తత్త్వము వినాశము లేనిదని తెలిసి కొనుము. దానిని నశింపఁ జేయుటకు అర్హుడెవఁడును లేఁడు. "ఏకః పరాత్మా బహుదేహవర్తీ" యను ఆర్యోక్తిని బట్టి సర్వ శరీరముల యందలి చైతన్య మొకటే కాఁగా తనకంటే అన్యమైన చైతన్య వస్తు వింకొకటిలేదని తెలియుచున్నది. జడవస్తువు లేవియు దీనిని నష్టము చేయఁజాలవని యెఱుగుదుము. కనుకనే ఆత్మను నష్టము చేయువాఁడు లేడని చెప్పఁబడినది.

మూ॥ అంతవంత ఇమేదేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత॥ 18.

తా॥ ఓ భారతా! (చిత్ప్రకాశముచే క్రీడింపఁబడు శిష్యా) ఇట్టివాఁడని కాని, యింతవాఁడని కాని, బుద్ధీంద్రియములచే ఏర్పఱుపరానివాఁడు, నాశము లేనివాఁడు, శాశ్వతుఁడు, శరీరధారియు నైన ఆత్మకు ఈ దేహములు అంతముతో గూడినవని చెప్పఁబడుచున్నవి. నశించిపోవు స్వభావము వీని యందుండుట చేతనే శరీరములని పేరుకలిగినది. తాపత్రయముచే దహింపబడుచున్నవి. జఠరాగ్నిచే దహింపఁ బడుచున్నవి. కామ జ్వరాదులచే దహింపబడుచున్నవి, యోగాగ్నిచే దహింపబడుచున్నవి, తుదకు స్మశానములో ఇంధనాగ్నిచే దహింప బడుచున్నవి ఆత్మ సర్వసాక్షి, నిత్యుఁడు కాబట్టి అస్థిరములైన దేహములయందుగాని, దేహములతో సంబంధముగల విషయ భోగాదుల యందుగాని, అభిమానము వదలుకొనుము. శత్రువుల సంహరింపుము ఇచ్చట ఆత్మ నిత్యము. ఎవ్వని చేతను సంహరింప బడునదికాదు. సర్వము తానై యుండుటచే శత్రు మిత్ర భేదములు లేవని చెప్పవలయును. శరీరము సహజముగ నశించునది. శత్రు మిత్ర భేదమెఱుఁగని జడము. ఇఁక శత్రుసంహార మనఁగా నెట్టిది? అని కొందఱడుగుచున్నారు. ఆర్ష విద్యార్థికి కామలోభాదులే శత్రువులని జ్ఞాపక ముంచుకొన వలయును.

మూ॥ య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్॥
ఉభౌతౌ నవిజానీతో నాయం హంతి న హన్యతే॥ 19.

తా॥ శరీరధారియైన యీ యాత్మ యింకొకరిని చంపువాఁడని యెవడు తెలిసికొను చున్నాఁడో, ఆటుగాక చంపఁబడినాఁడని యెవఁడు తలఁచు

చున్నాడో అట్టి వారిరువురు మూఢులే. (ఎందుకనఁగా) ఆప్రత్యగాత్మ చంపునది కాదు. చంపఁ బడునది కాదు.

శ్లో॥ హంతాచే న్మన్యతే హంతుం హతశ్చే న్మన్యతే హతమ్।
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే॥

ఈ శ్లోకము కఠోపనిషత్తు 2. వల్లిలోను, శివగీత 2 అధ్యాయములోను, ఒకటేవిధముగఁ జెప్పఁబడినది. మఱియు భారత శాంతి. 224 అధ్యాయములోను, ఈ భావము వెల్లడింపఁ బడినది. ఇట్టి యనుకరణ శ్లోకములు అందందు కనఁబడు చుండుటచేతను. "భగవద్గీతాసు, ఉపనిషత్సు" అని గీతాగ్రంథములో అధ్యాయాంతమున వ్రాయఁబడుటచేతను, "సర్వోప నిషదోగావః" అని గీతా ప్రశంసా శ్లోక ముండుటచేతను, ఉపనిషత్తుల నుండి సంగ్రహింప బడినదే గీతాశాస్త్రమని నమ్మ పలసియున్నది.

మూ॥ నజాయతే మ్రియతే వా కదాచి।
న్నాయం భూత్వా భవితా వా నభూయః।
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో।
నహన్యతే హన్యమానే శరీరే॥ 20.

తా॥ సనాతనమైన యీయాత్మ జన్మములేనిది. ఎల్లప్పటికి నియతముగ నుండునది. ఎప్పుడైనను పుట్టునదికాదు, చచ్చునదికాదు. మఱియు ఈ యాత్మ యొకప్పుడుండి యింకొకప్పుడు లేకపోవునదికాదు శరీరము హింసింపబడుచుండగా ఆత్మ హింసింపఁబడదు. శరీరము పవనేంద్రియములతో సంఘాతము చేయఁబడుచుండఁగా ఆత్మ యటుల సంఘాతము చేయఁబడదు. (హనహింసాగత్యోః)

శ్లో॥ నజాయతే మ్రియతేవా విపశ్చి।
న్నాయం కుతశ్చిన్న బభూవకశ్చిత్।
అజోనిత్య శ్శాశ్వతోఽయం పురాణో।
నహన్యతే హన్యమానే శరీరే॥

పండితుఁడు పుట్టఁడు, చావఁడు. అట్టివాఁడెవఁడును ఎచ్చటను లేనివాఁడుకాఁడు. తక్కిన అర్థ శ్లోకము గీతలో వచ్చినదే. (కఠోపనిషత్తు 2 వల్లి 18 శ్లో॥ )

శ్లో॥ న జాయతే నోమ్రియతే న వర్ధతే।
నక్షీయతే నో వికరోతి నిత్యః।
విలీయ మానేఽపి వపుష్య ముష్మిన్।
నలీయతే కుంభ ఇవాంబరం స్వయమ్॥

అస్మత్పదలక్ష్యార్థమైన పరిశుద్ధాత్మ జనన మరణములు, వృద్ధిక్షీణము లు, మొదలైన వికారములులేనిది. నిత్యమైనది కడవయందలి ఆకాశమువ ఈదేహము నందుండియు, తాను లయించునదికాదు. (వివేకచూడామణి 136 శ్లో)

శ్లో॥ కదాచిదాత్మా నమ్రుతో నజాయతే।
నక్షీయతే నాపి వివర్ధతేఽనవః।
నిరస్త సర్వాతి శయః సుఖాత్మకః।
స్వయంప్రభః సర్వగతోఽ యమద్వయః॥

ఆపరమాత్మ యెప్పుడైనను చావఁడు, పుట్టడు, క్షీణింపడు, పెరుగడు, సనాతనుడు. సర్వవ్యాపి, స్వయంప్రకాశముగలవాడు. సుఖస్వరూపుడు. ఇంత కంటె వెల్తైనదిలేదు అతిశయమైనదిలేదు. (ఈశ్లోకము రామగీతలోను 35అ. ఉత్తర 5 సర్గలోను చదివినట్లు జ్ఞాపకము)

శ్లో॥ నజాయతే నమ్రియతే కించిదత్ర జగత్రయే।
నచభావ వికారాణాం సత్తాక్వచ న విద్యతే॥

పరమాత్మ తత్త్వము ఈమూఁడు లోకములలో కొంచెమైనను పుట్టదు, చావదు. భావ వికారములకువ్యతిరిక్తమైన సత్త్వము లేకపోవుట యెక్కడిది? (మహోపనిషత్తు 4-120)

"నజాయతే, నమ్రియతే, నశుష్యతి, నక్లిద్యతే, నదహ్యతే, నకంపతే, నబిద్యతే, నచ్ఛిద్యతే, నిర్గుణః సాక్షిభూతః శుద్ధో నిరవయ వాత్మా కేవలః సూక్ష్మో నిర్మమో నిరంజనో నిర్వికారః" అవయువ శూన్యమైన ఆపరమాత్మ సాత్వికాదిగుణములులేనివాఁడు, సర్వమునకు సాక్షియైనవాఁడు, పరిశుద్ధుడు కేవలము సూక్ష్మరూపుఁడు. నాది యన్నమాటలేనివాఁడు, అందువల్లనే అను రాగశూన్యుఁడు. షడ్భావ వికారములులేనివాడు. కావున అపరమాత్మ పుట్టఁ డు, చావఁడు, ఎండింపఁబడఁడు, తడుపఁబడడు, దహింపఁబడడు, చలింపఁ డు, పగులఁగొట్టఁబడఁడు, చీల్పఁబడడు. (ఆత్మప్రభోదో పనిషత్తు 1 గ.)

మూ॥ వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్।
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతికమ్॥ 21.

తా॥ ఓపార్థా! పవనములకు, మనోబుద్ధీంద్రియములకు విలక్షణమై, గుణ కర్మాదులకు అతీతమై సర్వభూతములయందు నేను నేనని వ్యవహరింపబడు పరిశుద్ధాత్మ తత్త్వము దేశకాల వస్తు పరిచ్ఛేదములచే స్వరూపనాశము నొందనిది, షడ్భావ వికారములఁ జెందక నియతమై యుండునది, జన్మములేనిది, ఎన్నఁటికి తఱిగిపోక యేకరీతి ప్రకాశించునది'' అని యెవఁడు తెలిసికొనుచున్నాడో (పరిపూర్ణజ్ఞాన సిద్ధాంతియైన) ఆ పురుషుఁడు ఎవని నెట్లు చంపించును? ఎవని నెట్లు చంపును.

మూ॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ।
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా।
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥ 22.

తా॥ మనుష్యుఁడు శిథిల వస్త్రములను వదలివేసి ఆ వస్త్రముల కంటె వేఱైన క్రొత్త వస్త్రముల నెట్లు గ్రహించుచున్నాడో అట్లే దేహియగు వాడు రోగముల చేతను, వార్థకము చేతను చింతాపరంపరల చేతను శిథిలీభూతములైన శరీరములను వదలివేసి నూతనములైన వేఱు శరీరముల బొందుచున్నాఁడు. ఆత్మ యేకవచనము నందును, శరీరములు బహువచనము నందును. చెప్పబడుటచే అనేక జన్మములు కలవనియు, అందు ఉత్పత్తి నాశములు శరీరములకే కాని, ఆత్మకు లేవనియు తెలియుచున్నది. పాతవస్త్రముల విడుచునప్పుడు శోకములేదు. అట్లే పాతశరీరములను వదలు నప్పుడు కూడ శోకము జెందరాదని భావము.

శ్లో॥ యథాత్యజతివై జీర్ణం వాసో గృహ్ణాతి నూతనమ్
తథా జీర్ణం పరిత్యజ్య దేహీ దేహంపున ర్నవమ్।
భజత్యేవ సదాతత్ర శోకస్యావసరః కుతః॥
ఆత్మా సమ్రియతే జాతుజాయతే న చవర్ధతే॥

పురుషుఁడు పాతవస్త్రమును విడిచిపెట్టి క్రొత్తవస్త్రము నెట్లు గ్రహించుచున్నాడో అట్లే పాతశరీరమును వదలివేసి మఱియొక క్రొత్తశరీ

రమును ధరించుచున్నాఁడు. ఆత్మ యెన్నడును చావఁడు. పుట్టడు. పెరుగడు. కావున దీనియందుశోకింపవలసిన అవసరమేమున్నది? (అధ్యా. అయో. 7. సర్గ 104, 105 శ్లో )

శ్లో॥ యథా జీర్ణ మజీర్ణం వా వస్త్రం త్యక్త్వాతు పూరుషః॥
అన్యద్రోచయతే వస్త్రమేవం దేహా శ్శరీరిణామ్॥

పురుషుఁడు శిథిలమైన వస్త్రమునుగాని, శిథిలముకాని వస్త్రమునుగాని వదలివేసి వేఱువస్త్రమును ధరింపఁగోరుచున్నాడు, శరీరధారులైన జీవులకు దేహములుసైతమట్టివే. (భారతము. స్త్రీ. 3-9,)

మూ॥ నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః॥
నచైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః॥ 23.

తా॥ (ఈపరిశుద్ధాత్మ రూపము, పరిమాణములేనిదికాఁబట్టి) దీనిని ఆయుధములు చీల్పఁజాలవు, అగ్ని దహింపఁజాలదు, జలములు తడుపఁజాలవు, వాయువు దీనిని ఎండింపఁజాలదు. (పంచభూతముల వలన సంభవించిన దృశ్యవస్తు సముదాయముమాత్రమే పంచభూతములచే బాధింపఁబడునుకాని తద్విలక్షణము, నిర్వికారము, నిరాకారమునైన పరిపూర్ణాత్మ తత్త్వము మఱి దేనిచేతను బాధింపఁబడదు.)

మూ॥ అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽ శోష్య ఏవచ।
నిత్యస్సర్వగత స్థాణుర చలోఽయం సనాతనః॥ 24.

తా॥ ఆపరమాత్మ తత్త్వము భావ వికారములులేక ఒకటేరీతిగ నుండునది. కనుక నిత్యమైనది. సర్వవస్తువులయందు వ్యాపించియుండునది. శాశ్వతమైన ప్రతిష్ఠ కలిగినది. చాంచల్యములేనిది. ఆద్యంతములు లేకపోవుటచేసనాతనమైనది అందువల్లనేఛేదింపరానిది. దహింపరానిది. తడుపరానిది. ఎండింపరానిది ఇట్టిపరమాత్మ యేవిధముగనైన నశించునదికాదు. దీనికంటె ఇతరవస్తువులన్నియు తమకుదామే నశించుస్వభావముగలిగినజడపదార్థములు ఎవరుకొట్టకున్నను కాలముచేతనే కొట్టుపడిపోవుచున్నవి, కాఁబట్టితనకంటె అన్యమేదియుఁ గానరాని శుద్ధచైతన్యమునుగూర్చి కాని, తమకుఁదామే నశించు స్వభావముగల జడాత్మకములైన శరీరాదులను గూర్చికాని శోకింపరాదని భావము.

[శత 4/10] ఓం తత్ సత్

# శతపత్రము

# 90

మూ॥ అవ్యక్తోఽయ మచింత్యోఽయ మ వికార్యోఽయముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి॥ 25

తా॥ ఆపరమాత్మ తత్త్వము రూపనామములు లేనిది కనుక అవి ఇట్టి దట్టిదని పలుకులచే వర్ణింపరానిది. నిరాకారము, నిర్గుణము అగుటచే బుద్ధిచే ఊహింపరానిది. కర చరణాద్యవయవములు లేనిదగుటచే క్రియారహితమైనది. (అని యిట్లు పండితులచే) పలుకఁబడుచున్నది. అందువలన ఆ పరమాత్మను ఈవిధముగాఁ దెలిసికొని (శోకము మానుము) నీవు శోకింపఁ దగినవాఁడవుకావు. అని గురువు బోధించుచున్నాఁడు.

శ్లో॥ నసందృశే తిష్ఠతిరూపమస్య, నచక్షుషా పశ్యతి కశ్చిదేనమ్।
మనీషయా మనసావైహృదాచ, యఏనం విదురమృతాస్తేభవంతి॥

తా॥ ఆ పరమాత్మస్వరూపము సాదృశ్యమునందు నిలుచునదికాదు. (దానికి సాదృశ్యమేలేదు.) దాని నెవఁడైనను కంటిచేతను, బుద్ధిచేతను, మనస్సుచేతను, హృదయభావముచేతను చూడఁజాలఁడు అట్టిపరమాత్మ నెవరు తెలిసికొందురో వారు మరణము లేనివారగుదురు. (ఈశ్లోకము సనత్సుజాతీయము 5 అధ్యాయములోను, కఠోపనిషత్తు 6 వల్లిలోను, మహానారాయణోపనిషత్తు 6 అధ్యాయములోను, శివగీత 13 అధ్యాయములోను, నారాయణోపనిషత్తు 1 అధ్యాయములోను, శ్వేతాశ్వతరోపనిషత్తు 4 అధ్యాయములోను, కొంచెము వర్ణభేదముతోఁ జదివినట్టు జ్ఞాపకము.) ఇచ్చట తెలిసికొనుట యనఁగా అన్యవస్తువులవలె పృథగ్భావముతో తెలిసికొనుటకాదు. తత్స్వరూపమును బొందుటయని భావింపవలయు.

మూ॥ అథచైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్।
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి॥ 26.

తా॥ గొప్ప బాహుబలముగల అర్జునా! ఇంకను ఆపరమాత్మను నిరంతరము పుట్టుచు, చచ్చుచుండు వానింగాఁదలఁచి నప్పటికిఁగూడ నీవీ విధముగా శోకింపరాదు. (దినదినము పుట్టుట, చచ్చుట నైజగుణమే యైనప్పుడు దానినిగుఱించి శోకింప నవసరమేలేదు.)

మూ॥ జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మమృతస్యచ।
తస్మాదపరిహార్యేఽర్థే నత్వం శోచితు మర్హసి॥

తా॥ జన్మించు స్వభావముగల వస్తువునకు మరణము నిశ్చితమై యుండును. మరణించు స్వభావముగల వస్తువునకు మరల జన్మము తప్పినదికాదు ఏవస్తువునకైనను జనన మరణములలో ఒకటిమాత్రమే యుండుటకు వీలుపడదు. లేనిదాని కీరెండు నుండవు. ఉన్నదాని కీరెండునుండును. ఇట్లు తప్పనిసరిగా జనన మరణములు రెండును నియతమై యుండు వస్తువు కొఱకైనను నీవు శోకింపరాదు. (ఎందుకనఁగా చచ్చినది మరల పుట్టును. ఇఁక శోకింపనేల?)

శ్లో॥ బంధత్వ మపి చేన్మోక్ష బంధాభావే క్వమోక్షతా।
మరణం యదిచే జ్జన్మ జన్మాభావే మృతిర్నచ॥

బంధముండినయెడల మోక్షమున్నది. బంధము లేకపోయినప్పుడు మోక్షమెక్కడిది? జన్మముండినయెడల మరణమున్నది. జన్మము లేకపోయినప్పుడు మరణములేదు. (తేజోబిందూపనిషత్తు 5-24)

శ్లో॥ జన్మవాన్ యది లోకేఽ స్మిం స్తర్హి తం మృత్యురన్వగాత్।
తస్మాదపరి హార్యోఽయం మృత్యు ర్జన్మవతాం సదా॥

ఈలోకములో జన్మముగలవాఁడు కాగానే వానిని మృత్యువు వెంబడించుచున్నది. అందువలన ఎల్లప్పుడును జన్మగలవారికి మరణమనివార్యమై యున్నది. (అధ్యా - అయో - 7 స. 99 శ్లో)

శ్లో॥ జాయతే మృత్యవే లోకో మ్రియతే జననాయచ।
అస్థిరా స్సర్వ ఏవేమే సచరాచర చేష్టితాః॥

ఇంద్రియగోచరమైన వస్తుసముదాయ మంతయు (జన్మించుచున్నది. మరణించుచున్నది.) చచ్చుటకే పుట్టుచున్నది. మరల పుట్టుటకే చచ్చుచున్నది. జంగమస్థావర సహితమైన లోకముయొక్క యీ చేష్టితములు (జననమరణాదులు) అన్నియునస్థిరములే (మహోపనిషత్తు 3 అధ్యా 4 శ్లో)

శ్లో॥ మరణం జన్మని ప్రోక్తం జన్మవై మరణాశ్రితమ్।
అవిద్వాన్ మోక్ష ధర్మేషు బద్ధో భవతి చక్రవత్॥

జన్మమునందు మరణమున్నది. మరణము నాశ్రయించి జన్మమున్నది. మోక్షధర్మములయందు జ్ఞానయుక్తుడు కానివాడు చక్రమువలె బద్ధుడై యున్నాడని చెప్పబడినది. (పరాశరగీత 9 అ. 19 శ్లో.)

మూ॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।
అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా॥ 28.

తా॥ ఓ యర్జునా! ఈ భూతములన్నియు పుట్టకముందెట్లుండెనో అప్పుడు మానసేంద్రియములకు గోచరించుటలేదు. ఇలలో పుట్టిన తరువాత కొంతకాలము నామరూపములతో గనఁబడుచుండును తుదకన్నియు కనఁబడక పోవుచున్నవి, అట్లుపోవుట భూతములకు నైజగుణము కనుకనే ఇట్టి భూతములకై శోకింపరాదు.

భూతములనఁగా శరీరములని కొందఱు అనువదించి యున్నారు. "భూ సత్తాయామ్" అను సూత్రమువలన కలుగునది (ఉద్భవించునది) భూతము. జీవకళలేనిదే జడాత్మకమైన శరీరము పుట్టదు. పెరుగదు. అంతేకాక ఆద్యంతములయందు అవ్యక్తముగ నుండుటకు శరీరమునకు అర్హత యుండదు. శరీర మేర్పడుటకు ముందు, శరీరము నశించిన పిమ్మట అవ్యక్తముగ నుండునవి జీవులు మాత్రమే కనుక భూతములనఁగా శరీర ధారులైన జీవులని తెలియవలయును. శరీరాత్మల సంయోగ వియోగములే జీవులకు జనన మరణములని యెంచబడును. శరీరమును వదలిపోవు జీవుని కొఱకు శోకించుచున్నారే కాని శరీరము కొఱకెవ్వరును శోకించుటలేదు. కాబట్టి భూతములనగా కేవల శరీరములు కావు.

శ్లో॥ అభావాదీని భూతాని భావమధ్యాని భారత।
అభావ నిధనాన్యేవ తత్రకా పరిదేవనా॥ (భారతము స్త్రీ. 2-6)

ఓ భారత? ఆదిలోలేక, అంతములో లేక, నడుము కొంతకాలము మాత్రమే ఉండు భూతముల కొఱకై యేల శోకింపవలయును.

శ్లో॥ అదర్శనా దాపతితాః పునశ్చాదర్శనం గతాః।
నైతే తవ నతేషాం త్వం తత్ర కా పరిదేవనా॥

వీరందఱు అవ్యక్తము నుండి వ్యక్తపడుచున్నారు. మరల అవ్యక్తమునే పొందుచున్నారు. నీకు వారు లేరు, వారికి నీవు లేవు. కనుక అట్టివారి కొఱకు శోకింపనేల? (భారతము స్త్రీ. 2-13)

శ్లో॥ తేషాంస్నేహో న కర్తవ్యో విప్రయోగో ధ్రువోహితైః।
అదర్శనా దా పతితః పునశ్చాదర్శనం గతః॥

(లౌకికులైన) వారి స్నేహము చేయ దగినదికాదు. వారి స్నేహము మఱెప్పుడైనను ఎడబాటగుట నిజము. అట్టివాడు కనఁబడని దశనుండివచ్చుచున్నాడు, మరల కనబడని స్థితినే పొందుచున్నాడు. (పింగళాగీత 17 శ్లో)

మూ॥ ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేన।
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః।
ఆశ్చర్య వచ్చైన మన్య శ్శృణోతి।
శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్॥ 29.

తా॥ ఈ పరమాత్మను ఒకానొకఁడు చూడకచూడక అరుదుగఁ జూచినట్లు వింతగఁ జూచుచున్నాఁడు. మఱియొకఁడు అట్లే వింతగఁ జెప్పు చున్నాఁడు. వేఱొక డియాత్మను గుఱించి వింతగ వినుచున్నాఁడు అటుల వినియు యీ పరమాత్మను ఎవ్వఁడేనియుఁ దెలిసికొనలేడు (పరమాత్మను పృథగ్భావముతోఁ జూచువారు తెలిసికొన లేరని యిందలి భావము) నేనను పదమునకు లక్ష్యార్థమును తెలిసికొనిన యోగి పరమాత్మను తనకంటె అన్యముగఁ జూడడు. సమదృష్టితోఁ జూచిన వానికివింతగఁ గనబడదు. అట్టివాడు శోకము పొందడు.

ఇంద్రియగోచరమైన వస్తుసముదాయ మంతయు (జన్మించుచున్నది. మరణించుచున్నది.) చచ్చుటకే పుట్టుచున్నది. మరల పుట్టుటకే చచ్చుచున్నది. జంగమస్థావర సహితమైన లోకముయొక్క యీ చేష్టితములు (జననమరణాదులు) అన్నియునస్థిరములే (మహోపనిషత్తు 3 అధ్యా 4 శ్లో)

శ్లో॥ మరణం జన్మని ప్రోక్తం జన్మవై మరణాశ్రితమ్।
అవిద్వాన్ మోక్ష ధర్మేషు బద్ధో భవతి చక్రవత్॥

జన్మమునందు మరణమున్నది. మరణము నాశ్రయించి జన్మమున్నది. మోక్షధర్మములయందు జ్ఞానయుక్తుడు కానివాడు చక్రమువలె బద్ధుడై యున్నాడని చెప్పబడినది. (పరాశరగీత 9 అ. 19 శ్లో.)

మూ॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।
అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా॥ 28.

తా॥ ఓ యర్జునా! ఈ భూతములన్నియు పుట్టకముందెట్లుండెనో అప్పుడు మానసేంద్రియములకు గోచరించుటలేదు. ఇలలో పుట్టిన తరువాత కొంతకాలము నామరూపములతో గనఁబడుచుండును తుదకన్నియు కనఁబడక పోవుచున్నవి, అట్లుపోవుట భూతములకు నైజగుణము కనుకనే ఇట్టి భూతములకై శోకింపరాదు.

భూతములనఁగా శరీరములని కొందఱు అనువదించి యున్నారు. "భూ సత్తాయామ్" అను సూత్రమువలన కలుగునది (ఉద్భవించునది) భూతము. జీవకళలేనిదే జడాత్మకమైన శరీరము పుట్టదు. పెరుగదు అంతే కాక ఆద్యంతములయందు అవ్యక్తముగ నుండుటకు శరీరమునకు అర్హత యుండదు. శరీర మేర్పడుటకు ముందు, శరీరము నశించిన పిమ్మట అవ్యక్తముగ నుండునవి జీవులు మాత్రమే కనుక భూతములనఁగా శరీర ధారులైన జీవులని తెలియవలయును. శరీరాత్మల సంయోగ వియోగములే జీవులకు జనన మరణములని యెంచబడును. శరీరమును వదలిపోవు జీవుని కొఱకు శోకించుచున్నారే కాని శరీరము కొఱకెవ్వరును శోకించుటలేదు. కాబట్టి భూతములనగా కేవల శరీరములు కావు.

శ్లో॥ అభావాదీని భూతాని భావమధ్యాని భారత।
అభావ నిధనాన్యేవ తత్రకా పరిదేవనా॥ (భారతము స్త్రీ. 2-6)

ఓ భారత? ఆదిలోలేక, అంతములో లేక, నడుమ కొంతకాలము మాత్ర మే ఉండు భూతముల కొఱకై యేల శోకింపవలయును.

శ్లో॥ అదర్శనా దాపతితాః పునశ్చాదర్శనం గతాః।
నైతే తవ నతేషాం త్వం తత్ర కా పరిదేవనా॥

వీరందఱు అవ్యక్తము నుండి వ్యక్తపడుచున్నారు. మరల అవ్యక్తము నే పొందుచున్నారు. నీకు వారు లేరు, వారికి నీవు లేవు. కనుక అట్టివారి కొఱకు శోకింపనేల? (భారతము స్త్రీ. 2-13)

శ్లో॥ తేషాంస్నేహో న కర్తవ్యో విప్రయోగో ధ్రువోహితైః।
అదర్శనా దా పతితః పునశ్చాదర్శనం గతః॥

(లౌకికులైన) వారి స్నేహము చేయ దగినదికాదు. వారి స్నేహము మఱెప్పుడైనను ఎడబాటగుట నిజము. అట్టివాడు కనఁబడని దశనుండివచ్చు చున్నాడు, మరల కనబడని స్థితినే పొందుచున్నాడు. (పింగళాగీత 17 శ్లో)

మూ॥ ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేన।
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః।
ఆశ్చర్య వచ్చైన మన్య శ్శృణోతి।
శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్॥ 29.

తా॥ ఈ పరమాత్మను ఒకానొకఁడు చూడకచూడక అరుదుగఁ జూచి నట్లు వింతగఁ జూచుచున్నాఁడు. మఱియొకఁడు అట్లే వింతగఁ జెప్పు చు న్నాఁడు. వేఱొక డియాత్మను గుఱించి వింతగ వినుచున్నాఁడు అటుల విని యు యీ పరమాత్మను ఎవ్వఁడేనియుఁ దెలిసికొనలేడు (పరమాత్మను పృథగ్భావముతోఁ జూచువారు తెలిసికొన లేరని యిందలి భావము) నేనను పదమునకు లక్ష్యార్థమును తెలిసికొనిన యోగి పరమాత్మను తనకంటె అన్య ముగఁ జూడడు. సమదృష్టితోఁ జూచిన వానికివింతగఁ గనబడదు. అట్టివాడు శోకము పొందడు.

మూ॥ దేహీ నిత్య మవధ్యోఽ యం దేహే సర్వస్య భారత।
తస్మా త్సర్వాణి భూతాని నత్వం శోచితు మర్హసి॥ 30.

తా॥ ఓ యర్జునా! సమస్త భూతముల యొక్కయు శరీరము నందలి యాత్మ నిత్యమైనది. (ఒకప్పుడును) వధింపబడునది కాదు. అందువలన సర్వభూతములను గుఱించి నీవు శోకింపరాదు.

శ్లో॥ యథోర్ణనాభిః సృజతే గృహ్ణతేచ।
యథా పృథివ్యా మోషధయ స్సంభవంతి॥
యథాసతః పురుషా త్కేశలోమాని।
తథాక్షరా త్సంభవ తీహ విశ్వమ్॥

సాలీడుపురుగు తంతువు నెట్లు సృజించి యుపసంహరించు చున్నదో, భూమియందు ఏకవార్షికములైన సస్యములెట్లు సంభవించుచున్నవో, సత్పురుషుని శిరమునుండి, దేహమునుండి వెండ్రుకలెట్లు పుట్టుచున్నవో అట్లే అక్షరిత పరబ్రహ్మ తత్త్వమునుండి యీవిశ్వము సంభవించుచున్నది. (ముండకోపనిషత్తు 1-1-7.) దీని ఛాకపాకలు ఒకని యధీనములు కావు. కనుక శోకింపరాదని భావము.

మూ॥ స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే॥ 31.

తా॥ మఱియు స్వధర్మముఁజూచి (యైన) చలింపఁదగనివాఁడవే (ఎందుకనఁగా) ధర్మముతో సంబంధించిన యుద్ధమునకంటె శ్రేయము క్షత్రియునకు వేఱొకటిలేదు.

విశే॥ ఈ భగవద్గీత ఆధ్యాత్మిక గ్రంథమని పలువురు వేదాంత స్వాములు చెప్పుకొనుచుండుట పాఠకులు వినియుందురు కనుక యుద్ధమనఁగా భౌతికయుద్ధ మనుకొనరాదు. స్వధర్మమనఁగా తనధర్మము. తాననఁగా దేహేంద్రియములకు విలక్షణమైన పంశుద్ధాత్మ. ఇట్టి పరిశుద్ధాత్మ తత్త్వముచే ధరింపఁబడినది స్వధర్మము. అశుభకారణములైన స్వల్పసుఖములకై స్వయంప్రకాశ సంకలితమైన జ్ఞానశక్తిని చెడఁగొట్టుకొనకుండుట స్వధర్మము. విష

యేంద్రియములచే కదలింపబడకుండుట స్వధర్మము. కామలోభాదులైన అంతశ్శత్రువులచే బాధింపఁబడక దివ్య వైభవోపేతమైన నిత్యసుఖమునఁ జొక్కియుండుట స్వధర్మము. ఆధి వ్యాధులయందును, జననమరణ వేదనలయందును ఉద్వేగమునొందక శాశ్వతానందపదమున సుస్థిరుఁడైయుండుట స్వధర్మము.

క్షతమనఁగా గాయము. క్షతమునుండి రక్షించువాఁడు క్షత్రియుఁడని పండితులు చెప్పుదురు. దేహములు అంతముతోఁగూడినవి ఒకప్పుడు శిథిలములై పోవుచున్నవి. అందువల్లనే శరీరములని పేరుకలిగినది. "కాయేకృతాంతాద్భయమ్" అంతమును కలిగించువాఁడు కృతాంతుఁడు. కాలపురుషుఁడందురు. అట్టి కాలమువలన దేహమునకు అపాయమున్నదని శ్రీభర్తృహరి యోగీంద్రుఁడు చెప్పెను.

శ్లో॥ సర్వే క్షయాంతా నిచయాః పతనాంతా స్సముచ్ఛ్రయాః।
సంయోగా విప్రయోగాంతా మరణాంతంచ జీవితమ్॥

(భారత స్త్రీ 2 అ. 3 శ్లో)

అను శ్లోకార్థమునుబట్టి మనుష్య జీవితము మరణముతో ముగియుచున్నది. ఇట్టియస్థిరశరీరములను అపాయములేకుండ కాపాఁడువాఁడొకడున్నాడనికాని, కాపాడుటకు సాధ్యమగుననికాని నమ్మట మొదటిరకము వెఱ్ఱియని చెప్పవలసివచ్చును. అందువలన క్షత్రియుఁడనగా విషయచింతనము వల్లను, కామ క్రోధాదులవల్లను ఆత్మకు క్షతము కలుగకుండ కాపాడువాఁడని ఆధ్యాత్మికులమతము.

శ్లో॥ అభిధ్యా ప్రథమం హంతి చైనమ్।
కామక్రోధావను గృహ్యాశు పశ్చాత్॥
ఏతే బాలాన్ మృత్యవే ప్రాపయంతి।
ధీరాస్తు ధైర్యేణ తరంతి మృత్యుమ్॥

పూర్వశ్లోక విషయమునుబట్టి "అభిధ్యా" అనఁగా విషయచింతనమని చెప్పఁబడినది. అట్లు విషయములఁ జింతించు యోగిని తొట్టతొలుత అ ధ్యా

నమే కొట్టుచున్నది. అటుపిమ్మట కామక్రోధములు సత్వరముగ పట్టుకొని కొట్టుచున్నవి. ఇవన్నియు అప్రగల్భులైన విద్యార్థులనుపట్టి మృత్యువును ప్రాపింపఁజేయుచున్నవి. జ్ఞానులు ధైర్యముతో మృత్యువును తరింతురు. (సనత్సుజాతీయము. 1-11) అని చెప్పుటచే కామక్రోధాది శత్రువర్గముల వలన ఆత్మకు గాయము కలుగుచున్నదనియు, అట్టిగాయమునుండి యాత్మను రక్షించుటే క్షత్రియధర్మమనియుఁ దెలియుచున్నది.

"యుధసంప్రహారే" అనుసూత్రమువలన యుద్ధమనఁగా శత్రువును లెస్సగ ప్రహరించుట, ఆత్మరక్షణముకై కామక్రోధాది శత్రువర్గమును ప్రహరించుటే స్వధర్మమునకు సంబంధించిన యుద్ధము క్షత్రియునకు (ఆత్మరక్షాపరునకు) ఇంతకంటే శ్రేయము (మోక్షము) వేఱొకటిలేదు. ఇట్టియాధ్యాత్మిక సంగ్రామమే మోక్షదాయకమగును కాని యనర్థదాయకమైన భౌతిక ద్రవ్యసంచయమునకై జ్ఞాతులతో కలహించి చచ్చినవారికి మోక్షము లభించినట్లు నేనెచ్చటను వినియుండలేదు.

మూ॥ యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్।
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశమ్॥ 32

తా॥ ఓపార్థా! తమప్రయత్నము లేకయే తటస్థించినట్టియు, తెఱవఁబడిన స్వర్గద్వారమనఁదగినట్టియు, ఈవిధమైన యుద్ధము సుఖవంతులైన క్షత్రియులు పొందుదురు.

విశే॥ "సుష్ఠుఖనతి కామాదీన్ శత్రూనితి సుఖమ్ తత్సుఖం యేషామస్తి తే సుఖినః ఖను అవదారణే" అనుసూత్రమునుబట్టి కామాది శత్రువులను విదారించు సత్కర్మఫలము సుఖమనఁబడును. అట్టి పూర్వసుకృతము కలిసివచ్చుటే అప్రయత్నముగ యుద్ధము తటస్థించుటయగును. సుఖస్థానమే స్వర్గముకనుక కామాది శత్రువులను ప్రహరించుటకు అవకాశ మేర్పడినదనఁగా స్వర్గద్వారము తెఱవఁబడినదనియే భావము. ఇట్టి యవకాశమును పొందిన ఆత్మరక్షా విశారదులే క్షత్రియులు, సుఖవంతులు. హత్యాప్రచారములోఁజేరిన భౌతిక కలహమే స్వర్గద్వారమనికాని, యిట్టి కలహములలో పాల్గొనినవారే సుఖవంతులనికాని చెప్పినయెడల ఈకాలపు పెద్దమనుష్యులు ఒప్పుకొనరు.

మూ॥ అథచేత్త్వం ధర్మ్య మిమం సంగ్రామం నకరిష్యసి।
తతస్స్వధర్మం కీర్తించ హిత్వా పాపమవాప్స్యసి॥ 33.

తా॥ మఱినీవు ధర్మముతో సంబంధిచిన యీయుద్ధము చేయవేని అందువలన స్వధర్మమును, కీర్తిని వదలివేసి పాపము పొందగలవు.

విశే॥ అంతశ్శత్రువులైన కామ లోభాదులను అణచుకొనిన పరిశుద్ధాత్ములకు బాహ్యశత్రువు లుండరు భౌతికమైన యుద్ధము తటస్థింపదు. ఆధ్యాత్మిక యుద్ధరంగమున ప్రధానశత్రువులైన కామలోభాదుల జయించు నైపుణ్యములేని హిరణ్యకశిపుడు, రావణుడు, మొదలైన బలవంతులు భౌతిక యుద్ధములలో శత్రువుల నెందఱ గెలిచినను వారికి కీర్తిలేదు. సుఖములేదు స్వధర్మము, సిద్ధాంతము కాలేదు. కనుక అంతశ్శత్రువుల నిగ్రహించి భావ శుద్ధిని గాంచుటే ధర్మమునకు సంబంధించిన యుద్ధము కీర్తికరమైన స్వధర్మము. అటుగాక భౌతిక యుద్ధము మాత్రమే చేయుటవలన కీర్తిలేదు, సుఖములేదు. స్వధర్మము కానేరదు. పాపముపొందుట నిజము.

మూ॥ అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్।
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే॥ 34.

తా॥ ప్రజలు నీ యపకీర్తిని ప్రకటింపఁ గలరు. ఈ యపకీర్తి మాసి పోవునది కాదు. గొప్పగఁ దలఁపఁబడిన పురుషునకు అపకీర్తియన్నది మరణమునకు మించిన దగును.

విశే॥ మరుత్తుఁడు, దుష్యంతుఁడు, మొదలైన కొందఱు సుప్రసిద్ధ ప్రభువులు అప్రయత్నముగ ప్రాప్తించిన భౌతికయుద్ధమునుండి విరమించుకొనినట్లు రామాయణములో ఉత్తరకాండమునఁ జెప్పబడినది. శ్రీకృష్ణుడు సైతము కొన్నిచోట్ల భౌతిక యుద్ధము నుండి పరాఙ్ముఖుడైనట్లే పురాణములలో జెప్ప బడినది. కాని అందువల్లనే వారు మరణమునకు మించిన అపకీర్తిలో బడిపోయినారని మనము వినలేదు. "నీతిలేనివాని నిందింత్రు లోకులు" అని పెద్దలు చెప్పియున్నారు, ఆధ్యాత్మిక నీతిలేనివాడు భౌతిక నీతి నిలుపుకొనఁ జాలక లోకులచే నిందింపబడి మరణమునకు మించిన అపకీర్తిని, పాపమును పొందుచున్నాఁడు.

మూ॥ భయా ద్రణా దుపరతం మంస్యంతే త్వాం మహారథాః॥
యేషాంచ త్వం బహుమతోభూత్వా యాస్యసి లాఘవమ్॥ 35.

తా॥ ఎవరిలో నీవు (ఇంతవఱకు) గొప్పగఁ దలఁపఁ బడుచుంటివోఁ (వారియెదుటనే) లాఘవము పొందగలవు. మహారథులెల్లరు నిన్ను భయముతో విరమించుకొనిన వానినిగాఁ దలఁతురు.

విశే॥ "రము క్రీడాయామ్" అను సూత్రమువలన ఆత్మకు క్రీడా స్థానమైన శరీరము రథమనబడును.

శ్లో॥ ఆత్మానం రథినం విధి శరీరం రథమేవతు।
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవచ॥
ఇంద్రియాణి హయానాహుర్విషయాంస్తేషు గోచరాన్॥

ఆత్మ రథికుఁడు. శరీరము రథము. బుద్ధి సారథి మనస్సు పగ్గము. ఇంద్రియములు గుఱ్ఱములు. ఇంద్రియ గోచరములైన విషయములు లక్ష్యములు. (ఈశ్లోకము కఠోపనిషత్తు 3 వల్లిలోను, పైంగలోపనిషత్తు 4 అధ్యాయములోను, శివగీత 14 అధ్యాయములోను, కొంచము వర్ణభేదముతో జదివినట్టు జ్ఞాపకము.) మఱియు భాగవతములో పురంజనోపాఖ్యాన మనెడు ఆధ్యాత్మిక ఘట్టమునందు దేహమును రథముగ వర్ణించియున్నారు. మహారథులనగా దేహధారులలో గొప్పవారని భావము. స్థూల శరీరము నందలి తత్త్వము లన్నిటిలోను గొప్పగా బావింపబడిన జ్ఞాత కామ లోబాదులను నిగ్రహింప జాలక విరమించుకొనుటచే లాఘవము పొందుచున్నాఁడు. విషయేంద్రియములకు లొంగిపోవుటే యపకీర్తి అదే మరణము.

శ్లో॥ అమృత్యుః కర్మణా కేచిన్మృత్యుర్నాస్తీతి చాపరే।
శృణుమే బ్రువతో రాజన్ యథైతన్మా విశంకథాః॥

ఓ రాజా! కర్మ (అభ్యాస) యోగముచే మృత్యు రాహిత్యము అగుచున్నదని కొందఱు (చెప్పుదురు) తనకంటె అన్యములేదన్న పరిపూర్ణ భావము గలవారు మృత్యువు లేదనియే (చెప్పుదురు) అదియెట్లో చెప్పుచున్న నా మాట వినుము, సంశయింపకుము. (సనత్సుజాతీయము 1 అ. 3 శ్లో)

శ్లో॥ ఉభేసత్యే క్షత్రియాద్య ప్రవృత్తే।
రో్మహో మృత్యు స్సమ్మతోఽయం కవీనామ్।
ప్రమాదంవై మృత్యుమహం బ్రవీమి।
తథాప్రమాద మమృత త్వం బ్రవీమి॥

"ఓ క్షత్రియా! పైజెప్పినట్లు రెండు నిజమే. జన్మకారణమైన వృత్తి యందు కలుగు మోహమే మృత్యువని పండితుల యభిప్రాయము. అజాగ్రత్త (స్వస్వరూపమును మఱచుట) మృత్యువని నేను చెప్పుచున్నాఁడను, అదే విధముగా జాగ్రతఅమృతత్వమని చెప్పుచున్నాడను." (సనత్సుజాతీయము 1 అ 4 శ్లో)

శ్లో॥ ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్యః కదాచన।
ప్రమాధో మృత్యురిత్యాహు ర్విద్యాయాం బ్రహ్మవాదినః॥

బ్రహ్మనిష్ఠయందు మతిమఱపు ఎప్పుడును ఉండరాదు. విద్యయందు ప్రమాద పడుటే మృత్యువని బ్రహ్మవాదులు చెప్పుదురు. (అధ్యాత్మోపనిషత్తు 14) ప్రకృతి విషయములయందు అనురక్తుడై స్వస్వరూపమను మఱచుటే ఆధ్యాత్మికులకు మరణమని యిందువలన ఋజువగుచున్నది.

మూ॥ అవాచ్య వాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః।
నిందంత స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్॥ 36.

తా॥ నీకు హితులు కానివారు నీసామర్థ్యమును నిందించుచు పలుకరానిమాటలు విశేషముగా పలుకఁగలరు. అంతకంటె మిక్కిలి దుఃఖము మఱేమున్నది?

మూ॥ హతోవా ప్రాప్స్యసి స్వర్గం జిత్వావా భోక్ష్యసేమహీమ్।
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః॥ 37.

తా॥ ఓ కౌంతేయా! హతుఁడవైనచో స్వర్గము పొందగలవు. జయించినచో మహి ననుభవింపఁగలవు. అందువల్ల యుద్ధమునకై కృతనిశ్చయుఁడవై

శ్లో॥ హతోఽపిలభతే స్వర్గం హత్వాచ లభతేయశః।
ఉభయంనో బహుగుణంనాస్తి నిష్ఫలతారణే॥

యుద్ధములో చచ్చినప్పటికి స్వర్గము పొందుచున్నాఁడు. శత్రువుల చంపినను కీర్తి పొందుచున్నాడు. మనకీరెండును గొప్ప ప్రయోజనకరములే యగును. నిష్ప్రయోజనమన్నమాటేలేదు (భారత స్త్రీ 2-14)

శ్లో॥ జేతావా బ్రాహ్మమానందం జితోవా విషయాదికమ్।
ప్రాప్నోతి నియతం తస్మాత్కామాదీన్ ప్రహరేద్యతిః॥

కామాది శత్రువులతో పోరాడి జయించినచో బ్రహ్మానందమును పొందుచున్నాఁడు. ఓడిపోయనను విషయానందమును పొందుచున్నాఁడు· ఎట్లును ఆనందము తప్పినదికాదు. అందువలన యతీశ్వరుఁడు కామాదులను కొట్టవలసినదే. (విశ్వగీత 68)

విశే॥ "ఈభూమికంటె వేఱుగ మఱియొకచోట స్వర్గలోకమని యొకటి యుండును. అది యీలోకమునకంటె చాల భాగ్యవంతమైనది. సుఖవంతమైనది. అచ్చట దుఃఖమన్నమాటే యుండదు. ఈలోకములో యుద్ధము చేసి చచ్చినవారందఱు ఆలోకములోఁజేరి సుఖింతురు. అది భూలోకమునకంటె సర్వవిధముల హెచ్చైనది" అని భౌతిక పురాణములలోఁ జెప్పుదురు. మఱియు జయించినవారు సుఖ దుఃఖభూయిష్ఠమైన భూలోకరాజ్యము ననుభవింతురనియుఁ జెప్పుదురు. పైగీతాశ్లోకమును కొందఱు వ్యాఖ్యాతలు ఇట్లే అనువదించియున్నారు. యుద్ధములో అసమర్థుఁడైనవాఁడు చచ్చి దివ్యలోక సుఖముఁ బ్రాపించుచుండఁగా సమర్థుఁడైనవాఁడు జయించి దుఃఖపూరితమైన భూరాజ్యమును పొందుట మిక్కిలి యన్యాయముగ నున్నది. మఱియు, దివ్యసుఖ ప్రాప్తికరమైన యుద్ధ మరణమునే సర్వజనులు కోరక దుష్ప్రాప్తికరమైన విజయమును కోరువారు కొందఱు కనఁబడుచుండుట మఱింత చిత్రము. ఈభావము ఆధ్యాత్మికులకు నచ్చదు.

"హనహింసాగత్యోః" అను సూత్రమువలన హతుఁడనఁగా కామలోభాది శత్రువులచేఁ బీడింపఁబడినవాడనికాని, మానసేంద్రియములచే సంఘాతము చేయబడినవాడనికాని చెప్పవచ్చును. అట్లు విషయేంద్రియ సంగతుడైనవాడు భౌతిక సుఖముల ననుభవింపదగిన దృశ్యపథమును పొందుచున్నాడు. అంతశ్శత్రువుల జయించినవాడు (మహపూజాయామ్) పూజనీయమైన దివ్యపదవి ననుభవించుచున్నాడు. "చిఞ్ చయనే" అనుసూత్రమువలన

చయమనగా కొన్నివస్తువుల చేరికయని యర్థమగుచున్నది. "నిరస్తంచయం నిశ్చయమ్" అన్యవస్తువుల చేరిక లేకుండినది నిశ్చయము, కృతనిశ్చయు డనగా సంగదోషరహితము చేయఁబడినవాడని యర్థము. అట్టి నిస్సంగుడైన శిష్యుని కామాదుల ప్రహరించుటకు లెమ్మని గురువుప్రబోధించుచున్నాడు.

మూ॥ సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ।
తతోయుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి॥ 38.

తా॥ సుఖదుఃఖములు, లాభాలాభములు, జయాపజయములు సమ ముగఁ దోచునట్లు అంతఃకరణమును సంస్కరించుకొని తరువాత యుద్ధము నకుఁ గడఁగుము. అట్లైన పాపము పొందవు.

శ్లో॥ సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖమ్।
ద్వయమే తద్ధి జంతూనా మలంఘ్యం దినరాత్రివత్।
సుఖమధ్యే స్థితం దుఃఖం దుఃఖమధ్యేస్థితం సుఖమ్।
ద్వయమన్యోఽన్య సంయుక్తం ప్రోచ్యతే జలపంకవత్॥

జీవులకు పగలు, రాత్రి ఒకదాని తర్వాత నొకటి తప్పని సరిగా ఎట్లు వచ్చుచున్నవో అట్లే సుఖ దుఃఖములు ఒకదాని తరువాత మఱియొకటి వచ్చుచున్నవి. వీనిని తప్పించుటకు వీలులేదని తెలిసికొనుము. జలము, బురద ఒకదానియందొకటి కలిసికొని యుండినట్లు సుఖ దుఃఖములు కూడ పరస్పరము ఒకదానియందొకటి కలిసియుండునని చెప్పబడినది. (అధ్యా అయో 6. స. 13, 14 శ్లో)

శ్లో॥ సుఖదుఃఖే సమేకృత్వా లాభం హానిం జయంతథా।
పరాజయంచ శీతోష్ణం మానం చాప్యవమానకం॥

సుఖదుఃఖములను, లాభా లాభములను, జయాజయములను, అదే ప్రకారము శీతోష్ణములను, మానావమానములను సమముగ భావింపవల యును. (వరాహపురాణము పూర్వా. 59 అధ్యా)

శ్లో॥ సుఖాత్సం జాయతే దుఃఖం దుఃఖమేవం పునఃపునః।
సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖమ్॥

భౌతికమైన విషయసుఖమువలన దుఃఖము కలుగుచున్నది. సుఖమునకు పిమ్మట దుఃఖము వచ్చుచున్నది. దుఃఖమునకు తరువాత సుఖము వచ్చుచున్నది. ఈ విధముగా మరలమరల దుఃఖముకలుగుచున్నది. (పింగళాగీత 19 శ్లో.)

శ్లో॥ సుఖదుఃఖే మనుష్యాణాం చక్రవత్పరివర్తతః॥
సుఖాత్త్వం దుఃఖమాపన్నః పునరాపత్స్యసే సుఖమ్॥

మనుష్యులకు సుఖదుఃఖములురెండు చక్రమువలె ప్రవర్తించుచున్నవి నీవు సుఖమునుండి దుఃఖము పొందుచున్నాడవు. మరలసుఖమును పొందుచున్నాడవు. (పింగళాగీత 20)

శ్లో॥ ననిత్యం లభతేదుఃఖం ననిత్యం లభతేసుఖమ్।
శరీరమేవాయతనం దుఃఖస్యచ సుఖస్యచ॥

యెల్లప్పుడు దుఃఖమునే పొందుటలేదు. ఎల్లప్పుడు సుఖమునే పొందుటయులేదు. దుఃఖమునకును, సుఖమునకును దేహమే నిలయము (దేహములేనప్పుడు సుఖదుఃఖములు లేవనిభావము. (పింగాళాగీత 21 శ్లో.)

శ్లో॥ శరీరమేవాయతనం సుఖస్య
దుఃఖస్యచాప్యాయతనం శరీరమ్।
యద్యచ్ఛరీరేణ కరోతికర్మ
తేనైవ దేహీ సముపాశ్నుతే తత్॥

సుఖమునకు శరీరమే నిధానము. దుఃఖమునకు శరీరమే నిధానము మనుష్యుఁడు శరీరముతో ఏయే కర్మచేయుచున్నాడో ఆ కర్మఫలమును శరరముతోనే అనుభవించుచున్నాడు (పింగళాగీత 22 శ్లోకము)

విశే॥ భౌతికములైన సుఖదుఃఖాది ద్వంద్వములన్నియు జన్మకారణములే. వీనియందొకటి మంచిది, వేఱొకటి చెడ్డదియను భేదభావము ఆర్ష విద్యార్థికి ఉండరాదు. అన్నిటియందును సమానమైన నిస్పృహకలిగిన మీదటనే కామాది శత్రువుల పరిహరించుటకు వీలుపడును. ఈ విధముగఁజేసి నప్పుడే సర్వపాపములనుండి విముక్తుడగుచున్నాడు.

శ్లో॥ క్వచిత్పృథ్వీశయ్యః క్వచిదపిచ పర్యంక శయనః।
క్వచిచ్ఛాకాహారః క్వచిదపిచ శాల్యోదనరుచిః।
క్వచిత్కంథాధారీ క్వచిదపిచ దివ్యాంబరధరో।
మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం నచసుఖమ్।

కార్యము సాధింపదలచిన ధీరాగ్రేసరుడు ఒకయెడ (కఠిన శిలాకంటక సమన్వితమైన) భూమిమీదశయనించుచున్నాఁడు. ఒకయెడ (అతిమృదులము లైన హంసతూలికాది) తల్పముల మీఁదను శయనించుచున్నాఁడు. ఒకయెడ (నీరసములైన) కందమూలాది వన్యపదార్థములఁ దినుచున్నాఁడు ఇంకొక యెడ మంచి స్వాదుగలిగిన వరియన్నము మొదలైన పదార్థములఁ గూడ భుజించు చున్నాఁడు. ఒకయెడ ప్రాతపేలికలతో గూర్పఁబడిన బొంత ధరించు చున్నాఁడు వేఱొకయెడ దివ్యములైన (బంగారుపట్టు) వస్త్రములు సైతము ధరించుచున్నాఁడు. కాని భూశయ్యాదుల యందలి దుఃఖమును, మృదుపర్యంకాదుల యందలి సుఖమును గూడ లెక్కింపడు. (శ్రీభర్తృహరి 1-73) ఇటువంటి యార్షవిద్యార్థి పాపమునుండి విడువబడును.

మూ॥ ఏషాతేఽభి హితాసాంఖ్యే బుద్ధిర్యోగేత్విమాంశృణు।
బుద్ధ్యాయుక్తో యయాపార్థ కర్మబంధం ప్రహాస్యసి॥ 39.

తా॥ అర్జునా! ఆత్మవిచారణలోఁ జేరిన జ్ఞానము నీకు బోధింప బడినది ఇంక యోగమునందు ఏ బుద్ధితో గూడుకొని జన్మకారణమైన కర్మబంధ మును వదలగలవో దానిని వినుము. (అష్టాంగ యోగములలో పూర్వాంగ ములు నాలుగు కర్మయోగ మనియు, ఉత్తరాంగములు నాలుగు బుద్ధియోగ మనియు, ఇదివఱకు జెప్పబడినది, బుద్ధియోగముతోఁ గూడుకొని నప్పుడు కర్మబంధములు వదలునని యోగీశ్వరులు చెప్పుదురు.)

మూ॥ నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో నవిద్యతే।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥ 40.

" అభితః క్రమతి ఇతి అభిక్రమః, తన్నాశః అభిక్రమనాశః,
క్రముపాద విక్షేపే, ణశ అదర్శనే"

తా॥ ఇచ్చట బాగుగ ఆక్రమింపబడిన లక్ష్యస్థానము మరల తప్పి పోదు. కలుగబోవు శుభోదయమునకు ప్రతి విఘాతములేదు. ధర్మములో కొంచము భాగము అయినప్పటికి గొప్పభయమునుండి రక్షించుచున్నది.

శ్లో॥ స్వల్పాపి దీపకణికా బహుళం నాశయేత్తమః।
స్వల్పోఽపిబోధోనిబిడం బహులం నాశయేత్తమః॥

దీపజ్వాల చిన్నదయ్యును గొప్పచీకటిని పోగొట్టుచున్నది అట్లే తత్త్వ జ్ఞానము కొంతమాత్రము సాధించినను అది గాఢమైన గొప్ప అజ్ఞానాంధకారమును పోగొట్టుచున్నది. (ఆత్మప్రబోధోపనిషత్తు 28 శ్లో.)

మనుష్యునకుఁగలుగు సమస్త భయములు జన్మమువలననే కలుగుచున్నవి. కావున అన్నిఁటిలో జన్మభయమే గొప్పది. ఆద్యంతములులేని యాత్మ అనంత కాలవాహినియందు ఆధ్యాత్మిక యుద్ధమనెడు స్వధర్మము న ర్వదాచేయక ఒక్కనరజన్మమున మాత్రము నూఱుసంవత్సరములో అంతకు తక్కువగనోచేయుట స్వల్పమేయగును. అటులస్వల్పమేయైనను గొప్పదైన జన్మభయమునుండి రక్షించుచున్నది. భౌతికయుద్ధమే స్వధర్మమని నమ్మినయెడల కొంచమేచేసి విరమించుకొన్నవానికి భయము దీఱునని చెప్పలేము. అభిక్రమము నిలువదు. శుభముఁ గాంచజాలఁడు కనుక ఆధ్యాత్మిక యుద్ధమని నమ్మవలసియున్నది.

మూ॥ వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునందన।
బహుశాఖాహ్యనంతాశ్చ బుద్ధయోఽ వ్యవసాయినామ్॥ 41

తా॥ అర్జునా! మంచినిశ్చయ జ్ఞానముతోఁగూడిన బుద్ధియోగము ఒక టేపద్ధతిలోనుండును నిశ్చయజ్ఞానములేనివారి బుద్ధులు అనేకములైన చీలికలుగలిగి యెంతదూరముపోయినను ఎడతెగనివైయుండును.

సర్వభూతములయందలి చైతన్యమంతయు నొకటేకాని అన్యము లేదను నిశ్చయజ్ఞానముగల యోగిబుద్ధి యెప్పుడును ఏకభావమునే కలిగియుండును. వేఱువేఱుగనుండు నూల శరీరములఁజూచి పరమాత్మయు నటిదే యని పృథగ్భావముతోఁ జూచువానిబుద్ధి నానావిధములఁ బోవుచుండును.

మూ॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః॥ 42.

కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదామ్।
క్రియావిశేష బహుళాం భోగైశ్వర్య గతిం ప్రతి॥ 43

తా॥ అర్జునా! ఆత్మజ్ఞానశూన్యులు, వేదములలో వాదోపవాదములు సేయుటయందే యిచ్ఛగలవారు, భౌతికములైన కోరికలతోఁ గూడుకొని స్వర్గాదిసుఖములయం దాసక్తిగలవారై జన్మకారణమైన కర్మఫలము నిచ్చునట్టియు, కాయిక క్రియాబాహుళ్య రూపమైనట్టియు, భోగములతో, ఐశ్వర్యములతోఁ గూడినట్టియు మార్గమేదికలదో దానినిగుఱించి వికాసమైన మాట చెప్పుచున్నారు. ఇంతకంటె వేఱుమార్గములేదని వాదించుచున్నారు.

మూ॥ భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ నవిధీయతే॥ 44.

తా॥ అట్టి ప్రవృత్తిమార్గముచె అపహరింపఁబడిన చిత్తముగలవారికి, భోగములయందును, ఐశ్వర్యములయందును ఆసక్తిగలవారికి సమాధియందు నిశ్చయమైన బుద్ధి నిలువదు

శ్లో॥ పఠంతు శాస్త్రాణి యజంతుదేవాన్।
కుర్వంతు కర్మాణి భజంతు దేవతాః।
ఆత్మైక్య బోధేన వినా విముక్తి।
ర్నసిద్ధ్యతి బ్రహ్మశతాంతరేఽపి॥

తర్కవ్యాకరణాది శాస్త్రములు చదువుదురుగాక, మహేంద్రాదులైన దివ్యపురుషుల పూజింతురుగాక, శ్రౌతస్మార్తాది భౌతిక కర్మలఁ జేయుదురుగాక, మఱియు నానాదేవతలసేవింతురుగాక సర్వభూతములయందలి యాత్మయొకటేయను తెలివి గలుగకున్నచో నూఱుబ్రహ్మకల్పములకైనను ముక్తి లభింపదు. ( వివేకచూడామణి 6 )

శ్లో॥ న కర్మణా సుకృతే నైవ రాజన్।
సత్యం జయే జ్జుహుయాద్వా యజేద్వా।

...తేన బాలోఽమృత్యు మభ్యేతి రాజన్।
రతించాసౌ నలభత్యంతకాలే॥

ఓ రాజా! వేదవిహితమైన పుణ్యకర్మచేతనే నిత్యశుభమును సాధించుటకు వీలుపడదు. ఇఁకను హోమముఁజేయుఁగాక, యజ్ఞముఁ జేయుఁగాక మూఢుఁడైనవాఁడు (ఆత్మజ్ఞానము లేనివాడు) మోక్షముఁ బొందజాలడు. అవసాన కాలములో ఆత్మరతి సుఖము గాంచఁజాలఁడు. (సనత్సుజా॥ 4-19)

మూ॥ త్రైగుణ్యా విషయావేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమఆత్మవాన్॥ 45.

తా॥ అర్జునా! వేదములు సత్త్వరజస్తమో గుణములకు సంబంధించిన ప్రకృతివిషయములను (నీతులను) ఎఱిగించుచున్నవి. నీవు అత్రిగుణముల కుసంబంధము లేనివాఁడవగుము సుఖదుఃఖాది ద్వంద్వములు లేనివాఁడవు, నిరంతరము సత్త్వరూపమైన భగవ త్తత్త్వమునందే స్థిరముగ నిలిచియుండువాఁడవు, స్వస్వరూపము నెఱిఁగినవాఁడవు కమ్ము. ఐహికములైన యర్థములను కూడవేయుట, కాపాడుట అనుయోగక్షేమములు లేనివాఁడవు కమ్ము. అపేక్షాశూన్యుఁడే మోక్షార్హుఁడని భావము.

శ్లో॥ నఛందాంసి వృజినం తారయంతి।
మాయావినం మాయయా వర్తమానమ్।
నీడం శకుంతా ఇవ జాత పక్షాః।
ఛందాంస్యేనం ప్రజహా త్యంతకాలే॥

మాయావియై మాయతోఁగూడి వర్తించుచు పాపమును పెంచుకొనినవానిని వేదములు రక్షింపఁజాలవు. వాఁడుచదివిన వెదపారము లన్నియు మరణకాలము ప్రాప్తించినప్పుడు రెక్కలువచ్చిన పక్షులుగూటిని వదలివేసినట్లు వానినివదలివేసి తొలఁగిపోవుచున్నవి. (సనత్సుజాతీయము. 2-5.)

మూ॥ యావానర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే।
తావాన్ సర్వేషువేదేషు బ్రాహ్మణస్య విజానతః॥ 46.

తా॥ ఎల్లెడల పరిపూర్ణముగ నిండియుండు సరోవర జలముండఁగా ఇఁకప్రయత్న పూర్వకముగ త్రవ్వితీయఁబడు ఒకచిన్న బావినీటియందు ఎంత ప్రయోజనముండునో పరబ్రహ్మతత్త్వ సిద్ధాంతికి కామ్యకర్మల నెఱిఁగించు వేదములయందు నంతే ప్రయోజనముండును. శాశ్వతమైన బ్రహ్మానందము లభించినవానికి స్వల్ప కాలానుభవ యోగ్యములైన స్వర్గాది సుఖముల నొసఁగు వేదములయందు ప్రయోజన ముండదని భావము.

"తత్రాపరా ఋగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వవేద శ్శిక్షా కల్పో, వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషమితి. అథపరా యయా తదక్షర మధిగమ్యతే"

తా॥ ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము (అనునాలుగు వేదములు) శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు జ్యోతిషము (అనునాఱు శాస్త్రములు) అపరవిద్యలోఁజేరినవి. మఱియేవిద్యచే అస్ఖలిత పరబ్రహ్మతత్త్వము పొందఁబడుచున్నదో ఆవిద్యపరావిద్యయనఁబడును పరావిద్య లభించిన వారికి అపరావిద్యతోఁబనిలేదు.

(ముండకోపనిషత్తు 1 ముం. 1 ఖం 5 శ్లో.)

"అమృతేన తృప్తస్య పయసా కింప్రయోజనం? ఏవం స్వాత్మానం జ్ఞాత్వావేదైః కింప్రయోజనం భవతి? జ్ఞానామృతతృప్తయోగినో నకించి త్కర్తవ్యమస్తి తదస్తిచే న్నసతత్త్వవిద్భవతి" అమృతము త్రావి తృప్తిఁజెందినవానికి జలముతో నేమిప్రయోజనమున్నది? అష్లైతనయందు ప్రకాశించు పరమాత్మ తత్త్వమును తెలిసికొనిన తర్వాత వేదములతో నేమిప్రయోజనమున్నది? జ్ఞానామృతములో తృప్తిపడిన యోగీశ్వరునకు (వైదిక కర్మయందు) చేయఁదగినది కొంచెమైననుండదు. ఉండినచో అట్టివాఁడు తత్త్వజ్ఞుఁడుకాఁడు.

(పైంగలోపనిషత్తు 4 అధ్యా 9 శ్లో )

శ్లో॥ ద్వేవిద్యేవేదితవ్యేహి పరాచైవాపరాచతే।
తత్రాపరాతు విద్యైషా ఋగ్వేదోయజురేవచ॥
సామవేద స్తథాథర్వవేదః శిక్షామునీశ్వర।
కల్పోవ్యాకరణం చైవ నిరుక్తం ఛందఏవచ॥

జ్యోతిషంచ యధానాత్మ విషయా అపిబుద్ధయః
అథైషాపరమావిద్య యయాత్మా పరమాక్షరమ్॥
తద్భూతయోనిం పశ్యంతిధీరా ఆత్మానమాత్మని॥

అపరావిద్యయనియు, పరావిద్యయనియు రెండువిద్యలు తెలియఁదగినవి. అందుఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అదేవిధముగా అథర్వవేదము, శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము ఇఁకను అనాత్మవిషయ జ్ఞానముతో కూడినయేలాటివికూడ అపరావిద్యలోఁజేరుచున్నవి. మఱియేవిద్యచేత జ్ఞానయోగులు సర్వభూతముల యుత్పత్తికిఁగారణమైనట్టియు, అవ్యయమైనట్టియు భగవత్తత్త్వమును తమలోఁదాము చూచుచున్నారో ఆవిద్య పరావిద్యయగును. పరావిద్య లభించినవానికి అపరావిద్యయందు ప్రయోజనముండదని తెలియవలయును.

(రుద్రహృదయోపనిషత్తు 28 మొదలు.)

మూ॥ కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన।
మాకర్మఫలహేతుర్భూర్మాతే సంగోఽస్త్వకర్మణి॥ 47.

తా॥ నీకు కర్మచేయుటయందే యధికారమున్నది. ఫలములయందు ఎప్పుడును వలదు. కర్మఫలమునకు కారణము కారాదు. అకర్మయందు నీకు ఆసక్తియుండకూడదు.

విశే॥ యోగికి తొలుత కర్మయోగము అని చెప్పఁబడు యోగభాగమును అభ్యాసము చేయుటకే అర్హతయుండును. ఇందు మనశ్శుద్ధి దప్ప మఱియొక ప్రతిఫలము లేదు. మనశ్శుద్ధి యన్ననో రూపనామములు లేనిది. కర్మయోగికి కోరకున్నను కలుగుచున్నది. ఇదిగాక మఱేదైన కోరిక పెట్టుకొనినను యోగభ్రంశ మగుచున్నది. కనుక ఇతర ఫలములను కోరరాదు. ఫలములకు నేను కర్తననుకొనరాదు, మఱియొక జన్మకారణమైన ఫలమునకు హేతువైన కర్మచేయరాదు కర్మయోగ పద్ధతి వలదని దీనికంటె అన్యమైన పద్ధతి కావలయునని నీకు ఆపేక్షవలదు.

మూ॥ యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ।
సిద్ధ్యసిద్ధ్యో స్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥ 48.

**తా॥** అర్జునా! జన్మకారణమైన ప్రవృత్తియందు ఆసక్తిలేక లాభాలాభములయందు సముడవై యోగమునందుండి కర్మలను చేయుము. సమభావము కలిగియుండుటే యోగమనఁబడును.

**విశే॥** సర్వభూతములయందలి ప్రత్యగాత్మ యొక్కటే కాని వేఱు లేదను భావము సమత్వము, ఇది యోగమనబడును. సర్వభూతాత్మ నేనను జ్ఞప్తియందుండుటేయోగము నందుండుట తనకంటె అన్యము మఱియొకటి లేనప్పుడిఁక లభింపఁదగినదిలేదు. లభింపరానిదిలేదు. కావలయుననెడి యాసక్తియులేదు. అట్టిస్థితియందుండి విద్యార్థియమనీయమాది కర్మయోగ పద్ధతుల నభ్యాసము చేయవలయును.

శ్లో॥ కర్మోదయే కర్మఫలానురాగాస్తే।
తత్రానుయాంతి నతరంతి మృత్యుమ్॥
సదర్థ యోగానవగమా త్సమంతాత్।
ప్రవర్తతే భోగయోగేన దేహ॥

కర్మయోగారంభమున కర్మఫలమునం దనురక్తులైనవారు దానియందే తగులుకొనిపోదురు. మృత్యువును తరింపఁజాలరు. స్వస్వరూపానుభవము అందుపాటులో లేకపోవుటవలన దేహిసంపూర్ణముగా ఐహికభోగములను సమకూర్చుకొనుటతోనే వర్తించుచుండును. (సనత్సుజాతీయము 1అ 9శ్లో)

ఓం. తత్. సత్.

# శతపత్రము

# 91

మూ॥ దూరేణహ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ।
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥ 49.

తా॥ అర్జునా! కర్మయోగము మోక్షస్థానము జెందుటకు దూర మైన దగుటచే బుద్ధియోగమునకంటె మేలైనది కాదు. నీవు బుద్ధియోగము నందు ఆశ్రయము కోరుము. కర్మఫలమును కారణముగ లక్షించువారు అల్పులు, బుద్ధియోగము నాశ్రయింపక కేవల కర్మయోగమునే అనుష్ఠింపఁ జూచినచో విషయాసక్తి యుడుగదు. యోగభ్రంశమగును. మఱియు పెక్కు కష్టములు, దుఃఖములు సంభవించును కనుక బుద్ధి నాశ్రయించియే కర్మ చేయవలయును.

శ్లో॥ చిత్తస్యశుద్ధయే కర్మ నతువస్తూపలబ్ధయే।
వస్తు సిద్ధిర్విచారేణ నకించిత్కర్మకోటిభిః॥

కర్మయోగము మనశ్శుద్ధికిఁ బనికివచ్చునే కాని తత్త్వప్రాప్తికిఁ బనికి రాదు. పరమాత్మ తత్త్వము సాంఖ్యయోగము చేతనే లభించును. సాంఖ్య యోగము లేకున్న పెక్కుకర్మలు చేసినను లభించునది కాదు.

(వివేకచూడామణి 11 శ్లోకము)

మూ॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభె సుకృత దుష్కృతే।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥ 50

తా॥ బుద్ధియోగముతో కూడినవాడు (సాంఖ్యయోగి) ఈ లోకములో పుణ్య పాపములను రెంటిని వదలివేయుచున్నాడు. యమనియమాది దృశ్య

రూపములైన అభ్యాసములయందు బుద్ధియోగముమేలు। అందువలన యోగ
ము కొఱకు యత్నము చేయుము.

విశే॥ బుద్ధినిశ్చయము లేకున్న కర్మయోగము సాగదు. కర్మయోగము
లేకున్న చిత్తశుద్ధి కలుగదు. చిత్తశుద్ధిలేకున్న ఆత్మజ్ఞానము లభింపదు. ఆత్మ
జ్ఞానములేకున్న నిత్యశుభప్రాప్తిలేదు. అందువలన తొలుత బుద్ధినిశ్చయము
కావలయును.

శ్లో॥ నకామకర్మబీజానామ్ దృశ్యతేయత్ర సంభవః।
వాసుదేవైక నిలయ స్సవైభాగవతోత్తమః॥

కోరికతోగూడిన కర్మబీజాంకురము ఎవనియందు గనబడదో, సర్వ
భూతాత్మయైన పరమాత్మయే తనకు స్థానముగ నెవడున్నాడో వాఁడు దైవ
పరాయణులలో ఉత్తముఁడు. ( భాగవత. అ. 1-50 ) ఇట్లు చెప్పుటచే
భగవత్తత్త్వము నందు బుద్ధినిలిపిన యోగియే నిష్కామ కర్మయోగమునందు
నేర్పరియగునని భావము.

మూ॥ కర్మజం బుద్ధి యుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబంధ వినిర్ముక్తాః పదంగచ్ఛంత్యనామయమ్॥ 51.

తా॥ బుద్ధియోగముతో గూడినవారు (ప్రత్యాహార, ధారణా. ధ్యాన
సమాధి అను ఉత్తరాంగములు అనుష్ఠించినవారు) యమ నియమాది కర్మ
యోగాభ్యాసములవలన కలుగు కాయక్లేశములను సుఖదుఃఖాది ఫలము
లను త్యజించి జన్మబంధముల వలన విడువబడిన వారై నిరామయమైన
పరమాత్మ తత్త్వమును పొందుచున్నారు. బుద్ధియోగము లేక కేవల కర్మ
యోగమునే అభ్యసించువారు జన్మకారణమైన కర్మ ఫలమును త్యజింప
జాలరు. పరతత్త్వమును పొందజాలరు. అని భావము.

మూ॥ యదాతేమోహ కలిలం బుద్ధిర్వ్యతి తరిష్యతి
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ॥ 52

తా॥ అర్జునా! నీబుద్ధి యెప్పుడైతే మోహరూపమైన కాలుష్యమును దాటఁగలదో అప్పుడు వినవలసినట్టియు, వినినట్టియు అర్థములలో వైరాగ్యము పొందుచున్నాఁడవు. అతీతానాగతములైన భౌతిక విషయములయందు శ్రవణజ్ఞానము లేనివాఁడవగుదువు. స్వర్గాది సుఖముల నెఱిఁగించు వేదములకు అతీతమైనపదము పొందుదువు.

శ్లో॥ ఇంద్రియేభ్యశ్చ పంచభ్యో మనసశ్చైవ భారత।
అతీతానాగతేభ్యశ్చ ముక్తశ్చేత్స సుఖీభవేత్॥

ఓ భారతా! ఇంద్రియములనుండి, మనస్సునుండి, అగతానాగతములైన విషయ వాసనలనుండి విడువఁబడిన వాఁడగునేని అట్టివాఁడు సుఖవంతుఁడగును. (సనత్సుజాతీయము 2. అ 39 శ్లో.)

మూ॥ శ్రుతి విప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।
సమాధావచలా బుద్ధిస్తదా యోగ మవాప్స్యసి॥ 53

తా॥ అర్జునా! వేదములనుండి విపరీతజ్ఞానమును పొందిన నీబుద్ధి యెప్పుడైతే భ్రంశములేనిదై సమాధియందు నిలుకడగా స్థాపితమగుచున్నదో అప్పుడు యోగమును పొందఁగలవు.

వి॥ శే॥ "శ్రుతి విప్రతిపన్నా" వినికిడివలన విశేషముగఁ దెలియఁబడినదని యింకొకయర్థము వచ్చును. ఈ యర్థము మంచిదే కాని అష్టాంగయోగములు సాధించి శ్రమపడినవారికే సమాధియందు చిత్తమునిలుచుట దుర్లభమని యోగీశ్వరులు చెప్పుచుండ శ్రవణమాత్రముననే నిలుచునని యొప్పుకొనుటకు వీలుపడదు. అర్జునుఁడు తొలుత వైదిక ధర్మములఁబేర్కొనుచు విమనస్కుఁడైనట్లు చెప్పఁబడియుండుటచేతను, కడచిన శ్లోకములలో సైతము వేదవిహితాచారములు నిరసింపఁబడి యుండుటచేతను, ప్రవృత్తిధర్మములైన వైదికాచారములవలన విముఖతఁజెందినప్పుడే సమాధియోగమునందు బుద్ధి ప్రతిష్ఠింపఁబడుటకు అవకాశము చిక్కునని యోగీశ్వరులందఱు చెప్పుచుండుటచేతను పైవిధముగ అనువదించితిని.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు;

మూ॥ స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేతకిమ్॥ 54

తా॥ ఓ కృష్ణా! సమాధియందు స్థిరముగ బుద్ధినిలిచిన వానిభాష యెట్టిది? అతఁడేమి మాటాడును? ఎట్లు కూర్చుండును? ఎట్లు ప్రవర్తించును? (ఆధ్యాత్మిక కర్మయందు తుదిలక్ష్యమైన సమాధి వర్ణింపఁబడుచున్నది కనుక యుద్ధమన్నను, కర్మయన్నను భౌతికముకాదని తెలియఁపగి యున్నది )

శ్రీభగవానుఁడు చెప్పుచున్నాఁడు.

మూ॥ ప్రజహాతి యదా కామా౯ సర్వా౯ పార్థ మనోగతా౯।
ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥ 55

తా॥ అర్జునా! మనస్సుతోఁగూడిన కోరికల నన్నిఁటిని ఎప్పుడైతే విడిచి పెట్టు చున్నాఁడో, ఆత్మయందు ఆత్మచేతనే ఎప్పుడు సంతుష్టుఁడగు చున్నాఁడో అప్పుడు స్థితప్రజ్ఞుఁడని చెప్పఁబడు చున్నాఁడు.

శ్లో॥ ప్రజహాతి యదా కామా౯ సర్వాంశ్చిత్త గతా౯మునే।
మయి సర్వాత్మకే తుష్టః సజీవన్ముక్త ఉచ్యతే॥

ఓ మునీంద్ర! ఎప్పుడైతే సర్మభూతాత్మయైన నాయందు తృప్తిజెందినవాడై తన మనస్సున తగులుకొనియుండు కోరికల నన్నిటిఁని కొట్టివేయు చున్నాఁడో అప్పుడే యతఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడును.

(వరాహోపనిషత్తు 4 28 శ్లో)

మూ॥ దుఃఖేష్వను ద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః।
వీతరాగ భయక్రోధః స్థితధీర్మని రుచ్యతే॥ 56.

తా॥ దుఃఖములు గలిగినప్పుడు భీతిఁజెందక, సుఖములయందు ఆశ పడక రాగమునుఁ భయమును, క్రోధమును వదలుకొని స్వస్వరూపమును మననముచేయువాడు స్థిరమైన బుద్ధికలవాడని చెప్పఁబడును.

శ్లో॥ న హి దుఃఖేషు శోచంతే న ప్రహృష్యంతి చర్ధిషు।
కృతప్రజ్ఞా జ్ఞానతృప్తాః క్షాంతాః సంతోమనీషిణః॥

జ్ఞానయోగము పర్యాప్తముగ చేసి జ్ఞానముచేతనే సంతుష్టిఁజెంది ఓర్పు గలిగియుండు సత్పురుషులు ధీశాలురు దుఃఖములు కలిగినప్పుడు శోకింపరు. క్షేమాభివృద్ధులు కలిగినప్పుడు సంతోషపడరు కదా?

(భారతము శాంతి 223 అ. 29 శ్లో)

శ్లో॥ అర్థసిద్ధి మనర్థంచ జీవితం మరణం తథా।
సుఖదుఃఖఫలంచైవ నద్వేష్మి నచకామయే॥

అర్థలాభమును, అనర్థమును, జీవితమును, మరణమును, సుఖదుఃఖరూపమైన కర్మఫలమును ఇట్టివాని నన్నిఁటిని వలదని ద్వేషింపను కావలయునని వాంఛింపను. (భారత. శాంతి. 224 అ. 13 శ్లో.)

" దృష్టదుఃఖేష్వను ద్వేగో విద్యాయాః ప్రస్తుతం ఫలమ్ " దుఃఖములు తోచినప్పుడు భీతిజెందకుండుటే బ్రహ్మవిద్యయొక్క యిప్పటిఫలము.

(వివేకచూడామణి 422 శ్లో.)

విశే॥ భగవత్తత్త్వమునందు మానసేంద్రియములను స్థిరముగ నిలిపినప్పుడు భౌతికములైన దుఃఖములు, సుఖములు కనఁబడవు. అందువలన ఖేదమోదములు కనఁబడవు. తనకు హానిఁజేయు అన్యవస్తువులేదని తెలిసికొనినందున రాగద్వేషాదులు పొడసూపవు. ఇట్టి స్థితప్రజ్ఞుని గురించి తేజోబిందూపనిషత్తునందు విపులముగ వర్ణిపఁబడినది. మఱియు పెక్కుచోట్ల ఉగ్గడింపఁబడినది.

మూ॥ యస్సర్వత్రానభి స్నేహస్తత్తత్ప్రాప్య శుభాశుభమ్।
నాభినందతి నద్వేష్టి తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 57.

తా॥ ఎవఁడైతే సర్వవిషయములయందు కేవలము అను రాగము జెందక యుండునో, ఆయా శుభాశుభములను ప్రాపించియు శుభమువలన సంతోషమును, అశుభమువలన ద్వేషమును పొందఁడో అటువంటివాని బుద్ధి మిక్కిలి స్థిరమైనది.

" దుఃఖేనసోద్విగ్నః సుఖేన నానుమోదకో, రాగేనిస్పృహః, సర్వత్ర శుభాశుభయోరనభిస్నేహః" దుఃఖముచే దిగులు పడనివాడు, సుఖముచే హర్షముఁ బొందనివాఁడు, అనురాగమును బుట్టించు వస్తువులయందు ఆశ లేనివాడు, ఎల్లెడల శుభాశుభములయందు ఎక్కువ స్నేహము లేనివాఁడు స్థితప్రజ్ఞుఁడనఁబడును. ( తురీయాతీతోపనిషత్తు. )

శ్లో॥ గృహీత్వాపీంద్రియై రర్థాన్ యో నద్వేష్టి నహృష్యతి।
విష్ణోర్మాయామయం పశ్యన్ సవై భాగవతోత్తమః॥

బాహ్యాభ్యంతరములైన యింద్రియములచేత విషయార్థములను గ్రహించియు ఆయర్థములవలన ఎవఁడైతే ద్వేషమును, సంతోషమును పొందక అంతయు విష్ణుమాయా మయముగఁ జూచుచుండునో అతఁడు భాగవతులలో ఉత్తముఁడు. (ఆర్షభ గీత 1-48)

మూ॥ యదాసంహరతే చాయం కూర్మోఽంగానీవసర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా॥ 58.

తా॥ తాబేలునకు ఏదైన మఱియొక జంతువు వలన భయము కలిగినప్పుడు తల, తోక, పాదములు వీని నన్నిఁటిని తన లోపలికి తీసికొని నట్లు ఆయోగియు ఇంద్రియార్థములైన విషయములనుండి తనమానసేంద్రియములను ఎప్పుడైతే ఉపసంహరించుకొనుచున్నాఁడో అప్పుడే యతని బుద్ధి మిక్కిలి స్థిరముగ నిలుచుచున్నది. (ఈసాధనకు యోగశాస్త్రములో ప్రత్యాహారమని పేరు)

శ్లో॥ యదాసంహరతే కామాన్ కూర్మోఽంగానీవ సర్వశః
తదాత్మజ్యోతి రచిరా త్స్వాత్మన్యేవ ప్రసీదతి॥

తాబేలు తన అంగములను ముడుచుకొనినట్లు పురుషుఁడు ఎల్లరీతుల కోరికలను ఎప్పుడైతే ఉపసంహరించు కొనుచున్నాఁడో అప్పుడు తనయందే ఆత్మజ్యోతి త్వరగా ప్రసన్న మగుచున్నది (భారత శాంతి 21-అ. 3-శ్లో)

శ్లో॥ లభతే యోగయుక్తాత్మా పురుషస్తత్పరం పదమ్।
కూర్మః స్వపాణిపాదాది శిరశ్చాత్మని ధారయేత్॥

ఏవంద్వారేషు సర్వేషు వాయుపూరిత రేచితః।
నిషిద్ధంతు నవద్వారే ఊర్ధ్వం ప్రాఙ్నిశ్వసంస్తథా॥

తాబేలు తన కర చరణాదులను, శిరమును తనయందే ధరించు చున్నది. అదే విధముగా యోగీశ్వరుఁడు సర్వద్వారములయందు రేచక పూరకములచే నిషేధింపఁబడిన నవద్వారబంధురమైన శరీరమునందు వాయువును ఊర్ధ్వముగా ముందు ఎక్కించుచు అట్లే మోక్షపదమును పొందు చున్నాడు. (యోగతత్త్వోపనిషత్తు 140-141 శ్లోకములు)

శ్లో॥ యథాకూర్మ ఇవాంగాని ప్రసార్య వినియచ్ఛతి।
ఏవమేవేంద్రియగ్రామం బుద్ధిః సృష్ట్వా నియచ్ఛతి॥

తాబేలు తన శరీరాంగములను ఏప్రకారముగా విస్తరింపఁజేసి మరల ముడుచుకొనుచున్నదో, పురుషుని బుద్ధియు అదే ప్రకారముగా ఇంద్రియ సముదాయమును బయటికిఁ బోఁడిచి మరల నిగ్రహించుచున్నది.

(భారత శాంతి 247-14)

శ్లో॥ ప్రసార్యేహ యథాంగాని కూర్మః సంహరతే పునః।
తథేంద్రియాణి మనసా సంయంతవ్యాని భిక్షుణా॥

లోకములో తాబేలు తన శరీరాంగములను విప్పి మరల నెట్టుల ముడుచుకొనఁజేయుచున్నదో అదేవిధముగా సన్న్యాసి తన యింద్రియములను మనస్సుచే నిగ్రహింపవలయును. (భారత శాంతి 327-39)

"విషయేషు విచరతా మింద్రియాణాం బలాదాహరణం ప్రత్యాహారః యద్యత్పశ్యతి తత్సర్వ మాత్మేతి ప్రత్యాహారః, యద్యత్పశ్యతి తత్సర్వ మాత్మేతి పత్యాహారః, నిత్యవిహిత కర్మఫలత్యాగః ప్రత్యాహారః, సర్వవిషయ పరాఙ్ముఖత్వం ప్రత్యాహారః" శబ్ద స్పర్శాది విషయములయందు చరించు ఇంద్రియములను బలవంతముగ వాపసు తీసుకొనుట ప్రత్యాహారము, ఏమేమి చూచుచున్నాఁడో అది యంతయు నేనేయని భావించుట ప్రత్యాహారము, నిత్యము చేయఁబడుచున్న శాస్త్రసమ్మతమైన కర్మయొక్క ఫలమునకు తాను కర్త కాకుండుట పత్యాహారము, సర్వవిషయములయందు విముఖుఁడగుట ప్రత్యాహారము. (శాండిల్యోపనిషత్తు 1 అ)

"చిత్తస్యాంత ర్ముఖీభావః ప్రత్యాహారస్తు సత్తమ" ఓ సత్పురుషా! మనస్సు బాహ్య వ్యాపారములకు వ్యాపింపక అంతర్ముఖముగాఁ దిరుగుట ప్రత్యాహారము. (త్రిశిఖి బ్రాహ్మణోపనిషత్తు 30 శ్లో)

యోగాంగములలో ఈసూత్రము మిగుల ముఖ్యమైనది. కనుక ఇచ్చటఁ గొన్ని దృష్టాంతములు చూపఁబడినవి.

మూ॥ విషయా వినివర్తంతే నిరాహారస్యదేహినః
రసవర్జం రసోఽప్యస్య పరందృష్ట్వా నివర్తతే॥ 59

తా॥ (పూర్వశ్లోకరీతిగా) ఇంద్రియముల వృత్తిని ఉపసంహరించుకొనిన దేహికి విషయములు తొలఁగుచున్నవి అనురాగశూన్యమైన పరమాత్మ తత్త్వమును దర్శించుటచే అతనికి విషయములయందలి అనురాగముకూడ ఉడిగిపోవుచున్నది. (ఈశ్లోకము భారత, శాంతి 204 అధ్యాయములో చదివినట్లు జ్ఞాపకము)

వివ॥ కొందఱు "నిరాహారస్య" అనుటచే భోజనములేనివానికి విషయముల గ్రహించు శక్తియుండదు. కాని విషయవాసనమాత్ర ముండును. మరల భుజించినప్పుడు అన్నివిషయములు తగులుకొనును. ఆత్మసాక్షాత్కారము పొందినయోగికి విషయవాసన తగ్గిపోవునని చెప్పుదురు. ఇందు కొంత నిజమే యున్నదికాని భోజనములేక దేహము దుర్బలమైనవానికి కర్మేంద్రియములు తగ్గినను జ్ఞానేంద్రియములు అంతరింద్రియములు తగ్గవు కనుక భోజనము తగ్గినంతనే విషయములన్నియు తగ్గునని చెప్పరాదు జిహ్వేంద్రియ విషయము ననుసరించి తగ్గునది, హెచ్చునది గుహ్యేంద్రియ విషయముమాత్రమే నిరాహారులనఁగా కూడు తిననివారని భాగవతములో ప్రమాణశ్లోకము లుండినట్లుఁ జెప్పుదురు. అందు:

శ్లో॥ జిహ్వయాతి ప్రమాథిన్యా జనో రస విమోహితః।
మృత్యుమృచ్ఛ త్యసద్బుద్ధి ర్మీనస్తు బడిశైర్యథా॥

చేప మనోవ్యాకులకారణమైన జిహ్వేంద్రియ చాపల్యముచే గాలములకుఁ దగులుకొని యెట్లు మరణించుచున్నదో అట్లే పరమాత్మతత్త్వమునందు బుద్ధి నిలుపని మనుష్యుఁడు రసమోహితుఁడై మృత్యువును పొందుచున్నాడు

(భాగవత 11 స్కం. 8 అధ్యా 19 శ్లో)

రసమోహితుడనఁగా భోజనపదార్థములయందలి షడ్రసములకు భ్రాంతి పడినవాఁడనియు, చేపతో పోల్చుటచే దానివలెనే జిహ్వేంద్రియము చేతనే చెడుచున్నాఁడనియు తలఁచుచున్నారు.

"శృంగారాదౌ, విషే, వీర్యే, గుణే, రాగే, ద్రవేరసః॥ రస్యత ఇతిరసః రస ఆస్వాదనే" రసశబ్దము శృంగారాది రసములకును, విషమునకును, బలమునకును, మధురాది షడ్రసములకును, అనురాగమునకును, ద్రవమునకునుపేరు (అమర నానార్థ 228 శ్లో)

రసమనఁగా రాగము. రసనమనఁగా ఆస్వాదించువృత్తి పరతత్త్వావలోకనమువలన రసనము విజితమగుచున్నది. అందువల్లనే రాగము జయింపఁబడుచున్నది.

శ్లో॥ ఇంద్రియాణి జయంత్యాశు నిరాహారా మనీషిణః।
వర్జయిత్వాతు రసనం తన్నిరన్నస్య వర్ధతే॥

"ఆసమంతాత్ హరణం ఆహరణం, నిరస్తం ఆహరణం నిరాహరణం, నిరాహరణవంతః పురుషా నిరాహారాః" విషయార్థములఁ గైకొనని బుద్ధిమంతులు రసనమును (ఆస్వాదనమును) వర్జించి శీఘ్రముగా ఇంద్రియముల జయించుచున్నారు. రసనము నిరసింపబడిన మరల వృద్ధినొందదు.

(భాగవత 11 స్కం. 8-అ 20 శ్లో)

శ్లో॥ తావజ్జితేంద్రియో నస్యాద్విజితాన్యేంద్రియః పుమాన్।
నజయేద్రసనం యావజ్జితం సర్వం జితేరసే॥

పురుషుఁడు ఎంతవఱకు రసనమును (విషయాస్వాదవృత్తిని) జయింపఁడో అంతవఱకు తక్కిన ఇంద్రియముల గెల్చినను విజితేంద్రియుఁడు కాఁడు. విషయానురాగము జయింపఁబడినప్పుడు సర్వము జయింపఁబడుచున్నది. (భాగవత. 11 స్కం. 8 అధ్యా 21 శ్లో)

మత్స్యమును ఉపమానముగఁ దీసికొనుటచే పురుషుఁడు జిహ్వేంద్రియముచేతనే మోసపోవుచున్నాడని సిద్ధాంతము చేయరాదు.

శ్లో॥ విస్తారితం మకరకేతన ధీవరేణ।
స్త్రీసంజ్ఞితం బడిశమత్ర భవాంబురాశౌ।
తేనాచిరాత్తదధరామిషలోల మర్త్య
మత్స్యాన్వికృష్య స పచత్యనురాగవహ్నౌ॥

సంసారసాగరమున మన్మథుఁడను బెస్తవానిచే స్త్రీ యను గాలము విడువఁ బడినది. అధరామృతమనెడు మాంసమున కాశపడిన నరులనెడి చేపలను సత్వరముగఁ బట్టుకొని అనురాగమను అగ్నిలో అతఁడు పాకము చేయుచున్నాడు (శ్రీభర్తృహరి 2 52)

అంతేగాక భాగవతములో సైతము పైశ్లోకములకు పూర్వోత్తర శ్లోకము లలో ఎచ్చటనైనను నిరాహార శబ్దమునకు శబ్దాది విషయముల నన్నిఁటిని త్యజించుటయని వర్ణింపఁబడినదే కాని తిండి లేకుండుట యని చెప్పలేదు. యోగీశ్వరులు ఉపవాస జాగరములు చేయరాదనియు, కడుపులో నాలు గింట ఒకభాగము వెలితియుండునట్లు మితమెఱిఁగి భుజించుచుండవల యుననియు యోగశాస్త్రములో చెప్పబడినది.

మూ॥ యతతోహ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః।
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః॥ 60.

తా॥ అర్జునా! పురుషుడు మంచి తెలివిగలవాడేయైనను, ఇంద్రియ నిగ్రహమునకై ప్రయత్నించు వాఁడేయైనను కలతపెట్టు స్వభావముగల ఇంద్రియములు మనస్సును బలవంతముగ హరించుచున్నవి.

వివ॥ ఉత్తమాధికారియైన గురువుచే బోధింపఁబడక యమనియమాది యోగాంగముల శాస్త్రోక్తరీతిగ నభ్యసింపక తనకుఁదానే యింద్రియ వ్యాపారమును మానుకొనఁ బ్రయత్నించువానిని బలవంతముగ లాగునని తెలియ వలయును.

శ్లో॥ మాత్రా స్వస్రా దుహిత్రావా న వివిక్తాసనోభవేత్।
బలవానింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి॥

ఇంద్రియ సమూహము బలిష్ఠమైనది. విద్వాంసు నైనను వ్రక్క ల్రించును. (అందువలన) తన తల్లితోనైనను, చెల్లెలితోనైనను, పుత్రికతో

నైనను ఏకాంతమున గూర్చుండరాదు. (ఈశ్లోకము మనుస్మృతి 2. అధ్యాయములోను, భాగవతము 9 స్కం. 19 అధ్యాయములోను హితోపదేశము నందు మిత్రలాభ తంత్రములోను, ఒకటే విధముగ నున్నది.)

భగవత్తత్త్వమునందు బుద్ధి ప్రతిష్ఠింపఁ బడినప్పుడు ఇంద్రియముల బలము ఉడిగిపోవునని పూర్వశ్లోకములలోఁ జెప్పఁబడినందువలన సామాన్య విద్వాంసుల మాటయే యిందుఁజెప్పఁబడియుండును.

మఱియు

శ్లో॥ తస్మాదేతామహం త్యక్త్వా బ్రహ్మణ్యాధాయ మానసమ్।
నిర్ద్వంద్వోనిరహంకార శ్చరిష్యామి మృగైస్సహ॥

"అందువలన నేను ఈ విషయాభిలాష వదలుకొని పరబ్రహ్మము నందు మనస్సును నిలిపి సుఖ దుఃఖాది ద్వంద్వములు, అహంకారము లేని వాడనై మృగములతోఁ గూడి చరించుచుండును" అని యయాతి మహారాజు చెప్పెను. (భాగవతము 9 స్కం. 19 అ. 19 శ్లోక) యీ శ్లోకమునందును ఆత్మధ్యానమువలన విషయానురాగము తగ్గుననియే సూచింపఁబడినది.

మూ॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీతమత్పరః।
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 61.

తా॥ ఆ యింద్రియముల నన్నిటిని తన స్వాధీనములో నిలుపుకొని అస్మచ్ఛబ్ద లక్ష్యార్థమైన సర్వభూతాత్మయే శ్రేష్ఠమనెడు భావము కలిగి యోగియై యుండవలయును. ఇంద్రియములు ఎవనివశమున (వర్తించునో) అతని బుద్ధి సుస్థిరమైనది.

వివ॥ ఇంద్రియములు వశపడుటకు పరమాత్మయందు అనన్యభావము కలుగుటే ముఖ్యహేతువని ఈ శ్లోకమువలన తెలియుచున్నది. "ఆత్మ ప్రసన్నత లేకున్న ఇంద్రియ నిగ్రహము కాదు. ఇంద్రియనిగ్రహము లేకున్న ఆత్మప్రసన్నతకలుగదు ఈరెండు ఒకటేసారి ఒకటే క్రియాసూత్రమువలన లభింపవలయునే కాని వేఱువేఱు సూత్రముల వలన లభించునవి కావు"

(అన్నపూర్ణోపనిషత్తు 4 అ 78-80 శ్లో.)

శ్లో॥ యస్తువిజ్ఞానవాౕ భవతి యుక్తేన మనసా సదా।
తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవసారథేః॥
యస్తువిజ్ఞానవాన్ భవతి సమనస్కస్సదాశుచిః।
సతు తత్పద మాప్నోతి యస్మాద్భూయో నజాయతే॥

ఎవఁడైతే యెల్లప్పుడు యోగసక్తమైన మనస్సుతో జ్ఞానయోగియై యు న్నాఁడో అతని ఇంద్రియములు సారథికి వశ్యములగు మంచి గుఱ్ఱములవలె వశ్యములగుచున్నవి. ఎవఁడైతే జ్ఞానయోగియై మనస్సుతోగూడి యెల్లప్పుడు పరిశుద్ధుఁడైయున్నాఁడో అతఁడు పునర్జన్మములేని మోక్షస్థానమును పొందు చున్నాఁడు. (కఠోపనిషత్తు 3 వల్లి 6, 8 శ్లో.) ఇందువలన జ్ఞానశుద్ధి, ఇంద్రి య నిగ్రహము వేఱువేఱుగ లేవని తెలియుచున్నది.

మూ॥ ధ్యాయతో విషయాౕ పుంస స్సంగస్తేషూపజాయతే।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥ 62.

శబ్దాది విషయములఁ జింతించుచుండు పురుషునకు ఆవిషయముల యందు అందుపాటు యేర్పడుచున్నది. విషయములు అందుపాటులోనికి వచ్చుట వలన వానిని అనుభవింపవలయునను కోరిక పెరిగిపోవుచున్నది. ఆకోరిక నుండి క్రోధము అధికముగ కలుగుచున్నది. (విషయములను అనుభవించిన కొలది కోరిక పెరిగిపోవుచున్నది. అటంకము కలిగినప్పుడు క్రోధము పుట్టుచున్నది.)

శో॥ క్రోధాద్భవతి సమ్మోహ స్సమ్మోహత్ స్మృతివిభ్రమః॥
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణస్యతి॥ 63.

తా॥ క్రోధమువలన మనోవైకల్యరూపమైన అవివేకము కలుగుచున్న ది. అవివేకమువలన పురుషధర్మమునందలి జ్ఞప్తి చలించిపోవుచున్నది. అట్టి చలనమువలన నీతి నియమములు స్ఫురింపక పోవుటచేత చేయఁదగి న కార్యమేదో, చేయరానికార్యమేదో, తన కర్తవ్యమేదో యెఱుఁగు బుద్ధి బలము నశించుచున్నది. బుద్ధిబలము చెడిన పురుషుఁడు మిక్కిలి చెడి పోవుచున్నాఁడు.

మూ॥ రాగద్వేష వియుక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్।
ఆత్మ వశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి॥ 64.

తా॥ నియతాత్ముఁడైన యోగీశ్వరుఁడు రాగద్వేషములనుండి విడువఁబడినట్టియు, తనకు స్వాధీనమైనట్టియు, ఇంద్రియములచే విషయముల ననుభవించుచు ఉత్తమగతి పొందుచున్నాఁడు (ప్రకృష్టం సీదంతి అస్మిన్ ఇతిప్రసాదం, షద్ఌవిశరణ గత్యవసాదనేషు) ఆత్మనిష్ఠాపరులైన యోగీశ్వరులైనను ఆహారపానీయాది విషయములను ఇంద్రియములచే అనుభవింపవలసియున్నది. రాగద్వేషాదులు వదలినవిగాను, తనకు వశపడినవిగాను, ఉండు ఇంద్రియములచే విషయముల ననుభవించినను బద్ధులు కారని భావము.

శ్లో॥ ఇంద్రియైరింద్రియార్థేషు చరత్యాత్మ వశైరిహ।
అసజ్జమాన శ్శాంతాత్మా నిర్వికార స్సమాహిత॥

విషయభోగాదులయందు అసక్తుఁడుకాక, షడ్భావవికారముల జెందక చిత్తోపశమముఁగాంచి ప్రసన్నమానసుఁడై తనకు వశపడిన యింద్రియములతో లోకములో ఎవఁడైతే విషయముల ననుభవించుచున్నాఁడో అతఁడు స్థితప్రజ్ఞుడు. (భారతము శాంతి. 330-15)

మూ॥ ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్నచేతసోహ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే॥ 65

తా॥ సత్త్వాప్తికాఁగా యోగీశ్వరుని దుఃఖముల కన్నిఁటికి వినాశము సంభవించుచున్నవి. స్వస్థచిత్తుఁడైన యతని బుద్ధి సత్వరముగ స్థిరపడుచున్నది.

వివ॥ పూర్వశ్లోకములలో వర్ణింపఁబడిన విషయసంగాది దోషములు శమించి పోవుటకు తత్త్వప్రసన్నతయే ముఖ్యకారణమని యీ శ్లోకములోఁ జెప్పబడినది.

శ్లో॥ చిత్తస్య హి ప్రసాదేన హంతి కర్మ శుభాశుభమ్।
ప్రసన్నాత్మాత్మని స్థిత్వా సుఖమక్షయ మశ్నుతే॥

చిత్తము స్వాధీనమగుటచే (యోగీశ్వరుఁడు) శుభాశుభ రూపమైన కర్మను నిర్మూలించుచున్నాఁడు. ప్రసన్న చిత్తుఁడై తనలో తాను నిశ్చలుడై యెన్నఁటికిని తఱుఁగని సుఖము ననుభవించుచున్నాఁడు (ఈశ్లోకము మైత్రే

యోపనిషత్తు 1 అధ్యాయమందును. మైత్రాయణ్యుపనిషత్తు 4 ప్రపాఠక మందును ఉన్నది,

శ్లో॥ యానిదుఃఖాని యాతృష్ణా దుస్సహాయే దురాధయః।
శాంతచేతః సు తత్సర్వం తమోర్కే ష్వివ నశ్యతి॥

సూర్యోదయముకాఁగా చీఁకటి నశించిపోయినట్లు చిత్తముశాంతించిన పురుషులయందు ఏ దుఃఖములును, ఏయాశయు, సహింపరాని యేసంకటములును సర్వము నశించుచున్నవి. (మహోపనిషత్తు 4 అధ్యా 29 శ్లో)

శ్లో॥ చిత్తప్రసాదేన యతిర్జహాతీహ శుభాశుభమ్।
ప్రసన్నాత్మాత్మని స్థిత్వా సుఖమత్యంత మశ్నుతే॥

చిత్తము శాతించుటచేత యతీశ్వరుఁడు లోకములో శుభాశుభ కర్మఫలములను అతిక్రమించుచున్నాఁడు ప్రసన్నచిత్తుఁడైన యోగీశ్వరుఁడు తనలో తాను నిలిచి అతిశయమైన సుఖము ననుభవించుచున్నాఁడు.
(భారత. శాంతి. 246 అధ్యా. 10)

శ్లో॥ భిద్యతేహృదయగ్రంధి శ్ఛిద్యంతే సర్వసంశయాః।
క్షీయంతేచాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥

ఆపరమాత్మ తత్త్వము తెలియబడినంతట ఆయతీశ్వరుని హృదయగ్రంధి (వక్రస్వభావము) భిన్నమగుచున్నది సంశయము లన్నియు ఖండింపఁబడుచున్నవి సుకృత దుష్కృత కారణములైన కర్మలుకూడ నశించుచున్నవి. (ఈశోకము అన్నపూర్ణోపనిషత్తు 4 అధ్యాయములోను, యోగశిఖోపనిషత్తు 5అ లోను, ముం.షత్తు 2 ముం. 2 ఖండములోను, మహోపనిషత్తు 4అధ్యాయములోను,సరస్వతీ రహస్యోపనిషత్తులోనుఒక టేవిధముగనున్నది. (భాగవత 11 స్కం 20 అధ్యాయములో కొంచెము వర్ణభేదముతో నున్నది.)

"తద్యథాప్రియయాస్త్రియా సంపరిష్వక్తో నబాహ్యం కించన వేదనాంతర మేవ మేవాయం పురుషః ప్రాజ్ఞే నాత్మనా సంపరిష్వక్తోనబాహ్యంకించనవేదనాంతరమ్'

ప్రియురాలైన స్త్రీచే లెస్సగ కౌఁగిలింపఁబడిన పురుషుఁడు బాహ్యాంతరములను కొంచెమైనను ఎట్లు తెలిసికొనకుండునో, అదే ప్రకారముగా విజ్ఞాన స్వరూపమైన పరమాత్మచే బాగుగ కౌఁగిలింపఁబడిన పురుషుఁడు (కూడ) బాహ్యాంతర సుఖదుఃఖరూపమైన ప్రపంచమును కొంచె

మైనను తెలిసికొనకుండును. (బృహదారణ్యకోపనిషత్తు 4 అ. 3బ్రా 21శ్లో.) ఇట్లు చెప్పుటవలన తత్త్వప్రసన్నతయే సర్వదుఃఖములకు వినాశహేతువని తెలియువలయును.

శ్లో॥ స్వామిన్నభ్యుదితే సూర్యే తమస్తిష్ఠేత్కథం ప్రభో।
క్షీయంతేచాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥
ఇతివక్తిశ్రుతిః స్వామిం స్త్వయిదృష్టె నచాస్త్యఘమ్॥

ఓ స్వామీ! పరమాత్మను దర్శించినవాని కర్మలు క్షీణించునని శ్రుతి చెప్పుచున్నది. నిన్ను దర్శించినవానికి పాపములేదు సూర్యుఁడుదయింపగా చీఁకటి యెక్కడ నిలుచును? (వరాహపురాణము. పూర్వ 49 అధ్యా)

మూ॥ నాస్తిబుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా
నచాభావయత శ్శాంతి ర శాంతస్య కుతస్సుఖమ్॥ 66

తా॥ యోగికానివానికి బుద్ధిబలముండదు పరమాత్మ తత్త్వనిరూపణ జ్ఞానముకూడ ఉండదు. తత్త్వమును నిరూపింపనివానికి రాగాదులు శమింపవు. అట్లు రాగాదులు శమింపనివానికి సుఖమెక్కడిది?

శో॥ యథాగ్నిర్దారు మధ్యస్థో నోత్తిష్ఠే న్మథనంవినా।
వినాచాభ్యాసయోగేన జ్ఞానదీపస్తథానహి॥

కొయ్యను చిలుకకున్న ఆకొయ్యయందలియగ్ని యెట్లు వెల్లడిగ ప్రకాశింపదో అట్లే అభ్యాసయోగములేకున్న జ్ఞానదీపముకూడ ప్రకాశింపదు. (ఈశ్లోకము యోగకుండల్యుపనిషత్తు 3 అధ్యాయములోను, యోగశిఖోపనిషత్తు 6 అధ్యాయములోను, చూచినట్లు జ్ఞాపకము) ఇట్లు చెప్పుటచే అభ్యాసయోగమే యన్నిటికి మూలమని తెలియుచున్నది

మూ॥ ఇంద్రియాణాంహి చరతాం యన్మనోఽను విధీయతే।
తదస్య హరతిప్రజ్ఞాం వాయు ర్నావ మివాంభసి॥ 67

తా॥ పూర్వశ్లోకరీతిగా యోగి కానివానికి సుఖము లేకపోవుటకు కారణమేమనిన విషయార్థములయందుఁ జరించు ఇంద్రియములరీతి ననుసరించి మనస్సు వర్తించును స్థిరమైన యాధారములేక జలములోఁ దేలుచుండు ఓడను వాయువు హరించునట్లు ఇంద్రియ నిగ్రహములేనివాని బుద్ధిని ఇంద్రియములతోఁగూడిన మనస్సు హరించుచున్నది.

శ్లో॥ నిర్గుణే బ్రహ్మణి మయి ధారయన్ విశదం మనః।
పరమానంద మాప్నోతి యత్రకామోఽవ సీయతే॥

ఎచ్చటనైతే కోరిక క్షీణించుచున్నదో అట్టి యస్మచ్ఛబ్ద లక్ష్యార్థమైన నిర్గుణ పరబ్రహ్మ తత్త్వమునందు నిర్మలమైన మనస్సును నిలుపుచు శ్రేష్ఠమైన ఆనందమును బొందుచున్నాఁడు. (భాగవతము 11 స్కం. 15 అధ్యాయము. 17 శ్లో) ఇట్లు చెప్పుటవలన మనస్సు నిర్మలమగుటకు అభ్యాసయోగము, ఆనందము బొందుటకు జ్ఞానయోగము అవసరమని బుజువగుచున్నది.

మూ॥ తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా॥ 68.

తా॥ అర్జునా! అందువల్ల ఎవని యింద్రియములు ఇంద్రియార్థములైన విషయములనుండి సర్వవిధముల నిగ్రహింపఁబడుచున్నవో ఆయతీశ్వరుని బుద్ధి స్థిరముగ నిలుచుచున్నది.

శ్లో॥ ఇంద్రియాణీంద్రియార్థేభ్యో మనసాకృష్యతన్మనః।
బుద్ధ్యాసారథినా ధీరః ప్రణయేన్మయిసర్వతః॥

జ్ఞానియైనవాఁడు ఇంద్రియార్థములైన విషయభోగాదులనుండి సర్వేంద్రియములను మనస్సుచే పట్టిలాగుకొని ఆమనస్సును బుద్ధియనెడు సారథిచేత ఎల్లెడల అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వమునందు చేర్పవలయును.
(భాగవతము 11 స్కం. 14 అ. 42 శ్లో.)

మూ॥ యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తిసంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతోమునేః॥ 69.

తా॥(1) సర్వభూతములకు ఏదినిశయగుచున్నదో దానియందు యతీశ్వరుఁడు మేలుకొనియుండును. దేనియందు భూతములు మేలుకొనియుండునో అది (స్వస్వరూపమును) చూచుచు మననము చేయువానికి నిశయగును

(2) "నిశా నిశీథినీ రాత్రి స్త్రియామా క్షణదా క్షపా" (అమరకోశము కాలవర్గము 4 శ్లో.) నిశ అనఁగా రాత్రియని సామాన్యప్రజల యభిప్రాయము. ప్రాకృత జనులు నిద్రించుచుండు రాత్రికాలమున యతీశ్వరుఁడు

మేలుకొని తత్త్వచింతనము చేయుచుండును. ఎందుకనగా మానవులసందడి లేక ఆసమయము నిశ్శబ్దముగను, నిర్మలముగను ఉండును. ప్రజలందఱు మేలుకొనుటచే సందడిగనుండు సమయములో ధ్యానముచేయుటకు మనస్సు సరిగ నిలువదు కనుక అప్పుడు యోగి నిద్రించును. (ఈయనువాదము కొందఱు ఒప్పుకొనరు)

3 ''నితరాంశ్యతి సర్వవ్యాపారాన్ నిశా, శో తనూకరణే" అను సూత్రమువలన సర్వవ్యాపారములను మిక్కిలి తగ్గించునది ''నిశా'' అని చెప్పఁబడును. రాత్రి సూర్యరశ్మి లేకపోవుటచే మనుష్యుల నయనేంద్రియ వ్యాపారము తగ్గింపఁబడుచున్నది. మఱియు కంటితోఁజూచుచు కర చరణములతోఁ జేయఁదగిన యిఁకఁగొన్ని వ్యాపారములు తగ్గింపఁబడుచున్నవి. మనస్సుతో సహ ఏకాదశేంద్రియములలో నేత్రము, కరచరణములుగాక తక్కిన యెనిమిది యింద్రియములతోఁ జేయఁబడు వ్యాపారములు ఎంత మాత్రము తగ్గింపఁబడుటలేదు. అంతేకాక యీశ్లోకములో 'సర్వభూతానాం' అని చెప్పుటవలన ఒక్క మనుష్యజాతికిమాత్రమే కాదు జన్మబంధమునకు లోఁబడిన సర్వజీవులకు వర్తించుచున్నది. అట్టి ప్రకృతిభూతముల నన్నిటిని పరిశీలింపగా పగలు సంచరించు జీవులకంటె రాత్రిచరించు జీవులసంఖ్య యెక్కువగనుండినట్లు సృష్టిలోఁ గనఁబడుచున్నది. దివారాత్రములలో ఏవేళ యందుఁ జూచినను ఆయాజాతి జంతువుల వ్యాపారము తక్కువలేక సాగు చునే యుండును.

అభ్యాసయోగులనుగుఱించి ''ప్రాతర్మాధ్యందినే సాయ మర్ధరాత్రేతు కుంభకాన్, శనైరశీతి పర్యంతం చతుర్వారం సమభ్యసేత్'' అని శాండిల్యోపనిష్యత్తులోను, యోగతత్త్వోపనిషత్తులోను, త్రిశిఖి బ్రాహ్మణోపనిషత్తులోను, మఱియు నందందు చెప్పఁబడినది. అందువలన రాత్రి, పగలుకూడ అభ్యాసయోగుల వ్యాపారము సాగుచున్నదనియే భావము. ఇఁక జ్ఞానయోగులకు కాలనియమమేలేదు. జన్మభయమునుండి తప్పించుకొనవలయునను ఆత్రముగల స్వాత్మ నిరీక్షణాసక్తుఁడు అమోఘమైన ఆయువులో కొంతవృథాపోవుటకు సమ్మతింపఁడు. సూర్యచంద్రులచేతను, అగ్నిచేతను, మఱిదేనిచేతను వెలిఁగింపఁబడక సర్వమును తాను వెలిఁగించు పరతత్త్వమే తానైన సంయ

మీశ్వరుఁడు కాలక్షేపము నెఱుఁగఁడు. కనుక ఈశ్లోకములోఁ జెప్పఁబడిన నిశాశబ్దమును రాత్రియని అనువాదము చేయరాదు.

ప్రవృత్తికిఁ జెందిన సర్వజీవులకు అగమ్యగోచరమగుటచే నిశయని చెప్పఁదగిన నివృత్తి పద్ధతి (ఆత్మవిద్య) యందు సంయమీశ్వరుఁడు మెలకువ గలిగి యుండును. జన్మబంధముతోఁ గూడిన జీవులకు మంచి మెలకువ (నైపుణ్యము) గల ప్రవృత్తి మార్గమునందు ఆత్మావలోకన పరుఁడైన జ్ఞానయోగికి నైపుణ్యము తక్కువ యగుటచే అతనికామార్గము నిశయగుచున్నది.

శ్లో॥ యత్రసుప్తా జనానిత్యం ప్రబుద్ధ స్తత్రసంయమీ।
ప్రబుద్ధాయత్రతే విద్వాన్ సుషుప్తిం యాతి యోగిరాట్॥

జననమరణములుగల ప్రజలంపఁడు దేనియందు మెలకువ తప్పి యుందురో దానియందు (బ్రహ్మనిష్ఠయందు) యతీశ్వరుఁడు మిక్కిలి జ్ఞాపకము కలిగి యుండును. ఆమూఢజనులెల్లరు దేనియందు మిగుల హెచ్చరిక కలిగి యున్నారో అట్టి ప్రవృత్తి వ్యవహారమునందు విద్వాంసుడైన యోగీశ్వరుఁడు ఎంతమాత్రము మెలకువ లేకుండును. (యాజ్ఞవల్క్యోపనిషత్తు 22 శ్లోకము)

శ్లో॥ మరణంయత్ర సర్వేషాం తత్రాసౌ పరిజీవతి।
యత్రజీవంతి మూఢాస్తు తత్రాసౌ మృతఏవహి॥

సామాన్య జనులెల్లరు దేనియందు మరణతుల్యమైన అజాగ్రత్తపడుచున్నారో ఆబ్రహ్మవిద్యా పరిశ్రమయందు యోగీశ్వరుఁడు లెస్సగ జీవించుచున్నాడు. మూఢజనులెల్లరు దేనియందు జాగ్రత్తతో జీవించుచున్నారో అట్టి లౌకిక వ్యాపారమునందు ఆయోగీశ్వరుఁడు నిస్పృహుడై చచ్చినవానివలెనే యుండును. (యోగశిఖోపనిషత్తు 1 అ. 46 శ్లో)

శ్లో॥ ప్రవృత్తిర్మానినాం గమ్యా గహనా బ్రహ్మవాదినామ్।
నివృత్తిర్మౌనినాం గమ్యా గహనా దేహమానినామ్॥

దేహాభిమానులకు సుగమ్యమైన ప్రవృత్తిమార్గము బ్రహ్మవాదులకు అగమ్యమైయుండును. మౌనీశ్వరులకు సుగమ్యమైన నివృత్తిమార్గము దేహాభిమానులకు అగమ్యమైయుండును. (విశ్వగీత 101 శ్లో.)

మూ॥ ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం।
సముద్రమాపః ప్రవిశంతి యద్వత్।
తద్వత్కామా యంప్రవిశంతి సర్వే।
స శాంతిమాప్నోతి న కామకామీ॥ 70.

తా॥ అంతటను నిండింపఁ బడినట్టియు, హద్దును మీఱిపోక యేకరీతి నిలిచియుండు నట్టియు, సముద్రమును (ఎక్కడెక్కడనుండి వచ్చిన) జలములు ఎట్లు ప్రవేశించుచున్నవో అదేప్రకారముగా సమస్తమైన భోగ్యవిషయములు ఎవని ప్రవేశించుచున్నవో అతఁడు శాంతి పొందఁగలఁడు. విషయవాంఛగలవాఁడు శాంతిపొందజాలఁడు. (ఈశ్లోకము అవధూతోపనిషత్తులోను, భారతము శాంతి. 251 అధ్యాయములోను చదివినట్లు జ్ఞాపకము.)

శ్లో॥ యత్రప్రవిష్టా విషయాః పరేరితా।
నదీప్రవాహా ఇవవారిరాశౌ।
లీనంతి సన్మాత్రతయా నవిక్రియా।
ముత్పాదయంత్యేవ యతిర్విముక్తః॥

నదీప్రవాహములన్నియు సముద్రములో కలిసిపోయినటుల శబ్దస్పర్శాదులు, ఆహారపానీయాది విషయములన్నియు ఇతరులచే ప్రేరితములై యెవనియందు ప్రవేశించి స్వరూపలయము పొందుచున్నవో, పరిపూర్ణతత్త్వస్వరూపుఁడగుటచే భావవికారమును పుట్టింపనేరకయే పోవుచున్నవో అట్టి యతీశ్వరుఁడు ముక్తుఁడగుచున్నాఁడు. (వివేకచూడామణి 442 శ్లో.)

వివ॥ సమస్త నదులనుండి జలము రావలెననికాని, రాఁగూడదనికాని సముద్రము కోరుటలేదు. ఆజలమువచ్చిచేరక ముందెట్టి స్థితియందుండెనో వచ్చినపిమ్మట అదేస్థితియందుండును. నదులయందలిజలము సముద్రమునఁ గలియుటచే అంతకుముందా జలమునకుండిన గుణములు, నామరూపములుపోయి అంతయు సముద్రరూపమే యగుచున్నది. కాని యీసముద్రమునందెట్టి మార్పులును కలుగుటలేదు. అట్లే జ్ఞాని కోరకున్నను అన్నపానములు, వస్త్రమాల్యములు మొదలైన కొన్నివిషయములు వచ్చిచేరుచున్నవి. కాని అవిషయములవలన అతనియందెట్టి భావవికారములు కలుగవు. అట్టి యోగీశ్వరుఁడు శాంతిపొందును. కోరికలుగలవాడు పొందజాలడు.

శ్లో॥ కాంతాకటాక్ష విశిఖా నఖనంతి యస్య
చిత్తం న నిర్దహతి కోపకృశాను తాపః
కర్షంతి భూరివిషయాశ్చ న లోభపాశై
ర్లోకత్రయం జయతి కృత్స్నమిదం సధీరః॥

ఎవ్వని మనస్సును స్త్రీల కటాక్షములనెడు బాణములు త్రవ్వజాలవో కోపాగ్నియొక్క వేడిమి దహింపఁ జాలదో, అనేక విషయములు ఆశాపాశములచేత ఆకర్షింపఁజాలవో అట్టి పండితుఁడు మూఁడులోకములను సంపూర్ణముగ జయించుచున్నాఁడు. (శ్రీభర్తృహరి. నీతి. 75 శ్లోకము) ఈ శ్లోకము పైయభిప్రాయమునే వెల్లడించుచున్నది.

మూ॥ విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః॥
నిర్మమో నిరహంకార స్సశాంతి మధిగచ్ఛతి॥ 71.

తా॥ ఏపురుషుఁడైతే కోరికల నన్నిఁటిని వదలివేసి నాది. నేను అను భావములు లేక ఆశారహితుఁడై దేహధారణార్థము ఆహారాది విషయములను లభించిన మాత్రము భుజించుచున్నాఁడో అతడు శాంతి పొందుచున్నాఁడు.

మూ॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాస్యామంత కాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి॥ 72.

తా॥ అర్జునా! (పూర్వోక్త శ్లోకములలోఁజెప్పఁబడిన) యీస్థితి పరబ్రహ్మ తత్త్వమునకు సంబంధించినది. దీనిని ప్రాపించిన యోగి విమనస్కుఁడు కాఁడు అవసాన సమయమున నైతము ఈ స్థితియందే యుండిన యతీశ్వరుఁడు బ్రహ్మానంద రూపమైన మోక్షమును పొందును.

శ్లో॥ సంశాంత సర్వసంకల్పా యా శిలావదవస్థితిః।
జాగ్రన్నిద్రా వినిర్ముక్తా సాస్వరూపస్థితిః పరా॥

సర్వసంకల్పములు లెస్సగ శాంతించినట్టియు, ఎఱుక మఱపుల నతిక్రమించినట్టియు, ఱాయివలె నిశ్చలముగ నుండునట్టియు స్థితి యేదికలదో అదిశ్రేష్ఠమైన బ్రహ్మ స్వరూపమునకు సంబంధించినది.

(శత 4/15) (మైత్రేయోపనిషత్తు 2 అ. 30 శ్లో)

శ్లో॥ ఏషా బ్రాహ్మీ స్థితిః స్వచ్ఛా నిష్కామా విగతామయా।
ఆదాయ విహరన్నేవం సంకటేషు న ముహ్యతి॥

ఈ స్థితి పరబ్రహ్మ తత్త్వమునకు సంబంధించినది. పరిశుద్ధమైనది. కోరికలు లేనిది ఆధివ్యాధులు లేనిది. ఈ స్థితిని పొంది యిట్లే విహరించు చుండు యోగీశ్వరుఁడు సంకటసమయములయందు మోహితుఁడుకాఁడు.

(మహోపనిషత్తు 6-73)

"దేహే జ్ఞానేన దీపితే బుద్ధి రఖండ రూపా యదా భవతి, తదా విద్వాన్ బ్రహ్మజ్ఞానాగ్నినా కర్మబంధం నిర్దహేత్" దేహము జ్ఞానముచే ఎప్పుడు వెలిఁగింపబడుచున్నదో, బుద్ధి దేశ కాలాది పరిచ్ఛేద రహిత స్వరూపము గలదిగ ఎప్పుడగుచున్నదో అప్పుడే విద్వాంసుఁడు బ్రహ్మజ్ఞానమను అగ్నిచే జన్మకారణమైన కర్మబంధమును దహించు చున్నాఁడు.

(పైంగలోపనిషత్తు 4 అధ్యా. 11 శ్లో॥)

ఇది శ్రీ మహాభారతము. భీష్మపర్వములో సాంఖ్యయోగమను ఇరువది యాఱవ అధ్యాయము.

ఓం. తత్. సత్.



# శ త ప త్ర ము

# 92



## శ్రీ మహాభారతము భీష్మపర్వము 27 అధ్యాయము.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు:—

మూ॥ జ్యాయసీచేత్ కర్మణస్తే మతాబుద్ధిర్జనార్దన।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ॥ 1.

తా॥ ఓ కేశవా! జనార్దనా! కర్మయోగమున కంటె బుద్ధియోగము శ్రేష్ఠముగ నీకుఁదోఁచిన యెడల భయంకరమైన కర్మయందు నన్నేందులకు నియోగించుచున్నాఁడవు?

వివ॥ బాహ్యేంద్రియములచేఁ జేయఁబడు కార్యమునకు సామాన్యముగ కర్మయనిపేరు. దీనియందు కొన్ని కాయక్లేశములు, ఉపద్రవములు కలుగుచుండు ననుట నిజమే. యోగవిద్యలో యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, కర్మలోఁ జేరినవని మనకుఁ దెలియును. ఈకర్మలో పొరపడిన వారికి ఉన్మాదము, రోగములు, ప్రాణహాని మొదలైనవి సంభవించుట అందందుఁ జూచియున్నారము. మఱియు

శ్లో॥ కర్మణాబధ్యతే జంతుర్విద్యయాచ విముచ్యతే।
తస్మాత్కర్మ నకుర్వంతి యతయః పారదర్శినః॥

జీవి కర్మచే బద్ధమగుచున్నది. విద్యచే ముక్తినొందుచున్నది. (విదజ్ఞానే) అందువలన పరమాత్మ తత్త్వమును గాంచిన యతీశ్వరులు కర్మచేయరు. (సన్న్యాసోపనిషత్తు 2-98) ఇంకను వివేకచూడామణి 10-11 శ్లోకములలోను ఇదేభావము వెల్లడింపఁబడినది. ఈగీతాగ్రంధములో సైతము సాంఖ్యయోగము 49 శ్లోకములో బుద్ధియోగమునకంటే కర్మయోగము మేలైనది

కాదని చెప్పఁబడినది. ఇట్లుండగాఁ భయంకరము, స్వల్పప్రయోజనకరము నైన కర్మయందు నన్ను నియోగింపనేలయని శిష్యుఁ డడుగుచున్నాడు.

మూ॥ వ్యామిశ్రేణైవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్॥ 2.

తా॥ (విశేషేణ ఆసమంతాత్ మిశ్రః వ్యామిశ్రః ఏతేన ఇవ వ్యామిశ్రేణేవ.) యుక్తివాదము వంటి వాక్యముచేత నాబుద్ధిని మోహింపఁజేయు వానివలె నున్నాఁడవు. దేనిచే నేను మోక్షముఁ జెందగలనో ఆవాక్యము నొక్కదాని నిశ్చయించి చెప్పుము.

వివ॥ కడచిన అధ్యాయములో కర్మయోగము, బుద్ధియోగము రెండు వర్ణింపఁ బడినవి. యోగరహస్యమును గుర్తింపని వారికీరెండు యోగములు పరస్పర విరుద్ధములుగఁ గనఁబడును. అందేది యనుష్ఠాన యోగ్యమో తెలియక మోహితులగుచున్నారు. అందువలన ప్రస్తుత కర్తవ్యాంశమేదో దానినే చెప్పుమని శిష్యుఁడడుగుచున్నాఁడు.

శ్రీభగవానుఁడు చెప్పుచున్నాఁడు:—

మూ॥ లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురాప్రోక్తా మయానఘ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥ 3.

ఓ పాపరహితుఁడా! ఈ లోకములో బ్రహ్మనిష్ఠ రెండు విధములు. జ్ఞానయోగముతో సాంఖ్యులకు, కర్మయోగముతో యోగులకు పూర్వము నాచే లెస్సగఁ జెప్పఁ బడినది.

వివ॥ పరబ్రహ్మ తత్త్వ మిట్టిదని బుద్ధిచే విచారించి తెలిసికొని స్వస్వరూపమును బొంది దివ్యసుఖము ననుభవించువారు సాంఖ్యులు. శరీరావయవములచే క్రియారూపమైన సాధనసేసి మానసేంద్రియముల నిగ్రహించి స్వాధీనము గావించుకొని నియతమైన సత్పథమున నడిపింపఁ గలిగినవారు కర్మయోగులనియు, యోగులనియు, పిలువఁబడుదురు. ఈ యుభయుల పద్ధతులు బ్రహ్మనిష్ఠలోఁ జేరినవే. ఇందులో ఏదైన నొక పద్ధతి చేసనంత మాత్రమున బ్రహ్మనిష్ఠ పూర్తియగు ననుకొనుట పొరపాటు.

శ్లో॥ ద్వౌ క్రమౌ చిత్తనాశస్య యోగో జ్ఞానం మునీశ్వర।
యోగస్తద్వృత్తిరోధోహి జ్ఞానం సమ్యగవేక్షణమ్।

తస్మిన్ నిరోధితేనూన ముపశాంతం మనోభవేత్।
మనస్స్పందోప శాంత్యాయం సంసారః ప్రవిలీయతే॥

చిత్తమును క్షీణింపఁజేయుటకు యోగమని, జ్ఞానమని రెండు పద్ధతు లున్నవి. ఓ మునీశ్వరా! చిత్తవృత్తులను నివారించునది యోగము. స్వస్వ రూపమును లెస్సగఁ గాంచునది జ్ఞానము. ఆ చిత్తవృత్తి నిగ్రహింపఁ బడి నప్పుడు మనస్సు శాంతించుచున్నది. మనస్సు చలన ముడుగుటచే ఆ సంసృతి బంధము లయించి పోవుచున్నది. ఇది నిజము. (శాండిల్యోపనిషత్తు 1 అధ్యా. 24-25 శ్లోకము)

శ్లో॥ శిఖాజ్ఞాన మయీవృత్తి ర్యమాద్యష్టాంగ సాధనైః।
జ్ఞానయోగః కర్మయోగ ఇతి యోగో ద్విధా మతః॥

యమము. నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము ధారణ, ధ్యానము, సమాధియని అష్టాంగసాధనములతో వ్యాప్తమైన జ్ఞాన వృత్తి యోగమని చెప్పఁబడును. ఈ యోగము కర్మయోగమనియు, జ్ఞాన యోగమనియు, రెండు విధములు. (త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు 23 శ్లోకము)

శ్లో॥ క్రియాయోగ మథేదానీం శృణుబ్రాహ్మణ సత్తమ।
అవ్యాకులస్య చిత్తస్య బంధనం విషయేక్వచిత్॥

ఓ బ్రాహ్మణోత్తమా! వినుము. చిత్తమును చెదరనీయక ఒకానొక విషయమునందే (పరబ్రహ్మ తత్త్వమునందే) నిలుపుట కర్మయోగము.

(త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు 24 శ్లో)

శ్లో॥ యత్సంయోగో ద్విజశ్రేష్ఠ సచ ద్వైవిధ్య మశ్నుతే।
కర్మ కర్తవ్య మిత్యేవ విహితేష్వేవ కర్మసు॥

ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! శాస్త్రవిహితములైన కర్మలయందు (యోగపద్ధతులయందు) ఇది చెయఁదగిన కర్మయని లెస్సగ అనుష్ఠింపఁబడిన యోగమేది కలదో అదియే రెండు విధముల యోగఫలమును పొందుచున్నది.

(త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు 25 శ్లో)

శ్లో॥ బంధనం మనసోనిత్యం కర్మయోగ స్సఉచ్యతే।
యతచిత్తస్య సతత మర్థే శ్రేయసి బంధనమ్।

జ్ఞానయోగ స్స విజ్ఞేయః సర్వసిద్ధి కరశ్శివః।
యస్యోక్త లక్షణే యోగే ద్వివిధేఽప్యవ్యయం మనః॥

మనస్సును బాహ్యవిషయములకుఁ బోనీక నిగ్రహించుట కర్మయోగ మనఁబడును, నిగ్రహింపఁబడిన మనస్సును మోక్షరూపమైన పరమాత్మ యందు నిలుపుట జ్ఞానయోగమని తెలియవలయును. ఈ జ్ఞానయోగమే సర్వవిభూతుల నొసగుఁచున్నది. శుభస్వరూపమైనది. ఇట్లు చెప్పఁబడిన రెండువిధముల లక్షణముగల యోగమునందు ఎవని మనస్సు చెడకుండు నో (వాడు త్వరగా మోక్షమును బొందుచున్నాడు)

(త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు 26-27 శ్లోకము.)

కర్మయోగముచే మనస్సును నిగ్రహింపకున్న జ్ఞానయోగము చేయు టకు వీలుపడదు. జ్ఞానయోగముతో గూడిన తత్త్వదృష్టి లేకున్నచో కర్మ యోగమునందు మనస్సు నిగ్రహింపఁబడదు. కాఁబట్టి రెండును పరస్పర విరుద్ధములు కావు.

మూ॥ నకర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।
నచ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥ 4.

తా॥ కర్మయోగమునకు ప్రయత్నము చేయక పోవుటవలన (మాన సేంద్రియములు నిగ్రహింపఁ బడవు విషయవాసన నశింపదు అంతఃకర ణము నిర్మలముకాదు. సుకృత దుష్కృత రూపమైన జన్మ కర్మ క్షీణింప దు) పురుషుఁడు కర్మరాహిత్య ఫలమును అనుభవింపఁ జాలఁడు. కేవ లము కర్మ వదలు కొన్నందువల్లనే నిత్యశుభప్రాప్తి పొందఁజాలఁడు.

శ్లో॥ కర్మత్యాగా న్నసన్న్యాసో నప్రేషోచ్చారణేనతు।
సంధౌ జీవాత్మనో రైక్యం సన్న్యాసః పరికీర్తితః॥

కర్మ (అభ్యాసయోగము) చేయకపోవుటవలనఁగాని, లౌకికవిషయ సంగతి సంభాషణములు లేకుండుటవలనఁగాని సన్న్యాసము సిద్ధింపదు. సంధిస్థానమున జీవాత్మ పరమాత్మలయొక్క ఏకీభావమే సన్న్యాస మనఁ బడును. (మైత్రేయోపనిషత్తు 2 అధ్యా 17 శ్లో.) భగవత్తత్త్వ ప్రసన్నత ముఖ్యమని భావము.

మూ॥ నహికశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః॥ 5.

తా॥ ఒకప్పుడైనను క్షణకాలమేని కర్మచేయనివాఁడు ఎవ్వఁడును ఉండడుకదా? సహజముగ ప్రకృతివలనఁ గలిగిన సత్త్వాదిగుణములచే ప్రతిమనుష్యుఁడు తనయత్నము లేకయే కర్మ చేయింపఁబడుచున్నాఁడు. (ఈశ్లోకము భాగవ 6 స్కం 1 అ.లో కొంచెము వర్ణభేదముతోనున్నది.)

వివ॥ దేహమున్నంతసేపు అహారపానీయములు స్వీకరింపవలయును ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు జరుగుచుండవలయును. మలమూత్రములను వెడలింపవలయును. శరీరమునందలి పంచవాయువులచే ఆయాకార్యములు చేయుచుండవలయును. రక్తకోశమునందును, అంత్రకోశమునందును ఉండునాడులచేతను, కండరములచేతను విధి విరామములేక పనిచేయుచుండవలయును. ఈగలు, నల్లులు, చీమలు మొదలైన భూతములవలని బాధలు తొలఁగించుకొనవలయును ఈకర్మలలో ఒక్కటియు మానుకొనుటకు వీలు లేదు. "ప్రకృతిజైర్గుణైః" అనుటవలన ప్రకృతికి లోఁబడిన పామరులకు మాత్రమే యీశ్లోకము అన్వయించునని కొందఱియూహ. పైఁజెప్పఁబడిన కార్యములు ప్రకృతిసిద్ధమైన దేహధర్మములోఁ జేరినవి. కనుక దేహముండినంతవఱకు పండితులు, పామరులు, ఎల్లరుఁ జేయవలసినదే. అందువల్లనే "సర్వః" అని చెప్పఁబడినదికాని ఆకర్మలనే పామరులు అహంభావముతోఁ జేయుదురు, జ్ఞానులు నిరహంకారులై చేయుదురు.

మూ॥ కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే॥ 6.

తా॥ ఎవఁడైతే కర్మేంద్రియములైన వాక్పాణి పాదపాయు గుహ్యేంద్రియములను విషయములవెంటఁ బోనీక బిగబట్టుకొని మనస్సుచేత ఇంద్రియార్థములైన విషయభోగాదులను చింతించుచున్నాఁడో అట్టివాఁడు సత్స్వరూపమైన పరమాత్మ తత్త్వమును జింతింపనేరక లోకమును నమ్మించుటకై అంతస్సార శూన్యమైన వట్టి యాచారముమాత్రమే పెట్టుకొనిన మూఢాత్ముఁడు దొంగసన్న్యాసియని చెప్పఁబడును. ఇట్టి మిథ్యాచారమువలన వానికేమి ప్రయోజనముండునని కొందఱు ప్రశ్నింతురు. ఇందుకు సమాధా

నము:- ఆత్మశుద్ధి యున్నను, లేకపోయినను వైరాగ్యవేషములు ధరించుట వల్లను, గ్రంథములు చదువుకొని అధ్యాత్మిక సభలలో ఉపన్యాసము లిచ్చుట వల్లను, మన కలియుగ వేదాంత స్వాములకు కలుగు భౌతిక లాభములు గౌరవ మర్యాదలు చూచుచున్నాము. దీనినిగుఱించి యింకను:

శ్లో॥ అయాచితం యథాలాభం భోజనాచ్ఛాదనం భవేత్।
పరేచ్ఛయా చ దిగ్వాసా స్స్నానం కుర్యాత్పరేచ్ఛయా॥
అలాభే నవిషాదీ స్యా ల్లాభేచైవ నహర్షయేత్।
అభిపూజిత లాభైస్తు యతిర్ముక్తోఽపి బధ్యతే॥

దిగంబరుఁడైన సన్న్యాసి యెవరినేదియు యాచింపక పరులెవరైనను వారివారి యిష్టానుసారము తెచ్చిపెట్టుటచే లభించు అన్నము, వస్త్రము లభించినంతమాత్రమే ఉపయోగించుకొనవలయును. స్నానము పరుల ప్రయత్నముతోనే చేయవలయును. (ఈశ్లోకములో "పరేచ్ఛయా" అనఁగా మోక్షాపేక్షచేత ననియు అర్థము చేసికొనవచ్చును ) లాభము లేనప్పుడు వ్యసనపడరాదు. లాభము వచ్చినప్పుడు సంతోషపడరాదు. కర్మబంధములనుండి విడువఁబడిన యతీశ్వరుఁడుకూడ గొప్ప పూజాలాభములచే బద్ధుఁడగుచున్నాఁడు. (నారద పరివ్రాజకోపనిషత్తు 5 ఉపదేశః 4-7శ్లో)

శ్లో॥ వమనాహారవద్యస్య భాతి సర్వేష ణాదిషు।
తస్యాధికార స్సన్న్యాసే త్యక్త దేహాభిమానినః॥
యదామనసి వైరాగ్యం జాతం సర్వేషు వస్తుషు।
తదైవ న్న్యసే ద్విద్వా నన్యథా పతితో భవేత్॥
ద్రవ్యార్థమన్నవస్త్రార్థం యః ప్రతిష్ఠార్థ మేవవా।
సన్న్యసే దుభయభ్రష్ట స్సముక్తిం నాప్తు మర్హతి॥

ధనము, భార్యలు, పుత్రులు మొదలైన సర్వాభీష్టములయందు కడుపులోనుండి వెడలగ్రక్కఁబడిన అన్నమువలె ఎవనిమనస్సునకు స్ఫురించునో, ఎవనికైతే దేహమునందలి అభిమానము వదలుకొనఁబడియుండునో అట్టివానికి సన్న్యాసమునందు అధికారము కలుగును. భోగ్యములైన సర్వవస్తువులపైన తన మనస్సులో అసక్తి యెప్పుడు లేకపోవుచున్నదో అప్పుడే విద్వాంసుఁడు సన్న్యసింపవచ్చును. వైరాగ్యములేకయే సన్న్యసించువాఁడు

భ్రష్టుఁడగును. ద్రవ్యము సంపాదించుటకు, అన్నవస్త్రములకొఱకు, ఘనత కొఱకుమాత్రమే యెవఁడు సన్న్యసించుచున్నాఁడో వాడు ప్రవృత్తి నివృత్తు లకు రెంటికి తప్పిపోవును. మోక్షముఁజెందుటకుఁ బనికిరాదు. (మైత్రియో పనిషత్తు. 2 అధ్యా 18-19-20 శ్లోకములు.) ఇట్లు పెద్దలు చెప్పియుండుటచే మిథ్యాచారుల గుఱించి గీతలో కొంచెము ప్రస్తావన చేయవలసివచ్చినది.

మూ॥ యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున।
కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్స విశిష్యతే ॥ 7

తా॥ అర్జునా! స్వల్పసౌఖ్యప్రదములైన విషయములయందు (భోగ్య వస్తువులయందు) అభిలాష మానుకొని, శ్రోత్రాది జ్ఞానేంద్రియములను మన స్సుచే నిగ్రహించి కర్మేంద్రియములైన కర చరణాదులతో, ప్రాణాయామా దులతోఁగూడిన అభ్యాస యోగమును ఆరంభించి యెవఁడు చేయుచున్నాడో వాఁడు ఉత్తమ పురుషుడగును.

వివ॥ కర్మయోగమనఁగా ధానము, క్రతువు మొదలైన శ్రౌతకర్మలఁ జేయుటయని కొందఱు దలఁతురు. స్వర్గాదిభోగములఁగోరినవారు దేవతల ప్రీతికొఱకు చేయునవి శ్రౌతకర్మలు. దేవతలనెడువారు తనకంటె వేఱుగ నెచ్చటనో యుందురనియు, వారు అనుగ్రహించి సుఖములనో, ఐశ్వర్యము లనో యిత్తురనియు ఈకర్మలయందు భావము వ్యక్తమగును. ఇందు స్వస్వ రూపానుభవము కలుగుననికాని, మోక్షము లభించుననికాని, చెప్పలేము. మఱియు:

శ్లో॥ తావన్మామర్చయేద్దేవం ప్రతిమాదౌ స్వకర్మభిః
యావత్సర్వేషు భూతేషు స్థితం చాత్మని నస్మరేత్॥

సమస్త భూతములయందు పరమాత్మ యున్నాఁడనుజ్ఞప్తి యెందాఁకకలుగదో అందాఁక వారివారికి నియతములైన క్రియాభేదములతో విగ్రహాదులయందు దేవపూజసేయవచ్చును. (అధ్యా ఉత్త 7స. 76 శ్లో)

శ్లో॥ అనంత కర్మశౌచంచ జపోయజ్ఞ స్తథైవచ।
తీర్థయాత్రాభిగమనం యావత్తత్త్వం న విందతి॥

ఎడతగని కర్మ, శౌచము, జపము, యజ్ఞము, మఱియు ఇదేప్రకారముగా తీర్థయాత్రలకుఁ బోవుచుండుటయు (ఇట్టివి) భగవత్తత్త్వము లభింపనంతవరకు ఉండవచ్చును. (పైంగలోపనిషత్తు 4 అ. 18 శ్లో) ఇందువలన ఈయధ్యాయము మూఁడవ శ్లోకములోఁ జెప్పఁబడిన బ్రహ్మనిష్ఠలో ఒకయంశమైన కర్మయోగమునకును, శ్రౌతకర్మకును సంబంధము లేదని తెలియుచున్నది. మానసేంద్రియములను అంతర్వీథిలో భగవత్తత్త్వమునందు నిలుపుటయు, కర చరణాదులతో పనిచేయుటయు అధ్యాత్మిక యుద్ధమునకుఁ బనికివచ్చునేకాని భౌతిక యుద్ధమునకుఁ బనికిరావని యెట్టిమూఢుఁడైనఁ జెప్పఁగలఁడు. కనుక సామాన్య క్షత్రియ కులోచితమైన యుద్ధకర్మయనియుఁ జెప్పరాదు.

మూ॥ నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయోహ్యకర్మణః।
శరీర యాత్రాపిచ తే న ప్రసిద్ధ్యే దకర్మణః॥ 8.

తా॥ అర్జునా! నీవు ఇంద్రియములను లెస్సగ నిలుపఁదగిన అభ్యాసయోగము చేయుము. అభ్యాసములేక వట్టి యుక్తులతో పరమాత్మ యిట్టిదని తెలిసికొనుటకంటె అభ్యాసయోగమే మేలైనది. అభ్యాసము లేకపోవుటవలన నీకు శరీరప్రాప్తికూడ మిగుల లాభములేనిదగును. అభ్యాసము చేయనివానికి మానసేంద్రియములు వశపడవు. అవి వశపడక పోయినప్పుడు బుద్ధి నిలుకడ యుండదు. బుద్ధి స్థిరపడనివానికి ఆత్మ సాక్షాత్కారము కలుగదు. అది లేకపోయినప్పుడు మోక్షములేదు. అనేక జన్మార్జిత సుకృతకర్మ ఫలముచే పొందఁబడిన మనుష్యజన్మము నిష్ఫలమగును. కనుక అభ్యాసయోగము మానరాదని గురువు చెప్పుచున్నాడు.

మూ॥ యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మ కౌంతేయ ముక్త సంగ స్సమాచర॥ 9.

తా॥ ("యజదేవపూజాదౌ" అను సూత్రమువలన సర్వభూతాత్మయైన భగవత్తత్త్వమును మనోవీధియందు పూజించుటే యజ్ఞమనఁబడును. అదిగాక స్వాయంభువ మనుకాలములో పరమేశ్వరావతారము యజ్ఞనామముతో బిలువబడినట్లు భాగవతము అష్టమస్కంధము ప్రథమాధ్యాయము 6 శ్లోకములోను, 19 శ్లోకములోను సూచింపఁబడినది.) అర్జునా! పరమాత్మకొఱకుఁ

జేయు పూజా కార్యమునకంటె వేఱైన కార్యములయందు లోకము కర్మచే బంధింపఁబడుచున్నది. నీవు విషయవాసన లేనివాఁడవై ఆపరమాత్మ తత్త్వముకొఱకే అభ్యాసయోగము ఆచరింపుము. (ఆత్మప్రసన్నతయే కర్మయోగమునకు పరమావధియని యిందువలనఁ దెలియుచున్నది )

మూ॥ సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వమేషవోఽస్త్విష్టకామధుక్॥ 10.

తా॥ సృష్టికర్త పూర్వము యజ్ఞముతోఁ గూడ ప్రజలను సృజించి మీరీయజ్ఞముచేత ఉత్పత్తిచేయుడు. ఈ యజ్ఞము మీకోరికల పూర్తిచేయునది యగును అని చెప్పెను.

సృష్టికర్త యనఁగా బ్రహ్మదేవుఁడు ఒకప్పుడాయన మఱియొక లోకమునుండ భూమికి దిగివచ్చెను. మనుష్యులను, జంతువులను, చరాచర వస్తువుల నన్నిఁటిని పుట్టించెను. అట్లు పుట్టిన మనుష్యులలో మూఁడు కులముల వారికి కొన్ని రకముల యజ్ఞములు చేయుటకు నేర్పెను. మీరలిట్లు యజ్ఞము చేయుచుండ ప్రజలు వృద్ధి యగుచుందురు. మీ కోరికలు పూర్తి చేయఁబడుచుండును. అని చెప్పిపోయెను. (ఇది వైదికస్వాములు చేయు అనువాదము.)

ఇతర దేశములలో ప్రజలీయజ్ఞములు జరుపుచుండినట్లు వినలేదు. మన భారతదేశములో నైనను పశుపక్ష్యాది జంతువు లెప్పుడును చేయుట లేదు. మనుష్యులలోను పెక్కుతెగలవారు యజ్ఞము పేరేయెఱుగరు. అగ్రజాతి స్వాములలో యజ్ఞమను పేరు మాత్రము చెవులలోఁ బడినవారు చాల మంది కనఁబడు చున్నారు. దాని క్రమమెఱిఁగి చేయఁగల వారినిగాని, చేసిన వారినిగాని నేనెచ్చటను జూడలేదు, ఉత్తర హిందూస్థానమున నొకప్పుడు ఏకొందఱో యజ్ఞములు చేసి యుండినట్లు పౌరాణికులు చెప్పుదురు. అగ్నికుండములలో కట్టెలు, నేయి మొదలైన వస్తువులు వేయుచు వైదిక స్వాములు దేవతలను స్తోత్రము చేయుట, అందు పశు పక్ష్యాది జంతువులే కాక కొన్నిచోట్ల మనుష్యులు కూడ ఆ యజ్ఞములలో బలి యొసఁగఁబడుట అందువలన ఇంకొక లోకము నుండి "దేవతలు" అనే వారు దిగివచ్చి మన వైదిక స్వాముల కోరికల పూర్తిచేసి పోవుట. ఇట్లు పౌరాణిక స్వాములు గొప్పగ వర్ణించి చెప్పుచుందురు.

పులిపిల్ల మాతృగర్భము నుండి బయట వచ్చునప్పుడు నఖదంష్ట్రాదులతోఁ గూడుకొని వచ్చుచున్నది. ఏయుగములో, ఏదేశములో పుట్టినను పులిపిల్లలు ఇట్లే పుట్టుచున్నవి కాని మఱియొక మార్పుతో పుట్టుటలేదు. బాతులు, చేపలు మున్నగునవి పుట్టునప్పుడే జలములోఁ జరించు విద్యతోఁగూడి పుట్టుచున్నవి. వానికింకొకరు నేర్పవలసిన పనిలేదు. ఇట్లే సృష్టిలో సర్వ జంతువులకు సహజముగ వచ్చిన విద్యలు సర్వకాలముల యందును ఏకరీతి ప్రకాశించియుండును. భౌతిక యజ్ఞములు ప్రజలతోఁ గూడ విధినియుక్తములై పుట్టిన వనుమాట నిజమేయైన యెడల ఇంకొకరివలనఁ దెలిసికొన వలసిన అవసరము లేకయే సర్వప్రజలకు సర్వదా అనుభవములో నుండవలయును. ఈ యజ్ఞముల చేతనే కోరికలు పూర్తిచేయఁ బడుచుండవలయును. యజ్ఞముచేఁగాక మఱియొక విధముగా ప్రజలయందు ఉత్పత్తి లేకుండవలయును. అదిగాక ఈయజ్ఞములు ఉపనిషద్గ్రంథములలో పెక్కు చోట్ల నిరసింపఁ బడినవి. ఇట్టి యజ్ఞములు ప్రజలతోఁగూడ పుట్టి వచ్చినవనిన ఆధ్యాత్మికులు ఒప్పుకొనరు. పురాకృత కర్మఫలము విధియనబడును. జీవుల యుత్పత్తి స్థితి లయములకు కర్మఫలమే కారణము. అంచు సాధు జంతువునకుఁ గాని, దుష్టజంతువునకుఁ గాని, మఱిదేనికిఁ గాని తనలోఁ దనకు అంతరాత్మయందు సద్భావము కలిగియుండును. అంతరాత్మను సన్మాన భావముతోఁ జూచుటే ఆత్మపూజ యనియు, ఆత్మయజ్ఞమనియుఁ జెప్పఁబడును. ఇది జ్ఞానముతోఁ గూడినది కనుక జ్ఞానయజ్ఞమనియుఁ జెప్పబడును. ఈయజ్ఞముచేతనె జీవులు క్షేమాభివృద్ధిఁ గాంచుచున్నవి కోరికలు పూరింపఁబడుచున్నవి. ఇదిసర్వజీవులకు పుట్టుకతో వచ్చిన యజ్ఞము దీనిని జేయుటకు లోలోపల తమవిధి, తమ్ము సర్వదా ప్రేరేపించుచున్నది.

మూ॥ దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః।
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ॥ 11.

తా॥ ఈయజ్ఞయచేత మీరు దేవతలను భావింపుడు. ఆదేవతలు మిమ్ము భావింతురు. మీరు, వారు అన్యోన్యము భావించువారై శ్రేష్ఠమైన మోక్షమును పొందుదురు.

వివ॥ "దివ్‌క్రీడాదౌ" అను సూత్రమువలన "దేవాః" అను శబ్దమునకు సర్వభూతములయందు క్రీడించువారు, ప్రకాశించువారు అనియర్థము.

రామశబ్దమువలెనని తెలియవలయును సర్వభూతాత్మ యేక వచనముగఁ జెప్పఁబడక యిచ్చట బహువచనముగఁ జెప్పఁబడుటవలన స్వయంప్రకాశ ముచే ఏకమయ్యును శరీరభేదములచే నానారూపములుగఁదోఁచు ప్రత్యగా త్మ స్వరూపులైన దివ్యపురుషులని భావము. అట్టి స్వయం ప్రకాశ స్వరూపు లైన దివ్యపురుషులను మీరు (సామాన్య ప్రజలు) భావింపఁగా వారు మిమ్ము భావింతురు. అన్యోన్య ప్రేమభావములచే మోక్షముఁ జెందవచ్చును. ఇట్లుఁ గాక భౌతిక యజ్ఞములచే ఇంద్రాది దేవతల నారాధించి మోక్షముఁ బొంద వచ్చుననిన అధ్యాత్మికులు ఒప్పుకొనరు.

మూ॥ ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః।
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవసః॥ 12.

తా॥ ఆత్మపూజావిధాన రూపమైన జ్ఞానయజ్ఞముచే సంభావింపఁబడిన దివ్యపురుషులు మీకు అభీష్టములైన భోగములను ఇయ్యఁగలరుకదా? అద వ్యపురుషులచే అనుగ్రహింపఁబడిన (ఇప్పింపఁబడిన) భోగములను దైవార్ప ణ భావములేక అహంభావముతో ఎవ్వఁడు భుజించుచున్నాఁడో వాఁడు దొం గయేయగును పరతత్త్వ నిష్ఠానులైన పెద్దల సేవించు ప్రజలకు భౌతికము గాఁగాని అధ్యాత్మికముగాగాని, లాభముండునని భావము.

శ్లో॥ ప్లవాహ్యేతే అదృఢా యజ్ఞరూపా।
అష్టాదశోక్తమవరం యేషుకర్మ।
ఏతచ్ఛ్రేయో యేఽభి నందంతి మూఢా।
జరామృత్యుం తే పునరేవాపియంతి॥

పదునెనిమిది విధముల తీరుదప్పినకర్మ వేనియందు చెప్పఁబడినదో అట్టి యజ్ఞస్వరూపములన్నియు ఓటిపడవలవంటివికదా! ఇవే మేలైనవని యే మూఢులు మిగుల సంతోషపడుచున్నారో అట్టివారు జరామరణములను మ రల మరల పొందుచున్నారు (ముండకోపనిషత్తు 1 ము. 2ఖం. 7 శ్లో)

"ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం నాన్యచ్ఛ్రేయో వేదయంతే ప్రమూ ఢాః॥ నాకస్యపృష్ఠే తే సుకృతేఽను భూత్వేమం లోకం హీనతరం వా విశంతి"

ఇష్టాపూర్తము కేవలము శ్రేష్ఠమైనదని తలఁచువారు ఇంతకంటె మే లైనది వేఱొకటి లేదని యెఱుకపఱచుకొనుచున్నారు. మిక్కిలి మూఢులైన

అజనులు స్వర్గములో అసుకృత ఫలము ననుభవించినమీఁదట మరల ఈ లోకములోనో, ఇంతకంటె మిగుల హీనమైన యింకొకలోకమునో ప్రవేశించు చున్నారు. (ముండకోపనిషత్తు 1ముం. 2ఖం. 10 శ్లో.)

శ్లో॥ ఏకే త్వాఖిల కర్మాణి సన్న్యస్యోప శమంగతాః
జ్ఞానినో జ్ఞానయజ్ఞేన యజంతి జ్ఞాన విగ్రహమ్॥

అఖండైక స్వరూపమైన నీయందు సమస్త కర్మలను వదలివేసి శాంతి పొందిన జ్ఞానులు జ్ఞానరూపుఁడవైన నిన్ను జ్ఞాన యజ్ఞముచేఁ బూజింతురు. (భాగవత 10స్క. 40 అధ్యా 6 శ్లో.)

అని యిట్లు ఆధ్యాత్మిక గ్రంథములలో వర్ణింఁబడుటచే భగవద్గీతలో ను జ్ఞానయజ్ఞమే వర్ణింపఁబడియుండునని చెప్పవలసియున్నది.

మూ॥ యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వ కిల్బిషైః।
భుంజతే తేత్వఘం పాపా యే పచంత్యాత్మ కారణాత్॥ 13.

తా॥ సర్వ విషయములను, గుణ కర్మాదులను, మానసేంద్రియము లను జ్ఞాన యజ్ఞమునందు వెల్వఁగా సర్వము తానైన భగవతత్త్వమువలని దివ్యసుఖము మిగిలియుండును. అటుల మిగిలియుండు పవిత్రమైన జ్ఞాన యజ్ఞ శిష్టమను బ్రహ్మానందమును అనుభవించు సజ్జనులు సమస్త పాపము లచే విడువబడుచున్నారు. దైవార్పణబుద్ధిలేక పృథగ్భావముతో తమకొఱకుఁ దామే యెవరైతే కర్మఫలమును పక్వముగావించుకొనుచున్నారో అట్టిపాపులు పాపమునే భుజింతురు. వారికి మోక్షములేదు.

శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియై ర్వా।
బుద్ధ్యాత్మనావాను సృత స్వభావాత్।
కరోతి యద్య త్సకలం పరస్మై।
నారాయణాయేతి సమర్పయేత్తత్॥

శరీరముచేత, వాక్కుచేత, మానసేంద్రియములచేత, బుద్ధిచేత ఇన్ని టికి విలక్షణమైన ప్రత్యగాత్మచేత పురుషుఁడు ఏదేది చేయుచున్నాడో అది యంతయు పరతత్త్వానుగత స్వభావమువలన శ్రీమన్నారాయణ పరమాత్మ కొఱకే చేసితినని సమర్పింపవలయును (అర్జునగీత 1 అ. 36 శ్లో)

మూ॥ అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవః।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః॥ 14.
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥ 15.

తా॥ 1. అన్నమువలన భూతములు కలుగుచున్నవి. అన్నము వర్షాధి దేవతయైన పర్జన్యునివలన సంభవించుచున్నది. వర్షాధిదేవత యజ్ఞమువలన కలుగుచున్నది. యజ్ఞము కర్మవలన మిక్కిలిగ ఉద్భవించుచున్నది. కర్మ బ్రహ్మవలన ఉద్భవించుచున్నదని తెలిసికొనుము. బ్రహ్మ అక్షలిత పర మాత్మవలన ఉద్భవించుచున్నవి. అందువలన సర్వమును పొందియుండు బ్రహ్మ యజ్ఞమునందే నియతముగ స్థిరపఱుపఁబడి యుండును.

2 పరమాత్మవలన వేదము పుట్టినది. వేదము వలన శ్రౌత స్మార్తాది కర్మ యుద్భవించినది. శ్రౌతాది కర్మవలన యజ్ఞము ఉద్భవించినది, యజ్ఞ మునందు వేల్వఁబడిన ఆహుతులు సూర్యునకు అందుచున్నవి. సూర్యుని వలన మేఘములు కల్పింపఁబడి వర్షము నిచ్చుచున్నవి ఆ వర్షమువలన ఆహారోత్పత్తి యగుచున్నది. ఆహార రసోపార్జితములైన శుక్ల శోణితముల వలన భూతములు పుట్టుచున్నవి. అందువల్ల సర్వముతోఁ గూడియుండు వేదము కర్మయజ్ఞము నందే సర్వదా ప్రతిష్ఠింపఁబడి యుండును (ఇది వైదిక స్వాముల అనువాదము.)

వేదములు, కర్మ యజ్ఞములు లేని అమెరికా ఖండములో అండీసు పర్వతములయందు ఎడతెగని వర్షధారాపాతము కలిగియున్నది. బ్రహ్మాండ ములో మఱియెచ్చటను జూడబడనంత పొడవు, వెడల్పు, లోతుగల "అమే జాను" నది ఏబుతువులోను వెలితిపడని ప్రవాహము కలిగియున్నది. ఇతర దేశములలో నెచ్చటనులేని యాహారోత్పత్తి ఆదేశవాసులకున్నది. నానా భూత ములు పుట్టుచున్నవి. పెరుగు చున్నవి. భారత దేశములోమాత్ర మ టుల కాదు. తిక్కసోమయాజులవారు వైదిక కర్మయజ్ఞము చేయుటచేతనో, పెద్ది భట్టుగారు విరాటపర్వము చదువుటచేతనో, తోటవెంకన్న పోతురాజుస్వామికి ఘటాభిషేకము చేయుటచేతనో, గొల్ల సుంకన్న గంగప్రార్థన చదువుటచేతనో, మనతాతగారు కడుపునిండ మజ్జిగ పుచ్చుకొని గట్టున త్రేపుట చేతనో, ఇఁక

నెందుచేతనో వర్షము కురియుచున్నది. భూతములు వృద్ధియగుచున్నవి. అని కొందఱు నమ్ముచున్నారు.

శ్లో॥ ఏకస్య వేద్యస్యాజ్ఞానాద్వేదాస్తే బహవోఽభవన్।
సత్యస్యైకస్య రాజేంద్ర సత్యే కశ్చిదవస్థితః॥
ఏవం వేద మవిజ్ఞాయ ప్రాజ్ఞోఽహమితి మన్యతే।
దాన మధ్యయనం యజ్ఞో లోభాదేతత్ప్రవర్తతే॥

ఓ రాజేంద్రా! తెలియఁదగిన వేదము పరమాత్మయొకటే, అది యొకటే సత్యమైనది. దాని నెఱుఁగకపోవుటవలన అవేదము లనేకములు పుట్టియున్నవి. సత్యమైన వేదమునందు నిలుచువాఁడు ఒకానొకఁడు మాత్రమే. ఈవిధముగా నిజమైన వేదమును తెలిసికొనక మనుష్యుఁడు నేనే లెస్సగఁ దెలిసినవాఁడనని తలఁచుచున్నాఁడు. దానము, గ్రంథపఠనము, యజ్ఞము ఇట్టివంతయు, లోభగుణమువల్లనే ప్రవర్తిల్లుచున్నది (సనత్సుజాతీయము 2 అ. 42, 43 శ్లో) ఇట్లు చెప్పుటవలన ఆత్మయజ్ఞమే మోక్షకారణమని తెలిచున్నది.

3. అక్షరము అనఁగా అస్ఖలితము, నిర్గుణము, నిరాకారము, నిష్కళము నైన పరతత్త్వము. బ్రహ్మ అనఁగా పరతత్త్వము నందు ప్రకృతి చేరుటచే ఏర్పడు బృహత్త్వము తాను మఱి దేనిచేతను వృద్ధినొందింపఁబడక యిఁక దేనినైన తాను వృద్ధి నొందింపఁ జాలియుండును. అందుచేత బ్రహ్మ యని పేరు కలిగినది. (బృహవృద్ధౌ) రూపనామ క్రియలుగల వస్తువు లన్నిటిలో పూజనీయమైనది. అందువలన మహత్తత్త్వమని పేరు కలిగినది. (మహపూజాయామ్) వృద్ధి స్వరూపమైన వృత్తియుండుటచే సాత్త్వికాది గుణములు గలిగి ప్రవృత్తిలోఁ జేరుచున్నది. దీని వలన కర్తృత్వ, భోక్తృత్వ, మంతృత్వాది వృత్తులన్నియుఁ గలుగుచున్నవి. తరువాత తాత్కాలికశుభము కొఱకుఁ జేయ బడు భౌతికర్మలు, నిత్యశుభము కొఱకుఁ జేయఁబడు ఆధ్యాత్మిక కర్మలు (యమ నియమాసన ప్రాణాయామము లనెడు యోగాంగములు) అన్నియు బృహత్తత్త్వము వల్లనే కలుగుచున్నవి. ఇట్లుచేయఁబడు కర్మయోగమువల్ల దుర్గుణములు నశించి సుగుణములు ఉద్ధరింపఁబడుటచే ఆత్మపూజారూపమైన జ్ఞానయజ్ఞము సిద్ధాంతమగుచున్నది. ఈ యజ్ఞమువలన

నాకంటెనన్యము లేదను ప్రబోధము కలుగుచున్నది. ఆనందరసవృష్టిచే అంతఃకరణమును తడిపివేయు చున్నది. కనుక ఆధ్యాత్మిక పరిభాషలో ప్రబోధమును వర్షాధి దేవత యని ఒప్పుకొన వచ్చును. (వృషుసేచనే) ఆనంద వృష్టివలన జీవులు నిత్య శుభప్రాప్తిని పొందుచున్నవి. "అదభక్షణే" అను సూత్రమువలన యోగీశ్వరులు భుజించు ఆత్మరతి సుఖము అన్నమనఁబడును. "భూప్రాప్తౌ" అను సూత్రమువలన శుభప్రాప్తి కలిగిన జీవులు భూతములనఁబడును. అందువలన సర్వమును కూడియుండు బ్రహ్మ జ్ఞాన యజ్ఞమునందే నియతముగఁ బ్రతిష్ఠింపఁ బడియుండును. (అని యోగీశ్వరుల మతము)

మూ॥ ఏవం ప్రవర్తితం చక్రం నాను వర్తయతీహ యః।
అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి॥ 16.

తా॥ "చకతి తర్పయతి యోగిన ఇతి చక్రః, చకతృప్తౌ" యోగులను తృప్తిపఱచునది చక్రము. అర్జునా! యిట్లు ప్రవర్తించు వృత్తమును ఈ లోకములో ఎవఁడైతే అనుసరింపఁడో అట్టివాఁడు పాపపూరితమైన ఆయుస్సుగలవాఁడు. ఇంద్రియములచేత అంతటను క్రీడించువాఁడు (అంతేకాక) ఇట్టివాఁడు వ్యర్థముగ బ్రతుకుచున్నాడు.

మూ॥ యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవచ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే॥ 17.

తా॥ ఏమానవుఁడైతే ఆత్మయందే క్రీడించువాఁడు, ఆత్మయందే ప్రీతి జెందువాఁడు, ఆత్మయందే సంతోషించుఁవాడు అగునో అట్టివానికి చేయఁదగినదియుండదు.

శ్లో॥ ఆతిథ్యశ్రాద్ధయజ్ఞేషు దేవయాత్రోత్సవేషు చ।
మహాజనేషు సిద్ధ్యర్థీ నగచ్ఛేద్యోగవిత్ క్వచిత్॥

పరతత్త్వ ప్రాప్తినర్థించు యోగీశ్వరుఁడు అతిథి సత్కారములయందును, శ్రాద్ధకర్మలయందును, యజ్ఞములయందును, దేవయాత్రలయందును, ఉత్సవములయందును, పూజనీయులని పేరొందిన అవతారస్వాముల యందును ఎచ్చటనైన పొత్తు గలిగించుకొనరాదు. (నారద పరివ్రాజకోపనిషత్తు 6-3)
(శత 4/17)

శ్లో॥ నవిధిర్నని షేధశ్చ నవర్జ్యావర్జ్యకల్పనా।
బ్రహ్మ విజ్ఞానినామస్తి తథా నాన్యచ్చ నారద॥

ఓ నారదా! బ్రహ్మజ్ఞానులకు విధినిషేధములులేవు. వర్జ్యావర్జ్యములనెడు కల్పనయులేదు. అదేవిధముగా మఱి యితరమైనదియులేదు.
(నారద పరివ్రాజకోపనిషత్తు 6-15)

ప్రాణాయామాది సాధనలు చేయుట ఆత్మ సాక్షాత్కారము కొఱకే. భగవత్తత్త్వమునుజెంద దానియందే క్రీడించుచు, మోదించుచు, ఆనందించుచు, దానియందేచొక్కి సమస్తము మఱచిన వానికిఁక అభ్యాసయోగముతో పనిలేకపోవచ్చును. అంతకులోపల చేయవలసినదేయని భావము.

మూ॥ నైవతస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన।
నచాస్య సర్వభూతేషు కశ్చిదర్థ వ్యపాశ్రయః॥ 18.

తా॥ పూర్వోక్త శ్లోకములో చదువఁబడిన జ్ఞానయోగ సిద్ధాంతికి లోకములో చేయబడిన కర్మచేత ఏప్రయోజనము లేనేలేదు. చేయఁబడని కర్మచేతను ఏదియు నుండదు. సర్వభూతములయందు ప్రయోజనము కొఱకై ఆశ్రయింపదగినది ఇతని కేదియులేదు. సర్వార్థములకు మూలమైన పరమార్థము తానేయైనప్పుడు, తనకంటె వేఱువస్తువు కానరానప్పుడు ఏప్రయోజనముకొఱకు ఏవస్తువు నాశ్రయింపవలయునో యెఱుఁగఁడు.

శ్లో॥ నాకృతేన కృతేనార్థో నశ్రుతి స్మృతి విభ్రమైః।
నిర్మందర ఇవాంభోధిః స తిష్ఠతి యథాస్థితః॥

వేదములు, శాస్త్రములు చదువుటవలన కలిగిన భ్రాంతులతో కర్మ చేసినను ప్రయోజనములేదు. చేయకపోయినను ప్రయోజనములేదు. అట్టి భ్రాంతులులేనివాఁడు చేసినను, చేయకపోయినను ఒకటే వానికేప్రయోజనము కాఁబట్టదు. అట్టివాడు మందరపర్వతముచే చిలుకఁబడని సాగరము వలె అచంచలుఁడై యథాప్రకారము నిలిచియుండును. (మహోపనిషత్తు 4-41)

శ్లో॥ జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః।
నచాస్తి కించి త్కర్తవ్య మస్తిచే న్నసతత్త్వవిత్॥
లోకత్రయేఽపి కర్తవ్యం కించిన్నాస్త్యాత్మ వేదినామ్।

జ్ఞానామృతముతో తృప్తిజెంది కృతకృత్యుఁడైన యోగికి ఇఁక జేయఁ దగినది కొంచెమైనను లేదు. ఇంకను ఏమైన చేయఁదగినది కొదవయుండె ననినచో అట్టివాఁడు తత్త్వజ్ఞుఁడుకాఁడు. ఆత్మజ్ఞానులకు మూఁడు లోకము లలో కొంచెమైనను చేయఁదగినదిలేదు.

(జాబాలదర్శనోపనిషత్తు 1. ఖం: 23-24 శ్లోకము)

మూ॥ తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర।
అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥ 19.

తా॥ ఆత్మసంతుష్టికంటె వేఱుప్రయోజనములేదు. తనకింకొక ఆశ్ర యము లేదు. అనుట నిశ్చయమైనందువలన సమస్త విషయ భోగముల యందు విరక్తుడవై క్రియారూపమైన అభ్యాసయోగమును నిరంతరము బాగుగఁజేయుము. విరాగియై అభ్యాసయోగమును చేయుచుండు పురుషుఁ డుకదా మోక్షము పొందుచున్నాఁడు.

మూ॥ కర్మణైవహి సంసిద్ధిమాస్థితా జనకాదయః
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి॥ 20.

తా॥ జనకుఁడు మొదలైన రాజర్షులు అభ్యాసయోగము చేతనేకదా లెస్సైన లాభమును (మోక్షమును) పొందిరి. (అభ్యాసమువలన మనశ్శుద్ధి కలుగును ఆమీఁద ఆత్మావలోకనమునకు అనుకూలమేర్పడును. దానివలన జన్మకర్మ క్షీణించును. మోక్షము లభించును. అనిభావము.) "లోకృద ర్శనే" అనుసూత్రమువలన శ్రోత్రాదులైన యింద్రియములచేఁ జూడఁబడు విషయ సముదాయమంతయు లోకమనఁబడును. విషయావలోకనమును సూక్ష్మపఱచుటే లోకసంగ్రహము. ఇంద్రియవ్యాపారమును తగ్గించుటే లోక సంగ్రహము. విశ్వమంతట వ్యాపించు దృక్కును మరలించి సూక్ష్మమైన అంతర్లక్ష్యమున నిలుపుటే లోకసంగ్రహము. లోకులకు ఇదేచక్కని మార్గ మని యెఱుకపడునట్లుఁ జేయుటే లోకసంగ్రహము. ఇట్టిలోకసంగ్రహమునే లక్ష్యమునందుంచుకొనియైన ఈవిధము చేయఁదగినవాఁడవే.

మూ॥ యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥ 21.

లౌకికముగఁగాని, వైదికముగఁగాని, ఆధ్యాత్మికముగఁగాని శ్రేష్ఠుఁడైన వాఁడు ఏదేది చేయుచున్నాఁడో దానినే యితరమనుష్యుఁడు చేయుచున్నాడు. అట్టి యుత్తమ పురుషుఁడు దేనిని ప్రమాణముగఁ జేయునో దానినే లోకమనుసరించుచున్నది.

దుష్కర్మచేయువాఁడు శ్రేష్ఠుఁడుకాఁడు. దుష్కర్మలేనివాఁడు ప్రమాణముగఁ జేసినదానినే లోకమనుసరించునని చెప్పఁబడినది. కాఁబట్టి శ్రేష్ఠుఁడు దుష్కర్మచేయుననికాని, లోకము దానిననుసరించుననికాని చెప్పరాదు. అట్టియాదర్శ పురుషుఁడుఊరకుండుటకంటెలోకోపకారార్థము కర్మచేయుటే మంచిది. (ఈశ్లోకము భాగవత. 6 స్కం. 2 అధ్యాయములో కొంచెము వర్ణభేదముతోఁజూచినట్లు జ్ఞాపకము.)

మూ॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి॥ 22.

తా॥ అర్జునా! నాకు మూఁడు లోకములలో చేయఁ దగినది కొంచెమైనను లేదు. లభింపదగినదిలేదు. (ఇట్లుండియు) కర్మయందు వర్తించుచునే యున్నాఁడను.

విశే॥ అస్మత్పద లక్ష్యార్థమైన నిర్గుణతత్త్వమునకు జాగ్రత్స్వప్న సుషుప్తలనెడు మూఁడు లోకములలో చేయఁ దగినదిలేదు. "ఈశ ఐశ్వర్యే" అను సూత్రమువలన సర్వేశ్వరత్వము సిద్ధాంతమైన భగవత్తత్త్వము నందు అష్టైశ్వర్యములు సిద్ధాంతములగుచున్నవి. అందొకయైశ్వర్యమైన"ప్రాప్తి"తనయందే యుండెను. కనుక నిఁక ప్రాపింపనిది, ప్రాపింపఁ దగినది యుండదు. ఐనను ఆత్మ మనస్సు నందును, మనస్సు ఇంద్రియముల యందును వర్తించిన గాని యెట్టికార్యమును జరుగదు. కావున లోకసంగ్రహార్థము చేయు కర్మయందు ఆత్మ వర్తించుచున్నదని యిచ్చట సూచింపఁబడినది.

ఓం. తత్. సత్.

# శతపత్రము

# 93

మూ॥ యదిహ్యహం నవర్తేయం జాతు కర్మణ్యతంద్రితః।
మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థసర్వశః॥ 23.

తా॥ అర్జునా! ఎట్టి యుపద్రవములులేని జాగ్రత్స్వరూపుఁడనైన నేను ఒకప్పుడైనను కర్మయందు వర్తింపక యూరకుందునేని ప్రజలు సర్వవిధముల నామార్గమునే యనుసరింతురు.

విశే॥ చిత్తచాంచల్యము ఉడిగిపోయిన పరిపూర్ణ జ్ఞానికి అభ్యాసయోగముతోఁ ప్రయోజనము లేదని యింతకుఁ బూర్వము చెప్పఁబడియుండెను. ఇట్లనుకొని ఆదర్శపురుషుఁడు కర్మ మానుకొనెనేని "ఏసాధన మాకెందుకు ఏసానికి బనికిరాదు" అని యపూర్వ వేదాంతస్వాములెల్లరు అభ్యాసములను వదలివేసి శుష్కవాక్యములతోనే వేదాంతమును వెల్లడించుచు సోమరితనమును పెంచుకొందురు. కనుక జ్ఞానయోగియు కర్మయోగమున వర్తించుట పొరపాటుకాదు.

మూ॥ ఉత్సీదేయురిమే లోకా నకుర్యాం కర్మచేదహమ్।
సంకరస్యచ కర్తా స్యాముపహ న్యామిమాః ప్రజాః॥ 24.

1 తా॥ నేను కర్మచేయక పోయినచో ఈలోకులు చెడిపోవుదురు. సంకరమునకు నేను కర్తనగుదును. ఈప్రజల నందఱ చెడఁగొట్టిన వాఁడ నగుదును.

2. నేను పరిపూర్ణజ్ఞాని నగుటచే అభ్యాసయోగముతో నాకుఁ బ్రయోజనములేదు. అని దానిని మానుకొనినచో అదివఱకే తెలియని లోకులు ఇంకొకరిని చూచుకొని చేయుటకైనను అవకాశము లేనందున యీ కర్మ

చేయఁజాలక అజ్ఞానకూప నిమగ్నులై చెడిపోదురు. మార్గదర్శకులు లేక తమకుఁ దామే చేయఁ బూనినవారు పద్ధతులలో ముందు వెనుకలు తెలియక తబ్బిబ్బులు పడుచు ఒకపద్ధతి చేయఁదగినవారు మఱియొక పద్ధతి చేయుదురు. అందువలన కర్మసంకరమగును. ఈ సంకరమునకు నేనే కర్తనగుదును. ఇటుల నాలోపముచేతనే ఈ ప్రజలు చెడిపోవుచుండ వీరిని నేనే చెడఁగొట్టిన వాఁడనగుదును.

3. అస్మచ్ఛబ్ద లక్ష్యార్థమైన పరమాత్మ అంతఃకరణమున ప్రతి ఫలింపక తనయందే తాను నిల్చుటవలన దేహేంద్రియములు ప్రకాశింపవు. దృశ్యము మిగుల సన్నగిలి పోవును. ఇతర భూతములను బాగుసేయుటకు వీలులేదు. కర్మేంద్రియములయందు ప్రతిఫలించియు విరాగియైయుండుట బాగు.

మూ॥ సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత।
కుర్యాద్విద్వాంస్తథాసక్తశ్చికీర్షుర్లోక సంగ్రహమ్॥ 25.

తా॥ అర్జునా! కర్మయని చెప్పఁబడు అభ్యాసయోగమునందు స్వరూప జ్ఞాన శూన్యులైన మూఢులు ఎటుల చేయుచున్నారో పరిపూర్ణజ్ఞాన సిద్ధాంతియు అట్లే చేయుచున్నాఁడు. ఈ ఇరుతెగలవారి కర్మ ఒక్కటేపద్ధతిగ నున్నను వారి భావములు వేఱుగనుండును. అజ్ఞానులు విషయానురాగ బద్ధులై స్వార్థచింతతో చేయుచుందురు. జ్ఞానులు తీవ్ర వైరాగ్యోపేతులై లోక కల్యాణముకొఱకు చేయుదగును. (నీవుకూడ అట్లేచేయవలయుననిభావము)

మూ॥ న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మ సంగినామ్।
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్॥ 26.

తా॥ జ్ఞానయోగమనఁగా నేమో యెఱుఁగని మూఢజనులు కర్మయోగమునందే విశేషప్రయోజన ముండునని దానియందే ఆసక్తులైయుందురు. "కర్మయోగమువలన ప్రయోజనములేదు. దీనికంటే మేలైనది జ్ఞానయోగమున్నది. జ్ఞానయోగమువేఱు కర్మయోగమువేఱు" అని బోధించి అజ్ఞానులకు జ్ఞానియైనవాఁడు బుద్ధిసంచలనము కలిగింపరాదు. తాను యోగియై సర్వకర్మలను చేయుచు అజ్ఞానులచేతఁ జేయుంపవలయును చలనముకలిగించుటచే నిరుత్సాహమువలన చేయుదానిని చేయఁజాలరు. పైదానికిఁ బోఁ

జాలరు. ఉభయత్ర చెడుదురు. కర్మయోగమునే విడువక చేయుచువచ్చిన చో కొంతకాలమ్మునకు చిత్తశుద్ధి యగుచున్నది. దానిలోనే జ్ఞానయోగమున్నది. కర్మయోగముయొక్క పర్యవసానమే జ్ఞానయోగమని తెలిసినవాఁడు మఱి యొకనికి పృథగ్భావమును కలిగింపఁడు.

మూ॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః॥
అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే॥ 27.

తా॥ ప్రకృతివికారములైన గుణములచే అన్నివిధముల కర్మలు చే యఁబడుచున్నవి. (శరీరముకలుగుటచే దీనినిగుఱించిన పాలనాభ్యవహారాది కర్మలనేకములు పురుషుని ప్రయత్నములేక దేహధర్మమువల్లనే చేయబడు చున్నవి. ప్రాణకోశమునందును, రక్తకోశమునందును, ఆంత్రకోశమునందు ను స్వతంత్రనాడులు రేవగలు తమకుఁదామే అనేకకర్మలు చేయుచున్నవి. ఇందు కర్తృత్వమెంతమాత్రము లేకున్నను) పురుషుఁడు అహంకారముతో ఇట్టికర్మలకు నేను కర్తనని తలఁచుకొనుచున్నాడు. (ప్రకృతిసంయోగము లేనప్పుడు కేవల నిర్గుణానంద పరబ్రహ్మతత్త్వము ఏకర్మయుఁ జేయుట లేదుకదా?)

శ్లో॥ అహంకారో వినిర్దిష్టా కలంకీ బుద్ధి రుచ్యతే।
బుద్ధిః సంకల్పితాకారా ప్రయాతి మననాస్పదమ్॥

పవనేంద్రియములతోఁగూడి యీశరీరమునందు నాయకత్వము వహిం చిన అహంకారము మలినబుద్ధి యనఁబడును. ఆబుద్ధిసంకల్పముఁజెంది విషయచింతనములకు స్థానముగా మాఱుచున్నది. (మహోప 5-125)

శ్లో॥ మనోఘనవికల్పంతు గచ్ఛతీంద్రితాం శనైః।
పాణి పాదమయం దేహమింద్రియాణి విదుర్బుధాః॥

పూర్వశ్లోకరీతిగా విషయచింతనముచే మనోరూపముజెందిన బుద్ధి గొప్ప వికల్పముఁజెంది మెల్లగ ఇంద్రియస్వరూపముఁ జెందుచున్నది. ఇంద్రి యములనఁగా కరచరణాదులచే రూపొందిన దేహమేయని జ్ఞానులెఱుఁగు దురు (మహోపనిషత్తు 5 అ. 126 శ్లో)

శ్లో॥ ఏవం జీవోహి సంకల్పవాసనా రజ్జు వేష్టితః।
దుఃఖజాల పరీతాత్మా క్రమాదాయాతి నీచతామ్॥

ఈ విధముగా అహంకారముగను, మలినబుద్ధిగను మానసముగను ఇంద్రియములుగను, పాంచభౌతిక శరీరముగను మాఱుచు వచ్చిన జీవుఁడే సంకల్పములు, విషయవాసనలు ననెడు త్రాళ్లతో బంధింపఁబడి దుఃఖములనెడు వలలోఁ దగులుకొని క్రమముగా నీచదశకు వచ్చుచున్నాఁడు.
(మహోపనిషత్తు 5 అధ్యా. 127 శ్లోకము)

మూ॥ తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః।
గుణాగుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే॥ 28.

తా॥ అర్జునా! సత్త్వాది గుణము లిట్టివనియు, వానిచేఁ జేయఁబడు కర్మ లిట్టివనియు విమర్శించి యథార్థము తెలిసికొన్నవాడు ఏయే గుణములు ఆయా అభ్యాసములయందే వర్తించుచున్నవని తెలిసికొని ఫలాసక్తిని పొందకయుండును.

అసంస్కృతాంతఃకరణ వేదాంత స్వాములు కొందఱీశ్లోకము నాధారము జేసికొని అనేకదుర్నయముల జరుపుచున్నారు. మేముచేయలేదు. గుణములే చేయుచున్నవి. గుణములకు మాకు సంబంధములేదు. ఆ కర్మఫలము మాకెంతమాత్రమంటదు. మేము త్రిగుణాతీతులమైన పరిశుద్ధాత్ములము అని సమాధానము చెప్పుచున్నారు. అంతటి పరిశుద్ధాత్ములైనప్పుడు లోకకల్యాణ దాయకమైన సత్కర్మచేయుదురేకాని దుష్కర్మచేయరని పాఠకులు జ్ఞాపక ముంచుకొనవలయును.

మూ॥ ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జంతే గుణకర్మసు।
తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్నవిచాలయేత్॥ 29.

తా॥ ప్రకృతివలనఁ గలిగిన సత్త్వాదిగుణముల తారతమ్యము నెఱుఁగని మూఢులు ఆగుణములచేఁ జేయఁబడు కార్యములను మేమే చేయుచున్నారమని మోహితులై ఆకర్మయందే ఆసక్తు లగుచున్నారు. పూర్తిగఁ దెలియని యామూర్ఖులను పరిపూర్ణజ్ఞాని కదిలింపరాదు.

ప్రకృతిస్వరూపములైన దేహేంద్రియములవలనఁ జేయఁబడు అభ్యాస యోగము పూర్తియగువఱకు జ్ఞానయోగములేదు. అందాక వీరుమూఢులనియే తలఁపబడుదురు. నిదానముగ పైకిరాదగిన యీయసంపూర్ణ జ్ఞానులను వీ రొనర్చెడు అభ్యాసములనుండి పరిపూర్ణజ్ఞాని తొలఁగింపరాదు.

మూ॥ మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥ 30.

తా॥ కేవలము ఆత్మకు సంబంధించిన మనస్సుచేత అ భ్యాసయోగ క్రియా సూత్రముల నన్నిటిని అస్మచ్ఛబ్ద లక్ష్యార్థమైన భగవత్తత్త్వమునందే యుంచి ఆశ, మమకారము లేనివాఁడవై సంతాపమును వదలినవాఁడవై శత్రువుల లెస్సగఁ బ్రహరింపుము.

ఆశ, మమకారము మానుకొని ఆధ్యాత్మిక చిత్తముతోఁ జేయునది అధ్యాత్మిక యుద్ధమేకాని భౌతికయుద్ధముకాదు. అందుఁజేయఁబడు కర్మలు అభ్యాస యోగాంగములైన యమనియమాదులేకాని భౌతిక కార్యములుకావు.

శ్లో॥ హరౌ సర్వాణి కర్మాణి సన్న్యసేద్యోగ విత్తమః॥
నిర్మమో నిత్యతృప్తశ్చ భగవద్ధ్యాన మాశ్రితః॥

యోగీశ్వరుఁడు భగవద్ధ్యానము నాశ్రయించి మమకారమును మానుకొని నిత్యసంతోషియై సమస్తకర్మలను హరియందు సమర్పింపవలయును.
(వరాహపురాణము, పూర్వ. 59 అధ్యా)

మూ॥ యే మే మతమిదం నిత్యమనుతిష్ఠంతి మానవాః।
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః॥ 31.

తా॥ అస్మచ్ఛబ్ద లక్ష్యార్థమైన భగవత్తత్త్వము యొక్క యీమతమును (జ్ఞానమును) ఏమానవులైతే నియతముగ అనుష్ఠించుచున్నారో పరమాత్మ తత్త్వ చింతనమునందు శ్రద్ధగలిగినట్టియు, సర్వాంతర్యామియైన యీశ్వర తత్త్వమునందు అసూయలేనట్టియు ఆమానవులు కూడ జన్మకారణములైన శుభాశుభ కర్మలచే విడువఁబడుచున్నారు.

మూ॥ యేత్వేతదభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్।
సర్వజ్ఞాన విమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః॥ 32.

తా॥ ఎవరైతే సర్వభూతాత్మయైన భగవత్స్వరూపముపై అసూయపెట్టుకొని యీ నా మతమును అనుష్ఠింపకుందురో బ్రహ్మనిష్ఠా విధానము పూర్తిగ దెలియని అమూఢులను చెడినవారని గాను, వివేకము లేనివారినిగాను, తెలిసికొనుము. సర్వము నేనని తెలిసికొనుటే సర్వజ్ఞానము. తనకంటె పరుదులేదని తెలిసికొనిన తరువాత అసూయపడుటకు తావుండదు. అట్టిజ్ఞానము లేనివానికే అసూయయుండును. అందువల్లనె అసూయగలవాఁడు మూఁఢుడనియు, వివేకశూన్యుడనియు, విషయరాగాదులచేఁ జెడినవాఁడనియు, జెప్పుటకు కారణము గలిగినది.

మూ॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి।
ప్రకృతింయాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి॥ 33.

తా॥ పూర్వమెప్పుడో చేయఁబడియుండి యీ జన్మములో పురుషునిచే అనుభవింపఁ బడుటకై జన్మముతో కూడివచ్చిన దేదికలదో అది ప్రకృతియని కొందరందురు. పురాకృత కర్మఫల రూపములైన సుఖదుఃఖాది ద్వంద్వములను అనుభవింపఁ జేయుటకు పురుషునకు సాధన భూతముగ జన్మములో మొట్టమొదట కూడివచ్చినది యీ శరీరమే కాఁబట్టి యీశరీరము, ఈవిధముగనే సృష్టిలోఁ గనబఁడు సర్వవస్తువులు ప్రకృతి యని మఱికొందఱందురు. (ప్రకృష్టం కరణం ప్రకృతిః, డుకృఞ్ కరణే) జ్ఞానయోగియు తన శరీరస్థితికిఁ దగినమాత్రము ఆహారవస్తు సంగ్రహాది కార్యములు కొన్ని చేసికొను చున్నాఁడు సామాన్య భూతములు ప్రకృతి నంటుకొనియేయున్నవి. కరచరణాది బాహ్యేంద్రియములతో నేమియుఁ జేయరాదను పట్టుదలయేమి పనికి వచ్చుచున్నది?

జ్ఞానయోగమునందు ఉత్తీర్ణుడైనవాఁడు కూడ ప్రకృతికి అనుగుణముగా అభ్యాసయోగము చేయుచున్నాఁడు. జన్మబంధముతోఁ గూడినవారు ప్రకృతిని జెందుకొనియే అన్నికార్యములు చేయుచున్నారు. కరచరణాదులతో ఏకార్యము జేయక బిగఁబట్టుకొని కూర్చుండవలయునను పట్టుపలయేమిచేయుచున్నది?

గ్రంథములు చదివి. పెద్దలవలన విని పరమాత్మ తత్త్వ మిట్టిదని తెలిసికొనిన వాఁడైనను అభ్యాసయోగము చేయనియెడల చిత్తశుద్ధియుండదు. అందువలన తన పురాకృతమునకు అనుగుణముగ అన్నికార్యములు చేయుచున్నాఁడు. అన్యభూతములు దేహమే నేననుకొని ప్రకృతియందే మునిఁగి పోవుచున్నవి. జ్ఞానులు, అజ్ఞానులు, సర్వులు కర్మచేయక తప్పినదికాదు. కాఁబట్టి బాహ్యేంద్రియములను మాత్రము నిగ్రహింపవలయునను ప్రయత్నమునందు సాఫల్య మెంతమాత్రము లేదని యిందువలన ఋజువగుచున్నది.

మూ॥ ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయోర్నవశమాగచ్ఛేతౌహ్యస్య పరిపంథినౌ॥ 34.

తా॥ జ్ఞానేంద్రియములకు శబ్దస్పర్శ రూప రసగంధములు ప్రయోజనములు, కర్మేంద్రియములకు వచనదాన గమన విసర్జనాది విషయములు ప్రయోజనములు అంతఃకరణమునకు సంకల్ప వికల్పములు మున్నగునవి ప్రయోజనములు అందు ప్రతియింద్రియమునకు ఇష్టమైన ప్రయోజనము లభించి నప్పుడు అనురాగము కలుగుచున్నది. అనిష్టమైన ప్రయోజనము లభించి నప్పుడు ద్వేషము కలుగుచున్నది. పురుషుఁడు ఈరాగద్వేషములకు రెంటికిలోఁబడరాదు. ఈరెండు యోగికి శత్రువులుకదా?

శ్లో॥ తూష్ణీమేక ఉపాసీత చేష్టేత మనసాపి న।
తదా సంస్తుతినిందాభ్యాం ప్రీతిరోషౌ వివర్జయేత్॥

ఒంటివాఁడై మౌనిదై యుపాసింపవలయును. మనస్సుచేత నైనను చేష్టలు లేకుండవలయును. అప్పుడు లెస్సగ స్తుతిసేయుటవలన సంతోషము గాని, నిందవలన రోషముగాని చెందరాదు. (సనత్సుజాతీయము 4అ. 20శ్లో.)

రాగద్వేషములే శత్రువులని పైశ్లోకములోఁ జెప్పుటవలన అంతశ్శత్రువుల బ్రహరించుటే యుద్ధమగును. కాని యీగ్రంథములో వర్ణింపఁబడినది భౌతికయుద్ధము కాదని తెలియుచున్నది.

మూ॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనంశ్రేయః పరధర్మో భయావహః॥ 35.

తా॥ బ్రాహ్మణులకు జపహోమాదులుసేయుట స్వధర్మము. క్షత్రియులకు యుద్ధము, రాజ్యపరిపాలనముచేయుట స్వధర్మము. వైశ్యులకు కృషి వాణిజ్యాదులు స్వధర్మము. శూద్రులకు ద్విజస్వాముల సేవించుట స్వధర్మము. ఇంకొకని ధర్మమును తానుగైకొని బాగుగ అనుష్ఠించుటకంటె గుణములేనిదైనను తనధర్మమును తానే యనుష్ఠించుటమేలు. తనధర్మమునందు అనఁగా ఎవఁడు చేయుచున్నపనిలో వాఁడు మరణించినను మోక్షమున్నది. పరులవృత్తినవలబించువానికి అవ్యాపారములోనైపుణ్యము లేకపోవుటచే నష్టమువచ్చుననియు, మఱియొకని బ్రతుకుచెరుపున కష్టముపోవుటచే పాపము వచ్చుననియు భయముకలుగుచుండును (అనివైదికులుచెప్పుదురు)

శ్లో॥ యః శరీరేంద్రియాదిభ్యో విహీనం సర్వసాక్షిణమ్।
పారమార్థికవిజ్ఞానం సుఖాత్మానం స్వయంప్రభమ్॥
పరతత్త్వం విజానాతి సోఽతివర్ణాశ్రమి భవేత్।
వర్ణాశ్రమాదయో దేహే మాయయా పరికల్పితాః॥
నాత్మనో బోధరూపస్య మమ తే సంతిసర్వదా।
ఇతి యో వేదవేదాంతైః సోఽతివర్ణాశ్రమీ భవేత్॥

అస్థిరములైన దేహేంద్రియాదులకు విలక్షణమైనట్టియు, సమస్త (గుణకర్మాదులకు) సాక్షియైనట్టియు, పరమార్థజ్ఞానమునకు సంబంధించినట్టియు, సుఖస్వరూపమైనట్టియు, స్వయంప్రకాశము కలిగినట్టియు, పరబ్రహ్మతత్త్వము నెవఁడు తెలిసికొనుచున్నాఁడో అట్టివాడు వర్ణాశ్రమముల నతిక్రమించినవాడగును. వర్ణాశ్రమములు మొదలైనవి దేహమునందు మాయచే మిక్కిలి కల్పింపఁబడినవి. కేవల పరిశుద్ధాత్మ తత్త్వబోధ స్వరూపుఁడనైన నాకు అవర్ణాశ్రమాదులు ఎల్లప్పుడును లేవని వేదాంత సూత్రములచే ఎవడు తెలిసికొనుచున్నాడో అట్టివాడు వర్ణాశ్రమాదుల నతిక్రమించిన వాడగును. (నారద పరివ్రాజకోపనిషత్తు 6 ఉ. 9-11శ్లో) ఆధ్యాత్మిక గ్రంథములో స్వధర్మమని పేర్కొనబడినది. లౌకికమైన కులవృత్తికాదని యిందువలనఁ దెలియుచున్నది.

చిత్తపరిపాకములేనివారు అభ్యాసయోగము చేయుటయు, చిత్తశుద్ధిగలవారు (సాంఖ్యులు) జ్ఞానయోగము చేయుటయు యోగి జనసంప్రదాయము

లోఁజేరిన నియతధర్మము. ఇందులో ఒకపద్ధతి చేయదగినవారు మఱియొక పద్ధతి యోగధర్మమును నైపుణ్యముతోఁ జేయుటకంటెను తమకు నియతమైన పద్ధతి స్వల్ప ప్రయోజనకరమైనను దానినేచేయుటలెస్స. ఒకవేళ ఆ పద్ధతి పూర్తిగ నెఱవేఱకముందే యోగి మరణించినను ఎన్నఁటికైన మోక్షము కలుగుచునేయున్నది. తనపద్ధతివిడిచి మఱియొకపద్ధతిఁ జేయువాఁడు రెంటికిని బనికిరాక తుదకు జన్మభయమునకు గుఱియగుచున్నాఁడు.

శుభేచ్ఛాది విజ్ఞాన భూమికలు ఏడు కలవని యిదివఱకు వినియున్నారు. అందు ఏభూమికయందలి విద్యార్థి అభూమికకు నియతమైన యోగపాఠము ననుష్ఠించుట స్వధర్మము. మఱియొక భూమికయందు నియతమైన పద్ధతిని బాగుగ అనుష్ఠించుటకంటె తనభూమికకు నియుక్తమైన పాఠము స్వల్ప ప్రయోజనకారమైనను దానినె చేయుటమేలు. అభూమికలో ఉత్తీర్ణుఁడు కాకముందె మరణించినను మఱియొక జన్మములోనైన మోక్షము కలుగుచున్నది తనపాఠము విడిచిపెట్టి అన్యపాఠము ననుష్ఠించువారికి జ్ఞానసిద్ధిలేకపోవుటచే జన్మభయమునకుఁ గారణముగుచున్నది. అంతేకాక యోగప్రమాదమువలన నానావ్యాధులు, మూర్ఛ, యున్మాదము మొదలైన పీడలు కూడ రావచ్చును.

స్వధర్మమనగా తపధర్మము అని యిదివఱకు చదివియున్నారు. పంచభూతాత్మకమైన స్థూలశరీరము, పవనేంద్రియములు, మనోబుద్ధి చిత్తాహంకారములు, శబ్దాది విషయములు, నామరూపములు, గుణకర్మాదులు, సంకల్ప వికల్పములు అన్నియు లయించినపిమ్మట ఏదిమిగిలియుండునో అదియొకటె తాను. ఇట్టి తానైన అఖండపరిపూర్ణైక పరబ్రహ్మతత్త్వముచే ఏవి ధరింపఁబడునో అవి స్వధర్మము దానికంటె అన్యములైన ప్రవృత్తిధర్మములన్నియు ఒకప్పుడు తనవి కాకపోవుచున్నవి అందువల్ల పరధర్మములని చెప్పవచ్చును. అనేక జన్మములనుండి ప్రవృత్తియందే వర్తించుచుండు ప్రాకృతపురుషులకు అ ధర్మములయందు మంచి యభ్యాసముండుటచే అవి లెస్సగ అనుష్ఠింపఁబడుచుండును. ఆత్మసంబంధమైన నివృత్తి ధర్మము (స్వధర్మము) జీవులచే దీర్ఘకాలము అభ్యాసముచేయఁబడి యుండదు. "గుణఅభ్యాసే" అనుసూత్రమువలన విగుణమనఁగా అభ్యాసములేనిది. బాగుగ అనుష్ఠిం

పఁబడు ప్రవృత్తి ధర్మమునకంటె అభ్యాసములేనిదైనను స్వకీయమైన నివృత్తి ధర్మమే మేలు. ఆత్మధర్మమునందు భౌతికములైన ద్రవ్యములవలని తగులాటముండదు. (నిరస్తంధనం నిధనమ్) అందువలన మోక్షము లభించుచున్నది. ప్రవృత్తిధర్మము నాచరించుట సులభమే కావచ్చును కాని అది జన్మభయమును కలుగఁజేయుచున్నది.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు:

మూ॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥ 36.

తా॥ ఓకృష్ణా! (పాపము సేయుటవలన నరకమనుభవింపవలసి వచ్చునని సామాన్యజనులకును దెలియును. పాపము చేయునపుడు హృదయము జంకుచుండుటచే ఇది పాపకృత్యమని తెలిసినట్లేయున్నది.) ఇట్లుండగా తన కిష్టములేని కార్యములయందు ప్రభువులచే బలాత్కారముగఁ బంపబడు భృత్యునివలె ఈపురుషుఁడు ఇష్టములేని వాడయ్యును మఱిదేనిచేఁ బ్రయోగింపఁబడి పాపము నాచరించుచున్నాఁడు? (చేయరాని కార్యమని యెఱిగియుండియు దానినేచేయువారు కొందరున్నారని యింమువలన వెల్లడియగుచున్నది.)

శ్రీ భగవానుఁడు చెప్పుచున్నాడు:-

మూ॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్॥ 37.

తా॥ (జీవులకు సర్వానర్థకారణమైన కోరికయేది కలదో అదే కామము ఏదైన నొకటి యాటంక మేర్పడుటచే కామము విఫలమైనప్పుడు ఆకామమే క్రోధముగ మాఱుచున్నది. క్రోధమనునది కామమునకంటే వేఱుగ నుండదు. ఆరెంటికి శబ్దార్థములలో బేదములున్నను ఉత్పత్తికారణమొకటే. అందువల్లనే యీ శ్లోకములో కామ క్రోధములు ద్వివచనముగఁగాక యేకవచనముగఁ బ్రయోగింపవలసి వచ్చినది )

క్రోధమే పరిణామముగ గలిగిన యీకామము లోకములో రజోగుణమువలన సంభవించును. గొప్పయాహారము గలది. మిక్కిలి పాపముతోఁ గూడినది. దీనిని శత్రువుగఁ దెలిసికొనుము.

"కామక్రోధాదయస్తత్ర శత్రవః శత్రుసూదన"

శత్రుసంహారకుఁడవైన ఓ లక్ష్మణా! బ్రహ్మ విద్యాభ్యాసము నందు కామక్రోధాదులు శత్రువులు (అధ్యా. అయో. 4 స. 34 శ్లో.)

శ్లో॥ ఉద్భూతం జ్ఞానదుర్మిత్రమవధార్యాతిదుర్బలః।
అశ్చర్యం కామమాకాంక్షే త్కాలమంతమనుశ్రితః॥

కామమనునది జ్ఞానమునకు శత్రువుగ పుట్టినదని యెఱిఁగి యుండియు అంతకాలము నాశ్రయించి దుర్బల హృదయుఁడై అకామమునే వాంఛించుచున్నాఁడు. అశ్చర్యము! (అష్టావక్రగీత 3 ప్ర. 7 శ్లోకము) ఇచ్చట కామమే ముఖ్యమైనశత్రువని చెప్పుటచే భగవద్గీతాగ్రంథము భౌతికయుద్ధ చరిత్రమునకు సంబంధించినది కాదని చెప్పవలసియున్నది. కామక్రోధములు లేకపోయి నప్పుడు భౌతిక యుద్ధమునకుఁ కారణములేదు.

మూ॥ ధూమేనావ్రియతే వహ్నిర్యథా దర్శో మలేన చ।
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్॥ 38.

తా॥ అగ్ని ప్రకాశమానమైనదే యైనను ప్రకాశశూన్యమైనపొగ చుట్టుకొనుటవలన వెలుగొందదు. మనుష్యుల ప్రతిబింబముఁ గనఁబఱుపఁగల పరిశుద్ధమైన అద్దము ముఱికి పట్టుటచే మునుపటివలెఁ గనఁబఱుపకున్నది. గర్భశిశువు చైతన్యము కలిగియుండియు జడస్వరూపమైన మావిచేఁ గప్పఁబడి ప్రకాశింపకుండును. ఇవన్నియు నెట్లు ధూమాదులచేఁ గప్పఁబడుచున్నవో అదేవిధముగా కామముచే జ్ఞానము ఆవరింపఁబడుచున్నది. పాపము చేయవలయుననెడు ఇష్టము లేనివాఁడైనను అనర్థకరములైన కామ క్రోధాదులచేత జ్ఞానము మఱుగుపడుటవలన అస్వతంత్రుఁడై చేయుచున్నాడని భావము.

మూ॥ ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేనచ॥ 39.

తా॥ అర్జునా! కామమువలన క్రోధము కలుగుచున్నది. క్రోధమువలన తుదకు దుఃఖము కలుగుచున్నది. కాఁబట్టి కామమనగా దుఃఖముతో నిండిన

దని చెప్పవచ్చును. ఎన్నెన్ని విషయభోగములు కూడినను ఇఁకఁజాలునన్న మాట దీనికుండదు. నిత్యసంతోషియై తత్త్వచింతనము చేయఁదగిన జ్ఞాన యోగికి దుఃఖనిధానమైన యీకామము నిరంతర శత్రువగుచున్నది. ఇట్టి కామస్వరూపమైన శత్రువుచే జ్ఞాన మావరింపఁబడుచున్నది. (ధనహీనుఁడు దొంగల భయమెఱుఁగఁడు. మానహీనుఁడు అవమానదుఃఖమునెరుగడు జ్ఞాన హీనుడు కామమువలనఁగలుగు విప్లవము నెఱుఁగఁడు. అందువల్లనే కామ ము జ్ఞానికి శత్రువని చెప్పఁబడినది )

మూ॥ ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్॥ 40.

తా॥ పైఁజెప్పఁబడిన కామస్వరూపమైన శత్రువునకు ఇంద్రియము లు, మనస్సు, బుద్ధి ఆధారస్థానమని చెప్పబడుచున్నఁది. ఇట్టి లాధారము జేసికొనిన యీకామశత్రువు జ్ఞానమును అంతయు కప్పివేసి ఆ యింద్రియా దుల చేతనే దేహధారియైన జీవుని మోహింపఁజేయుచున్నది. (స్థూలదృష్టితో జూచు వారికి ఇంద్రియములు వేఱువేఱుగఁ గనఁబడవచ్చును. కాని సూ క్ష్మ దృష్టిలో నవియన్నియు నొక్కటేయని చెప్పవచ్చును కంటితో నొక రుచ్యమైన పదార్థమును జూడఁగా జిహ్వేంద్రియము చలించుచున్నది. శృంగారవంతులైన స్త్రీ, పురుషులు ఒకరి నొకరు చూచుటచే కొన్ని ఇంద్రి యములు చలించుచున్నవి. ఇంద్రియముల కన్నిఁటికి నిట్లేకూడికయున్నది. అందువల్లనే పైశ్లోకములో నివియన్నియు ఏకవచనముక్రిందఁజెప్పఁబడినవి )

మూ॥ తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।
పాప్మానం ప్రజహిహ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్॥ 41.

తా॥ అర్జునా! కామరూపమైన శత్రువునకు ఇంద్రియము లాధారమగు చున్నవని యింతకుముందు చెప్పితిని ) అందువలన తొట్టతొలుత యింద్రి యములను స్వాధీనము గావించుకొని పిమ్మట జ్ఞానవిజ్ఞాన నాశనకరమైనట్టి యు, పాపభూయిష్ఠమైనట్టియు ఈకామ శత్రువును బాగుగ కొట్టివేయుము. (మొట్టమొదట అభ్యాసయోగముచేతనే ఇంద్రియములను స్వాధీనముచేసికొన వలయును. అట్లయిన లౌకిక ధర్మముల నిరూపించు సామాన్య జ్ఞానమును నివృత్తి ధర్మమును నిరూపించు విశేషజ్ఞానమును నాశము గావింపకుండ విషయానురాగరూపమైన శత్రువును గెలువవచ్చును. పిమ్మట జ్ఞానయోగ

మునందు కృతార్థుఁడు కావచ్చును. రాగమును విడనాడుటే ముఖ్యసూత్ర ము.)

శ్లో॥ జ్ఞానినాం సంతతరిపుః కామస్సంకల్ప సంభవః।
ఆదావేవ విజిత్వైనం తతోయోగం సమభ్యసేత్॥

మనస్సంకల్పములవలన పుట్టిన కామము జ్ఞానులకు యెల్లపుడును శత్రువగుచున్నది. మొట్టమొదటనే ఆకామ శత్రువును జయించి అటు పిమ్మట యోగాభ్యాసము చేయవలయును. (విశ్వగీత. 72 శ్లో)

శ్లో॥ హృత్క్షేదారే కామనామ దుర్బీజాంకుర ఉచ్యతే।
తముత్పాట్య సమూలంతు స్వస్థో భవతు సంయమీ॥

మానసక్షేత్రమునందు కామమనునది కలుపుమొక్కయని చెప్పఁబడి నది. యతీశ్వరుఁడాకలుపు మొక్కను వేళ్లతోసహా పెళ్లగించి వేసి తనలోఁ దాను సుఖముగ నుండవచ్చును. (విశ్వగీత 71 శ్లో.)

శ్లో॥ మనోవ్యాధే శ్చికిత్సార్థ ముపాయం కథయామి తే।
యద్యత్స్వాభిమతం వస్తు తత్త్యజన్ మోక్షమశ్నుతే॥

మనస్సులోఁ బుట్టిన వ్యాధికి చికిత్సచేయుటకై నీకు ఉపాయము చెప్పుచున్నాఁడను. అభిలాషపుట్టించు వస్తువు ఏదేది కలదో దానిని వదలి వేయుచుండువాఁడు మోక్షము పొందుచున్నాఁడు.

(మహోపనిషత్తు 4 అ 88 శ్లో)

శ్లో॥ స్వపౌరుషైక సాధ్యేన స్వేప్సితత్యాగరూపిణా।
మనఃప్రశమ మాత్రేణ వినానాస్తి శుభాగతిః॥

తన పౌరుషము చేతనే యిష్టభోగములను వదలుటకు సాధ్యమగును. చిత్తముశాంతించును, ఇటులగాకున్న శుభమైన మార్గములేదు.

(మహోపనిషత్తు 4 అ. 90 శ్లో)

శ్లో॥ అసంకల్పేన శస్త్రేణ ఛిన్నం చిత్తమిదం యదా।
సర్వం సర్వగతం శాంతం బ్రహ్మ సంపద్యతే తదా॥

సంకల్ప రాహిత్యమనెడు ఆయుధముచేత చిత్తమెప్పుడు విదారిత మగుచున్నదో అప్పుడు సర్వజగద్వ్యాప్తమైనట్టియు, సర్వము తానేయైనట్టియు, శాంతస్వరూపమైనట్టియు, పరబ్రహ్మతత్త్వము లభ్యమగుచున్నది.
(మహోపనిషత్తు 4 అ. 91 శ్లో)

శ్లో॥ మనసైవ మనశ్ఛిత్వా పాశం పరమ బంధనమ్।
భవాదుత్తారయాత్మానం నాసావన్యేన తార్యతే॥

పురుషుని ముందునకు సాగిపోకుండ కేవలము బంధించు పాశము మనస్సే. మనస్సనెడు ఈ పాశమును మనస్సుచేతనే ఖండించి జన్మసాగరమునుండి ఆత్మను దాటింపుము. అటుగాక మఱియొక విధముగా ఆయాత్మ దాటింపబడదు. (మహోపనిషత్తు 4 అ 107 శ్లో)

శ్లో॥ ఇచ్ఛామాత్ర మవిద్యేయం తన్నాశో మోక్ష ఉచ్యతే।
సచా సంకల్పమాత్రేణ సిద్ధిభవతి వై మునే॥

ఓ మునీంద్రా! ఇష్టభోగముల యందలి అభిలాషకలది అజ్ఞానము ముదిరిపోవుచున్నది. ఆయభిలాష నశించుటమోక్షమని చెప్పఁబడుచున్నది. సంకల్పరాహిత్యము చేతనే అదిలభించుచున్నది.
(మహోపనిషత్తు 4 అ. 116 శ్లో)

మూ॥ ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరంమనః।
మనసస్తు పరాబుద్ధి ర్యోబుద్ధేః పరతస్తుసః॥ 42.

తా॥ (బాహ్యాంతరములగు సర్వవిషయములను గ్రహించు) యింద్రియములు (దృశ్యమునకంటె) శ్రేష్ఠములని చెప్పుదురు. మనస్సు చలింపకున్న ఇంద్రియము లెట్టికార్యమును జేయఁజాలవు. కనుక ఇంద్రియములకంటె మనస్సు శ్రేష్ఠము. బుద్ధి స్థిరపడియుండినచో మనస్సంకల్పము లేమియు జేయఁజాలవు. కాఁబట్టి మనస్సునకంటె బుద్ధి శ్రేష్ఠమైనది. బుద్ధి కంటెను శ్రేష్ఠమైన దేదికలదో అది పరమాత్మ (సః అని సర్వనామముగ జెప్పుటచే పూర్వోక్తకామమని కొందఱందురు. అది భావిశ్లోకమున కన్వయింపదు. మఱియు "మనసస్తు పరాబుద్ధి ర్బుద్ధేరాత్మా మహాన్పరః" అని కఠోపనిషత్తులోఁ జెప్పఁబడినందున బుద్ధికంటె శ్రేష్ఠమైనది పరమాత్మయని యనువదించితిని)

మూ॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥ 43.

తా॥ అర్జునా! యీవిధముగా బుద్ధికంటె శ్రేష్ఠమైన పరమాత్మను తెలిసికొని ఉపనిషత్ స్థానమునుండి భ్రంశము కాకుండ ఆత్మను ఆత్మచేతనే నిలువరించి మిగుల దుఃఖముతోఁ గూడినట్టియు, కామస్వరూపమైనట్టియు, శత్రువును కొట్టివేయుము.

" ఆత్మనాత్మని సంతృప్తో నావిద్యా మనుధావతి " ఆత్మచేత ఆత్మయందు లెస్సగ తృప్తిఁజెందిన యోగి అజ్ఞానమును వెంబడించి పరుగెత్తఁడు అని యన్నపూర్ణోపనిషత్తు 4 అధ్యాయలోను జెప్పఁబడినది. కనుక ఆత్మస్థైర్యముచేతనే కామము జయింపఁబడునని నమ్మవలసియున్నది.

ఇది శ్రీమహాభారతము. భీష్మపర్వములో కర్మయోగమను ఇరువది యేడవ అధ్యాయము.

ఓం. తత్. సత్.



# శతపత్రము

# 94



## శ్రీ మహాభారతము భీష్మపర్వము 28 అధ్యాయము.

శ్రీభగవానుడు చెప్పుచున్నాఁడు:-

మూ॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయమ్।
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్॥ 1.

తా॥ (భీష్మ పర్వము 26-27 అధ్యాయములలో వ్రాసినటు రీతిని ఇందాఁక బోధింపఁబడియుండు) నాశరహితమైన యీ యోగమును నేను వివస్వతునకుఁ జెప్పియుంటిని. వివస్వతుఁడు మనువునకుఁ జెప్పెను, మను వు ఇక్ష్వాకునకుఁ జెప్పెను.

విశే॥ చిత్కళాప్రకాశముచేత ఇరువదినాలుగు తత్త్వములతోఁగూడిన శరీరత్రయమును ఆచ్ఛాదించువాఁడు వివస్వతుఁడు. (వస ఆచ్ఛాదనే) స్వధర్మనిరూపణమునందు మనుష్యజాతికి ఆదర్శప్రాయుఁడైన ప్రభువు మనువు. ప్రజలకు ఇంపైన రీతిని అంతటను శబ్దించువాఁడు ఇక్ష్వాకు. (ఇష్యతే సర్వైరితి ఇక్షుః, ఇషుఇచ్ఛాయాం, ఆసమంతాత్కాయతి ధ్వనతీతి ఆకుః, కైశబ్దే, ఇక్షుః + ఆకుః = ఇక్ష్వాకుః)

మూ॥ ఏవం పరం పరాప్రాప్త మిమం రాజర్షయోవిదుః।
సకాలేనేహ మహతా యోగోనష్టః పరంతప॥ 2

తా॥ ఈవిధముగా ఒకరినుండి యింకొకరికి లభించుచువచ్చిన యీ యోగమును ఉత్తములైన ఋషులెఱుఁగుదురు. అర్జునా! యిప్పుడు చాలకాల ము గడచిపోవుటచే లోకములో ఈ యోగ మగపడుటలేదు.

వి॥ పూర్వశ్లోకములో అవ్యయము (క్షీణముకానిది) అనిచెప్పఁబడిన యోగము ఈశ్లోకములో నష్టమైనదని చెప్పుటయేమి? అనిప్రశ్న:- ఇందుకు సమాధానము: భౌతికములైన సుఖదుఃఖములందలి ఇచ్ఛాద్వేషములనువదలి వేసి నిరంతరము యోగము నభ్యసించు పురుషుఁడు అవ్యయుఁడగుచున్నాడు. అతనికీవిద్యయు అవ్యయమేయగుచున్నది. కాబట్టియీవిద్యను అవ్యయమందురు. ఆత్మజ్ఞానములేని మూఢజనుల కీవిద్య అగోచరముగ నుండును కావున నష్టమని చెప్పఁబడును. నష్టమనఁగా అగోచరమనియర్థము. (ణశ అదర్శనే)

భారతకాలములోను, ఆటుపిమ్మట కలియుగారంభమునఁ గొన్నాళ్లవఱకును ఈవిద్యనెఱిఁగిన బ్రహ్మర్షులు, రాజర్షులు అనేకులుండినట్లు పురాణములవలనఁ దెలియుచున్నది. మన్వాదులు ఒకరిద్దఱుమాత్రమే యెఱిఁగియుండిన కాలములో ప్రకాశమానముగఁ దలఁపఁబడిన విద్య అనేక ఋషీశ్వరు లెఱిఁగియుండిన భారతకాలములో నష్టమైనదిగఁ దలఁపఁబడుటయేమి? అనిప్రశ్న - ఇందుకు సమాధానము: కురువంశములో ప్రతీపమహారాజు ఒక్కఁడేయుండు కాలములో వంశము నష్టమైనదని యెవ్వరును చెప్పలేదు. భారత యుద్ధానంతరము ధృతరాష్ట్రపుత్రుఁడైన యుయుత్సుఁడు, పాండవ పౌత్రుఁడైన పరీక్షిత్తు, అర్జునపుత్రుఁడైన బభ్రువాహనుఁడు మున్నగు ప్రభువులు కొందఱుండిన కాలములో కౌరవవంశము నశించినదని తలఁపఁబడుచుండెను. ఇట్లె యదుకులములో ఋషిశాపమువలన పరస్పర కలహములచే అనేకులు చావఁగాఁ గొందఱు పురుషులు మిగియున్నను కులము నశించినట్లే చెప్పఁబడినది అట్లే యొకప్పుడు లక్షలకొలఁది పెరిగియుండిన రాజర్షులసంఖ్య యింకొకప్పుడు వందలలోనికో, పదులలోనికో దిగివచ్చినచో అప్పుడు బ్రహ్మవిద్య నశించినదని చెప్పుట కేవలము పొరపాటుకాదు.

మూ॥ స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః।
భక్తోఽసి మే సఖాచేతి రహస్యంహ్యేతదుత్తమమ్॥ 3.

తా॥ పూర్వము వివస్వతునకుఁ జెప్పఁబడిన అయోగమేయిది. నీవు నాకు భక్తుఁడవు, స్నేహితుడవు. ఇట్లని మిగుల గోప్యము, ఉత్తమమునైన యీయోగమిప్పుడు నాచే నీకుఁ జెప్పఁబడినది.

వివ॥ ఉపనిషత్తులనుండియు, భారత భాగవతాది పురాణములనుండి యు అందందు కొన్నియంశములను ఏఱితెచ్చి సమకూర్చుటచే తయారైనదే కాని యిది స్వతంత్రగ్రంథముకాదని విమర్శకుల మతము. ఇందుకు సాదృశ్యము "సర్వోపనిషదోగావో" అనుశ్లోకము గీతా పాఠకులెల్లరు ఆమోదించి నదే. ఈగీత చదువబడుచున్నది, దీనికి మాతృకలైన పూర్వగ్రంథములు చదువఁబడుచున్నవి. ఇట్లుండ నీవిద్య నశించుట యెప్పుడు? క్రొత్తగ లోకములోఁ బ్రవేశపెట్టుట యెప్పుడు? అనిప్రశ్న:- ఇందుకు సమాధానము: ఏతత్పూర్వమీవిద్యా గ్రంథములలో నుండినదేయైనను లోకములో ప్రజలచే దఱుమచూడబడకపోయినప్పుడు, అనుష్టింపబడకపోయినప్పుడు గ్రంథముల నుండిబయల్పడక అందులోనేమఱుగుపడిపోయినప్పుడు ఆవిద్యనశించినదని చెప్పుటవింతకాదు. ఒకానొకమహనీయుఁడావిద్యను పైకిఁదీసి శిష్యులకుబోధించిలోకములోఅనుష్ఠానమునకుఁదెచ్చినప్పుడుక్రొత్తగఁబ్రవేశపెట్టినట్లే భావింపబడును. గాంధిమహాత్మునిచేఁ బ్రవేశపెట్టఁబడిన కద్దరుసమస్య యిట్టిదేకదా?

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు:

మూ॥ అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః।
కథమేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవానితి॥ 4.

తా॥ ఓ కృష్ణా! వివస్వతుని జన్మము పూర్వకాలములో కలిగినది నీజన్మము ఇటీవల కలిగినది (ఇట్లుండఁగా) ఈయోగమును పూర్వమే చెప్పియుంటివని యెట్లు తలంతును?

విశే॥ నిరాకారమైన పరమాత్మయందు తొలుత చిత్కళపుట్టుచున్నది. పిమ్మట నాదబ్రహ్మ కలుగుచున్నది. అటుపైన నామరూపములు, నీవు నేనను భేదభావములు. జ్ఞానాజ్ఞానములు, వాగ్వాదవృత్తులు కలిగినవి. తరువాత ఒకరికొకరు బోధించుటకు అవకాశ మేర్పడుచున్నది. మొదట చిత్కళారూపమునకు పృథగ్భావముండదు. అప్పుడు బోధించుట మెట్టులని శిష్యుడడిగి యుండవచ్చునేమో!

శ్రీ భగవానుఁడు చెప్పుచున్నాఁడు.

మూ॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున।
తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థ పరంతప॥ 5.

తా॥ శ్రేష్ఠమైన తపముచేఁ గామలోభాదులైన అంతశ్శత్రువుల సంతాపింపఁజేయు అర్జునా! అస్మచ్ఛబ్ద చక్ష్యార్థమైన నాకు (సమస్తశరీరములయందు నేను నేనని పేర్కొనఁబడు పరమాత్మకు) సృష్ట్యాదినుండియు అనేక జన్మములు కడచిపోయినవి. వాచ్యార్థ స్వరూపమైన నీకు ప్రత్యగాత్మకుఁ గూడ పెక్కు జన్మములు కడచినవి. ఆజన్మముల నన్నిఁటిని నేనెఱుఁదును. అజ్ఞానావరణముచే జీవభావము వహించియుండు నీవెఱుఁగవు.

మూ॥ అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా॥ 6.

తా॥ నేను పరిశుద్ధుఁడను, నిర్గుణుఁడను కనుక ప్రాకృత జనులందఱువలె కర్మబద్ధమైన జన్మ నాకులేదు. అందువల్లనే నేను క్షీణించు స్వభావములేనివాఁడను జన్మబంధముగల జీవులకెల్ల నియామకుఁడనైయున్నాఁడను. ఇట్లు రూపనామక్రియా శూన్యుఁడనై యుండియు స్వకీయమైన క్రియాశక్తి (స్వతంత్రశక్తి) వహించి నాయందు పరిమితమైయుండు మాయతోఁగూడి సంభవించు చున్నాఁడను.

"మా మానే" అను సూత్రమువలన అంతది యింతదియనియు, అట్టిదిట్టిదనియు పరిమాణము కలిగినదిమాయ. పరిమాణములకు అతీతమైనది పరమాత్మ.

మూ॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥ 7.

(ఈశ్లోకము భారత. అరణ్య 189 అధ్యాయములో కొంచెము వర్ణభేదముతోఁ జదివినట్లు జ్ఞాపకము)

తా॥ 1 అర్జునా! ప్రజల ఆచార వ్యవహారములయందు ఎప్పుడెప్పుడు ధర్మమునకు హాని కలుగుచున్నదో, అధర్మము పైకొని యెప్పుడు చెలరేగుచున్నదో అప్పుడు (ధర్మమును కాపాడుటకై) నాయంశమును అవతరింపఁజేయుదును.

పూర్వయుగములలో ధర్మమునకు ఏకొంచెమో హానిత్యము కలిగినంత నే రామకృష్ణాద్యవతార పురుషులువచ్చి కొఱఁతదీర్చుచుండినట్లు పురాణము లలో వినియుంటిమి. ఈకాలములోనే చెప్పరానన్నివిధముల అధర్మము పెరిగిపోయినది. మహాపురుషు లవతరించుచున్నారు, నిరంతరపరిశ్రమ చేయుచున్నారు, ప్రభుత్వములు మార్చివేయబడుచున్నవి. ధర్మముమాత్రము దిన దినమునకు అడుగునకే దిగఁబడిపోవుచున్నది. ప్రజాహృదయములో మూఢత్వము ముదిరిపోవుచున్నది. ఎచ్చటఁజూచినను స్వార్థము క్రౌర్యము మూర్తీభవించినవి. ఇఁక ధర్మరక్షణ క్షమమైన దైవాంశమెట్టిదో, యెప్పుడువచ్చునో అని కొందఱడుగుచున్నారు. ఇందుకు సమాధానము:- ఆకాలపు వేదాంతస్వాములు అధర్మమును సహింపరు. అట్టిది కొంచెము చెలరేగుచుండగానే అండజోకటిగఁజేరి ధర్మరక్షణార్థము పరమేశ్వరావతారము రావలయునని సంకల్పించుచుండెడివారు. ఈకాలములో అట్టిత్యాగుఁడు, సంకల్ప బలముగల స్వాములు తఱుచుగ లేకపోవుటవలన భారతదేశమునకింత దుర్దశ వచ్చియుండ నోపును.

2. మానవుని హృదయమునందు ధర్మబలము తగ్గిపోయి యధర్మము హెచ్చినప్పుడు పాపముచేయఁ దలపెట్టుచున్నాఁడు అప్పుడు వాని హృదయమునందే భగవతత్త్వము సూక్ష్మముగ స్ఫురించి (అవతరించి) యీకార్యము చేయరానిదిసుమాయని లోలోపల ప్రబోధించుచున్నది అప్పుడా మనుష్యునకు పాపభయము కలుగుచున్నది. ఎవరైన చూచిపోదురేమోయని దిక్కులు చూచుచున్నాడు. ఆత్మగౌరవమును కాపాడుకొను పురుషుడు అపనిప్పుడే మానివేయుచున్నాఁడు. ఇదియొకవిధమైన యవతారము

3. పురుషునియందు స్వాత్మ నిరీక్షణరూపమైన ఆత్మధర్మమెప్పుడు తగ్గిపోవుచున్నదో అప్పుడే దానికి విరుద్ధమైన ప్రకృతి వ్యాపారదకత బాగుగ అలవడుచున్నది. ఇందు తఱుచు కామమునకు స్థానముచిక్కుటచే క్రోధమాత్సర్యాదులు, అహంకార మమకారములు, వానిమూలమున తీఱని దుఃఖములు సంభవించుచున్నవి. ఇవన్నియు అధర్మము యొక్క రూపాంతరములే ఈవిధముగా దుఃఖితుఁడైన పురుషునియందు పరమాత్మ సూక్ష్మముగ అవతరించి "అయ్యో! యీ పాపభూయిష్ఠమైన జన్మమిఁక వలదు" అని తీవ్ర వైరాగ్యమునుబుట్టించి తరణోపాయము కొఱకు సద్గురువును వెదకునట్లు.చేయుచున్నది. ఇది యింకొకవిధమైన యవతారము. అదృష్టవంతులకే యిట్టిది లభించును.

మూ॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥ 8.

తా॥ 1. సత్పురుషుల యాపదలఁదొలఁగించి రక్షించుటకు, దుష్కర్మానుష్ఠానపరులను నాశము గావించుటకు, లౌకికవైదిక పారమార్థిక ధర్మములను లెస్సగ స్థాపించుటకు (నేను) ప్రతియుగము నందును అవతరించు చున్నాఁడను.

2. సత్త్వగుణ ప్రధానములైన శాంతశమదమాది గుణములను కాపాడుటకు, దుఃఖమును కలుగఁజేయు (దుఃఖంకరోతీతిదుష్కృత్. డుకృఞ్ కరణే) కామక్రోధాది శత్రుగుణములను నశింపఁజేయుటకు, స్వాత్మసరీక్షణ రూపమైన నివృత్తిధర్మమును లెస్సగఁ బ్రతిష్ఠించుటలోఁగల ప్రయోజనమును గుర్తింపఁజేయుటకు పురుషుని హృదయాకాశమునందు అస్మచ్ఛబ్ద లక్ష్యార్థమైన పరిశుద్ధతత్త్వము అప్పుడప్పుడు స్ఫురించు చుండును.

మూ॥ జన్మకర్మచ మే దివ్యమేవం యోవేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మనైతి మామేతి సోఽర్జున॥ 9.

తా॥ భగవత్తత్త్వమునకుఁ గర్మబద్ధమైన జన్మములేగు, జన్మకారణమైనకర్మలేదు. ధర్మరక్షణార్థము స్వేచ్ఛగ ధరింపఁబడినదే జన్మము. ప్రతిఫలాపేక్షలేక లోకసంగ్రహార్థముచేయు ధర్మానుష్ఠానమే కర్మ అర్జునా! యీవిధముగా దివ్యమైన (క్రీడామాత్రమైన) నాజన్మమును, కర్మను యథార్థముగ ఎవఁడైతే తెలిసికొనుచున్నాఁడో వాఁడు దేహమును వదలివేసిన తరువాత మరలజన్మముపొందఁడు. నన్ను (స్వస్వరూపమును) పొందుచున్నాడు.

మూ॥ వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః॥ 10.

తా॥ అనురాగము, భయము, క్రోధము వదలుకొనినవారు, అస్మచ్ఛబ్ద లక్ష్యార్థమైన సర్వభూతాత్మ తామైనవారు, అపరమాత్మనే ఆశ్రయించినవారు జ్ఞానయోగయుక్తమైన తపస్సుచే పరిశుద్ధులైనవారుఅనేకులునాస్థితినేపొందిరి

శ్లో॥ సంప్రాప్యైన మృషయోజ్ఞాన తృప్తాః
కృతాత్మానో వీతరాగాః ప్రశాంతాః।

తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా।
యుక్తాత్మానస్సర్వమేవావిశంతి॥

జ్ఞానయోగమును గ్రహించి యభ్యాసయోగము చేసినవారు, విషయ భోగాదులయం దనురాగము మానుకొని చిత్తోపశమముఁగాంచి ఆత్మసంస్కారము పొందినవారు, జ్ఞానముచే సంతుష్టులైన ఋషీశ్వరులు పూర్వోక్తరీతిగా తమలోఁదాము బ్రహ్మస్థానమునుపొంది అటుపైన ఎల్లెడల సర్వమును వ్యాపించియుండు పరమాత్మనుపొంది సర్వము తానైన ఆపదమునందే కలిసి పోవుచున్నారు. (ముండకోపనిషత్తు 3 ముం 2-ఖం 5 శ్లో.)

మూ॥ యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్।
మమ వర్త్మాను వర్తంతే మనుష్యాః పార్థ సర్వశః॥ 11.

తా॥ (కొందఱు నానావిధముల నామరూపములఁ గల్పించుకొని ప్రతి ఫలాపేక్షతో ఉపాసింతురు. మఱికొందఱు నిష్కాములై నిరాకారమును నిర్గుణమును ఉపాసింతురు.) అర్జునా! ఎవరెవిధముగ నన్నాశ్రయించుచున్నారో వారిని ఆవిధముగానే నేను ప్రాపించియుందును. ఐనను మనుష్యులందఱును సర్వవిధముల నామార్గమునె అనుసరించుచున్నారు.

శ్లో॥ త్రయ్యాంచ విద్యయా కేచిత్త్వాం వై వైతానికా ద్విజాః॥
యజంతే వివిధైర్యజ్ఞై ర్నానారూపామ రాఖ్యయా॥

యజ్ఞములుసేయుటకు అలవాటుపడిన కొందఱు బ్రాహ్మణులు నానా రూపములఁబోలు దేవతల నామముల నెఱిగించు వేదములలోని చదువు నాధారముచేసికొని వివిధములైన యజ్ఞములచేత నిన్ను పూజించుచున్నారు. (భాగవత 10-స్కం. 40 అధ్యా 5-శ్లో ఇచ్చట మఱియైదు శ్లోకములలోను యజ్ఞభేదములు వర్ణింపఁబడినవి.)

శ్లో॥ నిర్మమో నిరహంకార స్సర్వసంగ వివర్జితః॥
సదా శాంత్యాది యుక్తస్సన్ ఆత్మన్యాత్మాన మీక్షతే॥

అహంకార మమకారములులేనివాఁడు సర్వవిషయములయందు అనురాగమును వదలుకొనినవాఁడు, ఎల్లప్పుడు శాంతి మొదలైన సుగుణములతో గూడినవాడునై తనయందే స్వస్వరూపమును చూచుచున్నాఁడు. (నారదపరివ్రాజకోపనిషత్తు. 6 ఉపదేశ. 19 శ్లో.)

మూ॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహదేవతాః।
క్షిప్రం హి మానుషేలోకే సిద్ధిర్భవతి కర్మజా॥ 12.

తా॥ కర్మలయొక్క లాభమును అభిలషించినవారు ఇహమునకు సంబంధించిన దేవతలను పూజించుచున్నారు. మనుష్యలోకములో కర్మవలనఁ గలుగు ప్రయోజనము సత్వరముగ లభించుచున్నదిగదా?

విశే॥ యమనియమాది యోగకర్మలయొక్క ప్రయోజనమైన చిత్తశుద్ధిని, కాయశుద్ధిని పొందఁగోరినవారు లోకములో క్రీడామాత్రులైన గురువుల సేవించుచున్నారు. మానవదృక్పథమునందు కర్మయోగమువలనఁ గలుగు మనఃకాయశుద్ధిరూపమైన లాభము సత్వరముగ నగునుగదా?

మూ॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్॥ 13.

తా॥ 1. సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము అని మూఁడు ప్రధానగుణములు వీనిసాంకర్యమువలన పెక్కు గుణములు పుట్టినవి. గుణములవలెనే కర్మలు పెక్కువిధములుగ నుండును. ఇట్టి గుణకర్మల విభాగరీతిగా నాలుగు వర్ణముల ప్రజాసముదాయము భగవత్తత్త్వముచే సృజింపబడినది. అందు శమదమాది గుణములను కాపాడుకొని తపముచేయువారు కొందఱు, శౌర్య ప్రతాపములుకలిగి కొన్నిభూతములను శిక్షించుచు, కొన్ని భూతములను రక్షించుచు రాజసముననుండువారు కొందఱు, ఆదాయవ్యయములను ముఖ్యముగ గమనించు చిత్తవృత్తిగలవారు కొందఱు, స్వతంత్రజ్ఞానములేక యితరులను సేవించి జీవించువారు కొందఱు ఈవర్ణభేదములు జన్మముతోసహ స్వాభావికముగ, గలిగినవికనుక దైవకల్పితములని చెప్పఁబడినవి. ఈకాలఁపు గోత్రాపురస్వాములు చెప్పుకొను జాతిభేదములు మనుష్య కల్పితములేకాని దైవకల్పితములుకావని తెలియవలయును. ఇట్లు వర్ణభేదములతోఁగూడిన సృష్టికిఁగర్త భగవత్తత్త్వమేయైనను ఈవిధముగఁ గలుగవలయునని పరమాత్మకు సంకల్పము లేనందున నాశరహితమైన పరమాత్మ యిందుకు కర్తకాదని తెలిసికొనుము.

శ్లో॥ సర్వత్రాహమకర్తేతి దృఢభావనయానయా।
పరమామృతనామ్నీ సా సమతైవావశిష్యతే॥

ఎల్లెడల నేను కర్తను కాను అనెడు దృఢమైన అభావనచే మోక్షామృత మని పేరువహించిన అసమత్వము మాత్రమే మిగిలిపోవుచున్నది. (మహో పనిషత్తు 6-అ. 2-శ్లో)

శ్లో॥ అథవా సర్వకర్తృత్వమకర్తృత్వంచ వై మునే।
సర్వం త్యక్త్వా మనః పీత్వాయోఽసి సోఽసి స్థిరోభవ॥

ఓ మునీంద్రా! ఒకవేళ సమస్తమైన కర్తృత్వమును అకర్తృత్వమును అంతటిని వదలివేసి మనస్సును నిగ్రహించిన మీఁదట నీవెవఁడవో వాఁడవే యగుదువు. (నిర్వికల్పస్వరూపుడవగుదువు) సుస్థిరుడవుకమ్ము.
(మహోపనిషత్తు 6 అ, 5. శ్లో)

శ్లో॥ యస్తు కర్తారమాత్మానం మన్యతే సాధ్వసాధు వా।
తస్య దోషవతీ ప్రజ్ఞా అతత్త్వజ్ఞేతి మే మతిః॥

శారీరకర్మ మంచిదికానీ చెడ్డదికానీ దానికి ఆత్మకర్తయని యెవ్వఁడు తలఁచుచున్నాఁడో అట్టివాని బుద్ధి దోషయుక్తమైనది. తత్త్వము నెఱుఁగనిది అని నా యభిప్రాయము. (భారత. శాంతి. 222 అధ్యా. 17 శ్లో)

(2) చతుర్వర్ణాత్మకమైన, ప్రణవరూపమైన నాదబ్రహ్మ పరమాత్మ నుండి యుత్పన్నమైనది దానితో స్థూల సూక్ష్మ కారణ మహాకారణ శరీరములు, జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయములు కలిగినవి. ఇందువలన జీవులకు కర్మభేదములు కలిగినవి ఇట్లు గుణకర్మాదులచే విభక్తమైన, చతుర్వర్ణాత్మకమైన భూతసృష్టికి పరమాత్మ కర్తయైనను యాపనామ క్రియాశూన్యము, నాశరహితము, సంకల్పవర్జితము నగు పరతత్త్వము దీనికి కర్తకాదని తెలిసికొనుము.

(3) "గుణఅభ్యాసే" అను సూత్రమువలన గుణకర్మలనఁగా అభ్యాసము చేయఁబడిన కర్మయోగ పద్ధతులని భావము "వర్ణస్తుతౌ" అను సూత్రము వలన వర్ణములనఁగా స్తోత్రపాత్రములనిభావము. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము అని నాలుగు భాగములుగ వర్ణింపఁబడిన అభ్యాసయోగము నాచే నిర్మింపఁబడినది. ఈ యోగము చేయుటచే లాభముగాని, చేయకపోవుటచే నష్టముగాని నాకులేదు దీనియందు రాగముకూడ లేదు. కనుక దీనికి నేను కర్తనైనను కర్తను కానని తెలిసికొనుము.

మూ॥ నమాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్నస బధ్యతే॥ 14.

తా॥ లౌకిక కర్మలయందుఁ గాని, శ్రౌతస్మార్తాది నిత్యనైమిత్తిక కర్మలయందుఁగాని, యమనియమాది యోగకర్మలయందుఁ గాని నాకు ప్రతి ఫలము కావలయునని యాసక్తిలేదు. ఈ కర్మలేవియు నన్నంటవు. అని యెవఁడైతే నన్నుబాగుగ దెలిసికొనుచున్నాఁడో అట్టివాఁడు కర్మలచే బద్ధుడు కాఁడు.

శ్లో॥ న యస్య జన్మకర్మాభ్యాం న వర్ణాశ్రమ జాతిభిః।
సజ్జతేఽస్మిన్నహంభావో దేహే వై స హరేః ప్రియః॥

పుట్టుకచేతను, క్రియలచేతను, వర్ణాశ్రమాచార విధులచేతను, అభిజాత్యముచేతను, ఈ దేహమునందు ఎవనికైతే అహంభావముంటదో అట్టివాఁడు శ్రీహరికిఁ బ్రియుఁడు, (ఆర్షభగీత 1. 51) ఇట్లుచెప్పుటచే ఫలాసక్తి లేనివానికి కర్మలంటవని నమ్మవలసియున్నది.

శ్లో॥ కర్తవ్యం నైవ తస్యాస్తి కృతేనాసౌ న లిప్యతే।
జీవన్ముక్తస్సదా స్వచ్ఛ స్సర్వదోష వివర్జితః॥

అతనికి చేయఁ దగిన కర్మ లేనేలేదు, చేయఁబడిన కర్మచే అతఁడంటబడఁడు. జీవన్ముక్తుఁడు సమస్త దోషములచే విడుపఁబడి యెల్లప్పుడును పరిశుద్ధుఁడై యుండును. (యోగశిఖోపనిషత్తు 1 47,)

శ్లో॥ హిత్వా గుణమయం సర్వం కర్మ హిత్వా శుభాశుభమ్॥
ఉభే సత్యానృతే త్యక్త్వా ఏవం భవతి నిర్గుణః॥

సత్త్వరజస్తమో గుణములవలన నేర్పడిన సమస్త ప్రపంచమును అభిమానించుకొనక శుభా శుభములకు హేతువైన కామ్యకర్మను వదలివేసి సత్యా సత్యములను రెంటిని విడిచిపెట్టి యీ విధముగా నిర్గుణుడగుచున్నాఁడు. (నారాయణీయము 2 అధ్యా· 11 శ్లో.)

మూ॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్॥ 15.

తా॥ మోక్షమునందాసక్తిగల పూర్వీకులచేతనైతము (పూర్వశ్లోకముల రీతిగా విషయానురాగము, ఫలాసక్తిలేని పద్ధతిలో) అభ్యాసయోగము చేయఁబడినది. అందువలన ఈ విధముగఁ దెలిసికొని చాలపూర్వకాలమునుండి పూర్వికులచేఁ జేయఁబడిన అభ్యాసయోగమునే నీవు చేయుము.

మూ॥ కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥ 16.

తా॥ కర్మయనగా నేమి? అకర్మయనఁగా నేమి? అను సందర్భములో పండితులుఁకూడ పొరపాటుపడినారు. నీవు దేనిని తెలిసికొని అశుభమునుండి విడువఁబడుదువో ఆ కర్మ నీకుఁ జెప్పుచున్నాఁడను. (స్వర్గభోగాదుల కొఱకు గు శ్రౌతాది కర్మలయందు శుభము క్షీణింపఁగా అశుభము రానే వచ్చుచున్నది. ఆధ్యాత్మిక కర్మమైన అభ్యాసయోగము చేతనే అశుభము తొలగవలయును.

మూ॥ కర్మణోహ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః॥ 17.

తా॥ (1.) కర్మయొక్కయు, వికర్మయొక్కయు, అకర్మయొక్కయు పద్ధతి స్వరూపము తెలిసియుండుట మంచిది. కర్మయొక్క పద్ధతి మిగుల కష్టమైనది. (ఈకర్మభేదములను గుఱించిన వివరములేవియు ఈగ్రంథములో విశదముగ వ్రాయలేదు.)

(2) కర్మయనఁగా సామాన్యముగ వేదములలోఁ జెప్పఁబడిన సత్కర్మయనియు, అకర్మయనఁగా చేయరాని యనర్థకర్మయనియు, వికర్మయనఁగా విజ్ఞాన కారణమైన విశేషకర్మయనియుఁ గొందఱు చెప్పుదురు.

ఇందుకు దృష్టాంతములు:- కర్మ, అకర్మ, వికర్మ. శుద్ధము. అశుద్ధము, విశుద్ధము. జ్ఞానము, అజ్ఞానము, విజ్ఞానము. నిందితము, అనిందితము వినిందితము. ఖండితము, అఖండితము, విఖండితము జితము, అజితము, విజితము. పాటనము, అపాటనము, విపాటనము. లుప్తము, అలుప్తము, విలుప్తము లూనము, అలూనము, విలూనము. దీర్ఘము, అదీర్ఘము, విదీర్ఘము. మొదలైన శబ్దముల వలెనని తెలియవలయును. ఇంతేకాక మఱికొన్ని యభిప్రాయములు కూడ అందందు గ్రంథములలోఁ గనఁబడుచున్నవి.

శ్లో॥ కర్మాకర్మ వికర్మేతి వేదవాదో న లౌకికః।
వేదస్యచేశ్వరాత్మత్వాత్తత్ర ముహ్యంతి సూరయః॥

కర్మాకర్మ వికర్మలనెడు సమస్య లోకాతీతమైన జ్ఞానసంభాషణములో జేరినది. ఈకర్మజ్ఞానము ఈశ్వరత్వమునుండి యుత్పన్నమైనది. అందువలన దీనియందు పండితులు మోహపడుచున్నారు. (అర్షభగీత. 2 అ 47 శ్లో)
ఇచ్చట కర్మయనఁగా శాస్త్రవిహితమైన సత్కర్మయనియు, అకర్మయనఁగా దానికంటె విపరీతమైన నిషిద్ధకర్మయనియు, వికర్మయనఁగా ఏకర్మయుఁ జేయక ఊరకుండు స్థితియనియు, శ్రీధర వ్యాఖ్యానములోఁ జెప్పఁబడినది.

శ్లో॥ పరోక్షవాదో వేదోఽయం బాలానామనుశాసనమ్।
కర్మమోక్షాయ కర్మాణి విధత్తేహ్యగదం యథా॥

ప్రత్యక్షానుభవమును తెలియఁజేయని ఆవేదము జ్ఞానయోగము నెఱుగని మూఢుల జన్మకర్మను క్షీణింపఁజేయుటకు కర్మయోగపద్ధతులను విధించుచున్నది. ఈశాసనము రోగులకు ఔషధమువంటిది. (అర్షభగీత. 2-48)

శ్లో॥ నాచరేద్యస్తు వేదోక్తం స్వయమజ్ఞోఽవిజితేంద్రియః
వికర్మణాహ్యధర్మేణ మృత్యోర్మృత్యుముపైతి సః॥

వేదోక్తమైన కర్మయోగమును (అభ్యాసయోగమును) స్వయముగ ఆచరింపఁడేని అట్టివాఁడు ఇంద్రియముల జయింపఁజాలఁడు. జ్ఞానయోగము తెలిసికొనజాలడు. ధర్మవిరుద్ధమైన వికర్మచే మరణమునుండి మరణమును (మాటిమాటికి మరణమును) పొందుచున్నాఁడు కదా? (అర్షభగీత 2-49)
ఇచ్చట "వికర్మణాహ్య ధర్మేణ" అనుటచే చేయరాని కార్యముచేయుట యొకవిధముగ ధర్మవిరుద్ధమగు చున్నది. చేయదగినదానిని చేయకపోవుట యింకొక విధముగ ధర్మవిరుద్ధమగుచున్నది. ఇందువల్లనే పండితులు సైతము కర్మపద్ధతి తెలిసికొనలేక తబ్బిబ్బులగు చున్నారు.

శ్లో॥ పుంసోఽయుక్తస్య నానార్థో భ్రమస్సగుణదోషభాక్।
కర్మాకర్మవికర్మేతి గుణదోషధియోభిదా॥

అభ్యాసయోగము చేయనిపురుషునికి నానావిషయ స్వరూపమైనట్టియు, గుణదోషముల ననుభవించునట్టియు సంచలనము (భ్రమ) కలుగుచున్నది. అట్టి గుణదోషములతోఁగూడిన ఆభ్రమ "కర్మ, అకర్మ, వికర్మ") యని భేదములఁగల్పించు చున్నది. (భాగవత 11 స్కం. 7 అధ్యా 8శ్లో.

ఇచ్చట కర్మయనఁగా శాస్త్రోక్తమైన సత్కర్మయనియు, అకర్మయనఁగా చేయఁదగినదానిని చేయకుండుటయనియు, వికర్మయనఁగా నిషిద్ధకర్మయని యు శ్రీధరాచార్యులే పై వ్యాఖ్యానమునకు విరుద్ధముగఁజెప్పియున్నారు. విహితము కర్మయని ఒప్పుకొనిన తరువాత విహితమునకంటె వేఱైనదంతయు అకర్మలోఁజేరిపోయినట్లే యెంచుకొనవలయును. అంతేకాక కర్మచేయకుం డుటకు ఒక్కక్షణమైనను సాధ్యముకాదని యింతకుముందే యెఱుగుదుము. కనుక కర్మలేని స్థితియుండునని చెప్పరాదు.

మూ॥ కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణి చ కర్మ యః।
స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్॥18

తా॥ (1) కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను ఎవఁడైతే చూడఁగలఁడో అట్టివాఁడు మనుష్యులలో బుద్ధిమంతుఁడు, (జ్ఞాని) యోగి, సంపూర్ణముగ కర్మచేసినవాఁడు నతఁడే.

(2) లౌకిక శ్రౌతస్మార్తాది కర్మలుచేయునప్పుడు కర్మఫలమునందా సక్తుఁడుకాక యెవ్వఁడు విముఖుడై నైష్కర్మ్య ప్రాప్తిఁగాంచు చున్నాఁడో; లౌకిక కార్యవిరామ సమయమునందు అంతరంగికమైన ఆధ్యాత్మిక కర్మ నెవఁడు చూచుచున్నాఁడో అట్టివాడు బుద్ధిమంతుఁడు. యోగి పూర్తిగ కర్మ చేసినవాడు.

(3) ప్రాకృత జనులచే అనుష్ఠింపబడు కామ్యకర్మ నిజమైన కర్మ కాదనియు, లౌకికులెల్లరు కర్మకాదని చెప్పుకొను పరమార్థచింతనమే నిజ మైన కర్మయనియు ఎవఁడు చూచుచున్నాఁడో వాఁడు మనుష్యులలో బుద్ధి మంతుఁడు. యోగి. పూర్తిగ కర్మచేసినవాఁడు.

(4) అష్టాంగయోగములలో పూర్వాంగములు కర్మయనియు, తక్కినవి (సాంఖ్యము) అకర్మయనియు యోగీశ్వరుల యభిప్రాయము. బాహ్యేంద్రియ ములచే కర్మయోగము నభ్యసించుకాలములో అకర్మగనుండు జ్ఞానస్వరూప మును అంతఃకరణముచే నెవఁడు తిలకించు చున్నాఁడో, అకర్మయని చెప్పఁ బడు జ్ఞానయోగమునందు అంతరంగికమైన పరిశ్రమ నెవఁడు కాంచుచున్నా డో వాడు మనుష్యులలో బుద్ధిమంతుఁడు. యోగి. పూర్తిగ కర్మచేసినవాఁడు దైహిక మానసిక పరిశ్రమలు రెండును చేసినప్పుడే కర్మ పర్యాప్తమగునని భావము.

(5) శ్లో॥ విశ్వం విష్ణుమయం సర్వం విష్ణుర్విశ్వమయః ప్రభుః।
న వస్త్వస్తితు లోకేఽస్మిఙ్ విష్ణోఃపరం నసంశయః॥

ఈ సమస్త విశ్వము విష్ణువుకంటె వేఱైనదికాదు. ప్రభువైన విష్ణువు విశ్వమునకంటె వేఱైనవాఁడుకాఁడు. ఈ లోకములో విష్ణువుకంటె వేఱైన వస్తువు లేనేలేదు. ఇందు సంశయము లేదు. (విశ్వగీత 94) అను ప్రమాణ రీతిగా క్రియాస్వరూపమైన ప్రకృతియందు నిష్క్రియా స్వరూపమైన పరమాత్మను, రూపనామ క్రియాశూన్యమైన పరమాత్మయందు క్రియాబాహుళ్య రూపమైన ప్రకృతిని ఎవఁడైతే చూడఁగలఁడో అట్టివాఁడు మనుష్యులలో బుద్ధిమంతుడు, యోగి, పూర్తిగ కర్మచేసినవాఁడు. ప్రకృతి పురుషులకు సంయోగముండి నప్పుడే కర్మయున్నది. సంయోగము లేనప్పుడు, కర్మలేదు. అందువలన కర్మలో అకర్మయున్నది. అకర్మలో కర్మయున్నది. అని తెలియుచున్నది.)

మూ॥ యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః॥ 19.

తా॥ ఎవఁడు చేయు ప్రయత్నము లన్నియు కోరికలతోను, సంకల్పములతోను సంబంధపడక యుండునో, ఎవఁడైతే జ్ఞానాగ్నిచేత కర్మబంధములను దహింపగలిగి యున్నాఁడో అట్టి పురుషుని జ్ఞానులు పండితుఁడందురు.

శ్లో॥ సంశాంతసర్వసంకల్పః ప్రశాంతసకలేషణః।
నిర్వికల్పపదంగత్వా స్వస్థోభవ మునీశ్వర॥

ఓ మునీశ్వరా! సమస్తసంకల్పములను, ధన దార పుత్రాదులయందలి వాంఛను, ఉడిగించుకొన్నవాఁడవై వికల్పములులేని పదమును పొంది నీయందే నీవు సుఖముండుము. (మహోపనిషత్తు 6-82.)

శ్లో॥ అనాబాధేఽవికారే స్వే సుఖే పరమపావనే।
సంకల్పోపశమే యత్నంపౌరుషేణ పరంకురు।

దుఃఖశూన్యము, వికారరహితము, ఆత్మసుఖ స్వరూపము, పరమపవిత్రమునైన సంకల్పశాంతికై పౌరుషముతో ఉత్తమమైనయత్నము చేయుము. (అధ్యా. ఉత్త. 6-53.)

శ్లో॥ నిస్సంకల్పో యథాప్రాప్తవ్యవహారపరోభవ।
క్షయే సంకల్పజాలస్య। జీవో బ్రహ్మత్వమాప్నుయాత్॥

సర్వవిధముల సంకల్పములను వదలివేసి ప్రారబ్ధానుసారము ఏవేళ కేది ప్రాప్తమగుచున్నదో ఆ వ్యవహారమునందు వర్తించుచుండుము. సంక ల్పరూపమైన వల క్షీణింపఁగా జీవుఁడు బ్రహ్మత్వమును పొందుచున్నాడు. (అధ్యా. ఉత్తర. 6-55) సర్వసంకల్పములు బంధములేయని నిరాలంబో పనిషత్తులోను చెప్పబడినది.

మూ॥ త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవకించిత్కరోతి సః॥ 20.

తా॥ కర్మఫలమునందలి ఆసక్తి వదలుకొని నియతమైన సంతోషము కలవాఁడును, తనకింకొక ఆశ్రయము లేనివాఁడునై విహితకర్మయందు బా గుగఁ బ్రవర్తించుచుండియు అతఁడు కొంచమైనను కర్మచేయని వాఁడెయగు ను. అతనికి కర్మవలని దోషమంటదని భావము.

శ్లో॥ రాగద్వేషౌ సుఖందుఃఖం ధర్మాధర్మౌ ఫలాఫలే।
యః కరోత్యనపేక్ష్యైవ స జీవన్ముక్త ఉచ్యతే॥

రాగద్వేషములను, సుఖదుఃఖములను, ధర్మాధర్మములను, ఫలా ఫలములను, అపేక్షింపకయే యెవఁడైతే (బ్రహ్మనిష్ఠ) చేయుచున్నాఁడో వాఁ డు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు. (మహోపనిషత్తు 2 అ. 49 శ్లో)

శ్లో॥ సర్వత్ర విగతస్నేహో యస్సాక్షివదవస్థితః।
నిరిచ్ఛో వర్తతే కార్యే స జీవన్ముక్త ఉచ్యతే॥

ఎవఁడైతే అనురాగముఁ జెందక సర్వవస్తువులయందు సాక్షివలె సమ దృష్టికలిగి యున్నాఁడో, చేయదగిన విహితకర్మయందు కాంక్షఁజెందక వర్తిం చు చున్నాఁడో అట్టివాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.
(మహోపనిషత్తు 2 అ. 51 శ్లో)

శ్లో॥ యః సమస్తార్థజాలేషు వ్యవహార్యపి నిస్పృహః
పరార్థేష్వివ పూర్ణాత్మా స జీవన్ముక్త ఉచ్యతే॥

సమస్త ప్రయోజనములయందు వ్యవహరించుచుండు వాఁడయ్యును పరులకెవరికైనను కలుగుచుండు ప్రయోజనములయందువలె తనకుఁ గలుగఁబోవు ప్రయోజనములయందును, ఆశలేక మనస్సంకోచము లేక యెవఁడున్నాఁడో అట్టివాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడును.

(మహోపనిషత్తు 2 అ. 62. శ్లో.)

మూ॥ నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ 21.

తా॥ ఆశలేనివాఁడై శరీర రక్షణావసరమునకు మించి యేవస్తువునైన గ్రహింపక అంతఃకరణమును స్వ వశముఁ గావించుకొని కేవల శరీరసంబంధమైన అభ్యాసయోగము చేయుచుండువాఁడు పాపము పొందఁడు.

"స్వసంకల్పవశాద్బద్ధో నిస్సంకల్పాద్విముచ్యతే" తన సంకల్పమునకు తాను వశపడుటవలన బద్ధుఁడగుచున్నాఁడు సంకల్పము లేకపోవుటవలన ముక్తుఁడగుచున్నాఁడు (మహోపనిషత్తు 2-70) బంధమోక్షములకు మనస్సంకల్పమే కారణమగును కాని కేవల శారీరకర్మ కాదు.

శ్లో॥ మాభవ గ్రాహ్యభావాత్మా గ్రాహకాత్మా చ మాభవ।
భావనామఖిలాం త్యక్త్వా యచ్ఛిష్టం తన్మయోభవ॥

నీవు ఇంకొకదానిచే గ్రహింపఁబడు స్వభావముకలవాఁడవు కావలదు. ఇంకొకదానిని గ్రహించుస్వభావము కలవాఁడవు కావలదు. సమస్తమైన భావనను వదలిపెట్టినమీఁదట ఏదిమిగిలియుండునో అదేనీవైయుండుము. (మైత్రేయోపనిషత్తు. 2 అ. 28 శ్లో) విషయపరిగ్రహము వదలుటయెంత ముఖ్యమో యిందువలనఁదెలియుచున్నది.

ఓం. తత్ సత్.

మూ॥ య దృచ్ఛాలాభ సంతుష్టో ద్వంద్వాతీతోవిమత్సరః।
సమస్సిద్ధావసిద్ధౌచ కృత్వాపి న నిబధ్యతే॥ 22.

తా॥భౌతికవిషయలాభమునకైకాని, ఆధ్యాత్మికములైన అణిమాద్యైశ్వ ర్యములకొఱకుఁగాని ప్రయత్నముచేయక పురాకృత విశేషముకొలఁది ఏవేళ కేది లభించుచున్నాదో దానితో తృప్తిఁజెందుచు, సుఖదుఃఖాది ద్వంద్వముల కందక, ఇతరులపై మత్సరము వహింపక, లాభము వచ్చినను రాకపోయిన ను మోదఖేదములఁజెందక సమచిత్తముతో వర్తించువాఁడు విహితకర్మ (అ భ్యాసయోగము) చేసియు ఆ కర్మచే బద్ధుఁడుకాడు.

"యస్య సంకల్పనాశ స్స్యాత్తస్య ముక్తిః కరేస్థితా. తస్మాద్భావాభావౌ పరిత్యజ్య పరమాత్మధ్యానేన ముక్తోభవతి" ఎవనికైతే సంకల్పములు నశిం చునో వానిచేతిలో ముక్తియున్నది. అందువలన భావాభావములను వదలిపెట్టి పరమాత్మధ్యానముచేత ముక్తుఁడగుచున్నాఁడు (మండల బ్రా॥పనిషత్తు 2-3)

"పునఃపునస్సర్వావస్థాసు జ్ఞానజ్ఞేయౌ ధ్యానధ్యేయౌ లక్ష్యాలక్ష్యే దృశ్యా దృశ్యేచోహాపోహాది పరిత్యజ్య జీవన్ముక్తో భవేత్" సర్వావస్థలయందును జ్ఞానజ్ఞేయములు, ధ్యానధ్యేయములు, లక్ష్యాలక్ష్యములు, దృశ్యాదృశ్యములు, ఊహాపోహలు మొదలైనవానిని మఱిమఱి వదలివేసి జీవన్ముక్తుఁడు కావ చ్చును. (మండల బ్రాహ్మణోపనిషత్తు 2-3)

ఇట్లు చెప్పుటచే సర్వసంకల్పములను, ద్వంద్వములను వదలిన కర్మ యోగి జీవన్ముక్తుఁడగునని పైశ్లోకార్థము వ్యక్తమగుచున్నది.

మూ॥ గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః।
యజ్ఞాయాచరతః కర్మసమగ్రం ప్రవిలీయతే॥ 23.

తా॥ ఐహికాముష్మిక భోగములయందు వాంఛ పెట్టుకొనక, సుఖదుఃఖాది సమస్త ద్వంద్వములచే విడువఁబడి తనచిత్తమును బ్రహ్మజ్ఞానమునందే నిలుపుకొని భగవత్తత్త్వముకొఱకు ఆచరించువానికర్మ (అభ్యాసయోగము) అంతయు మిగులులేకుండ (భగవత్తత్త్వమునందే) కలిసిపోవుచున్నది. (లీజ్ శ్లేషణే)

శ్లో॥ తపస్తీర్థం జపోదానం పవిత్రాణీతరాణిచ।
నాలంకుర్వంతి తాంశుద్ధిం యాజ్ఞాన కలయాకృతా॥

జ్ఞానయోగములో పదాఱింట ఒకభాగము చేతచేయఁబడు శుద్ధి యేదికలదో అటువంటి శుద్ధిని తపస్సుగాని, తీర్థసేవగాని, జపముగాని, దానముగాని, పవిత్రములైన యేయితర కర్మలుగాని పర్యాప్తముగఁజేయఁజాలవు. (భాగవత. 11స్కం-19 అధ్యా. 4శ్లో) జ్ఞానశుద్ధిచే దైవార్పణముగఁ జేయఁబడిన కర్మనిర్దుష్టమని భావము.

మూ॥ బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్।
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥ 24.

తా॥ అంతర్వీధియందు తనకంటె అన్యవస్తువేదియులేని కూటస్థానమున పరమాత్మతత్త్వ చింతనమనెడు యజ్ఞమును (ఆత్మపూజ) చేయుచోట సర్వము తానైయుండును కనుక యజ్ఞముచేయు కర్తయు, హవిరాదిపూజాపదార్థములును, యాగాగ్నియు, యజ్ఞోపకరణ సముదాయము, యజ్ఞక్రియాకలాపము అంతయు తానే (బ్రహ్మస్వరూపమే) యై యుండును. ఈయజ్ఞము యమముమొదలు ధ్యానమువఱకు ఏడంగములతో సమాప్తమగుచున్నది. ఇంతవఱకు ఉపాస్యము, ఉపాసకుఁడు అను భేదము వాచ్యార్థములో నున్నది. ఆభేదముకూడలేని సమాధిస్థితియందు బ్రహ్మస్వరూపుఁడైన యజ్ఞకర్త పొందఁబోవు యజ్ఞఫలముసైతము బ్రహ్మస్వరూపమే యగును. ఈయజ్ఞకర్త బద్ధుఁడగుటకు మఱెట్టికారణములేదని భావము (ఈశ్లోకము శర్భోపనిషత్తులోను చదివినట్లు జ్ఞాపకము)

శ్లో॥ జ్ఞాన విజ్ఞాన యజ్ఞేన మామిష్ట్వాత్మాన మాత్మని।
సర్వ యజ్ఞపతిం మాం వై సంసిద్ధిం మునయోఽన్వగన్॥

సర్వవిధములైన యజ్ఞములకు అధిపతియైనట్టియు, తనలోతానైనట్టి యు అస్మచ్ఛబ్ద లక్ష్యార్థమైన పరమాత్మతత్త్వమును మునీశ్వరులు వైదికజ్ఞానముతోను, వేదాతీతమైన తత్త్వజ్ఞానముతోను కూడిన యజ్ఞము (ఆత్మపూజ) చేత అర్చించి స్వస్వరూపమునే లాభముగ లెస్సగ పొందుచున్నారు.
(భాగవత. 11 స్కం. 19 అధ్యా. 6శ్లో )

మూ॥ దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥ 25

తా॥ ఇంకొకలోకములో ఏచ్చటనో దేవతలనెడువారు కొందఱున్నారని యు, వారివలన శుభముఁజెందవచ్చుననియు విశ్వాసముగల మఱికొందఱు వైదిక కర్మయుక్తులు ఆదేవతలకు సంబంధించిన యజ్ఞమునే యుపాసించు చున్నారు. ఇఁకఁగొందఱు పరమాత్మను పరమాత్మచేతనే పరబ్రహ్మతత్త్వ మనెడు అగ్నియందు వేల్చుచున్నారు.

విశే॥ "దివ్క్రీడాదౌ" అనుసూత్రమువలన సర్వభూతములయందు క్రీడామాత్రమైన పరమాత్మ యేస్థానమున స్ఫురించుచున్నదో ఆస్థానమునకు దివమనిపేరు. దివమునకు సంబంధించినది దైవమనఁబడును. "యజదేవ పూజాదౌ" అనుసూత్రమువలన యజ్ఞమనఁగా పూజాకార్యమునకుఁ బేరగు నని యింతకుముందు చదివియున్నారు. కాఁబట్టి "దైవం, యజ్ఞం" అనఁగా పరమాత్మతత్త్వమునకు క్రీడాస్థానమైన ఊర్ధ్వకుండలియందు జరుగు పూజా విధానమని తెలియవలయును. ఈదైవయజ్ఞమనెడు అంతరంగిక పూజావిధా నమునే కొందఱు యోగీశ్వరులు ఉపాసింతురు. మఱికొందఱు ఆత్మప్రయత్న ము చేతనే పరబ్రహ్మతత్త్వమునందు ఆత్మను లయింపఁజేయుదురు.

మూ॥ శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్విషయానన్యేఽపీంద్రి యాగ్నిషు జుహ్వతి॥ 26.

తా॥ ఇఁకఁగొందఱు శ్రోత్రాదులైన యింద్రియములను (జ్ఞానకర్మేం ద్రియములను) నిగ్రహమను నగ్నిలోవేల్చుచున్నారు. అనఁగా బాహ్యేంద్రి యములను విషయములయందు పోనీయక తమ యధీనముఁగావించుకొను చున్నారని చెప్పబడినది. ఇందు దుర్విషయములకు పోనీక నిలుపుకొన వచ్చునుకాని, ఆహారపానీయాదులకైనను పోకుండ నిలిపినారని యూహిం

చుకొనరాదు. మఱికొందఱు శబ్దస్పర్శాది విషయములను ఇంద్రియములనెడు అగ్నులయందు వేల్చుచున్నారు. అనఁగా విషయభోగములను సంపాదించి తెచ్చి యింద్రియములకు కొల్లగ "సప్లై" చేయుచున్నారని భావింపరాదు. విషయాసక్తిని ఉడిగించుకొని ఆహారాది విహిత కృత్యములయందు వర్తించుచున్నారని తెలిసికొనవలయును.

మూ॥ సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణకర్మాణిచాపరే।
ఆత్మసంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥ 27

తా॥ (26 శ్లోకమునందు "శ్రోత్రాది" అనుటచే దశేంద్రియములు మాత్రమే చెప్పఁబడినవి.) వేఱొకకొందఱు మనోబుద్ధి చిత్తాహంకారముల తోఁగూడ పదునాలుగింద్రియములచేఁ జేయఁబడు సమస్తకార్యములను, దశవిధములైన ప్రాణవాయువులచేఁజేయబడు బాహ్యాంతరకర్మలను జ్ఞానముచే వెలిఁగింపఁబడిన ఆత్మనిగ్రహమనెడు అగ్నిజ్వాలయందు వేల్చుచున్నారు. పదనేంద్రియవృత్తులు ఆత్మసమర్పణము చేసినట్లు చెప్పఁబడినదే కాని కర్మ మానుకొనవలయునని చెప్పలేదు ఇట్లు పదనేంద్రియములను నిగ్రహించు సాధనయోగమనఁబడును. "జ్ఞానదీపితే" అనుటవలన జ్ఞానము లేకున్న యోగము సిద్ధాంతము కాదని తెలియుచున్నది. కనుక యోగము, జ్ఞానము రెండును ఉండవలసినదే.

మూ॥ ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథా పరే।
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశితవ్రతాః॥ 28

తా॥ ఒకప్పుడుండి యింకొకప్పుండు పోవుదృశ్యవస్తువులతో అగ్నిహోత్రములను, దారుశిలాది విగ్రహములను, పెద్దలను అర్చించువారు; బాహ్యాంతరములయందలి అగ్నిచేతను, సూర్యకిరణములచేతను పదనేంద్రియములను తపింపజేయువారు, చిత్తశుద్ధికరమైన అభ్యాసయోగముచేయువారు; అవిధముగనే యింకఁగొందఱు ఆత్మవిద్యకు సంబంధించిన పాఠము చదువువారు; పరమాత్మయనఁగా నిట్టిదని చర్చించి తెలిసికొనువారు; మనోబుద్ధీంద్రియములను స్వాధీనము చేసికొనినవారు; తీవ్రములైన వ్రతముల ననుష్ఠించువారు (ఇట్టివారందఱు యజ్ఞములు చేసినవారేయని భావము)

మూ॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః॥ 29

తా॥ ప్రాణాయామము ననుసరించుటయే యుత్తమమని నమ్ముకొనిన మఱికొందఱు యోగులు ప్రాణాపానముల మార్గములను నిరోధించి అపానమునందు ప్రాణమును వేల్చుచున్నారు. అదేవిధముగా ప్రాణమునందు అపానము వేల్చుచున్నారు. (ఈయంశము 61 పత్రములోఁగొంత వ్రాయఁబడినది.)

వివ॥ మనము పీల్చుకొనుగాలిలో ప్రాణవాయువున్నది. బయటికి విడుచుగాలిలో అపానవాయువున్నది. అని యిదివఱకు చదివినట్లు జ్ఞాపకముండవచ్చును. ప్రాణవాయువుచరించు నాసామార్గమును, అపానవాయువుచరించు పాయురింద్రియమార్గమును బంధించి ఆపైన అపానమును రేచించిన స్వరమున ప్రాణమును పూరించుచున్నారు. అదేవిధముగా ప్రాణమునుపూరించిన స్వరమున అపానమును రేచించుచున్నారు.

1. అమృతనాదోపనిషత్తు: రేచకము, పూరకము కుంభకము అని ప్రాణాయామము మూఁడువిధములు. శరీరములోని వాయువును వెలుపల ఆకాశమునకు బోవిడిచి శూన్యభావమునందు పరమాత్మ చింతనము చేయుట రేచకము యొక్క లక్షణము. ఉత్పలనాళముచేత నోటితో జలమును పీల్చినట్లు వాయువును పీల్చుట. పూరకముయొక్క లక్షణము ఉచ్ఛ్వాస నిశ్వాసములు లేక శరీరాంగములు కదలకయుండి ఆత్మచింతనముచేయుట కుంభకముయొక్క లక్షణము నాసికాపుటము నొకదానిని వ్రేలితో బిగఁబట్టి మఱియొక దానిచే వాయువును పీల్చి అంపలి యుష్ణమును నిలుపవలయును. మనస్సును ఆత్మయందు నిల్పి ప్రణవనాదమును ధ్యానింపవలయును. ప్రక్కలకుఁగాని పైకిగాని, క్రిందికిఁగాని చూడఁగూడదు. యోగికి భయము, క్రోధము, మదము, అలసత్వము, ఉండరాదు. నిద్రాహారములయందు ఎక్కువ తక్కువలు లేక మితము కలిగి యుండవలయును. ఇట్లు లభ్యసించిన యోగికి మూఁడుమాసములకు జ్ఞానముకలును. ఆఱుమాసములకు మోక్షాధికారము కలుగును.

2. ధ్యానబిందూపనిషత్తు:-

20. శ్లో॥ ఇడయా వాయుమాపూర్య పూరయిత్వోదరస్థితమ్।
ఓంకారం దేహమధ్యస్థం ధ్యాయేజ్జ్వాలావలీవృతమ్॥

ఇడానాడిచే వాయువును సమగ్రముగ పూరకముచేసి యుదరమున నిశ్చలముగ నిలిపి తన దేహమధ్యమున జ్వాలావలీ సమావృతమైయుండు ప్రణవస్వరూపమైన పరమేశ్వర తత్త్వమును జింతింపవలయును.

21. శ్లో॥ బ్రహ్మ పూరక ఇత్యుక్తో విష్ణుఃకుంభక ఉచ్యతే।
రేచో రుద్ర ఇతి ప్రోక్తః ప్రాణాయామస్య దేవతాః॥

ప్రాణాయామమునకు దేవతలు బ్రహ్మ పూరకమనియు, విష్ణువు కుంభకమనియు, రుద్రుఁడు రేచకమనియుఁ జెప్పఁబడుదురు.

30 శ్లో॥ అతసీపుష్పసంకాశం నాభిస్థానే ప్రతిష్ఠితమ్।
చతుర్భుజం మహావిష్ణుం పూరకేణ విచింతయేత్॥

అగిసెపుష్పముతో సమానమైన వర్ణము కలిగినట్టియు, నాభిస్థానమున బ్రతిష్ఠింపఁబడి యుండునట్టియు, చతుర్భుజుఁడైన మహావిష్ణువును పూరకముచే ధ్యానింపవలయును. (ఈయుపనిషత్తులో 21 శ్లోకమునకును ఈ శ్లోకమునకును కొంచెము వైయర్థ్యము కనపడుచున్నది.)

31 శ్లో॥ కుంభకేన హృదిస్థానే చింతయేత్కమలాసనమ్।
బ్రహ్మాణం రక్తగౌరాభం చతుర్వక్త్రం పితామహమ్॥

కమలాసనస్థుఁడును, రక్తగౌర వర్ణుఁడును, చతుర్ముఖుఁడును, లోక పితామహుఁడు నైన బ్రహ్మను కుంభకముచేత హృదయస్థానమున ధ్యానింపవలయును. (ఈశ్లోకమునందును పైశ్లోకమునందువలెనే కొంచెము వైయర్థ్యము కానవచ్చుచున్నది)

32 శ్లో॥ రేచకేనతు విద్యాత్మా లలాటస్థం త్రిలోచనమ్।
శుద్ధస్ఫటికసంకాశం నిష్కలం పాపనాశనమ్॥

విద్యాస్వరూపుఁడైన యోగీశ్వరుఁడు తన లలాటస్థానమున (యోగముచే) ప్రతిష్ఠింపఁబడినట్టియు, శుద్ధస్ఫటికమువంటి తెల్లని వర్ణము కలిగి

నట్టియు, నిష్కళారూపుఁడైనట్టియు, సమస్తపాపములను నశింపఁజేయునట్టియు ముక్కంటీశ్వరుని రేచకముచే ధ్యానింపవలయును.

3. యోగతత్త్వోపనిషత్తు:- కుడిచేతి బొటనవ్రేలితో పింగళా నాడిని బట్టి యిడానాడిచేత నిదానముగా వాయువును పూరింపవలయును. పూరింపబడిన వాయును వాయుకోశమునందు నిదానముగా ఆయాసములేకుండ కుంభకము చేయువలయును. తరువాత ఆవాయువును పింగళానాడిచేత నిదానముగా విడువవలయును. మరల పింగళానాడిచేత నిదానముగ పూరించి శక్తికి మించకుండ కుంభకము చేయువలయును. మరల మెల్లగ ఇడానాడి ద్వారా రేచకము చేయువలయును. ఏనాడిచేత విడుచునో ఆనాడిచేతనే పూరింపవలయును వ్యత్యాసములుండ కూడదు వ్రేళ్లతో మోకాలిమీఁద వేగముగఁగాక నిదానముగఁగాక యేకరీతిని తాళము వేయునట్లు తట్టుచు అవి మాత్రలుగ లెక్కఁబెట్టుకొని 16 మాత్రల కాలము పూరకము, 64 మాత్రల కాలము కుంభకము, 32 మాత్రల కాలము రేచకము, అగునట్లు అనాయాసముగ నిదానముగఁ జెయువలయును. ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము, అర్ధరాత్రి యిట్లు ప్రతిదినము నాలుగు సారులుగ (ఒక్కొక్కసారి) 80 కుంభకములవఱకు చేయువలయును. మూఁడు మాసములు చేయునప్పటికి నాడులు శుద్ధియగును శరీరము కొంచెము కృశించి మంచివన్నె కలిగి తేలికగ నుండును. జీర్ణశక్తి బాగుండును. ఈయోగి ప్రాతస్స్నానము, ఉపవాసము, మొదలైన కాయక్లేశములను మానవలయును. ఉప్పు, కారము, పులుసు, కేవలము వేడివస్తువులు, తీక్ష్ణమైన వస్తువులు (కఠినపదార్థములు) ఉపయోగించుట మంచిదికాదు. మఱియు ఆవాలు, వృకసంభవములైన ఇంగువ మున్నగు వస్తువులు ఉపయోగింపరాదు. అగ్నిసాన్నిధ్యము, స్త్రీ సాన్నిధ్యము, పనికిరాదు. పాలు, నేయి, గోదుమలు, పెసలు, వరియన్నము తినవచ్చును.

4. త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు:— కుడిచేతితోనే ముక్కుపట్టుకొనవలయును. పింగళానాడియందలి వాయువును బయటికివిడువవలయును. ఇడానాడి ద్వారా 16 మాత్రల కాలములో పూరించి తరువాత 64 మాత్రల కాలము కుంభకము చేయువలయును. అటుపిమ్మట 32 మాత్రల కాలములో పింగళానాడిద్వారా రేచకము చేయువలయును. ఇట్లు మరల మరల చేయుఁ

గా దేహము నిండుకడవవలె గాలిచే నించుచున్నది. అందువలన నాడు లన్నియు వాయువుచే పూరింపబడుచున్నవి. హృదయము వ్యాకోచముం జెందుచున్నది. ఇట్లు సర్వభూతాత్మయైన పరమాత్మను లక్షించుచు ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము, అర్ధరాత్రి కాలములలో ప్రతిదినము నాలుగు పర్యాయములుగ 80 కుంభకములు చేయవలయును.

5. యోగచూడామణ్యుపనిషత్తు:- యోగి బద్ధ పద్మాసనస్థుండై చంద్ర స్వరమున వాయువునుపూరించి శక్తియున్నంతమాత్రము ధరింపవలయును. మరలసూర్యస్వరమున రేచింపవలయును. సూర్యస్వరమున పూరించికుంభకముచేసి చంద్రస్వరమున రేచింపవలయును. ఓంకారము మంత్రముగ జపముచేయుచు సూర్యచంద్రమండలములను ధ్యానింపవలయును. శ్వాసమయములైన12మాత్రలు పూరకము. 16మాత్రలుకుంభకము. 10మాత్రలురేచకము. అధముండైనయోగి 12మాత్రలుచేయును. మధ్యముండుదీనికి రెండింతలుచేయును ఉత్తముండుమూండింతలుచేయును. ఇట్టిద్విప్రణవాత్మకమైనప్రాణాయామ మనంబడును.

6. మండలబ్రాహ్మణోపనిషత్తు:-" పూరకకుంభకరేచకైః ష్షోడశచతుష్షష్టిద్వాత్రింశత్సంఖ్యయా యథాక్రమంప్రాణాయామః" 16 మాత్రలుపూరకము, 64 మాత్రలుకుంభకము, 32మాత్రలురేచకము క్రమముతప్పకచేసినది ప్రాణాయామము.

7. యోగశిఖోపనిషత్తు. 1 అధ్యా:— అభ్యాసయోగి సూర్యనాడిచేత వాయువును పూరించి నియతముగ కుంభకము చేయవలయును. చంద్రనాడిద్వారా రేచకము చేయవలయును. ఇట్లు రెండునాడులచేత మరల మరల చేయుచురాగా ఉదరరోగములు, క్రిమిదోషములు, శమించును. కంఠమునందు కఫాది దోషములు హరింపంబడును. (ఇంకను పెక్కువిశేషములు వర్ణింపంబడినవి)

8. యోగకుండల్యుపనిషత్తు: 1 అధ్యా. చిత్తము చలించుటకు కారణములు విషయవాసన, వాయువు. ఈరెంటిలో ఒకటి నశించినను రెండు నశించినట్లే. ముందువాయువును జయింపవలయును. ఇందుకు సాధనలు మితాహారము, ఆసనము, శక్తిచాలనము. (ఈమూండు విషయములు విపుల

ముగ వర్ణింపఁబడినవి. ఆ వివరమంతయు నిచ్చట వ్రాయఁబూనినచో ఇదే యొక గ్రంథమగును కాఁబట్టి చాలవఱకు వదలివేయఁబడినది.)

ప్రాణవాయును పూర్తిగ నిగ్రహించుట ప్రాణాయామము. శరీరము నందు వాయువును నిలుపుట కుంభకము. ఇది సహితకుంభకము, కేవలకుంభకము అని రెండువిధములు. కేవల కుంభకము సిద్ధించువఱకు సహితకుంభకము చేయవలయును ఈసహిత కుంభకమనునది సూర్యా, ఉజ్జాయీ, శీతళీ, భస్త్రీ, యని నాలుగువిధములు. అందు.

(1) సూర్య:- పద్మాసనస్థుడై సరస్వతీ నాడిని కదలింపవలయును. పింగళానాడిచేత వాయువును ఇష్టప్రకారము పూరింపవలయును. ఇట్లు పూరింపబడిన వాయువులో నాలుగింట ఒకభాగము వాయువు కపాల శుద్ధికి ఉపయోగపడవలయును. తరువాత ఇడానాడి ద్వారా మెల్లగరేచింపవలయును. ఇట్లు మాటిమాటికి చేయవలయును. దీనివలన వాతదోషము క్రిమిదోషము శమించును.

(2) ఉజ్జాయి:- నోరుమూసికొని రెండు స్వరములచేత వాయువును కొంచెము శబ్దము వినఁబడునట్లు నిదానముగ పీల్చుకొనవలయును, ఈ వాయువు కంఠస్థానమునుండి హృదయమువఱకు వ్యాపించునట్లు పైవిధముననే కుంభకము చేయవలయును. తరువాత ఇడానాడిద్వారా రేచకము చేయవలయును దీనివలన శిరమున జనించు ఉష్ణవ్యాధి క్షీణించును. కంఠమునందలి శ్లేష్మము హరింపఁబడును. నాడీజలోదర ధాతుగత దోషాది సమస్త రోగములు నశించును. శరీరాగ్ని వృద్ధియగును. నడచుచుండియు, నిలుచుండియు, ఈకుంభకము చేయవచ్చును.

(3) శీతళి:— నాలుకయందు ఒరసికొనిపోవునట్లు నోటితోవాయువును పీల్చుకొనవలయును. పూర్వోక్తరీతి కుంభకము చేయవలయును తరువాత రెండు ఘ్రాణరంధ్రములవెంట నిదానముగా బయటికి విడువవలయును. దీనివలన గుల్మప్లీహవిషాదులు, క్షయ పిత్తజ్వర విదాహములు శమించును.

(4) భస్త్రి:- పద్మాసనస్థుఁడై కడుపు, మెడ సమముగ నుంచుకొని, నోరు మూసికొని వాయువును ఘ్రాణముద్వారా ప్రయత్నపూర్వకముగా బయటికి విడువవలయును. ఆ వాయువు కంఠమునుండి కపాలమునందు తాఁ

కుచు శబ్దముతో వ్యాపించును. తరువాత ఇంచుమించుగా హృదయపద్మము వఱకు పోవునట్లు వేగముగా వాయువును పూరింపవలయును. మరల రేచింపవలయును. మరల పూరింపవలయును. ఇట్లు మరల మరల చేయుచుండవలయును. కమ్మరవానితిత్తివలె వేగముగ కదలుచుండవలయును. దేహమునకు శ్రమ దోచునట్లు, కడుపు నిండునట్లు సూర్యస్వరముచే పూరకము చేయవలయును. తర్జని వ్రేళ్లు లేకయే వాయువును నాసికామధ్యమున ధరింపవలయును. పూర్వోక్తరీతి కుంభకముచేసి యిడానాడిద్వారా రేచకము చేయవలయును. ఇందువలన కఫాద్యనేకరోగములు నశించును.

9 జాబాలదర్శనోపనిషత్తు 6 ఖం: ప్రణవ ప్రాణాయామము:- ఇడానాడిద్వారా 16 మాత్రలకాలము పూరకము చేయవలయును. ఈకాలములో అకారమును స్మరింపవలయును తరువాత ఆవాయువును ఉదరములో 64 మాత్రలకాలము కుంభకము చేయవలయును. ఈకాలములో ఉకారమును స్మరింపవలయును తరువాత మకారమును స్మరించుచు 32 మాత్రలకాలములో పింగళానాడిద్వారా నిదానముగా రేచకము చేయవలయును. మరల అకారమును స్మరించుచు పింగళానాడిచేత 16 మాత్రలు పూరించి ఉకారమును స్మరించుచు 64 మాత్రలు కుంభముచేసి మకారమును స్మరించుచు 32 మాత్రలు ఇడానాడిద్వారా రేచకము చేయవలయును. (రేచక పూరకములు లేకుండ కేవలము కుంభకమునే చేయు పద్ధతియున్నను అది దుర్లభమైనది కాఁబట్టి యిచ్చట వ్రాయలేదు)

10. శాండిల్యోపనిషత్తు: 1 అధ్యా.- పై యుపనిషత్తులలోఁ జెప్పఁబడిన ప్రాణాయామయోగ పద్ధతులన్నియు నిందు విపులముగ వ్రాయబడినవి కనుక అన్నింటికంటె ఈయుపనిషత్తు యోగులకు మిక్కిలి యుపయోగకరమని చెప్పవచ్చును.

శ్లో॥ ప్రాణం ప్రాగిడయా పిబేన్నియమితం భూయోఽన్యయా రేచయేత్।
పీత్వా పింగళయా సమీరణమథోబద్ధ్వా త్యజేద్వామయా।
సూర్యాచంద్రమసోరనేన విధినాభ్యాసం సదా తన్వతామ్।
శుద్ధా నాడిగణా భవంతి యమినాం మాసత్రయాదూర్ధ్వతః॥

ప్రాణవాయువును ముందుగా ఇడానాడిచే పీల్చుకొనవలయును. (తరువాత కుంభకము చేయవలయును.) మరల ఇంకొకనాడిచే రేచింపవలయును. పింగళానాడిచే పీల్చి కుంభకముచేసి యెడమనాడిచే విడువవలయును.

సూర్య చంద్ర నాడులయొక్క అభ్యాసము ఈవిధముగ ఎల్లప్పుడు చేయ వలయును. ఇట్లు మూడుమాసములు చేసినమీదట యోగులనాడులు శుద్ధ ములగును.

శ్లో॥ ప్రాతర్మధ్యందినే సాయమర్ధరాత్రేతు కుంభకాన్।
శనైరశీతిపర్యంతం చతుర్వారం సమభ్యసేత్॥

ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము, అర్ధరాత్రి యిట్లునాలుగు పర్యాయములు నిదానముగా ఎనుబది యగునంతవఱకు కుంభకములను బాగుగ అభ్యాసము చేయవలయును. (తక్కిన విషయములు కావలసినవారు ఉపనిషత్తు చదువవచ్చును.)

11. వరాహోపనిషత్తు: 5 అధ్యా:- లక్షింపఁబడుచున్న సాకారబ్రహ్మ నాశ్రయించి రేచకమును, పూరకమును కుంభకమునందు నిరోధింపవలయు ను. బాహ్యముగనుండు సమస్త విషయము రేచకమగును. (విసర్జింపఁబడిన ది.) శాస్త్రములుచదివి సంపాదించిన జ్ఞానము పూరకము (వెలినుండి ఆ కర్షింపఁబడినది.) తనంతటతానే తెలిసికొనిన జ్ఞానము కుంభకము. చిత్తము చే ఈవిధముగ అభ్యాసముచేయువాఁడు ముక్తుఁడగును. ఇందు సంశయము లేదు.

12. తేజోబిందూపనిషత్తు: 1 అధ్యా:- చిత్తము మొదలైన సర్వభావ ములయందు బ్రహ్మత్వముచేతనే కలిగిన భావనవలన సమస్తవృత్తులు నిరో ధింపఁబడుట ప్రాణాయామము. ఈజగత్తు నేనుకాదని తెలిసికొని యనురా గము వీడుటరేచకము. సర్వభూతాత్మ స్వరూపమైన బ్రహ్మస్వరూపమునేనని గ్ర హించుట పూరకము. ఏవృత్తియులేని నిశ్చలత్వము కుంభకము ఇట్టిది జ్ఞానులప్రాణాయామము ఊపిరాడకుండ ముక్కుబిగఁబట్టుకొనుట అజ్ఞా నుల ప్రాణాయామము.

మూ॥ అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః॥ 30

తా॥ నియతమైన విషయసంగ్రహముగల మఱికొందఱు యోగులు ప్రాణవాయువులను వశపఱచుకొని దేనిస్థానమునదానిని ఆత్మసమర్పణము

చేయుచున్నారు (తాముకర్తలుగాక బ్రహ్మభావముతోఁజూచుచున్నారు) వీరం
దఱుకూడ యజ్ఞము నెఱిఁగినవారే. యజ్ఞముచేఁబాపమును పోఁగొట్టుకొనిన
వారే.

మూ॥ యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్।
నాయంలోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ॥ 31

అర్జునా! పవనేంద్రియములు, గుణకర్మాదులు, మనోవృత్తులు అన్ని
యు యోగాగ్నియందు వేల్వఁబడినమీఁదట మిగిలియుండు అమృతమయ
మైన స్వస్వరూపమును అనుభవించువారు సనాతనమైన పరబ్రహ్మ స్వరూప
మునుజెందుదురు. ఇట్టి యజ్ఞముచేయనివానికి ఐహికసుఖమేలేదు. మఱి
యొకటి యొక్కడిది?

శ్లో॥ యే యే భావాః స్థితా లోకే తానవిద్యామయాన్ విదుః॥
త్యక్త్వా విద్వాన్ మహాయోగీ కథం తేషు నిమజ్జతి॥

లోకములో ఏ యే భావములుకలవో అవియన్నియు అజ్ఞానస్వరూప
ములేయని (జ్ఞానులు) ఎఱుఁగుదురు. అజ్ఞానమును వదలివేసిన మహాయో
గీశ్వరుఁడు ఆ ప్రకృతిభావములలో నెట్లుమునుఁగును? అజ్ఞానవృత్తులను
జ్ఞానాగ్నియందు వేల్చినయోగి బద్ధుఁడుకాఁడని భావము. (అన్నపూర్ణోపని
షత్తు 4. 4)

మూ॥ ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే।
కర్మజాన్ విద్ధి తాన్ సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥ 32.

తా॥ "వేదస్తత్త్వంతపోబ్రహ్మ, బ్రహ్మవిష్ణుః, ప్రజాపతిః బృహబ్రహ్మివృద్ధౌ"
(అమరనానార్థవర్గము.) ఈ విధముగా పెక్కురీతుల యజ్ఞములు నిగమ చో
దితములై ప్రవృత్తితత్త్వముద్వారా విస్తరించినవి (మిక్కిలిగ వ్యాపించినవి)
ఇవన్నియు దేహేంద్రియ కర్మలవలన ఉత్పన్నమైనవనియు, ఇందుకునేను
కర్తనుకాననియు ఈవిధముగఁదెలిసికొని మోక్షముఁజెందఁగలవు.

మూ॥ శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞా జ్జ్ఞానయజ్ఞః పరంతప।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే॥ 33.

తా॥ శత్రువుల తపింపఁజేయు అర్జునా! బాహ్యాపూజలయందు విగ్రహములు, అగ్నిహోత్రములు భౌతికవస్తువులే. పూజాపదార్థములు, ఉపకరణములు భౌతికవస్తువులే. ఇట్టి భౌతికద్రవ్యరూపమైన పూజావిధానమునకంటె జ్ఞానయజ్ఞముమేలు. (ఎందుకనఁగా) జ్ఞానముకలుగఁగా సమస్తమైన కర్మ అంతయు పరిసమాప్తమగుచున్నది. జ్ఞానయోగముచేయక అభ్యాసయోగమొకటి మాత్రముచేయుటచేఁ బ్రయోజనము లేదనిభావము.

శ్లో॥ తీర్థే దానే జపే యజ్ఞే కాష్ఠే పాషాణకే సదా।
శివం పశ్యతి మూఢాత్మా శివే దేహే ప్రతిష్ఠితే॥

తనదేహమునందే పరమశివుఁడు సర్వదాప్రతిష్ఠితుఁడైయుండఁగా దానినెఱుఁగని మూఢాత్ముఁడు ఎచ్చటనో తీర్థమునందు, దానమునందు, జపమునందు, యజ్ఞమునందు, కొయ్యయందు, ఱాతియందు దేవుఁడుండునని భ్రాంతుఁడై చూచుచున్నాఁడు. (జాబాలదర్శనోపనిషత్తు 4 ఖం 57 శ్లో)

శ్లో॥ అంతస్థం మాం పరిత్యజ్య బహిష్ఠం యస్తు సేవతే।
హస్తస్థం పిండముత్సృజ్య లిహేత్కూర్పరమాత్మనః॥

తనలోపలనేయుండు నన్నువిడిచిపెట్టి వెలుపల మఱెచ్చటనో దేవుఁడున్నాఁడనుకొని బాహ్యవస్తువును సేవించువాఁడెవఁడుకలఁడొ అట్టివాఁడు తన హస్తమునందున్న అన్నకబళమును పాఱవేసి మోచేతిని నాకుకొనినవాఁడగును. (జాబాలదర్శనోపనిషత్తు 4-58.)

శ్లో॥ సంత్యజ్య హృద్గుహేశానం దేవమన్యం ప్రయాంతి యే।
తే రత్నమభివాంఛంతి త్యక్తహస్తస్థకౌస్తుభాః॥

తమ హృదయమునందెయున్న పరమేశ్వరుని విడిచిపెట్టి యెవరైతే యితరదెవుని జేరుచున్నారో అట్టివారు తమహస్తమునందలి కౌస్తుభమణినిపాఱగొట్టుకొని స్వల్పమైన సామాన్యరత్నము నభిలషించినవారగు చున్నారు. (మహోపనిషత్తు 6-20)

శ్లో॥ జ్ఞానశౌచం పరిత్యజ్య బాహ్యే యో రమతే నరః।
స మూఢః కాంచనం త్యక్త్వా లోష్టం గృహ్ణాతి సువ్రత॥

మంచివ్రతముగల ఓ సాంకృతి మునీంద్రా! జ్ఞానతీర్థముతో ఆత్మను శుద్ధిచేసికొనక యెవఁడైతే జలముతో శరీరమును పై పైనకడుగుకొని అంతటితోనే పరిశుద్ధుఁడనైతినని మురియుచుఁ గ్రీడించుచున్నాఁడో అట్టి మూఢుఁడు బంగారమును పోఁగొట్టుకొని మంటిపెడ్డను పట్టుకొనినవాడగును.

(జాబాలదర్శనోపనిషత్తు 1 ఖం. 22 శ్లో.)

శ్లో॥ ఆత్మతీర్థం సముత్సృజ్య బహిస్తీర్థాని యో వ్రజేత్।
కరస్థం స మహారత్నం త్యక్త్వా కాచం విమార్గతే॥

జన్మసాగరమును దాఁటింపఁగల సర్వాంతర్యామి పరమాత్మతత్త్వము తనయందే యుండఁగా దానిని విసర్జించి బాహ్యతీర్థములను గుఱించి యెవ్వడు యాత్ర చేయఁబోవుచున్నాఁడో అట్టివాఁడు తన చేతియందున్న గొప్ప రత్నమును విసర్జించి గాజుఁకాతిని వెదకువాఁడగుచున్నాఁడు.

(జాబాలదర్శనోపనిషత్తు 4-50)

శ్లో॥ ఆత్మలింగం పరిత్యజ్య యో బాహ్యం లింగమర్చయేత్।
మాణిక్యదీపముత్సృజ్య చిత్రస్థం దీపమీహతే॥

తనయందేయుండు పరమాత్మ స్వరూపమైన శివలింగమును విడిచిపెట్టి వెలుపలఁగనఁబడు కృతకలింగము నెవడు పూజించుచున్నాడో అట్టివాఁడు మాణిక్యదీపమును విడిచిపెట్టి చిత్రపటమున వ్రాయఁబడిన దీపము నాశించుకొన్నవాడగును (విశ్వగీత 55)

శ్లో॥ యోఽంతర్బ్రహ్మసుఖం హిత్వా విషయానందమశ్నుతే।
స వైకుంఠపురంత్యక్త్వా కాంతారమనుధావతి॥

తన లోపల పరబ్రహ్మ తత్త్వమువలన కలుగు సుఖమును పోఁగొట్టుకొని తుచ్ఛమైన విషయానందము నెవఁడు గుడుచుచున్నాఁడో అట్టివాఁడు భగవద్ధామమైన వైకుంఠ నగరమును విడిచిపెట్టి అడవివెంబడి పరుగెత్తిపోయినవాఁడగును, (విశ్వగీత 56)

శ్లో॥ విస్మృత్య హృత్సమీశానం యో బాహ్యం పరిమార్గతి।
కల్పాగం సంపరిత్యజ్య ధుత్తూరం సముపాగతః॥

తన హృదయమునందేయున్న పరమేశ్వరుని మఱచి వెలుపల మఱెచ్చ టనో ఈశ్వరుఁ డనేవాఁడొకఁడుండునని యెవఁడు వెదుకఁబోవుచున్నాఁడో అట్టివాఁడు కల్పవృక్షమును విడిచిపెట్టి ఉమ్మెత్త చెట్టును జేరినవాఁడగును.

(విశ్వగీత 58 )

శ్లో॥ పాషాణ లోహమణి మృణ్మయ విగ్రహేషు।
పూజా పునర్జననభోగకరీ ముముక్షోః।
తస్మాద్యతి స్స్వహృదయార్చనమేవకుర్యా।
ద్బాహ్యార్చనం పరిహరేదపునర్భవాయ॥

ఱాళ్లతోను, లోహముతోను, మంటితోను, మాణిక్యములతోను నిర్మింప బడిన విగ్రహములయందుఁ జేయఁబడు పూజ ముముక్షువునకు పునర్జన్మ మును, భోగములను, కలుగఁజేయునది. అందువల్ల యతీశ్వరుఁడు తనలోఁ దాను మానసికపూజ చేయవలయును పునర్జన్మ రాహిత్యము కొఱకై బాహ్య పూజ వదలివేయవలయును. (మైత్రేయోపనిషత్తు 2-26 )

శ్లో॥ క్రియోత్పన్నైరనేకజైర్ద్రవ్యైర్మే నాంబ తోషణమ్।
భూతావమానినార్చాయామర్చితోఽహం నపూజితః॥

ఓ తల్లీ! అనేకములైన వివిధములైన కృతక పదార్థములతో నాకు సంతుష్టి కలుగదు. (ఆత్మవంతములైన) అన్యభూతముల నవమానించుచు (జడాత్మకములైన) విగ్రహములను పూజించువాని పూజ నాకుఁజెందదు.

(అధ్యా ఉత్త 7-75)

శ్లో॥ అశ్వమేధసహస్రస్య వాజపేయశతస్య చ।
యోగస్య కలయా తాత నతుల్యం విందతే ఫలమ్॥

వేయి యశ్వమేధయాగముల ఫలము, నూఱు వాజపేయముల ఫల ము అంతయును యోగాభ్యాసముచే పొందఁబడిన ఫలములో పదునాఱింట ఒకభాగమునకు సాటికాదు. (భారత శాంతి. 324-9 )

మూ॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః॥ 34.

తా॥ పరమాత్మ తత్త్వమును బాగుగఁ గాంచఁగలిగిన జ్ఞానులు (పూర్వోక్త శ్లోకములోఁ జెప్పఁబడిన) ఆ జ్ఞానయోగమును నీకు బోధింపఁగలరు (నీవు వారియొద్దజేరి) నమస్కరించి, సేవించి, బాగుగప్రశ్నించి తెలిసికొనుము.

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుర్గురుర్దేవస్సదాశివః।
న గురోరధికః కశ్చిత్త్రిషు లోకేషు విద్యతే॥

గురుఁడేబ్రహ్మ, గురుఁడే మహావిష్ణువు, దేవదేవుడైన సదాశివుఁడు గురుఁడే. గురునకంటె అధికుఁడు మూఁడు లోకములలో ఎవ్వఁడునులేఁడు

(యోగశిఖోపనిషత్తు 5-56.)

శ్లో॥ దివ్యజ్ఞానోపదేష్టారం దేశికం పరమేశ్వరమ్।
పూజయేత్పరయా భక్త్యా తస్య జ్ఞానఫలం భవేత్॥

దివ్యమైన జ్ఞానము నుపదేశించు పరమేశ్వరుఁడైన గురుని శ్రేష్ఠమైన భక్తితో పూజింపవలయును. అతనికి జ్ఞానఫలము కలుగును.

(యోగశిఖోపనిషత్తు 5-57)

శ్లో॥ గురూపదేశమార్గేణ సహసైవ ప్రకాశతే।
స్థూలం సూక్ష్మం పరంచేతి త్రివిధం బ్రహ్మణో వపుః॥

స్థూలము, సూక్ష్మము, పరము అని బ్రహ్మశరీరము మూఁడువిధములుగ నుండును. గురువులవారి యుపదేశపద్ధతిచేత అది శీఘ్రముగానే వెల్లడియగును. (యోగశిఖోపనిషత్తు 2-14)

శ్లో॥ యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ।
తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః॥

ఎవనికైతే దేవునియందు ఉత్తమమైన భక్తికలదో! దేవునియందెట్లో గురువునందును అట్లే యెవనికైతే యుత్తమమైన భక్తికలదో అట్టి మహాత్మునికి గదా యీచెప్పఁబడిన యర్థములు వెల్లడియగుచున్నవి (ఈశ్లోకముయోగశిఖోపనిషత్తు 2 అధ్యాయములోను, శ్వేతాశ్వతరోపనిషత్తు 6 అధ్యాయములోను చూడనగును.)

శ్లో॥ సర్వజ్ఞం సర్వగం శాంతం సర్వేషాం హృదయేస్థితమ్।
సుసంవేద్యం గురుమతాత్సుదుర్బోధమచేతసామ్॥

సర్వము నెఱిఁగినట్టియు, సర్వమును పొందియుండునట్టియు, సర్వజనుల హృదయమునం దుండునట్టియు పరబ్రహ్మతత్త్వము గురుమతానుసారముగా సులభముగ దెలియబడుచున్నది. మనస్సును స్వాధీనపెట్టుకొనని వారలకిది సుఖముగఁ దెలియదు. (యోగశిఖోపనిషత్తు 3-20)

"తద్దర్శనం సదాచార్యమూలమ్" ఆత్మసాక్షాత్కారము సదాచార్యుల వలన కలుగదగినది.

'తాదృశ యోగిపూజా యస్య లభ్యతే సోఽపి ముక్తో భవతి' అటువంటి యోగీశ్వరుని పూజ యెవనికి లభించుచున్నదో వాఁడుకూడ ముక్తుఁడగుచున్నాడు. (అద్వయతారకోపనిషత్తు)

'యథా జాత్యంధస్య రూపజ్ఞానం నవిందతే, తథా గురూపదేశేన వినా కల్పకోటిభిస్తత్త్వజ్ఞానం నవిద్యతే" పుట్టుగ్రుడ్డియైన వానికి రూపమును గ్రహించు తెలివి యెటులకలుగదో అటులే గురూపదేశము లేకుండ అనేక కోట్ల బ్రహ్మకల్పములకైనను తత్త్వజ్ఞానము కలుగదు. (మహానారాయణోపనిషత్తు 5 అధ్యా.)

శ్లో॥ శ్రద్ధాళుర్ముక్తిమార్గేషు వేదాంతజ్ఞాన లిప్సయా।
ఉపాయనకరోభూత్వా గురుం బ్రహ్మవిదం వ్రజేత్।
సేవాభిః పరితోష్యైనం చిరకాలం సమాహితః।
సదా వేదాంతవాక్యార్థం శృణుయాత్సుసమాహితః॥

మోక్షదాయకములైన యోగపద్ధతులయందు విశ్వాసముగల శిష్యుఁడు వేదాంతము తెలిసికొనవలయుననెడి ఆసక్తికలవాఁడై (ఫలపుష్పాదులైన) కానుకలు పట్టుకొని బ్రహ్మవేత్తయైన గురువును జేరవలయును. చాలకాలము గురువులయొద్ద చూపెట్టుకొని సేవించుచు ఆయనను సంతోషపరుపవలయును. ఎప్పుడును సమీపవర్తియైయుండి వేదాంతవాక్యముల వినుచు అర్థమును గ్రహింపవలయును. (నారద పరివ్రాజకోపనిషత్తు 6 ఉపదేశము 17-18 శ్లో) శివగీత 13 అధ్యా 19-20 శ్లోకములలోను ఇట్లే చెప్పఁబడినది. పైశ్లోకముల

బట్టిచూడ భౌతికయుద్ధచరిత్రమున శ్రీకృష్ణార్జున సంవాద భగవద్గీతా ఘట్టమును వినినంతనే జ్ఞానయోగము సిద్ధాంత మగునని చెప్పుటకు వీలుపడదు. జ్ఞానోపలబ్ధికి గురుసేవ ముఖ్యకారణమని యిందువలన తెలియుచున్నది.

మూ॥ యజ్జ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాండవ
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి॥ 35

తా॥ అర్జునా! దేనిని తెలిసికొనినమీదట ఈవిధముగ మరల మనోవైకల్యమును పొందకుందువో! అస్మచ్ఛబ్దలక్ష్యార్థమైన పరమాత్మయందు సర్వభూతములను అభేదముగా నీలోనివు దేనిచే ఇఁకమీదట చూడగలవో (అట్టి జ్ఞానయోగమును పూర్వోక్తశ్లోకరీతిగా తెలిసికొనుము)

మూ॥ అపిచేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥

తా॥ పాపముచేసిన వారందఱికంటె ఎక్కువపాపముచేసినవాఁడవైయుండినప్పటికిని జ్ఞానయోగమనెడు తెప్పచేతనేపాప సముద్రమునంతటిని లెస్సగదాఁటఁగలవు.

మూ॥ యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥ 37.

తా॥ అర్జునా! బాగుగ జ్వలించిన అగ్ని కొయ్యల నెట్లు కాల్చుచున్నదో అట్లే జ్ఞానయోగమనెడు అగ్ని సమస్తకర్మలను దహించుచున్నది. (వేదాంతపంచదశి 14 వ ప్రకరణములోను ఈశ్లోకము కనఁబడుచున్నది.)

శ్లో॥ యథాగ్నిస్సుసమిద్ధార్చిః కరోత్యేధాంసి భస్మసాత్।
తథా మద్విషయా భక్తిరుద్ధవైనాంసి కృత్స్నశః॥

ఓయి ఉద్ధవా! వికసించిన జ్వాలలుగల అగ్ని కొయ్యల నెట్లు కాల్చివేయుచున్నదో అట్లే నాయందలి భక్తి సర్వవిధముల పాపములను కాల్చివేయుచున్నది. (భాగవతము 11 స్కం. 14 అధ్యా. 19 శ్లో.)

వివ॥ జ్ఞానయోగముచే కర్మలు దహింపఁబడిన మీఁదట కర్మఫలము నుభవింపవలసిన పనియుండదు. ఈ కాలములో జ్ఞానయోగులమని చెప్పుకొను స్వాములలో కొంతమంది దేహబాధలు అనుభవించుచుండుట మన మెఱుగుదుము. అంతేకాదు పెక్కుమందిస్వాములు బాధకోర్వఁజాలక 'కోస్తాలు' తిరిగి వైద్యుల నాశ్రయించుచుండుటయుఁ జూచుచున్నాము. జ్ఞానముచే దహింపఁబడిన మీఁదట మరలఁ గర్మయెక్కడిదని యడుగఁగా వీరిచ్చు సమాధానము. "భావిజన్మములలో అనుభవింపఁదగిన అగామి, సంచితము అను రెండువిధముల కర్మలను మాత్రమే జ్ఞానాగ్ని దహింపఁగలదు కాని ఈ జన్మములో మరణ పర్యంతము అనుభవింపఁ దగిన ప్రారబ్ధకర్మను దహింపఁజాలదు." అని చెప్పుదురు.

శ్లో॥ జ్ఞానోదయాత్పురారబ్ధం కర్మ జ్ఞానాన్ననశ్యతి।
అదత్వా స్వఫలం లక్ష్యముద్దిశ్యోత్సృష్టబాణవత్।
వ్యాఘ్రబుద్ధ్యా వినిర్ముక్తో బాణః పశ్చాత్తు గోమతౌ।
న తిష్ఠతి భినత్త్యేవ లక్ష్యం వేగేన నిర్భరమ్॥

జ్ఞానోదయమునకు పూర్వమే ఆరంభింపఁబడినకర్మ జ్ఞానము వలన నశింపదు. లక్ష్యము నుద్దేశించి విడువఁబడిన బాణమువలె తన ఫలము నొసఁగకపోదు. అడవిలో వేఁటకాఁడు పెద్దపులి యని తలఁచి బాణమును విడిచిన తరువాత అది పులికాదు గోవుఅని వాఁడు తలఁచినను ఆబాణము నిలువదు. అతివేగముతో లక్ష్యమును ఛేదించుచునేయున్నది. (ఈశ్లోకములు అధ్యాత్మోపనిషత్తులోను వివేకచూడామణిలోను ఉన్నవి.) అని యిట్టి ప్రమాణములఁ జూపుదురు.

ఎన్నఁడో మఱియొక జన్మములో రాఁబోవుకర్మలను దహింపఁ గలిగిన జ్ఞానాగ్ని నేఁడు రేపు వచ్చు కర్మలను దహింపఁజాలక పోవుటయేమి? దూరమునందుండు కొయ్యలను కాల్పఁగలిగిన యగ్ని సమీపమునందలి కొయ్యలను కాల్పఁజాలక పోవుటయేమి? దానికట్టి శాపముండునా? రెండువిధముల కర్మలను కాల్చి మూఁడవ కర్మను కాల్పఁజాలక పోవుట నిజమేయైన యెడల పైగీతా శ్లోకములో కర్మశబ్దము ద్వివచనముగఁజెప్పక "సర్వకర్మాణి" అని బహువచనముగఁ జెప్పనేల! అని కొందఱడుగుచురు. ఇంకను.

శ్లో॥ నరోగో మరణం తస్య న నిద్రా న క్షుధా తృషా।
నచ మూర్ఛా భవేత్తస్య యో ముద్రాం వేత్తి ఖేచరీమ్।
పీడ్యతే నచ రోగేణ లిప్యతే నచ కర్మణా।
బధ్యతే నచ కాలేన యస్య ముద్రాస్తి ఖేచరీ॥

"ముదంహర్షంరాతి దదాతి ఇతిముద్రా. రాదానే" ఖేచరీముద్రను యెవడు తెలిసికొనుచున్నాఁడో అట్టి యోగికి రోగములేదు. మరణములేదు, నిద్రలేదు, ఆకలిలేదు, దాహములేదు, మూర్ఛయులేదు. ఎవనికి ఖేచరీముద్రకలదో అట్టివాఁడు రోగముచే పీడింపఁబడఁడు. కర్మచే అంటఁబడఁడు. కాలముచే బద్ధుఁడుకాఁడు. (ధ్యానబిందూపనిషత్తు 80 మొ)

శ్లో॥ అతీతానాగతం కర్మ వర్తమానం తథైవచ।
నకరోమి నభుంజామి ఇతి మే నిశ్చలా మతిః॥

నేను భూతభవిష్యద్వర్తమానములనెడు మూఁడు విధముల కర్మను చేయువాఁడనుకాను, అనుభవించువాఁడనుకాను అని నా బుద్ధి నిశ్చలమై యున్నది (అవధూతగీత 1-73)

శ్లో॥ నాహంచ దేహో జన్మమృత్యూ కుతో మే
నాహంప్రాణః క్షుత్పిపాసే కుతో మే।
నాహంచేతశ్శోకమోహౌ కుతో మే।
నాహంకర్తా బంధమోక్షౌ కుతో మే॥

నేను దేహమునుకాను (కనుక) నాకు జననమరణము లెక్కడివి? నేను ప్రాణమునుకాను (కనుక) నాకు ఆకలిదప్పులెక్కడివి? నేను మనస్సుకాను (కనుక) నాకు శోకమోహములెక్కడివి? నేను కర్తకాను (కనుక) నాకు బంధమోక్షములెక్కడివి? (సర్వసారోపనిషత్తు)

మఱియు ప్రాణాయామముచే ఆధివ్యాధులు నివారింపఁబడునని యుపనిషద్గ్రంథములలోఁ బెక్కుచోట్లఁ జెప్పఁబడినది. నా యనుభవములో సైతము ఇట్టి సాదృశములు కొన్నిచోట్లఁ జూచియుంటిని.

శ్లో॥ అహంబ్రహ్మేతి విజ్ఞానాత్ కల్పకోటిశతార్జితమ్।
సంచితం విలయం యాతి ప్రబోధాత్ స్వప్నకర్మవత్॥

నిద్రనుండి మేలుకొనఁగా స్వప్నములోఁ గనఁబడుచుండిన కర్మయంతయు అదృశ్యమైపోయినట్లు పురుషుఁడు నేను పరబ్రహ్మమయుఁడనని తెలిసికొనుటవలన నూఱుకోట్ల కల్పములనుండి సంపాదింపఁబడిన సంచితకర్మ శమించి పోవుచున్నది. (ఈశ్లోకము అధ్యాత్మోపనిషత్తులోను, వివేకచూడామణిలోను, వున్నది.)

శో॥ స్వమసంగముదాసీనం పరిజ్ఞాయ నభో యథా।
నశ్లిష్యతే యతిః కించిత్ కదాచిద్భావికర్మభిః॥

సంగరహితము, ఉదాసనీనము, ఆకాశమువలె నిర్మలమునైన తన స్వరూపమును లెస్సగఁ దెలిసికొనిన యతీశ్వరుఁడు ఎప్పుడేనియు భావికర్మలచేత కొంచెమైనను అంటబడడు. (ఈ శ్లోకము అధ్యాత్మోపనిషత్తులోను వివేకచూడామణిలో వున్నది.

శ్లో॥ అజరోఽస్మ్యమరోఽస్మీతి య ఆత్మానం ప్రపద్యతే।
తదాత్మనా తిష్ఠతోఽస్య కుతః ప్రారబ్ధకల్పనా॥

నేను వృద్ధత్వము లేనివాఁడను, మరణములేనివాఁడను, అని యెవడైతే స్వస్వరూపమును పొందియున్నాఁడో ఆ పరమాత్మతోఁగూడి స్థిరముగ నిల్చియుండు నాయతీశ్వరునకు ప్రారబ్ధకర్మ యొక్క కల్పనయెక్కడిది?

(అధ్యాత్మోపనిషత్తు 55)

సీ॥ నిఖిలరోగంబుల నిర్మూలముగఁజేయు భవభయంబులఁ నెల్ల బాఱఁదోలు।
బంధనంబుల బటాపంచలు గావించి నొలయు నాపదలను నులిమివైచు।
శాత్రవవిజయంబుసతతంబుసమకూర్చుఁదూలించు బహువిధదుఃఖములను।
దలఁజూపకుండ దుర్దశలను దొలఁగించు సకలశుభంబుల సంగ్రహించు॥

(సీతారామాంజనేయ సంవాదము. 1. అశ్వాసము. 64 పద్యము)

పైఁజెప్పఁబడిన గ్రంథప్రమాణములు స్థూలదృష్టితోఁ జూచువారికి పరస్పర విరుద్దములుగా కనబడవచ్చును. ప్రారబ్ధమనగా నేమో తిన్నగ విమర్శింపని కారణముచే మన వేదాంతస్వాములలో అభిప్రాయభేదములు కలుగవలసి వచ్చినది. "ప్రకర్షేణ అరభ్యత ఇతిప్రారబ్ధః" అను సూత్రము

వలన దేహోత్పత్తితో ఆరంభింపఁబడి దేహాంతముతో ముగియునది ప్రారబ్ధ కర్మయనఁబడును. ఆధివ్యాధులు దేహముతో ఆరంభింపఁబడక, దేహాంతము దాఁక నిలిచియుండక నడుమ నడుమ వచ్చుచున్నవి పోవుచున్నవి. కొన్ని వ్యాధులు ఔషధచికిత్సచేతను, మంత్రచికిత్సచేతను దేవతాపూజలచేతను, దానజపహోమాదులచేతను, యోగాభ్యాసముచేతను, పోవుచుండుటమనముచూచుచున్నాము. కనుక నిట్టివి ప్రారబ్ధములనిన కొందఱు విమర్శకులు ఒప్పుకొనరు శీతోష్ణములు. క్షుత్పిపాసలు, ఉచ్ఛ్వాస నిశ్వాసములు, నిమేషోన్మేషములు మొదలైన శారీరకర్మలు దేహముతో వచ్చుచున్నవి. దేహముతో తీఱిపోవుచున్నవి జ్ఞానోదయమునకు పూర్వమున్నవి. అనంతరము దేహాంతముదాఁక నున్నవి జానముచే నశింపవు ఇట్టివే ప్రారబ్ధకర్మలు కావచ్చునని పైవిమర్శకులందురు. అభ్యాసయోగము చేయక జ్ఞానయోగము మాత్రమే చేసిన వారియందు ఆధివ్యాధులు సైతము నశింపవని కొందఱిమతము.

యోగబలముచే రోగములను మాన్పుకొనఁ గలిగిన యతీశ్వరులకంటె తమకట్టి శక్తియుండియు శరీరవ్యాధులను మఱచి స్వాత్మ నిరీక్షణముచేయు యోగీశ్వరులు గొప్పవారు.

మూ॥ నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి॥ 38.

తా॥ జ్ఞానయోగముతో సమానమైనది. పవిత్రమైనది లోకములో మఱేదియు లేదుసుమా! అభ్యాసయోగమునందు బాగుగ కృతార్థుఁడైన యతీశ్వరుఁడు కాలము కూడివచ్చినప్పుడు తనలోఁదానే అట్టి జ్ఞానయోగమును పొందుచున్నాఁడు.

మూ॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః।
జ్ఞానంలబ్ధ్వా పరాం శాంతిమచిరేణాధిగచ్ఛతి॥ 39.

తా॥ (గురువులయందు) భక్తి (విశ్వాసము) జ్ఞానమునందు మిక్కిలి అసక్తి. సమగ్రమైన యింద్రియ నిగ్రహముగల పురుషుఁడు జ్ఞానలాభముఁ గాంచుచున్నాఁడు. అట్లు జ్ఞానలాభముఁగాంచి శీఘ్రకాలములో శాంతి పొందుచున్నాఁడు.

శ్లో॥ శ్రుత్వా స్పృష్ట్వాచ భుక్త్వాచ దృష్ట్వా జ్ఞాత్వా శుభాశుభమ్।
నహృష్యతి గ్లాయతి యస్సశాంత ఇతి కథ్యతే॥

శుభాశుభరూపమైన కర్మఫల ప్రాప్తిని వినియు, స్పృశించియు, అనుభవించియు, చూచియు, తెలిసికొనియు శుభముచే సంతోషమునుగాని, అశుభముచే జేటునుగాని, యెవఁడు పొందడో అట్టివాడు శాంతిపొందిన వాడని చెప్పబడును (మహోపనిషత్తు 4-32) శ్రద్ధ, ఇంద్రియనిగ్రహము వైరాగ్యముగల వానికే శాంతిపొందుటకు సాధ్యము,

మూ॥ అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి।
నాయంలోకోఽస్తి నపరో నసుఖం సంశయాత్మనః 40.

తా॥ నిత్యమైనదేదో, అనిత్యమైనదేదో తెలిసికొను తెలివిలేక, పెద్దలు బోధించుజ్ఞానవాక్యములయందు విశ్వాసములేక మఱియు అట్టిజ్ఞానవాక్యములయందుసంశయములనుకూడ పుట్టించుకొనుస్వభావము కలిగియుండువాఁడు మిగుల చెడిపోవును. సంశయ స్వభావము కలవానికి ఈలోకములేదు, పరలోకములేదు. సుఖములేదు.

శ్లో॥ అసంశయవతాం ముక్తిః సంశయావిష్టచేతసామ్।
నముక్తిర్జన్మ జన్మాంతే తస్మాద్విశ్వాస మాప్నుయాత్॥

సంశయము లేనివారలకు మోక్షమున్నది. సంశయచిత్తులకు ప్రతిజన్మాంతమందును ముక్తిలేదు. అందువలన భగవద్విశ్వాసమును సంపాదించుకొనవలయును. (మైత్రేయోపనిషత్తు 2 అ. 16. శ్లో.)

మూ॥ యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్।
ఆత్మవంతం నకర్మాణి నిబధ్నంతి ధనంజయ॥ 41.

తా॥ అర్జునా! అభ్యాసయోగముచే సర్వకర్మలను భగవత్తత్త్వమునందు సంక్షేపించి జ్ఞానయోగముచే సంశయములనెల్ల ఖండించి పరిశుద్ధాత్మను పొందియుండు యతీశ్వరుని కర్మలు బంధింపవు.

మూ॥ తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః।
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత॥ 42.

తా॥ అర్జునా! (సంశయములేనివానిని కర్మలుబంధింపవు.) అందువలన అజ్ఞానముచే కలిగినట్టియు, నీమనస్సులో నాటుకొనియుండునట్టియు సంశయమును స్వకీయమైన జ్ఞానయోగమనెడు ఖడ్గముచేత ఖండించి యోగమును అనుష్ఠింపుము. లెమ్ము. (అభ్యాసయోగమువలన చిత్తశుద్ధియు, జ్ఞానయోగమువలన సంశయ విచ్ఛేదము కలుగును. కనుక రెండు వర్ణింపఁ బడినవి.)

ఇది శ్రీమహాభారతము· భీష్మపర్వములో జ్ఞానయోగమనెడు ఇరువది యెనిమిదవ అధ్యాయము.

ఓం· తత్. సత్.



# శతపత్రము

# 96

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 29 అధ్యాయము.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.

మూ॥ సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగంచ శంససి।
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥ 1.

తా॥ ఓ కృష్ణా! కర్మలను సన్యసింపుమని చెప్పుచుండియు, మరల కర్మయోగమును ఉగ్గడించిచెప్పుచున్నాడవు. కర్మను సన్యసించుట, చేయుట యను నవిరెండును పరస్పర విరుద్ధకార్యములు. ఈరెండుకార్యములను ఒకఁడుచేయుట కెట్లువీలుపడును? ఈరెంటిలో నేది మంచిదని నిశ్చయింపబడినదో దాని నొకదానినె నాకుఁ జెప్పుము.

శ్రీ భగవానుఁడు చెప్పుచున్నాఁడు.

మూ॥ సన్న్యాసఃకర్మయోగశ్చ నిఃశ్రేయస కరావుభౌ।
తయోస్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే॥ 2.

తా॥ కర్మయోగము (అభ్యాసయోగము) విడిచిపెట్టినను మోక్షమున్నది. చేయుచున్నను మోక్షమున్నది ఈరెండింటియందును కర్మసన్న్యాసమునకంటె కర్మయోగము మంచిది. (వైరాగ్యముతోఁ గూడినవాని కీరెండువిధములచేత మోక్షము లభింపవచ్చును. కాని కర్మమానుకొనుటచే దేహయాత్రయందు కొంతచిక్కు వచ్చుచున్నది కనుక కర్మచేయుటే మంచిది.)

శ్లో॥ యోగేనరహితం జ్ఞానం నమోక్షాయ భవేద్విభో॥
జ్ఞానేనైవ వినాయోగో నసిద్ధ్యతి కదాచన।
జన్మాంతరైశ్చ బహుభిర్యోగో జ్ఞానేన లభ్యతే॥
జ్ఞానంతు కర్మనైకేన యోగాదేవ ప్రజాయతే।
తస్మాద్యోగా త్పరోనాస్తి యోగమార్గస్తు మోక్షదః॥

యోగాభ్యాసము లేకపోవుటచే పవనేంద్రియములు విషయాదులవెంట పరిభ్రమించుచుండ గ్రంథములు చదివికాని, వేదాంతస్వాములవలన విని కాని "పరమాత్మ పుట్టదు, చావదు, చీల్పఁబడదు, కాల్పఁబడదు, నిత్యము నిర్మలము, అఖండము, ఆనందమయము." అని యిట్లు విచారించుటచేతనే కలిగిన జ్ఞానము మోక్షము నొసఁగఁజాలదు. భగవత్తత్త్వ మిట్టిదని తెలిసికొనక, దానివలన దివ్యసుఖము చవియెఱుఁగక కేవలము పవనేంద్రియములను మాత్రము బిగఁబట్టుకొని కూర్చుండుట యెన్నఁటికైన నిష్ప్రయోజనమే. (కావున యోగము, జ్ఞానము రెండును నుండవలసినదే) జ్ఞానముచేత పెక్కుజన్మములకు యోగము లభించుచున్నది. యోగమువల్లనైతేనో ఒక్క జన్మముచేతనే జ్ఞానము కలుగుచున్నది. ఆయోగమునకంటె మేలైనది మఱి యొకటిలేదు. యోగపద్ధతి మోక్షమునిచ్చునది. (యోగశిఖోపనిషత్తు 1అధ్యా)

శ్లో॥ జన్మాంతరశతాభ్యస్తా మిథ్యా సంసారవాసనా।
సా చిరాభ్యాసయోగేన వినా న క్షీయతే క్వచిత్॥

అనేక జన్మాంతరములనుండి యభ్యాసపడి నట్టియు, అసత్యమైనట్టియు ఈ సంసృతియందలి యాసక్తి చాలకాలము అభ్యాసయోగము చేసిన దప్ప ఇఁకనెందునను క్షీణింపదు. (ముక్తికోపనిషత్తు 2-14)

శ్లో॥ శుద్ధే చేతసి తస్యైవ స్వాత్మజ్ఞానం ప్రకాశతే।
తస్మాజ్జ్ఞానం భవేద్యోగాజ్జన్మనైకేన పద్మజ।
తస్మాద్యోగం తమేవాదౌ సాధకో నిత్యమభ్యసేత్॥
ముముక్షుభిః ప్రాణజయః కర్తవ్యో మోక్షహేతవే॥

ఓ పద్మజా! అభ్యాసయోగమువలన చిత్తశుద్ధికాగా ఆ యతీశ్వరునికే స్వకీయమైన ఆత్మజ్ఞానము ప్రకాశించుచున్నది. ఆ యోగమువలన ఒక్క జన్మముతోనే జ్ఞానము కలుగగలదు. అందువలన సాధకుఁడు మొదట ఆయోగమునే నియతముగ అభ్యాసము చేయవలయును. మోక్షము నిమిత్తమై ప్రాణవాయువులను నిగ్రహించుట ముముక్షువులకు కర్తవ్యము.

(యోగశిఖోపనిషత్తు 1 అ. 65-66 శ్లో.)

మూ॥ జ్ఞేయస్సనిత్యసన్న్యాసీ యో నద్వేష్టి న కాంక్షతి।
నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధాత్ప్రముచ్యతే॥ 3

తా॥ అర్జునా! ఎవఁడైతే ద్వేషమును, అనురాగమును పొందఁడో వాఁడు నిత్యసన్న్యాసియని తెలియవలెను. సుఖదుఃఖాది ద్వంద్వములకు లోఁబడనివాఁడు జన్మబంధమునుండి సుఖముగ విడువబడుచున్నాఁడు.

శ్లో॥ నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థ స్సర్వత్ర సమదర్శనః।
తురీయః పరమో హంసస్సాక్షాన్నారాయణో యతిః॥

సుఖదుఃఖాది ద్వంద్వములఁ బొందక శుద్ధసత్త్వ ప్రధానుఁడై సర్వభూతములను సమభావముతోఁ జూచుచు ప్రకృతిని మఱచి పరమహంస స్వరూపముఁజెందిన యతీశ్వరుఁడు సాక్షాత్తు నారాయణుఁ డగును.
(నారద పరివ్రాజకోపనిషత్తు 4 ఉ ప-13-14 శ్లో)

మూ॥ సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః
ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విందతే ఫలమ్॥ 4.

తా॥ జ్ఞానయోగము (కర్మసన్న్యాసము) కర్మయోగము వేఱువేఱు అని మూఢులు చెప్పుదురు. జ్ఞానులటుల చెప్పరు. ఇందొకదానినైనను పూర్తిగ అభ్యసించియుండినవాఁడు రెండింటి ప్రయోజనమునులెస్సగ పొందగలడు.

వివ॥ చిత్తోపశమము, వాసనాక్షయము, తత్త్వజ్ఞానము ఈమూఁడు పరస్పర కారణములతోఁ గూడుకొని దుస్సాధ్యములైయుండును. ఈమూఁడింటిని ఒకటేకాలములో ఒకటేసాధనతో చాలదినములు అభ్యాసముచేసి సాధింపవలయును. కాని వేఱువేఱు సాధనలతో ఒక దానిని విడిచిపెట్టి యింకొక దానిని సాధించుటకు వీలుపడదు. అని అన్నపూర్ణోపనిషత్తు 4 అధ్యాయములో చెప్పఁబడి యున్నందున చిత్తోపశమము, వాసనాక్షయముగావించు అభ్యాసయోగము వేఱనియు, తత్త్వజ్ఞానముఁ గలిగించు సాంఖ్యము వేఱనియుఁ జెప్పరాదు. ఈరెంటికిని అంతిమ ప్రయోజనమొకటే కాఁబట్టి అంతయు నొకటేయని భావము.

మూ॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే।
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి సపశ్యతి॥ 5.

తా॥ జ్ఞానయోగులకు ఏపదవి లభించుచున్నదో అపదవి కర్మయోగులకుఁ గూడ లభించుచున్నది. (ఈ రెండుపద్ధతులవలన గలుగు ప్రయోజన మొకటే కనుక) సాంఖ్యయోగమును, కర్మయోగమును రెంటిని అభేదము

గఁ జూచువాఁడెవఁడో వాఁడే తత్త్వజ్ఞుఁడు. (వేదాంతపంచదశి 12 ప్రకరణము 82 శ్లోకము ఇంచుమించుగ నిట్లేయున్నది.)

శ్లో॥ యదేవ యోగాః పశ్యంతి తత్సాంఖ్యైరపి దృశ్యతే।
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి స తత్త్వవిత్॥

అభ్యాసయోగులు దేనిని గాంచుచున్నారో అవి (పరమాత్మతత్త్వము) సాంఖ్యయోగులచేతసైతము తెలియఁబడుచున్నది. సాంఖ్యయోగము, అభ్యాసయోగము ఒకటేకాని వేఱుకాదని సమదృష్టితో ఎవఁడు చూచుచున్నాడో అట్టి యతీశ్వరుఁడే పరబ్రహ్మ తత్త్వము నెఱిగినవాఁడు.

(భారతము శాంతి. 317 అధ్యా. 4 శ్లోకము)

మూ॥ సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః।
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి॥ 6.

తా॥ అర్జునా! అభ్యాసయోగముచేయకయే సన్న్యసించినవానికి విషయవాసన క్షీణింపకపోవుటచేతను, మనోవృత్తులు నశింపకపోవుటచేతను తత్త్వజ్ఞానము కలుగదు అందువల్ల దుఃఖముపొందుటకు కారణమగును. అభ్యాసయోగముతోఁ గూడుకొని తత్త్వచింతనముచేయు మునీశ్వరుఁడు బ్రహ్మపదము నెందును. (బ్రహ్మనిష్ఠయొక్క అపరిపక్వదశ కర్మయోగము, పరిపక్వదశ జ్ఞానయోగము అని యిందువలన తెలియుచున్నది కావున రెంటికి భేదములేదని చెప్పవచ్చును.

శ్లో॥ యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతీహ భో।
యోగోఽపి జ్ఞానహీనస్తు నక్షమో మోక్షకర్మణి।
తస్మాజ్జ్ఞానంచ యోగంచ ముముక్షుర్దృఢమభ్యసేత్॥

అభ్యాసయోగములేకుండ జ్ఞానయోగముకాని, జ్ఞానయోగములేకుండ అభ్యాసయోగముగాని ఏదో యొకదానినే చేసినయెడల అది మోక్షమునొసఁగఁజాలదు. అందువలన మోక్షము కోరినవాడు జ్ఞానయోగమును రెంటిని గట్టిగ అభ్యాసము చేయవలయును. (యోగశిఖోపనిషత్తు 1 అ 13-14 శ్లో. మఱియు యోగతత్త్వోపనిషత్తు 14-15 శ్లోకములలో కొంచెము వర్ణభేదముతో నిట్లే వ్రాయబడినది)

మూ॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి నలిప్యతే॥ 7.

తా॥ అభ్యాసయోగముతోఁ గూడిన వానియందు విషయరాగాదులు క్షీణించుటచే నిర్మల స్వభావుడగుచున్నాఁడు. అందువల్లనే చిత్తోపశమము, ఇంద్రియనిగ్రము గలుగును. సర్వభూతములయందు ప్రకాశించు పరమాత్మ నాకంటే అన్యముకాఁదను జ్ఞానమును పొందును. ఇట్టియోగీశ్వరుడు నియతకర్మ ఆచరించుచుండినను అతనికి కర్మఫలమంటదు.

శ్లో॥ ఏకో వశీ సర్వభూతాంతరాత్మా।
ఏకం రూపం బహుధా యః కరోతి।
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా।
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్॥

ఏకస్వరూపమైనట్టియు, సర్వభూతములయందు అంతరాత్మయై యుండునట్టియు, ఒక్కరూపమును అనేక విధములుగాఁదోఁపఁజేయునట్టియు, తమ లోపలనే నివసించియుండునట్టియు, ఆభగవత్తత్త్వము నెవ్వరుచూతురో వారు జ్ఞానులు. వారికి సుఖము శాశ్వతమైయుండును. ఇతరులకులేదు.

(కఠోపనిషత్తు 5-12 శ్లో ఈశ్లోకము శ్వేతాశ్వతరోపనిషత్తు 6 అధ్యాయములో కొంచెము వర్ణభేదముతో నున్నది )

శ్లో॥ ఏకో హుతాశో బహుధా సమిధ్యతే
ఏకస్సూర్యస్తపసో యోనిరేకః।
ఏకో వాయుర్బహుధా వాతిలోకే॥
మహోదధిశ్చాంభసాం యోనిరేకః।
పురుషశ్చైకో నిర్గుణో విశ్వరూపః।
తం నిర్గుణం పురుషం చావిశతి॥

అగ్నియొకఁడే అనేకవిధముల వెలుగుచున్నాఁడు. సూర్యుఁడొకఁడే అనేక కిరణములకు ఉత్పత్తికారణ మగుచున్నాఁడు. వాయువొకటే లోకములో అనేకవిధముల వీచుచున్నది. సముద్రమొకటే యనేకజలముల యుత్పత్తికి కారణమగుచున్నది. నిర్గుణుఁడైన పరమాత్మయొకఁడే సమస్తప్రపంచ రూపుఁడైయున్నాడు. రూపనామములుగల వస్తువులు ఆనిర్గుణ పరమాత్మ యందే లయించుచున్నవి. సర్వము తానైయున్నాఁడు.

(నారాయణీయము 2-10 మొ.)

శ్లో॥ ఏకేనైవతు పిండేన మృత్తికాయాశ్చ గౌతమ।
విజ్ఞాతం మృణ్మయం సర్వం మృదభిన్నం హి కార్యకమ్॥

ఓ గౌతమమునీంద్రా! ఒకటే మంటిముద్దతోఁ జేయఁబడిన దంతయు మన్నేయగును కాని మంటికంటే వేఱైనది కాదుకదా?

(పంచబ్రహ్మోపనిషత్తు 29)

"యోఽసౌ సూర్యే తిష్ఠతి, యోఽసౌ గోషు తిష్ఠతి, యోఽసౌ గోపాన్ పాలయతి, యోఽసౌ సర్వేషు దేవేషు తిష్ఠతి యోఽసౌ సర్వైర్దేవైర్గీయతే, యోఽసౌ సర్వేషు భూతేష్వావిశ్య భూతాని విదధాతి స వోహి స్వామీ భవతి"

ఎవఁడైతే సూర్యునియందున్నాఁడో, ఎవఁడు గోవులయందున్నాఁడో, ఎవఁడు గోపబృందములను రక్షించుచున్నాఁడో, ఎవఁడు సమస్త దేవతల యందున్నాఁడో, ఎవఁడు సమస్తదేవతలచేఁ గీర్తింపఁబడుచున్నాఁడో, ఎవఁడు సమస్తభూతముల యందావేశించి భూతములను భరించుచున్నాఁడో అతఁడు మీకు స్వామియగును (గోపాలోత్తరతాపిన్యుపనిషత్తు.)

మూ॥ నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్।
పశ్యఞ్ శృణ్వన్ స్పృశఞ్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపఞ్ శ్వసన్
ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్॥ 9.

తా॥ "యుక్తః తత్త్వవిత్" అనుటచే అభ్యాసయోగమును, జ్ఞానయోగమును చేసినవాఁడని భావము. అట్లగుటచే వాసనాక్షయము, చిత్తోపశమము, తత్త్వజ్ఞానము అన్నియు కలిగియుండును. అట్టియతీశ్వరుఁడు వీక్షించుచు, ఆలించుచు, స్పృశించుచు, ఆఘ్రాణించుచు, భుజించుచు, పోవుచు, నిద్రించుచు, ఊపిరిఁగొనుచు, భాషించుచు, విసర్జించుచు, గ్రహించుచు, కన్నులు తెఱచుచు, మూయుచు ఉండియు నేనీకార్యములు చేయుచున్నాఁడనని కొంచెమైనను తలఁపఁడు. ఇంద్రియములకు ప్రయోజనములైన విషయములయందు ఇంద్రియములే వర్తించుచున్నవని తలఁచును.

శ్లో॥ పశ్యఞ్ శృణ్వఞ్ స్పృశఞ్ జిఘ్రన్నశ్నన్ గృహ్ణన్ వదన్ వ్రజన్
ఈహితానీహితైర్ముక్తో ముక్త ఏవ మహాశయః॥

చూచుట, వినుట, సోఁకుట, అఘ్రాణించుట, భుజించుట, గ్రహించుట, భాషించుట, నడచుట మొదలైన కర్మలన్నియు ఇంద్రియ వ్యాపారములోఁజేరినవి. ఇవి జన్మముతో ఆరంభింపఁబడినవి. కనుక ప్రారబ్ధకర్మలనఁబడును. ఈకర్మలలోఁదేనియందును ఇచ్ఛలేక ద్వేషములేక అన్నిఁటికి విలక్షణుఁడైయుండు మహాశయుఁడు ముక్తుఁడే యగును. (అష్టావక్రగీత 17 ప్ర 12 శ్లో)

శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్ నిమిషన్నపి।
నిరస్తమనసానందః సంవిన్మాత్రపరోఽస్మ్యహమ్॥

భాషించుచు, విసర్జించుచు, గ్రహించుచు, కన్నులు తెఱచుచు మూయుచు ఉండియు నేనీ కర్మలయందలి జ్ఞప్తితో ఆనందపడను. జ్ఞానమును మాత్రమే శ్రేష్ఠముగ నమ్మియున్నాడను. (సన్న్యాసోపనిషత్తు 2-47)

శ్లో॥ గచ్ఛంస్తిష్ఠన్నుపవిశ ఞ్ఛయానోవాన్యథాపివా।
యథేచ్ఛయావసేద్విద్వానాత్మారామః సదామునిః॥

ఎల్లెడల తనయందే తాను గ్రీడించు మునీశ్వరుఁడు నడుచుచు, నిలుచుచు, కూర్చుండుచు, శయనించుచు. ఇతరకార్యములనుకూడ చేయుచు ఎల్లప్పుడును తనయిష్టప్రకారము నివసించును (కుండికోపనిషత్తు 28) ఇవన్నియు సుకృత దుష్కృతములతో సంబంధపడని శారీరకర్మలు.

మూ॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతియః
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా॥ 10.

తా॥ విహితకర్మలను పరబ్రహ్మతత్త్వమునందు సంక్షిప్తముగావించి ఫలాసక్తిని వదలివేసి యెవఁడు చేయుచున్నాఁడో అట్టివాడు నీటిచే అంటఁబడని తామరాకువలె పాపముచే అంటుకొనఁబడఁడు. ( కొందఱుస్వాములు దుష్కార్యములు చేయుచు తమకు దోషమంటదని యిట్టిశ్లోకముల ప్రమాణముగఁ జూపుదురు. యతీశ్వరుఁడు దుష్కార్యము చేయుడని తెలియవలయును.)

మూ॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి।
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మసుద్ధయే॥ 11

తా॥ యోగీశ్వరులు ఆత్మశుద్ధి (జ్ఞానయోగప్రాప్తి) కొఱకు ఆసక్తిని విడచిపెట్టి శరీరముచేతను, మనస్సుచేతను, బుద్ధిచేతను, కేవలము ఇంద్రియములచేతను విహితకర్మ (అభ్యాసయోగము) చేయుచున్నారు. (8 9 శ్లోకములలో జెప్పబడిన కర్మయని కొందరందురు.)

"అంతస్సర్వ పరిత్యాగీ బహిఃకురు యథాగతమ్"

అంతరంగమున సర్వమును పరిత్యజించి బహిరంగమున యథారీతి కర్మచేయుము. (అన్నపూర్ణోపనిషత్తు 5 అ. 116 శ్లో)

శ్లో॥ అంతస్సంత్యక్తసర్వాశో వీతరాగో వివాసనః।
బహిస్సర్వసమాచారో లోకే విహర విజ్వరః॥

అంతర్యములో ఆశ, అనురాగము, విషయవాసన లేనివాఁడవై బాహ్యములో సర్వము ఆచరించుచు లోకములో సంతాపము లేనివాఁడవై విహరింపుము. (మహోపనిషత్తు 6 అ. 67 శ్లో.)

మూ॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥ 12.

తా॥ అభ్యాసయోగము చేసినవానికి వాసనాక్షయము, మనోనిగ్రహము కలుగుచున్నవి. కనుక వాఁడు ఫలాసక్తి విడిచిపెట్టి బ్రహ్మనిష్ఠవలనఁగలుగు శాంతిని అనఁగా జ్ఞానయోగప్రాప్తిని పొందును. యోగికానివాఁడు కోరికలచే ప్రేరేపింపఁబడి ఫలాసక్తుఁడై బద్ధుఁడగును.

శ్లో॥ నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తిరుపజాయతే।
ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తిఫలభాగినీ॥

అజ్ఞాని దేహేంద్రియ వృత్తుల మానుకొని నివృత్తుఁడనైతి ననుకొన్నను అంతఃకరణవృత్తి మానలేఁడు. కావున వానికి నివృత్తియనుకొన్నదే ప్రవృత్తి యగుచున్నది. జ్ఞాని దేహేంద్రియములతో విహితకర్మ చేయుచుండియు, అంతఃకరణవృత్తులైన సంకల్ప వికల్పములను, అహంకార మమకారములను పొందకుండును. కనుక లోకమునకు ప్రవృత్తిగా కనఁబడినదే జ్ఞానికి నివృత్తి యగుచున్నది. (అష్టావక్రగీత 18 ప్ర 61 శ్లో)

శ్లో॥ సర్వగం సచ్చిదానందం జ్ఞానచక్షుర్నిరీక్షతే
అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వంతం భానుమంధవత్॥

సత్యము, జ్ఞానము, ఆనందము స్వరూపముగ గలిగినట్టియు, సర్వ వ్యాపియైనట్టియు పరమాత్మను జ్ఞాననేత్రముగలవాడు లెస్సగఁ జూచుచు న్నాఁడు. చక్కఁగఁ బ్రకాశించుచుండు సూర్యమండలమును గ్రుడ్డివాడు చూడఁనట్లు ఆపరమాత్మను జ్ఞానదృష్టిలేనివాఁడు చూడజాలడు. (ఈశ్లోకము మహోపనిషత్తు 4 అధ్యాయములోను, వరాహోపనిషత్తు 2 అధ్యాయము లోను కొంచెము వర్ణభేదముతో చదివినట్లు జ్ఞాపకము)

శ్లో॥ ఉలూకస్య యథాభానురంధకారః ప్రతీయతే।
స్వప్రకాశే పరానందే తమో మూఢస్య జాయతే॥

సూర్యుని వెలుతురు గుడ్లగూబకు అంధకారముగా ఎట్లు కనఁబడు చున్నదో అట్లే తనయందు పరమానంద స్వరూపమైన ఆత్మ ప్రకాశించుచుం డఁగా మూఢచిత్తునకు తమోగుణమే కలుగుచున్నది. ( ఆత్మప్రబోధోపని షత్తు 25 )

శ్లో॥ చక్షుర్దృష్టినిరోధేఽభ్రైః సూర్యో నాస్తీతి మన్యతే।
తథాజ్ఞానావృతో దేహీబ్రహ్మనాస్తీతిమన్యతే॥

మనుష్యుని నేత్రముల దృష్టికి మేఘములచే ఆటంకము కలుగగా అప్పుడు సూర్యుఁడులేడని తలఁచుచున్నాడు అదేవిధముగా దేహాభిమాని యైనవాఁడు అజ్ఞానముచే కప్పబడి బ్రహ్మలేదని తలచుచున్నాడు. (ఆత్మ ప్రబోధోపనిషత్తు 26)

శ్లో॥ నాజ్ఞానచక్షుస్త్వాం పశ్యేదంధదృగ్భాస్కరం యథా।
యోగినస్త్వాం విచిన్వంతి స్వదేహే పరమేశ్వరమ్॥

అంధుఁడు సూర్యునిజూడఁ జాలకపోవుట యెట్లో అట్లే జ్ఞాననేత్రము లేనివాఁడు నిన్ను చూడఁజాలడు. యోగీశ్వరులు పరమేశ్వరుఁడవైన నిన్ను తమదేహమునందే వెదకి కనుగొనుచున్నారు. (అధ్యా ఉత్త 2 స 7 శ్లో)

శ్లో॥ అజ్ఞస్య దుఃఖౌఘమయం జ్ఞస్యానందమయం జగత్।
అంధం భువనమంధస్య ప్రకాశంతు సుచక్షుషామ్॥

గ్రుడ్డివానికి లోకమంతయు గ్రుడ్డిదిగనే యుండును మంచికన్నులు గలవారికి వెల్లడిగ కనఁబడుచునే యుండును. (అట్లే) జ్ఞానహీనునికి ప్రపం

చమంతయు దుఃఖస్వరూపమగు చున్నది. జ్ఞానికి అనంద స్వరూపమగు చున్నది. (వరాహోపనిషత్తు 2-22)

శ్లో॥ న హి యాజక యజ్ఞ విభాగ ఇతి
న హుతాశన వస్తువిభాగ ఇతి
యదిచైకనిరంతర సర్వశివం
వద కర్మఫలాని భవంతి కథమ్॥

నిత్యమైనది సర్వశుభ స్వరూపమైనది యొకటేయగునెడల యాజకుఁడు, యజ్ఞము, అగ్ని, స్రుక్స్రువాది వస్తువులు అనుభేదములేదు కదా? (ఇఁక) కర్మఫలము లెట్లుకలుగుచున్నవో చెప్పుము (అవధూతగీత 6-19)

మూ॥ సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తె సుఖం వశీ।
నవద్వారే పురే దేహే నైవ కుర్వన్ న కారయన్॥ 13.

తా॥ ఇంద్రియములను, మనోవృత్తులను తనస్వాధీనము చేసికొనిన యోగి యేకర్మయుచేయువాఁడుగాక,చేయించువాడుగాకసర్వకర్మలను మనస్సుచేతనే సన్న్యసించి తొమ్మిదిద్వారముల పట్టనమువలెనుండు దేహములో సుఖముగ నివసించు చున్నాడు.

శ్లో॥ బహిః కృత్రిమసంరంభో హృది సంరంభవర్జితః।
కరా బహిరకర్తాంతర్లోకే విహర శుద్ధధీః॥

వెలుపల చూచుటకు ప్రయత్నపరుఁడుగనుండి లోపలప్రయత్నము లేకుండవలయును. పైగా చూచుటకు కర్తగనేయుండి లోపలకర్త కాకుండవలయును. (ఇట్లు) పరిశుద్ధమైన బుద్ధిగలవాఁడవై లోకములో విహరింపుము (మహోపనిషత్తు 6 అ 68 శ్లో) మానసికమైన సన్యాసమే మోక్షకారణమని యెఱుఁగునది.

మూ॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥ 14.

తా॥ "లోకృదర్శనే" అను సూత్రమువలన చూడఁబడునది లోకము లోకమును చూచుప్రభువు పరమాత్మ. ఉచ్ఛ్వాసనిశ్వాసాది కాయికకర్మలఁగాని, కర్మఫలముయొక్క ప్రాప్తినిగాని, కర్తృత్వమునుగాని లోకమునకు పర

మాత్మ సృజించియుండలేదు. ప్రకృతియొక్క స్వభావమే యిట్లు ప్రవర్తించు చున్నది.

వివ॥ సూర్యుని సాన్నిధ్యమున అగ్నిజ్వలించు చున్నది. వాయువువీచు చున్నది. మేఘములుత్పత్తి యగుచున్నవి. వర్షించు చున్నవి. సస్యములు పెరుగు చున్నవి. సూర్యుఁడులేకున్న ఈ కార్యములేవియు జరుగవు. ఐనను ప్రకృతి స్వభావమువలన జరుగుచున్నవేకాని యిందుకు సూర్యుఁడు కర్త కాఁడు. అట్లే యాత్మసాన్నిధ్యమున దేహప్రకృతియే శారీరకర్మలయందు వర్తించు చున్నది కాని పరమాత్మయిందుకు కర్త కాఁడని భావము.

శ్లో॥ మాయాప్రపంచరచనా నచ మే వికారః।
కౌటిల్యదంభరచనా నచ మే వికారః।
సత్యానృతేతి రచనా నచ మే వికారః।
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

మాయాస్వరూపమైన ప్రపంచముయొక్క రచనయు, కౌటిల్య దంభములనెడు వాని రచనయు, సత్యాసత్యములనెడు వాని రచనయు మున్నగు వాని వికారములు నావికావు. నేను జ్ఞానస్వరూపుడను అమృతస్వరూపుడను సర్వసముడను. ఆకాశమువలె నిర్మలుడను. (అవధూతగీత 3అధ్యా 20 శ్లో) ఆత్మ నిష్కర్మము, నిర్వికారము.

మూ॥ నాదత్తే కస్యచిత్పాపం నచైవ సుకృతం విభుః।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః॥

తా॥ మానసేంద్రియములచేఁ జేయబడు శారీరకర్మకు, కర్మఫలమునకు పరమాత్మ కర్తకాఁడని పూర్వోక్తశ్లోకమువలనఁ దెలిసియున్నది. అందులో ఏయొక్క పాపమునుగాని పుణ్యమునుగాని పరిశుద్ధాత్మ గ్రహించుట లేనేలేదు. అజ్ఞానముచే జ్ఞానము కప్పబడినందున జీవులు మోహముఁ జెందు చున్నవి. (జీవభ్రాంతిచేత నేను కర్మ చేయుచున్నాఁడననియు, పాపపుణ్యముల ననుభవించుచున్నాఁడననియుఁ దలఁతురని భావము)

శ్లో॥ ఏకం వృక్షం సమాసాతే సుపర్ణావయుతౌ పరే।
తయోరన్యః కర్మజన్యం ఫలమశ్నాతి సర్వదా।
అస్పృష్టగంధస్తత్రైవదీప్యసే త్వం యథారవిః॥

ఒకవృక్షమునందు రెండుపక్షులున్నవి. అందొకపక్షియైన నీవు భోగవాసన నంటక సూర్యునివలె వెలుఁగుచున్నాఁడవు. ఇంకొకపక్షియైన జీవుఁడు కర్మఫల మనుభవించుచున్నాడు. (వరాహ పురాణము పూర్వ 48 అధ్యా)

శ్లో॥ ద్వౌ సుపర్ణౌ శరీరేఽస్మిన్ జీవేశాఖ్యౌ సహస్థితౌ।
తయోర్జీవః ఫలం భుంక్తే కర్మణో న మహేశ్వరః॥

ఈశరీరమునందు (వృక్షమునందు) జీవుఁడు, మహేశ్వరుఁడు అను రెండుపక్షులున్నవి. ఆరెండుపక్షులలో జీవుఁడను ఒకపక్షిమాత్రము కర్మఫలము భుజించుచున్నది. మహేశ్వరుఁడను రెండవపక్షి భుజించుటలేదు (ఈశ్లోకము అన్నపూర్ణోపనిషత్తు 4 అ లోను రుద్రహృదయోపనిషత్తులోను కనఁబడుచున్నది)

"ద్వా సుపర్ణా భవతో బ్రహ్మణోఽహం సంభూతస్తదేతరో భోక్తాభవతి. అన్యో హి సాక్షీ భవతీతి. వృక్షధర్మేతౌ తిష్ఠతః. అతో భోక్త్రభోక్తారౌ పూర్వో హి భోక్తా భవతి తదే తరోఽభోక్తా కృష్ణో భవతీతి"

బ్రహ్మతత్వమునకు సంబంధించిన యిరువురు పక్షీంద్రులున్నారు. వారు వృక్షధర్మమునందు (శరీరమునందు) ఉన్నారు. అందులో అహంకారముతో సంభవించిన యొకడు ఫలము ననుభవించువాఁడగును. మఱియొకడు సాక్షియగును. మొదటివాఁడు (దేహాభిమాని) అనుభవించుచున్నాఁడు. ఇంకొకఁడు కృష్ణపరమాత్మ. ఆయన కర్మఫలము ననుభవించువాడు కాడు. (గోపాలోత్తరతాపిన్యుపనిషత్తు)

ఈవిషయమింకను భాగవత 11 స్కం. 11 అధ్యాయములోను, ముండకోపనిషత్తు 3 ముండకములోను ఇంచుమించుగ నిట్టిశ్లోకములతో వర్ణింపబడినది.

శ్లో॥ తత్ర యః పరమాత్మాహి స నిత్యం నిర్గుణః స్మృతః।
స హి నారాయణో జ్ఞేయస్సర్వాత్మా పురుషో హి సః।
న లిప్యతే ఫలై శ్చాపి పద్మపత్రమివాంభసా।
కర్మాత్మాత్వపరో యోఽసౌ మోక్షబంధైస్స యుజ్యతే॥

ఎవఁడు పరమాత్మయో అతఁడేకదా యెల్లప్పుడును నిర్గుణుఁడుగ తెలియబడినవాఁడు? అతడేకదా సర్వభూతములయందు ఆత్మస్వరూపుఁడై

యుండువాఁడు? అతఁడేకదా శ్రీమన్నారాయణుఁడని తెలియఁదగినవాఁడు? అందు (శరీరములయందుండియు) తామరాకునీటిచే అంటఁబడనియట్లు ఆ పరమాత్మ కర్మఫలముచేనైతము అంటఁబడఁడు. కర్మనభిమానించుకొనిన హీనుఁడెవడోవాఁడు బంధమోక్షములచే బంధింపఁబడు చున్నాఁడు.

(నారాయణీయము 2 అధ్యా 14-15 శ్లో)

శ్లో॥ త్రిషు ధామసు యద్భోగ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్।
తేభ్యో విలక్షణస్సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః॥

మూఁడులోకములలో (శరీరత్రయమున, అవస్థాత్రయమున) బోగింపఁబడు నదియేదికలదో, భోగించువాఁడు, బోగము ఏదికలదో యీయన్నిటి కంటె నేను విలక్షణుఁడను, సాక్షిస్వరూపుఁడను, జ్ఞానస్వరూపుఁడను, సదా శివుఁడను. (ఈశ్లోకము కైవల్యోపనిషత్తు 1 ఖం లోను, శివగీత 12 అధ్యాయములోను ఉన్నది.)

మూ॥ జ్ఞానేనతు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః।
తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥ 16

తా॥ ఆత్మజ్ఞానముచే ఎవరియజ్ఞానము నాశముగావింపఁబడు చున్నదో వారి జ్ఞానము సూర్యునివలె ఆ పరమాత్మను వెలిఁగించుచున్నది.

"అండం జ్ఞానాగ్నినా దగ్ధం కారణైః సహ పరమాత్మని లీనం భవతి। తతో బ్రాహ్మణః సమాహితో భూత్వా తత్ త్వం పదైక్యమేవ సదా కుర్యాత్ తతో మేఘాపాయేఽంశు మానివాత్మావిర్భవతి"

కారణములతోఁగూడ ఆవరణము జ్ఞానాగ్నిచే కాల్పఁబడినదై పరమాత్మయందు లయించుచున్నది. అందువలన బ్రహ్మనిష్ఠా గరిష్ఠుఁడైన పురుషుఁడు ప్రసన్నచిత్తుఁడై ఎల్లప్పుడును "తత్, త్వమ్" అను రెండు పదములను ఒకటిగ భావింపవలయును. అటుపైన మేఘముఁబాసిన సూర్యునివలె పరమాత్మ ప్రకాశించు చున్నది (పైంగలోపనిషత్తు 3 అధ్యా)

వివ॥ సర్వవస్తువులు పరమాత్మచే వెలిఁగింపఁబడు చున్నవేకాని పరమాత్మను వెలిఁగించువస్తువు మఱియొకటిలేదని కఠోపనిషత్తు 5 వల్లిలోను మఱిపెక్కు గ్రంథములలోను చెప్పఁబడినది. పెద్దలనేకులు ఇట్లే చెప్పి

యున్నారు ఇట్లుండ ఆపరమాత్మను జ్ఞానముమాత్రము వెలిగించుట యెట్లు లని సంశయమువలదు. ఆకాశమున మేఘము పట్టినప్పుడు సూర్యుఁడు వెలుఁగలేదని తలఁచుచున్నారు. ఆమేఘము గాలిచే తొలఁగగొట్టఁబడినప్పుడు సూర్యుఁడు ప్రకాశించుచున్నాఁడని యెంచుచున్నారు. మేఘముండినప్పుడు, లేనప్పుడుకూడ సూర్యుఁడు వెలుఁగుచునేయుండును. అగాలి మేఘమును తొలగించుచున్నదేకాని సూర్యుని వెలిగించుటలేదు. అట్లే జ్ఞానయోగము అజ్ఞానమునుపోఁగొట్టుచున్నదేకాని పరమాత్మను వెలిఁగించుటలేదు. స్వస్వరూపము తనంతటతాను సర్వదా యేకరీతిని వెలుఁగుచునేయున్నది.

మూ॥ తద్బుద్ధయస్తదాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః 17.

జ్ఞానయోగముచే పాపమును పోగొట్టుకొనినవారు, పరబ్రహ్మతత్త్వమునందు బుద్ధి తగులుకొనియుండువారు, పరబ్రహ్మమే తామైయుండువారు, అట్టి బ్రహ్మతత్త్వమునందే సుస్థిరులైయుండువారు, ఆతత్త్వమే తమకు పరమగతిగ వర్తించువారు మరల జన్మమునకురాని పదవిని పొందుదురు.

మూ॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణె గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితాస్సమదర్శినః॥ 18

జ్ఞానము, నీతిగలిగిన బ్రహ్మనిష్ఠునియందును, గోవునందును, ఏనుఁగునందును, కుక్కయందును, కుక్కమాంసము వండుకొను చండాలునియందును సమమైన దృష్టిగలవారు జ్ఞానులు. ( ఈశ్లోకము భారత శాంతి 239 అధ్యాములో కొంచెము వర్ణభేదముతోనున్నది )

వివ॥ మనుష్యులలో అత్యుత్తముఁడు బ్రహ్మనిష్ఠుఁడు. అధముఁడు చండాలుఁడు. తిర్యగ్జంతువులలో ఉత్తమమైనది గోవు. నిచమైనది శునకము మధ్యమము ఏనుఁగు. ఈయుత్తమాధమ మధ్యమములనెడు భేదములు శరీరతత్త్వములవలన కలిగినవికావు. పరమాత్మవలన కలిగినవి కావు గుణకర్మాదులవలన కలిగినవి. స్థూలదేహములను, గుణకర్మాదులను జూడక అంతరంగిక దృష్టిచే ఆపరమాత్మ తత్త్వమునుమాత్రమే చూచువారికి ఈజీవులన్నియు సమముగఁ గనఁబడును.

అటులచూచువారు జ్ఞానులు. అత్యుత్తమము, అత్యధమమునగు రెండుజీవులు పేర్కొనబడినప్పుడు ఆరెంటికి నడుమనుండు సర్వజీవులు పేర్కొనబడినట్లే భావము. తిర్యగ్జంతువులుసైత మిట్లేయని తెలియవలయును.

మూ॥ ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥ 19

తా॥ పరబ్రహ్మతత్త్వము దోషరహితమైనది. సర్వవస్తువులయందు సమముగనుండునదిగదా? అందువలన ఎవరిమనస్సు సమత్వముకలిగి యుండునో అట్టివారు పరబ్రహ్మమునందున్నవారే. జన్మకారణమైన కర్మబంధము అట్టి పురుషులచే ఈలోకములోనే జయింపఁబడుచున్నది. నామరూపములను, గుణకర్మాదులను వదలి అంతర్వ్యాప్తియందు స్వస్వరూపముఁగాంచిన వారికే సమత్వము సిద్ధించుచున్నది. కనుక అట్టిపురుషులచే కర్మజయింపఁబడుటకు సంశయములేదు.

మూ॥ న ప్రహృష్యేత్ప్రియంప్రాప్య నోద్విజేత్ప్రాప్యచాప్రియమ్।
స్థిరబుద్ధిరసమ్మూఢో। బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః 20

తా॥ మూఢత్వములేనివాడై తన బుద్ధిని స్థిరముగ నుంచుకొని పరబ్రహ్మ తత్త్వమిట్టిదని తెలిసికొని అట్టి భగవత్తత్త్వము నందే నిలిచియుండువాఁడు ప్రియమును పొందినప్పుడు సంతోషపడరాదు. అప్రియమును పొందినప్పుడు జంకుపడరాదు.

శ్లో॥ న ప్రీయతే వంద్యమానో నింద్యమానోన కుప్యతి,
నైవోద్విజతి మరణే జీవనే నాభినందతి॥

స్తోత్రము చేయబడియు ప్రీతినొందఁడు. నిందసేయఁబడియు కోపింపడు చావు బ్రతుకులయందు భయమును, సంతోషమును పొందఁడు.
(అష్టావక్రగీత 18 ప్ర. 99 శ్లో.)

శ్లో॥ న నందంతి న నిందంతి జీవితం మరణం చ యే।
తే ప్రాప్నువంతి పరమం సర్వత్ర సమదర్శినః॥

ఎవరైతే యెల్లెడల సమదృష్టిగలవారై జీవితమును గూర్చి సంతోషింపకుందురో, మరణమును గూర్చి నిందింపకుందురో అట్టివారు మోక్షమును పొందుచున్నారు. (విశ్వగీత 100,)

శ్లో॥ యో నద్వేష్ట్యప్రియం ప్రాప్య ప్రియం ప్రాప్య న హృష్యతి।
సర్వం మాయేతి నిశ్చిత్య త్వాం భజేత్తన్మనో గృహమ్॥

పురుషార్థమునందు అప్రియమైనదానిని పొందినప్పుడు ఎవఁడు ద్వేషింపఁడో ప్రియమైన దానిని పొందినప్పుడు హర్షింపఁడో, ఇది యంతయు మాయయే కాని నిజమైనది కాదని నిశ్చయించుకొని యెవఁడు నిన్ను భజించుచున్నాఁడో వాని మనస్సు నీకు గృహమగును.

(అధ్యా అయో. 6 స. 59 శ్లో.)

మూ॥ బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్॥
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే॥ 21.

తా॥ బాహ్యేంద్రియములకు లక్ష్యభూతములైన శబ్ద స్పర్శాది విషయార్థముల యందు ఆసక్తిలేనివాఁడై (తనకంటె అన్యములైన వస్తువులయందు సుఖమున్నదను భ్రాంతిమానుకొని) యెవఁడైతే ఆత్మయందే సుఖము పొందుచున్నాఁడో అట్టియోగి (జీవేశ్వరసంయోగ ప్రయుక్తాంతరంగుఁడు.) ఎన్నఁటికిని జెడని సుఖమును అనుభవించుచున్నాఁడు.

మూ॥ యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।
అద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః॥ 22.

తా॥ అర్జునా! కేవలము విషయములవల్ల కలుగు భోగములు ఏవికలవో అవియన్నియు ఒకప్పుడు వచ్చుచున్నవి, ఒకప్పుడుపోవుచున్నవి. అందువల్ల దుఃఖమును పుట్టించునవే యగుచున్నవికదా? (కనుక) జ్ఞాని ఈసుఖములయందు క్రీడింపఁడు.

శ్లో॥ న మే భోగాగమే వాంఛా న మే బోగ వివర్జనే।
అగచ్ఛత్వథ మాగచ్ఛత్వభోగవశగో భవేత్॥

నాకు భోగములు కావలయుననని వాంఛలేదు. వలదనియులేదు. భోగములు కలుగవచ్చును కలుగక పోవచ్చును. ఇట్టియెడ మానవుఁడు భోగములకు వశపడఁగూడదు. (అధ్యా. అయో. 6 స 9 శ్లో.)

శ్లో॥ అద్యంతవంతమత్యల్పం సుఖం విషయపూరితమ్।
దుఃఖాంతం తత్పరిత్యజ్య స్వాత్మన్యేవ రమేద్బుధః॥

విషయభోగాదులచే పూరింపఁబడు సుఖము స్వల్పమైనది, అద్యంతములు కలది, కట్టికడపట దుఃఖముతోఁ గూడినది. జ్ఞాని అసుఖమును విడిచిపెట్టి తనలోఁదాను పరమాత్మయందే క్రీడింపవచ్చును. (విశ్వగీత 67.)

మూ॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్।
కామక్రోధోద్భవం వేగం సయుక్తస్స సుఖీ నరః॥ 23.

తా॥ కామమునకు అధిష్ఠానము మానసేంద్రియములని ఇదివఱకు చదివియున్నారు. మానసేంద్రియములకు ఆధారము శరీరము. ఇట్టి శరీరముతో కూడియుండియు కామక్రోధాదులవలనఁ బుట్టు ఆత్రమును భరించుటకు ఎవఁడైతే సమర్థుఁడగుచున్నాఁడో అట్టివాఁడు యోగీశ్వరుఁడు, సుఖవంతుడు చిత్తమును తన స్వాధీనములో నిలుపుకొనఁ గలిగినవాఁడు.

శ్లో॥ వాచోవేగం మనసఃక్రోధవేగం హింసావేగముదరోపస్థవేగమ్।
ఏతాన్ వేగాన్ విసహేద్వై తపస్వీ నిందాచాస్య హృదయం నోపహన్యాత్

వాగింద్రియమువలన పురుషునికి కొన్ని తొందరలు కలుగుచున్నవి. మనస్సు ఒకప్పుడును ఊరకుండదు. నిరంతరము పురుషుని తొందరపుచ్చుటే దానిపని. కోపము కలిగినప్పుడు వివేకము సన్నమగుచున్నది. దానివలనఁ బుట్టు అనర్థము, తొందర మనము చూడనిదికాదు. మనస్సునకుఁగాని దేహమునకుఁగాని ఏదైన బాధగలిగెనా వానియాత్రము మిన్నుముట్టుచున్నది. క్షుత్పిపాసలమాట మఱచిపోరాదు. చెఱువులు నిండినను చేరెడుకడుపు నిండదన్నమాట క్రొత్తదికాదు ఇఁక గుహ్యేంద్రియము తొందర విశ్వామిత్ర పరాశరాదులకైనను దుర్భరమని వినియుంటిమి. తపస్సుచేయు పురుషుఁడు ఇట్టియాత్రములనెల్ల సహించుకొనవయును. అపవాదము లితనిమనస్సును బాధింపఁగూడదు. (హరీతగీత 17)

శ్లో॥ యావత్స్వస్థమిదం శరీర మరుజం యావజ్జరాదూరతో।
యావచ్చేంద్రియశక్తిరప్రతిహతా యావత్ క్షయో నాయుషః
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో పుమాన్
సందీప్తే భవనేతు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః॥

వాతపిత్త శ్లేష్మాది రోగములచే బడలువడక దేహమెందాఁక ఆరోగ్యవం తమైయుండునో, ఎదుటివారికి సైతము చూచుటకేవ పుట్టించు వృద్ధావస్థ యెందాక తన సమీపమునకు రాకుండునో, కన్నులు, చెవులు, కాళ్లు, చేతులు, మనస్సు మొదలైన చతుర్దశేంద్రియములు తమతమ పాటవము తప్పక యెందాఁక భద్రముగ నుండునో, ఎందాక ఆయుఃక్షయము కాకుండునో అందాక విద్వాంసుడు మోక్షముకొఱకు గొప్పప్రయత్నము చేయఁదగును. కొంప కాలిపోవుచుండగా బావిత్రవ్వఁబూనుట యేలాటిది? (శ్రీభర్తృహరి 3-75) ఈశ్లోకమునందలి భావముజూడ శరీరము మంచిస్థితియందుండగానే మోక్షప్రయత్నము చేయువలయునని తెలియుచున్నది.

మూ॥ యోఽంతస్సుఖోఽంతరారామస్తథాంతర్జ్యోతిరేవ యః
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి॥ 24

తా॥ బాహ్యేంద్రియములకు గోచరించు విషయసుఖములయందు ఆసక్తిఁజెందక తనలోపలనే తాను ఎవఁడైతే సుఖముఁ జెందుచున్నాఁడో, బాహ్యేంద్రియములచే క్రీడింపక తనలోపలనే తాను ఎవఁడైతే క్రీడించుచున్నాడో, అదేవిధముగా అంతర్వీధియందు చిత్కళాస్వరూపమైన ఆత్మజ్యోతియై యెవఁడు వెలుఁగుచున్నాడో అట్టియోగీశ్వరుఁడు పరబ్రహ్మస్వరూపుఁడై పరబ్రహ్మమునందే నివృత్తిఁ బొందుచున్నాడు. (శరీరముండినంతవఱకు బాహ్యాంతరములున్నవి. ''అంతస్సుఖః'' అనుటచే శరీరముతో కూడుకొని సాధించునదే యీనిర్వాణపదమని తెలియుచున్నది.)

మూ॥ లభంతే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః।
ఛిన్నద్వైధా యతాత్మానస్సర్వభూతహితే రతాః॥ 25.

తా॥ పాపములను క్షీణింపఁజేసినట్టియు, భేదభావములను సంశయములను ఖండించినట్టియు. చిత్తమును స్వాధీనము గావించుకొన్నట్టియు, సర్వభూతములకు హితము సమకూర్చుటయందాసక్తి కలిగినట్టియు ఋషీశ్వరులు బ్రహ్మస్వరూపమైన నివృత్తిపొందుచున్నారు.

మూ॥ కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్॥ 26.

తా॥ అభ్యాసయోగము చేయుటవలన కామక్రోధాదులైన అంతశ్శత్రువు లు శమించిపోవుచున్నవి. మనోనిగ్రహము కలుగుచున్నది. జ్ఞానయోగము వలన స్వస్వరూపజ్ఞానము కలుగుచున్నది. అని యిదివఱకు వినియున్నారు. ఇట్లురెండువిధముల బ్రహ్మనిష్ఠ నాశ్రయించి ఆత్మజ్ఞాన సిద్ధాంతులైన యతీశ్వరులకు మోక్షము బాగుగకలుగుచున్నది. (దేవేంద్రియములతో కూడియుండు కాలమునందైనను కర్మఫలానుభవముండదని భావము.)

మూ॥ స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాంతరే భ్రువోః
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ॥
యతేంద్రియ మనోబుద్ధిర్మునిర్మోక్ష పరాయణః।
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః॥ 28.

తా॥ కర్మబంధమునుండి విడువఁబడుటయే ఉత్తమమార్గమని నమ్మి యెవఁడైతే బాహ్యేంద్రియ విషయములైన శబ్ద స్పర్శాదులను లోఁగొనక నిషేధించి (అభిమానముంచుకొనక యనిభావము) కనుబొమల నడుమ దృష్టి నిలిపి నాసికయందు నడచుచుండు ప్రాణవాయువును, అపానవాయువును రెంటిని సమముగ నడచునట్లుఁ జేసి మనోబుద్ధీంద్రియములను తన స్వాధీనమున నిలుపుకొని కోరికలను, భయమును, క్రోధమును వదలివేసి తత్త్వచింతనము చేయుచున్నాఁడో అట్టివాఁడు ఎల్లప్పుడును ముక్తుడేయగును

ఇచ్చట భ్రూమధ్యమున దృష్టినిలుపుటచే ఖేచరీముద్రయు, ప్రాణాపానముల సమముచేయుటచే ప్రాణాయామము వర్ణింపఁబడినవి ఇది యభ్యాసయోగములోఁ జేరుచున్నది కనుక దీనిచే విషయవాసన ఉడిగిపోవుచున్నది మనస్సు నిగ్రహింపఁబడుచున్నది. తత్త్వచింతనము జ్ఞానయోగములోఁ జేరుచున్నది. దీనివలన శాశ్వతమైన బ్రహ్మానందము సిద్ధాంతమగుచున్నది. ఈవిధముగా అభ్యాసయోగము, జ్ఞానయోగము, యిది వఱకు పెక్కుసారులు వర్ణింపఁబడినవి. ఐనను సద్విషయము లెన్నిసారులు వర్ణింపఁ బడినను ఎక్కువ యనుకొనరాదు.

మూ॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి॥ 29

తా॥ "లోకృదర్శనే" అనుసూత్రమువలన దృశ్యములైన స్థూలసూక్ష్మ కారణ శరీరములయందు, జాగ్రత్స్వప్న సుషుప్తులయందు ఈశ్వరత్వము వహించినట్టియు, ఆత్మయజ్ఞములకు, తపస్సులకు భోక్తయైనట్టియు, సమస్త భూతములకు సుహృత్స్వరూపమైనట్టియు, అస్మచ్ఛబ్ద లక్ష్యార్థమైన పరమాత్మ తత్త్వమును తెలిసికొని శాంతిని పొందుచున్నాడు. (ఈయధ్యాయములో జ్ఞానకర్మ యోగములకు రెంటికి సమన్వయము నిరూపింపఁబడినది)

ఇది శ్రీ మహాభారతము భీష్మపర్వములో కర్మసన్యాస యోగమనెడు ఇరువది తొమ్మిదవ యధ్యాయము.

ఓం. సత్. సత్.



# శతపత్రము

# 97

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 30 అధ్యాయము.

శ్రీ భగవానుఁడు చెప్పుచున్నాఁడు.

మూ॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః
స సన్న్యాసీచ యోగీచ ననిరగ్నిర్నచాక్రియః॥ 1.

తా॥ అగ్నిహోత్రమును వదలినవాఁడు శరీరముతో చేయఁదగిన యేకార్యమునుజేయక బిగబట్టుకొని కూర్చుండినవాడు సన్యాసి కానేరఁడు యోగీ కానేరడు. ప్రతిఫలము నపేక్షింపక తాజేయఁదగిన విహితకర్మ సంపూర్ణ వైరాగ్యముతో ఎవడైతే చేయుచున్నాడో అట్టివాడే సన్న్యాసియు, యోగియు నగును.

మూ॥ యం సన్న్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ।
నహ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన॥ 2.

తా॥ పంచభూతములను, పవనేంద్రియములను, అంతఃకరణమును ఊర్ధ్వకుండలి స్థానమున పరమాత్మ తత్త్వముతోఁజేర్చుట యోగమనియందుందుఁ జెప్పబడినది. సర్వసంకల్పములను, మనోవృత్తులను పరమాత్మయందు శాశ్వతముగ వదలుట సన్న్యాసమనియుఁ జెప్పఁబడినది. అందువలన "యోగము, సన్న్యాసము'' అను రెండుపదములకు ఇంచుమించుగ ఒకటే యర్థము వచ్చుచున్నది. కాబట్టి దేని సన్న్యాసమని చెప్పుదురో దానినే యోగమనియుఁ దెలిసికొనుము. మమతాహంకారములతోఁ గూడిన అవిద్యావాసన మొదలుకొని మోక్షాపేక్షవఱకుఁగల సర్వసంకల్పములు బంధములేయని నిరాలంబోపనిషత్తులోఁ జెప్పబడినది. ఈసంకల్పములు మనస్సున బుట్టుచున్నవి

మనస్సు పరమాత్మయందు లయించినప్పుడు సంకల్పములు లయించు చున్నవి. అప్పుడు సన్న్యాసము సిద్ధాంతమగుచున్నది. అదేయోగమనియుజెప్ప బడుచున్నది. అర్జునా! సంకల్పములను వదలజాలనివాని మనస్సు పరమాత్మతో ఐక్యము జెందదు. కనుక అట్టివాఁడు యోగికాఁజాలఁడు.

మూ॥ ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే।
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే॥ 3.

తా॥ శాశ్వతసౌఖ్య నిధానమైన ఉర్ధ్వస్థానమును బ్రాపింపగోరి భగవ తత్త్వమును మననముసేయు అర్థవిద్యార్థికి శరీరాంగములచే సాధింపఁబడు క్రియారూపమైన "యమనియమాసన ప్రాణాయామము" లనెడు పూర్వాంగములతోఁ గూడిన అభ్యాసయోగము కారణమని చెప్పఁబడును. అభ్యాసయోగ మునందు ఉత్తీర్ణుడైన పిమ్మట అమౌనిశ్వరునకే చిత్తవిశ్రాంతి కారణమగు చున్నది.

"పతితాః శాస్త్రజాలేషు ప్రజ్ఞయా తేన మోహితాః।
స్వాత్మప్రకాశరూపం తత్కిం శాస్త్రేణ ప్రకాశ్యతే॥

శాస్త్రములనెడు వలలయందు పడిపోయినవారై అశాస్త్రజ్ఞానము చేతనే మతి చెడగొట్టుకొనుచున్నారు. స్వయం ప్రకాశమానమైన అస్వస్వ రూపము శాస్త్రముచేతనే వెలిగింపబడునా? (అనియిట్లు యోగతత్త్వోపనిషత్తు 6, 7 శ్లోకములలోను, యోగశిఖోపనిషత్తు 1 అ. 4-5 శ్లోకములలోను చెప్పఁబడినది )

స్వయంప్రకాశమానమైన పరమాత్మను వెలిఁగించునది మఱియొకటి లేదని తెలియుచున్నది. కనుక శాస్త్రోక్తములైన లౌకిక కర్మలు ఫలాపేక్ష లేకయే చేసినను అకర్మలవల్లనే స్వస్వరూపము వెలిగింపఁబడునని నమ్మ కొనరాదు.

మూ॥ యదా హి చేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే।
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥ 4.

తా॥ ఇంద్రియార్థములైన సమస్త విషయ భోగములయందును, భౌతిక కర్మలైన యిష్టాపూర్తాదులయందును ఆధ్యాత్మిక కర్మలైన ప్రాణాయామాదులయందును ఎప్పుడైతే ఆసక్తుఁడు కాఁడో! సర్వవిధములైన సంకల్పములను, మనోవృత్తులను భగవత్తత్త్వమునందు ఎప్పుడైతే సంక్షిప్తము గావించుచున్నాఁడో అప్పుడేకదా బ్రహ్మనిష్టయందు ఉత్తీర్ణుడైనాఁడని చెప్పఁబడుచున్నాఁడు?

శ్లో॥ యత్ర యత్ర భవేత్తృష్ణా సంసారం విద్ధి తత్ర వై।
ప్రౌఢవైరాగ్యమాశ్రిత్య వీతతృష్ణస్సుఖీ భవ॥

ఏయే విషయములయందు ఆసక్తిపుట్టుచున్నదో ఆయావిషయములయందు జన్మకారణమైన సంసృతిబంధము కలదని తెలిసికొనుము. దిట్టమైన వైరాగ్యము నాశ్రయించి ఆసక్తిని వదలుకొని సుఖవంతుఁడవు కమ్ము.

(అష్టావక్రగీత. 10 ప్ర. 3 శ్లో)

శ్లో॥ బాహ్యచింతా నకర్తవ్యా తథైవాంతరచింతికా॥
సర్వచింతాం పరిత్యజ్య చిన్మాత్రపరమో భవ॥

బాహ్యముగాఁగాని, అంతర్యముగాఁగాని చింతింప నవసరములేదు. సమస్తమైన చింతను వదలివేసి జ్ఞానమాత్రమున (శ్రేష్ఠుడవుకమ్ము.) ఈశ్లోకము శాండిల్యోపనిషత్తు 1 అధ్యాయములోను, వరాహోపనిషత్తు 2 అధ్యాయములోను కొంచెము వర్ణభేదముతోఁ జదివినట్టు జ్ఞాపకము.)

విషయవాసన క్షీణించిన మీఁదట సంకల్పములను వదలుకొనుట సులభము. ఇందు జ్ఞాన కర్మయోగములు రెండును సూచింపఁబడినవి.

మూ॥ ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్।
ఆత్మైవహ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః॥ 5.

సమస్త భూతముల యందుండు చైతన్యమంతయు ఒకటేయని తెలియును. తనకంటె అన్యవస్తు వింకొకటిలేదని తెలియును. అందువలన సౌఖ్యనిధానమైన ఊర్ధ్వస్థానమునఁ జేరు సాధనలో తన కింకొక సహాయవస్తువులేదని సిద్ధాంతమగుచున్నది. కనుక ఆత్మస్థానమున తనంతట తానే నిలువవలయును. స్వస్వరూపమును మఱచి మానసేంద్రియముల

యందు వ్యాపించుటచే విషయాసక్తుడై కర్మబంధములలోఁ బడిపోవుచున్నా డేకాని తన్ను దిగువకులాగు స్వతంత్రశక్తిగల వస్తువు మఱియొకటిలేదు. తనకుఁ దానే ప్రమాదము తెచ్చి పెట్టుకొనుచున్నాఁడు. తన్నుతానే అధఃక రించుకొనుచున్నాఁడు. కాఁబట్టి ఆవిధముగా తన ఔన్నత్యమును చెడగొట్టు కొనరాదు.

స్వయంప్రకాశము, ఏకస్వరూపమునైన ఆత్మకు ఇంకొక చుట్టము లేడు, శత్రువులేడు, స్వస్థానమున నిలిచియుండినంతసేపుఁ దనకుఁ దానే చుట్టము. స్థానభ్రంశముకాఁగా రాగాదిదోష సంకలితుఁడై అశుభమును ప్రా పించుచున్నాఁడు కావున నిచ్చటఁ దనకుఁదానే శత్రువని చెప్పవలయును. (ఆత్మయనఁగా మనస్సు అనియు, స్వభావము అనియు, కొందఱు అర్థము చెప్పుదురు కాని ఆయర్థమిచ్చటి సమంజసముగాఁ గనఁబడదు.)

శ్లో॥ ఉద్ధరేదాత్మనాత్మానం మగ్నం సంసారవారిధౌ।
యోగారూఢత్వమాసాద్య సమ్యగ్దర్శననిష్ఠయా॥

సంసృతిసాగరమున మునిఁగిపోయిన తన్నుఁదానే యుద్ధరించుకొన వలయును (అదెట్లనిన) భగవత్తత్త్వమును లెస్సగ దర్శింపఁగల బ్రహ్మనిష్ఠ చేత యోగవిద్యయందు ఉత్తీర్ణుఁడై యుద్ధరించుకొన వలయును. (వివేక చూడామణి 9 శ్లోకము.) ఇందువలన ఆత్మయనఁగా తాననియే యర్థమగు చున్నది.

మూ॥ బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్॥ 6.

తా॥ మానసేంద్రియములద్వారా ఆత్మ బహిర్గతముకాకుండ కేంద్ర స్థానమున తన్నుఁదానే నిలువరించుకొనుటవలన ఆత్మచేత ఆత్మయే విజిత మగుచున్నది. ఈ కారణముచేతనే మానసేంద్రియములు విజితములగు చున్నవి ఏయాత్మ యీవిధముగా తనచేతతానే నిలువరింపఁబడి నిశ్చల మగుచున్నదొ ఆయాత్మ తనకుఁదానే చుట్టమగుచున్నది. యోగసంస్కార ము లేకపోవుటచే అపరిపక్వదశయందుండు అశుద్ధాత్మ అశుభప్రతిపాదక ములైన కర్మలయందు తనకుఁదానే విరుద్ధముగ శత్రువువలె వర్తించు చున్నది. ఇందువలన పరమాత్మకు చుట్టముగాని శత్రువుగాని మఱియొకటి లేదని తెలియుచున్నది.

మూ॥ జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః।
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః॥ 7.

తా॥ అశుభ కారణమైన విషయాసక్తిఁ జెందకుండ తన్నుదాను కేంద్ర స్థానమున నిలుపుకొని ఆ కారణముచేతనే చిత్తోపశమము లెస్సగ ప్రాపించిన యోగికి శీతోష్ణములయందును, సుఖదుఃఖములయందును అదేవిధముగా మానావమానములయందును నిత్యశుభ ప్రతిపాదకమైన పరమాత్మ ప్రసన్న మగును.

శ్లో॥ సమదుఃఖసుఖః పూర్ణ ఆశానైరాశ్యయోస్సమః
సమజీవిత మృత్యుస్సన్నేవమేవ లయం వ్రజ॥

(జ్ఞానముచే) పరిపూర్ణుఁడవై సుఖదుఃఖములయందును, ఆశయందును, ఆశలేకపోవుటయందును, జీవితమునందును, మరణమునందును సముడవై పరమాత్మయందు అట్లే కలిసికొనుము (అష్టావక్రగీత 5 ప్ర 4 శ్లో) అభ్యాసయోగము, జ్ఞానయోగము రెండుసిద్ధాంతమైనవారికే ఈస్థితికలుగును.

మూ॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః॥ 8.

తా॥ సామాన్యజ్ఞానముచేతను, విశేషమైన తత్త్వజ్ఞానముచేతను ఆత్మ తృప్తిఁ జెందినవాడు. బాహ్యవిషయములయందు వ్యాప్తిజెందక ఆసక్తుఁడు గాక తనలోదాను కేంద్రస్థానమున నిలిచియుండువాడు అందుచేతనే చతుర్దశేంద్రియములను నిగ్రహించి తన యిష్టప్రకారము నడుపగలిగినవాడు పరిశుద్ధాత్మ తత్త్వముతోఁగూడినవాడని చెప్పబడును. తత్త్వజ్ఞానముచే తృప్తుడగుటకు జ్ఞానయోగము కారణము. విజితేంద్రియుడగుటకు అభ్యాసయోగము కారణముకనుక ఈస్థితి పొందినవాడు జ్ఞానకర్మయోగములు రెండును చేసినవాడేయని బుజువగుచున్నది. ఇట్టి యోగి మట్టిపెడ్డను, రాతిని, బంగారమునుసమముగఁ జూచును (ఇటువంటి జ్ఞానయోగ సిద్ధాంతులు ఈ కాలములో తఱచుగఁ గనఁబడరు)

మూ॥ సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు
సాధుష్వపిచ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే॥ 9

తా॥ ఆధ్యాత్మికదృష్టితోఁ జూచువానికి దేహేంద్రియములు, శబ్దాది విషయములు, గుణకర్మాదులు తనకంటె వేఱైనవిగాను, పరిశుద్ధాత్మయొక్కఁటే తాననియుఁ దోచును. అంతేకాక అట్టితత్త్వము సర్వభూతములయందును ఏకరీతిగానున్నట్లు కనఁబడును. కనుక సద్భావముగలవారియందును, మిత్రులయందును, శత్రులయందును, తటస్థులయందు, మధ్యస్థులయందును, అప్రియులయందును, బంధువులయందును, ఉత్తమ పురుషులయందును పాపాత్ములయందును సమబుద్ధిగల యోగీశ్వరుఁడు శ్రేష్ఠుఁడు.

శ్లో॥ అయంబంధురయంనేతి గణనా లఘుచేతసామ్।
ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకమ్॥

వీడు నాచుట్టము. వీడు కానివాడు అనుటయంతయు స్వల్పచిత్తుల లెక్కాచారము. ఉదారమైన ప్రవర్తనముగలవారి లెక్కాచారమైతేనో లోకతయు తమ కుటుంబమె (మహోపనిషత్తు 6 అ 71 శ్లో)

శ్లో॥ యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య నలిప్యతే
యస్సమస్సర్వభూతేషు జీవితం తస్య శోభతే॥

ఎవనికైతే అహంభావములేదో, ఎవని బుద్ధి విషయాదులచే అంటుకొనఁబడదో, ఎవఁడైతే సమస్తభూతములయందు సమభావము కలిగియున్నాఁడో అట్టివాని జీవితము ప్రకాశించుచున్నది. (సన్న్యాసోపనిషత్తు 2-39) ఇట్లు చెప్పుటచే జ్ఞానయోగులకు సమత్వము సిద్ధాంతమగునని తెలియుచున్నది.

మూ॥ యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః॥ 10

తా॥ బ్రహ్మనిష్ఠచేయువాఁడు ఏవిధమైన ఆశయు లేనవాడై దేహావసరమునకుమించి మఱెట్టివిషయమును వాంఛింపక రహస్యస్థలమున ఒంటరిగనుండి మనోబుద్ధీంద్రియములను స్వాధీనమున నిలుపుకొని నిరంతరము ప్రత్యగాత్మను ఊర్ధ్వస్థానమునఁ జేర్పవలయును.

శ్లో॥ వసేదేకాంతికో భూత్వా చైకాంతే ద్వైతవర్జితే॥
ఇత్యేవమాచరేద్ధీమాన్ స ఏవం ముక్తిమాప్నుయాత్॥

బుద్ధిమంతుడైనయోగి తనకంటె అన్యమేదియులేని యేకాంతస్థలమున ఒంటరివాడై నివసింపవలయును. ఈవిధముగనే బ్రహ్మనిష్ఠ ఆచరింపవలయును. అతఁడీవిధముగ ముక్తి నొందగలడు. (మైత్రేయోపనిషత్తు 2అ. 3శ్లో)

శ్లో॥ యావత్సర్వం నసంత్యక్తం తావదాత్మా నలభ్యతే।
సర్వవస్తు పరిత్యాగే శేష ఆత్మేతి కథ్యతే॥

సర్వవస్తుసముదాయము ఎంతవఱకు పరిత్యజింపబడదో అంతవఱకు ఆత్మప్రసన్నత కలుగదు. సర్వవస్తువులను పరిత్యజింపగా అటుపైన మిగిలియుండునది ఆత్మయని చెప్పబడును. (అన్నపూర్ణోపనిషత్తు 1అ. 45శ్లో)

ఇట్లు అంతఃకరణము, పవనేంద్రియములు, పంచభూతములు, గుణకర్మాదులు నిషేధింపఁబడినమీదఁట అస్మచ్ఛబ్ద లక్ష్యార్థమైన పరమాత్మతత్త్వమొకటి మాత్రమే మిగిలియుండు స్థితికి ఏకాంతమనిపేరు ఆత్మయే స్థానమున నిలిచినప్పుడు నామరూపక్రియలు, మనోవృత్తులు కనఁబడకుండునో అది రహస్యస్థలమని చెప్పఁబడును.

శ్లో॥ ఏకశ్చరేన్మహీమేతాం నిస్సంగస్సంయతేంద్రియః।
ఆత్మక్రీడ ఆత్మరతిరాత్మవాన్ సమదర్శనః॥

ఆత్మతత్త్వమును పొందిన యతీశ్వరుఁడు సర్వసంగ పరిత్యాగియై జితేంద్రియుఁడై తనయందే తాను క్రీడించుచు ఆనందించుచు సర్వభూతములను సమదృష్టితోఁజూచుచు భూమిపై ఒక్కఁడే చరింపవలయును. (నారద పరివ్రాజకోపనిషత్తు 5 ఉ 25శ్లో.)

ఆత్మచలింపక తనయందే తాను నిలిచియుండునెడల చిత్తము ఆత్మయందే లయించు చున్నది. సర్వవిషయములు త్యజింపఁబడు చున్నవి. ఆశ శమించిపోవు చున్నది. అందుచేతనే ఆత్మప్రసన్నత కలుగుచున్నది.

మూ॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్॥ 11.
తత్రైకాగ్రంమనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః।
ఉపవిశ్యాసనే। యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే॥ 12.

తా॥ పరిశుద్ధమైన స్థలములో కేవలము ఎత్తులేకుండునట్లును, కేవలము తగ్గులేకుండునట్లును దర్భ, జింకచర్మము, వస్త్రము మున్నగువానితో బాగుగ తనఆసనమును నిశ్చలముగ నుండునట్లు అమర్చుకొనిఆయాసనముసఁ గూర్చుండి మనస్సును ఊర్ధ్వస్థానమున ఒకటేపాయింటుపై నిలుచునట్లుచేసి అంతఃకరణముచేతను, బాహ్యేంద్రియములచేతను, జేయఁబడు అభ్యాసయోగ రూపమైన కార్యములను నియతముగఁ జేయుచు ఆత్మశుద్ధి కొఱకు యోగానుసంధానము చేయవలయును. (ఈవిషయము ఏబదియేనిమిదవ పత్రములో కొంతవ్రాయబడి యుండెను )

యోగతత్త్వోపనిషత్తు:— చిన్నద్వారము కలిగి వ్రణము లేమియు లేకుండు మఠమును ఆవుపేడతోనే, సున్నముతోనో, బాగుగ అలుకవలయును. ప్రయత్నపూర్వకముగా నల్లులు, దోమలు, సాలీడు పురుగులు మున్నగునవి లేకుండునట్లు చేయవలయును. దినదినము కసవూడ్చి కల్మషము లేకుండ శుద్ధిచేయవలయును. సువాసనగల ధూపములచేత పరిమళింపఁ జెయవలయును. కేవలము ఎత్తుగాని, కేవలము తగ్గుగాని లేకుండునట్లు దర్భతో, జింకచర్మముతో, వస్త్రములతో బాగుగ ఆసనము నిర్మించుకొని బుద్ధిమంతుడైన యోగి దానియందు పద్మాసనస్థుఁడై దేహము చక్కగనుండునట్లు కూర్చుండి చేతులు జోడించి యిష్టదేవతకు నమస్కరింపవలయును.

శ్లో॥ చైలాజినకుశైః సమ్యగాసనం పరికల్పయేత్।
తత్రోపవిశ్య దేవస్య సమ్ముఖే శుద్ధమానసః॥

దర్భలచేతను, జింకచర్మములచేతను, వస్త్రములచేతను, ఆసనము తయరుచేసి యుంచుకొని పరిశుద్ధమైన మనస్సుగలవాఁడై భగవత్సాన్నిధ్యమున కూర్చుండవలయును (అధ్యా. కిష్కి. 4-21.)

త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు:— ఇతర భూతములకు సంబంధపడని యేకాంతస్థలములో కొయ్యపీఠముమీఁద దర్భ, జింకచర్మము వగైరాలు అమర్చి ప్రసన్నతతో శరీరము చక్కగనుండునట్లు కూర్చుండవలయును. క్రింది దౌడయందలి దంతములు పైదౌడ దంతములకు సోఁకకుండునట్లు నాలుక దౌడల నడుమ నుండునట్లు స్వస్థచిత్తుడైయుండి నాసాగ్రమున దృష్టి నిలిపి యోగము చేయవలయును.

జాబాలదర్శనోపనిషత్తు - మనోహరము, పరిశుద్ధమునైన స్థలమున మఠము కల్పించుకొనవలయును. ప్రసన్నచిత్తుడై ఆసనము నిర్మించుకొని తూర్పు ముఖముగఁ గాని, ఉత్తరముఖముగఁగాని కూర్చుండవలయును. నోరు తెఱచుకొనియుండరాదు. శిరస్సు, మెడ, శరీరము, చక్కగనుండవలయును నిశ్చలుఁడై నాసాగ్రమున చూపునిలిపి అచ్చట అవస్థాత్రయమునకు అతీతమైన చంద్రబింబము నందలి అమృతబిందువును జూచుచుండవలయును.

అమృతనాదోపనిషత్తు:- భూమిమీఁద నిర్దుష్టమైన రమ్యమైన దర్భాసనమందు మానసికమైన రక్షామంత్రము జపించి పద్మాసనమునఁగానిఁ స్వస్తికాసనమునగాని, భద్రాసనమునఁగాని ఉత్తరాభిముఖముగ సుఖముగఁగూర్చుండి యోగాభ్యాసము చేయవలయును

మూ॥ సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః।
సంప్రేక్ష్యనాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్॥ 13.

ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః।
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీతమత్పరః॥ 14.

తా॥ యోగి తన శరీరమును, శిరమును, కంఠమును సమముగనుండునట్లు కదలకుండునట్లు నిలుపవలయును. సుస్థిరుఁడై తన నాసికాగ్రమును బాగుగఁ జూచుచుండవలయును. ప్రక్కల జూడరాదు, భయమును వదలినవాఁడుగాను, మిక్కిలి శాంతస్వరూపుడుగాను. బ్రహ్మచర్యవ్రతము నను ష్ఠించువాఁడుగాను ఉండవలయును. మనస్సును లెస్సగ నిగ్రహించి అస్మచ్ఛబ్ద లక్ష్యార్థమైన పరమాత్మ తత్త్వమునందు ఆసక్తుఁడై ఆపరమాత్మయందే చిత్తము నిలిపియుండవలయును,

1. యోగశిఖోపనిషత్తు:— నాసాగ్రమున దృష్టినిలిపి హస్తములను, పాదములను నియమించి సర్వత్రవ్యాపించు స్వభావముగల మనస్సును సంకోచింపఁజేసి అచ్చట ప్రణవరూపమైన పరమాత్మను చింతింపవలయును.

2. యోగచూడామణ్యుపనిషత్తు:— ఏకాంతస్థలమున పద్మాసనమును లెస్సగ అధిష్ఠించి నాసాగ్రమున దృష్టి నిలిపి అవ్యయమైన ప్రణవమును (నాదబ్రహ్మమును) జపము చేయవలయును.

3. మండలబ్రాహ్మణోపనిషత్తు:— చూపుడువ్రేలి చివరభాగములచే మూయఁబడిన రెండు కర్ణరంధ్రములయందును పూత్కారశబ్దము పుట్టుచున్నది. అచ్చట మనస్సు నిలుపగాఁ నేత్రములనడుమ నీలవర్ణముగల జ్యోతి కనఁబడును. మనస్సునందును అల్లేతోచును. బహిర్లక్ష్యము నాసాగ్రమున 4-6-8-10-12 అంగుళముల పరిమాణముచేత క్రమముగా నీలవర్ణము, నలుపు, ఎఱుపు, పసుపువర్ణముల నేత్ర కిరణములతోఁ గూడిన ఆకాశము కనఁబడును. ఇట్లు చూచిన వాఁడుయోగి.

4. అద్వయతారకోపనిషత్తు:-ఈ గ్రంథములో సైతము దాదాపుగ మండల బ్రాహ్మణోపనిషత్తులోవలెనే చెప్పఁబడినది. ఈ విషయములో రెండు గ్రంథములకు భేదము కనఁబడదు.

5. శాండిల్యోపనిషత్తు:-- ఇంతకుముందుఁ జెప్పఁబడినటుల మృదువై తనకు వశమైయుండు ఆసనమున తూర్పు ముఖముగాఁగాని ఉత్తర ముఖముగాఁగాని కూర్చుండి జ్ఞానిశిరమును, కంఠమును సమముగ నుంచుకొని నాసాగ్రమున దృష్టి నిల్పినవాఁడై భ్రూమధ్యమునందలి చంద్రబింబమును చూచుచు రెండు నేత్రములతో అమృతమును పానము చేయవలయును.

6. భాగవతము. 11. స్కం. 14. అధ్యా:--

శ్లో॥ సమ ఆసన ఆసీనస్సమకాయో యథా సుఖమ్।
హస్తావుత్సంగ ఆధాయ స్వనాసాగ్ర కృతేక్షణః॥

హెచ్చు తగ్గులు లేక సమముగనుండు ఆసనమునఁ గూర్చుండి శరీరమును సమముగనుంచుకొని రెండు హస్తములను తొడలపైఁ బెట్టుకొని సుఖము నతిక్రమింపక తన నాసాగ్రమున దృష్టి నిలుపవలయును.

వివ॥ నాసాగ్రమనఁగా ముక్కు చివరభాగమని సామాన్యముగ అర్థమగుచున్నది. పైచివరభాగమా! క్రింది చివరభాగమా! అని కొందఱు పాఠకులు సంశయింతురు. ఈ నాసయను ఘ్రాణేంద్రియము కూటస్థానము నుండి బయటికి వచ్చుటచేత పైచివర భ్రూమధ్యమగును. "నాసాగ్రమున దృష్టినిల్పి భ్రూమధ్యమున చంద్రబింబమును చూచుచు" అని శాండిల్యో

పనిషత్తులోఁ జెప్పుటచేత పైచివరభాగమే నాసాగ్రమని కొందఱు తలఁతురు. మండలబ్రాహ్మణోపనిషత్తునందును, అద్వయతారకోపనిషత్తునందును వర్ణింపఁబడిన పద్ధతియు కొంతవఱకు ఈయభిప్రాయమునకే అనుకూల మగుచున్నది.

శ్లో॥ అంతఃకపాలకుహరే జిహ్వాం వ్యావృత్య ధారయేత్।
భ్రూమధ్యదృష్టిరప్యేషా ముద్రా భవతిఖేచరీ॥

(యోగతత్త్వోపనిషత్తు)

"భ్రూయుగమధ్యబిలే దృష్టిం తద్ద్వారోర్ధ్వస్థితతేజ ఆవిర్భూతం తారకయోగో భవతి" (అద్వయతారకోపనిషత్తు)

శ్లో॥ కపాలకుహరే జిహ్వా ప్రవిష్టా విపరీతగా।
భ్రువోరంతర్గతా దృష్టిర్ముద్రా భవతి ఖేచరీ॥

(ధ్యానబిందూపనిషత్తు, యోగచూడమణ్యుపనిషత్తు.)

ఈ శ్లోకములరీతిగఁ జూచినను పైచివరయే నాసాగ్రమని కొందఱూహించుచున్నారు. - భ్రూమధ్యమున చూపునిలిపినది ఖేచరీ ముద్రయనియు నాసాగ్రమున చూపునిలిపినది భూచరీముద్రయనియు సీతారామాంజనేయ సంవాదములోఁ జెప్పఁబడినది అంతేకాక త్రికూటముతోఁ గూడిన పైచివర మూలము కావచ్చును. బాహ్యమునకు వ్యాపించిన క్రిందిచివర అగ్రము కావచ్చును. కాఁబట్టి నాసాగ్రమనఁగా క్రిందిచివరయేయని యిఁకఁగొందఱు వాదింతురు అందువలన రెండు చివరలు లక్ష్యస్థానములేయని ఒప్పుకొనవచ్చును. కాని రెండు నేత్రములనుండి వెలువడిన దృక్కిరణములన్నియు నాసాగ్రమున ఒక్కపాయింటుపై నిలుచుట మిక్కిలి కష్టము. కన్నునొప్పి, తలపోటు వచ్చును. కన్నులు చెడినవారిని కొందఱిని చూచియున్నారము. అటుగాక తొలుత 84 అంగుళముల దూరమున లక్ష్యమును నిలుపుకొని చూచుచు అభ్యాసమైన కొలది మెల్లమెల్లగ సమీపమునకుఁ జేర్చుకొనుచు రావచ్చును.

మూ॥ యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః।
శాంతిం నిర్వాణ పరమాం మత్సంస్థామధిగచ్ఛతి॥ 15.

తా॥ పూర్వోక్తశ్లోకము రీతిగా యోగి మానసమును స్వాధీనముఁ గావించుకొని నిరంతరము ఆత్మాను సంధానము జేయుచు అస్మచ్ఛబ్ద లక్ష్యార్థమునకు నిధానమైనట్టియు, మోక్షస్వరూపమగుటచే శ్రేష్ఠమైనట్టియు, శాంతిని పొందుచున్నాఁడు.

మూ॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాంతమనశ్నతః।
నచాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవచార్జున॥ 16.

తా॥ అర్జునా! మితముదప్పి యెక్కువ భుజించువానికి యోగము లభింపదు. కేవలము నిరాహారియైన వానికిని లభింపదు. అధికముగ నిద్రించు స్వభావముగలవానికిని, ఎంతమాత్రమైన నిద్రయేలేని వానికినిలభింపదు.

శ్లో॥ భయక్రోధమథాలస్యమతిస్వప్నాతిజాగరమ్।
అత్యాహరమనాహరం నిత్యం యోగీ వివర్జయేత్॥

భయమును, క్రోధమును, అలసత్వమును, ఎక్కువ నిద్రను, జాగరమును, అధికాహారమును, లంకణమును యోగి నియతముగ వదలవలయును. (అమృతనాదోపనిషత్తు 28)

శ్లో॥ ఉపసమీపే యో వాసో జీవాత్మపరమాత్మనోః।
ఉపవాసస్స విజ్ఞేయో నతు కాయస్య శోషణమ్॥
కాయశోషణమాత్రేణ కా తత్రహ్యవివేకినామ్।
వల్మీకతాడనాదేవ మృతః కిన్ను మహోరగః॥

జీవాత్మ పరమాత్మల సామీప్య మేదికలదో అదే యుపవాసమని తెలియవలయును. కూడుదినక శరీరమును ఎండగట్టుట ఉపవాసముకాదు. దేహమును శుష్కింపఁజేసినంతమాత్రమున వివేకశూన్యులకు ఏమి ప్రయోజనము? పుట్టమీఁద కొట్టుటవలన పుట్టలోని మహాసర్పము చచ్చునా?
(వరాహోపనిషత్తు 2అ. 39-40 శ్లో)

చ॥ వనరుచు నేమియుందిననివానికి మిక్కిలి వెక్కసంబుగాఁ,
దిని యెగఁబోయువానికిని దీఁటని నిద్దురయెల్లప్రొద్దుఁ బై
కొనఁబడియుండువానికిని గొంకక రేపగలొక్కరీతి మే
ల్కొని వసియించువానికి నగోచరముల్వరయోగ లక్ష్యముల్॥

తిండిలేక శరీరము నెండగట్టుకొనువానికిని, మితిమీఱిన తిండిపోతునకును, ఎక్కువ నిద్రించువానికిని, నిద్రలేక యెప్పుడు జాగరణములతోనే కాలము గడపువానికిని యోగాభ్యాసము చేయుటకు వీలుపడదు. (సీతారామాంజనేయ సంవాదము 1 ఆశ్వా. 98 ప.)

"లుబ్ధత్వంబుచే నేమియుం దినలేకుండిన కష్టజీవులకు సందేహంబు లేకెప్పుడుం దినుబహ్వాశులకుఁ"

"నిదురంగానని సౌఖ్యహీనులకు సందేలేక రేయుంబవల్ నిదురం జెందెడునట్టి మందులకు......కనంబడదు నీతేజంబు విశ్వంభరా"

(విశ్వంభరీయము 1 సం.)

శ్లో॥ ఆహారస్యచ భాగౌ ద్వౌ తృతీయముదకస్యచ
వాయోస్సంచలనార్థాయ చతుర్థమవశేషయేత్॥

యోగి కడుపులో రెండుభాగములకు ఆహారపదార్థములు భుజింపవలయును. మూడవభాగమునకు నీరుత్రాగవలయును. వాయుసంచలనమునకై నాల్గవభాగమును వెలితిపెట్టవలయును (దర్శనోపనిషత్తు 2ఖ. 59 శ్లో)

"మితాహారోనామ చతుర్థాంశావశేషక సుస్నిగ్ధ మధురాహారః" మితాహారమనగా కడుపులో నాలుగింట ఒకభాగము వెలితియుండునట్లు మృదువైన మధురమైన ఆహారపదార్థము భుజించుట (శాండిల్యోపనిషత్తు 1 ఖ)

శ్లో॥ అభక్ష్యస్య నివృత్త్యాతు విశుద్ధం హృదయం భవేత్
ఆహారశుద్ధౌ చిత్తస్య విశుద్ధిర్భవతి స్వతః॥

అనర్హములైన భోజనపదార్థములను తినక మానుకొనుటచేత మనస్సు పరిశుద్ధమగును. పరిశుద్ధమైన ఆహారపదార్థమును భుజించుటచేత చిత్తశుద్ధి తనంతటనే కలుగుచున్నది. (పాశుపత బ్రహ్మోపనిషత్ 36 శ్లో)

మూ॥ యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥ 17

తా॥ మితమైన ఆహారవిహారములు కలవానికి (ఆహారవిహారము లనఁగా విషయములను గ్రహించుట, నిషేధించుటయని కొందఱందురు.) మిత

మైన కర్మానుష్ఠానముకలవానికి, మితమైన నిద్రా జాగరములు గలవానికి దుఃఖసంహారకమైన యోగము కలుగుచున్నది.

యోగులకు ఏవిషయమెంతమాత్రము గ్రాహ్యమో ఏవిషయము విసర్జనీయమో దానినెఱిగి అప్రకారము వర్తించువానికి, యోగి జనార్హమైన కర్మయోగపద్ధతుల నాచరించువానికి, యోగి జనార్హమైనరీతి నిద్రాజాగరములు గలవానికి యోగము దుఃఖశాంతికరమగుచున్నది.

మూ॥ యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే।
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥ 18

(పూర్వశ్లోకములో జెప్పఁబడిన యుక్తశబ్దమునకు అర్థమిందు విశదపఱుపబడినది.)

తా॥ చిత్తము లెస్సగా నిగ్రహింపఁబడి విషయభోగములయందు వ్యాపింపక తనయందే యెప్పుడు నిలుచుచున్నదో! సమస్తకామములవలన ఎప్పుడు విరక్తి పుట్టుచున్నదో అప్పుడు యోగి (యుక్తః) అని చెప్పఁబడును.

మూ॥ యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా।
యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః॥ 19

తా॥ గాలివీవనిస్థలములో ఉంచఁబడిన దీపము చలనములేక యేకరీతి వెలుఁగుచున్నది. చిత్తమును విషయభోగములకై చలింపకుండ నియమించుకొని ఆత్మయోగాను సంధానముఁజేయు యోగికి పైజెప్పఁబడిన దీపవార్త ఉపమానముగఁ దలపబడినది. ఇచట చిత్తనిరోధము వర్ణింపఁబడుటచే అభ్యాసయోగము, ఆత్మానుసంధానము వర్ణింపఁబడుటచే జ్ఞానయోగము అవసరమని తెలియవలయును.

శ్లో॥ నివాతదీపసదృశమకృత్రిమమణిప్రభమ్।
ధ్యాయతో యోగినస్తస్య ముక్తిః కరతలే స్థితా॥

గాలిలేనిచోట నుంపఁబడిన దీపమువలె, స్వాభావికముగఁ బుట్టిన మాణిక్యమువలెఁ బ్రకాశించు పరమాత్మను ధ్యానించుచుండు ఆయోగికి మోక్షము అరచేతియందున్నది. (త్రిశిఖి బ్రాహ్మణోపనిషత్తు 157 శ్లో)

శ్లో॥ నిర్వాతేతు యథాదీపో జ్వలేత్స్నేహసమన్వితః।
నిశ్చలోర్ధ్వశిఖస్తద్వద్యుక్తమాహుర్మనీషిణః॥

గాలివీవనిచోట దీపము నిట్టనిలువు జ్వాలగలిగి చూచువారికి పీ్రతిని కలిగించు స్వభావముతోఁగూడి యెట్లు వెలుగుచున్నదో, అదేవిధముగా యోగీశ్వరుఁడు ఏకాగ్రచిత్తముతో నిశ్చలుఁడైయుండునని బుద్ధిమంతులు చెప్పుదురు. (భారత శాంతి 317 అ 19-20 శ్లో)

శ్లో॥ ధ్యాతృధ్యానే పరిత్యజ్య క్రమాద్ధ్యేయైకగోచరమ్।
నివాతదీపవచ్చిత్తం సమాధిరభిధీయతే॥

ధ్యానించువాఁడు (కర్త) ధ్యానించుట (క్రియ) అనువీనిని క్రమముగా విడిచిపెట్టినమీఁదట ధ్యానింపఁదగిన పరమాత్మయందే గోచరించు చిత్తము గాలివీవని స్థలమునందలి దీపమువలె నిశ్చలముగ నిలుచుచున్నది. ఈ స్థితి సమాధియనఁబడును. (అధ్యాత్మోపనిషత్తు 35) "ధ్యాతృధ్యానే విహాయ నివాతస్థిత దీపవద్ధ్యేయైక గోచరంచిత్తం సమాధిర్భవతి"

ధ్యానించువాఁడు, ధ్యానించుటయను నీరెండును వదలినతరువాత ధ్యానింపబడదగిన అంతర్లక్ష్యమునందే చిత్తము గాలివీవని స్థలమునందలి దీపమువలె నిశ్చలముగ నిలుచుచున్నది. ఈస్థితి సమాధియగును.
(పైంగలోపనిషత్తు 3 అధ్యా)

శ్లో॥ ద్రష్టృదర్శనదృశ్యాని లీయంతే యత్రతత్రవై
సందృశ్యతే స్వయంజ్యోతిర్నివాతస్థలదీపవత్॥

చూచువాఁడు, చూచుట, చూడఁబడునది ఇవన్నియు నెచ్చట లయించుచున్నవో అచ్చటనే స్వయంప్రకాశమానమైన పరమాత్మ తత్త్వము గాలిలేని స్థలమునందలి దీపమువలె లెస్సగఁ జూడఁబడుచున్నది. (విశ్వగీత 105)

వివ॥ "నివాతస్థలము" అనఁగా గాలిలేని స్థలమని కొందఱూహింతురు. గాలిలేని శూన్యప్రదేశమును "టారిచెల్లి" అను పండితుఁడు కనిపెట్టెను. అట్టి శూన్యప్రదేశములో దీపములు వెలుఁగవు. జీవులు బ్రతుకవు, సస్యములు పెరుగవు అని పండితులనేకులు దృష్టాంతపూర్వకముగఁ దెలిసికొనిరి. కనుక పైశ్లోకములో "నివాతస్థః" అనుపదమునకు గాలిలేనిచోట నుంపఁ

బడిన అనిచెప్పరాదు. "వా గతిగంధనయోః" అనుసూత్రమునుబట్టి గాలి వీవనిచోట నుంపఁబడిన అనిచెప్పుటే సమంజసము.

మూ॥ యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా।
యత్రచైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥ 20

తా॥ యోగవిద్యాభ్యాసమువలనఁ గలిగిన అనుభవముచేత అటంక పరుపబడిన చిత్తము ఎందు విశ్రాంతిఁ జెందుచున్నదో, (ఈవిశ్రాంతికి ఉపరతియనిపేరు.) తనస్వరూపమును దాఁజూచుచు తనలోనే యెందు సంతుష్టిఁ జెందుచున్నాడో! (ఈశ్లోకము యోగశిఖోపనిషత్తు 3అధ్యాయమందున్నది)

మూ॥ సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్।
వేత్తి యత్ర నచైవాయం స్థితశ్చలతి తత్త్వతః॥ 21

తా॥ ఇంద్రియగోచరములైన విషయసుఖములకంటె అతీతమైనట్టియు, బుద్ధిచే (జ్ఞానయోగముచే) గ్రహింపఁదగినట్టియు, అనంతమైనట్టియు పరమసుఖము ఎందు తెలిసికొనుచున్నాడో! తత్త్వమునుండి చలింపక పురుషుఁడు ఎందు సుస్థిరుఁడైయున్నాడో!

మూ॥ యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే॥ 22

తా॥ దేనిని పొందినతరువాత ఇతరలాభము ఇంతకంటె గొప్పదికాదని తలఁచుచున్నాఁడో! దేనియందు నిలిచియుండువాడు గొప్పదుఃఖముచేనైనను కదలింపబడఁడో! (ఈశ్లోకము యోగశిఖోపనిషత్తు 3 అధ్యాయమునందున్నది )

మూ॥ తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా॥ 23

తా॥ (పూర్వశ్లోకములలో వర్ణింపఁబడిన)దానిని దుఃఖప్రాప్తితో సంబంధపడని యోగసమాఖ్యగలదానినిగాఁ దెలియవలయును. లెస్సగ నిశ్చయింపఁబడినట్టియు, వేదనారహితమైనట్టియు చిత్తముతో ఆయోగము సంఘటింపఁబడవలయును.

మూ॥ సంకల్పప్రభవాన్ కామాంస్త్యక్త్వా సర్వాన శేషతః।
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః॥ 24

శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా।
ఆత్మసంస్థం మనఃకృత్వా నకించిదపి చింతయేత్॥ 25

"సంకల్పః కర్మమానసమ్" (అమరకోశము) మనోవృత్తి సంకల్పమన బడును. విషయములను చింతించుట మనోవృత్తి. దీనివలన కోరికలు పుట్టుచున్నవి. కోరికవలన క్రోధమాత్సర్యాదులుపుట్టుచున్నవి. అందుచేత మనస్సునకుఁ గొంత బాహ్య వ్యాపార మేర్పడుచున్నది. కాఁబట్టి కోరికల నన్నిటిఁని మిగులులేకుండ వదలివేయవలయును. కోరిక పుట్టుటకు అధారము మానసేంద్రియములు అగుటచే ఇంద్రియసముదాయమును మనస్సుచేత నిగ్రహించి స్వవశమున నిలుపుకొని తన యిష్టప్రకారము నడుపవలయును. మనస్సును పరమాత్మయందు నిలిచియుండునట్లుఁ జేసి ధారణాయోగముచే మెల్లమెల్లగ గ్రహింపఁబడిన బుద్ధిచేత పరమాత్మ తత్త్వమునందలి దివ్యసుఖమనుభవింపవలయును. తనకంటె అన్యమైనదానిని కొంచెమైననుతలపరాదు.

అనాదిగ గల్గిన అజ్ఞానవాసనచేత నేను జన్మించువాడననుకొనుట మొదలగు సంకల్పము బంధమగును. తల్లిదండ్రులు, సోదరులు, భార్యాపుత్రులు, గృహములు, పొలములు, క్రీడాస్థానములు మొదలైన వానియందు మమకార రూపమైన సంకల్పము బంధమగును. దేహేంద్రియములచేఁజేయఁబడు కర్మకు నేను కర్తనను సంకల్పము బంధమగును అణిమ, మహిమ మొదలైన అష్టైశ్వర్యములు కావలయునను సంకల్పము బంధమగును. దేవతలను, మనుష్యులను, ఉపాసించు కోరికతోఁ గూడిన సంకల్పము బంధమగును. యమనియమాది యోగాంగములు మున్నగువాని నభ్యసింపవలయుననెడు సంకల్పము బంధమగును. వర్ణాశ్రమ ధర్మములను, కర్మలనుచేయుటే లెస్సయను సంకల్పము బంధమగును. ఆజ్ఞ, భయము, సంశయము, స్వభావముగగల అభ్యాసములయందలి సంకల్పము బంధమగును. యజ్ఞము, వ్రతము, తపస్సు, దానము, వేదవిహితాచారములు తెలిసికొనవలయునను సంకల్పము బంధమగును కేవలము మోక్షము కావలయునను సంకల్పము బంధమగును.ఏమాత్రమైనను సంకల్పముపుట్టుటే బంధమగును. బంధకారణములైన సర్వసంకల్పములు క్షీణించుటమోక్షమగును (నిరాలంబోపనిషత్తు)

శ్లో॥ యత్కించిదపి సంకల్పస్తాపత్రయమితీరితమ్।
కామం క్రోధం బంధనం సర్వదుఃఖమ్।

విశ్వం దోషం కాలనానాస్వరూపమ్।
యత్కించేదం సర్వసంకల్పజాలమ్।
తత్కించేదం మానసం సోమ్యవిద్ధి॥

ఏ కొంచము సంకల్పముండినను తాపత్రయము తప్పదన్నమాటే కామము, క్రోధము, కర్మచె బంధింపఁబడుట, సమస్తమైన దుఃఖము, ప్రపంచము, వికృతిభావము, కాలముయొక్క వివిధమైన స్వరూపము ఇవన్నియు సంకల్పముతోఁ గూడినవే. సమస్తమైన యీ సంకల్పజాలము యేమాత్ర ముండినను అది మనస్సునఁ బుట్టినదే యని తెలిసికొనుము.

(తేజోబిందూపనిషత్తు 5 అ. 97 శ్లో.)

శ్లో॥ భోగేచ్ఛా మాత్రకో బంధ స్తత్త్యాగో మోక్ష ఉచ్యతే।
మనసోఽభ్యుదయో నాశో మనోనాశో మహోదయః॥

విషయ భోగములయందలి వాంఛ బంధమగుచున్నది. ఆవాంఛను వదలివేయుట మోక్షమనఁబడును. మనస్సు పెంపొందుటచే తత్త్వజ్ఞానము నశించుచున్నది. మనస్సు నశింపగా తత్త్వజ్ఞానము పెంపొందుచున్నది.

మహోపనిషత్తు 5-87.)

శ్లో॥ మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః।
బంధనం విషయాసక్తిర్ముక్త్యై నిర్విషయం మనః॥

మనుష్యులకు బంధమోక్షములయందు మనస్సే కారణమగుచున్నది. విషయభోగములయందు ఆసక్తిఁజెందుట బంధమగుచున్నది. విషయవాంఛను మానుకొనిన మనస్సు మోక్షమునకు కారణమగుచున్నది. (ఈశ్లోకము త్రిపురతాపిన్న్యుపనిషత్తు 5 ఉపనిషత్తులోను, శాట్యాయనీయోపనిషత్తులోను బ్రహ్మబిందూపనిషత్తులోను, కొంచెము వర్ణబేదముతోఁజదివినట్టుజ్ఞాపకము)

శ్లో॥ నిరస్తవిషయాసంగం సన్నిరుధ్యమనోహృది।
యదా యాత్యమనీభావస్తదా తత్పరమం పదమ్॥

విషయాసక్తిలేకుండ మనస్సును హృదయాకాశమున నిరోధించి అమనస్కభావమును ఎప్పుడు పొందునో అప్పుడు మోక్షపదము సిద్ధాంతమగుచున్నది. (త్రిపురతాపిన్న్యుపనిషత్తు 5 ఉపనిషత్తు 4 శ్లో.)

 ఓం తత్ సత్.

# శతపత్రము
# 98

మూ॥ యతోయతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరమ్।
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్॥ 26.

తా॥ మనస్సు నిలుకడలేక కదలుచుండు స్వభావముకలది. అది యేయేవిషయములవలన మిక్కిలి చరించుచున్నదో ఆయావిషయముల నుండిమరల్చి స్వాధీనముగావించుకొని పరమాత్మయందుఁజేర్పవలయును.

శ్లో॥ చిత్తసత్తా పరందుఃఖం చిత్తత్యాగం పరంసుఖమ్।
అతశ్చిత్తం చిదాకాశే నయ క్షయమవేదనాత్॥

చలనస్వభావముగల అంతఃకరణము కలిగియుండుట మిక్కిలి దుఃఖము. (కామక్రోధాదులకు అశుభములకు ఇదేహేతువని భావము) అట్టి స్వభావముగల చిత్తమును వదలుటలో శ్రేష్ఠమైన సుఖమున్నది. (మోక్షప్రాప్తి యున్నదని తెలియవలయును.) అందువలన అనాయాసముగ జ్ఞానాకాశమున ఆచిత్తమును క్షయము గావింపవలయును (అన్నపూర్ణోపనిషత్తు5అ117)

శ్లో॥ చిత్తే చలతి సంసారో నిశ్చలే మోక్ష ఉచ్యతే।
తస్మాచ్చిత్తం స్థిరీకుర్యాత్ ప్రజ్ఞయా పరయా విధే॥

ఓ విధాతా! చిత్తము చలించినప్పుడు సంసారమనియు, చలింపక నిలిచియుండునప్పుడు మోక్షమనియుఁ జెప్పఁబడును. అందువలన శ్రేష్ఠమైన బుద్ధిచేత చిత్తమును స్థిరముచేయవలయును. (యోగశిఖోపనిషత్తు 6-58)

మూ॥ ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్।
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్॥ 27

తా॥ "రంజయతీతి రజః, రంజరాగే గుణఅభ్యాసే" అనుసూత్రము వలన విషయభోగాదులయందు అనురక్తినిపుట్టించు అలవాటు రజోగుణ

మనఁబడును. ఈయఁలవాటు శాంతించినగాని మనస్సు శాంతింపదు. మనస్సు శాంతించువఱకు పరతత్త్వప్రాప్తి కలుగదు. పాపము క్షీణింపదు. దివ్యసుఖముఁ లభింపదు. కనుక చిత్తోపశమము కలిగినట్టియు, రజోగుణము శాంతించినట్టియు, బ్రహ్మప్రాప్తిఁ జెందినట్టియు, పాపరహితుఁడైనట్టియు ఈయోగిని ఉత్తమమైన సుఖము చెందుచున్నదికదా?

మూ॥ యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః।
సుఖేన బ్రహ్మ సంస్పర్శ మత్యంతం సుఖమశ్నుతే॥ 28

తా॥ ఈవిధముగా ఆత్మానుసంధానము చేయుచు పాపరహితుఁడైన యోగీశ్వరుఁడు పరతత్త్వప్రాప్తిరూపమైన విశేషసుఖమును అనాయాసముగా అనుభవించుచున్నాఁడు.

మూ॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతానిచాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ 29

తా॥ మానసేంద్రియములను పరమాత్మయందు సంక్షేపించువాఁడు యోగయుక్తాత్ముఁడని యిదిఱకు తెలియును. ఇరువదినాలుగు తత్త్వములు, వానివృత్తులు లయించినపిమ్మట ఆత్మయొక్కటే మిగిలియుండునది. అది సర్వవస్తువులయందును ఒకటేవిధముగ నుండును కాని వేఱువేఱు విధములుగ నుండదు అని తెలిసికొని ఆ జ్ఞప్తితో జూచువాఁడు సమదర్శనుడు. అట్టియోగీశ్వరుఁడు పృథివ్యాది స్థావరభూతములయందును, బ్రహ్మాది జంగమభూతములయందును, భూతవికారములైన యితరవస్తువులయందును ఉండు చైతన్యము తానేయనియు, సర్వభూతములు తనయందే వర్తించుచున్నవనియు చూచుచున్నాడు. (ఈశ్లోకము కైవల్యోపనిషత్తు 1 ఖండములోను, భారత శాంతి 239 అధ్యాయములోను, 327 అధ్యాయములోను, కొంచెము శబ్దభేదముతోఁ జదివినట్టు జ్ఞాపకము.)

శ్లో॥ సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని
విజ్ఞాయ నిరహంకారో నిర్మమస్త్వం సుఖీభవ॥

సర్వభూతములయందు పరమాత్మయున్నది. పరమాత్మయందు సర్వభూతములు ఉన్నవి అనితెలిసికొని అహంకార మమకారములు లేనివాఁడవై నీవుసుఖవంతుఁడవుకమ్ము. (అష్టావక్రగీత 15 ప్ర 6 శ్లో)

శ్లో॥ సర్వభూతేషు యః పశ్యేద్భగవద్భావమాత్మనః
భూతాని భగవత్యాత్మన్యేష భాగవతోత్తమః॥

సర్వభూతములయందు భగవత్స్వరూపమైన తనయొక్క భావమును, భగవతత్త్వ స్వరూపమైన తనయందు సర్వభూతములను ఎవఁడు చూచుచున్నాఁడో వాఁడు భాగవతోత్తముఁడు. (అర్షభగీత 1 అధ్యా 45 శ్లో.)

శ్లో॥ త్వమేవసర్వభూతానాంనివాసస్థానముత్తమమ్
తవాపి సర్వభూతాని నివాససదనాని హి॥

సర్వభూతములకు ఉత్తమమైన నివాసస్థానమునీవే నీకును సర్వభూతములు నివాసస్థానములుగదా? (అధ్యా. అయో 6 స. 52 శ్లో)

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని
సంపశ్యన్ బ్రహ్మపరమం యాతి నాన్యేన హేతునా॥

సర్వభూతములయందు తన్ను, తనయందు సర్వభూతములను లెస్సగఁజూచుచుండువాడు పరబ్రహ్మతత్వమును పొందును. ఇతరకారణముల చేత పొందఁజాలఁడు. (కైవల్యోపనిషత్తు 10 శ్లో.)

శ్లో॥ యస్తుసర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి।
సర్వభూతేషు చాత్మానం తతో నవిజుగుప్సతే॥

ఎవఁడైతే సమస్త భూతములు తనయందే యున్నవనియు, సర్వభూతములయందు తాను ఉన్నాఁడననియు ఆంతరంగిక దృష్టితోఁ జూచుచున్నాడో అతఁడాపైన మఱెట్టి భూతమునైనను నిందింపఁడు.

(ఈశావాస్యోపనిషత్తు 6 శ్లో.)

శ్లో॥ యదా సర్వాణి భూతాని స్వాత్మన్యేవ హి పశ్యతి।
సర్వభూతేషు చాత్మానం బ్రహ్మ సంపద్యతే తదా॥

ఎప్పుడైతే సమస్త భూతములను తనయందున్నవానినిగాఁ జూచుచున్నాడో! సమస్త భూతములయందు తానున్నట్లుగాఁ జూచున్నాఁడో! అప్పుడు కదా పరబ్రహ్మ తత్త్వమును పొందుచున్నాఁడు. (ఈశ్లోకము అన్నపూర్ణోపనిషత్తు 5 అధ్యాయములోను, జాబాలదర్శనోపనిషత్తు 10 ఖండములోవున్నది.)

శ్లో॥ సర్వభూతైకసదనం సర్వభూతేషు సంస్థితమ్॥
సర్వభూతమయం దేవం స్వాత్మానం శరణం వ్రజే॥

సమస్త భూతములకు నివాసస్థానమైనవానిని, సమస్తభూతములయందు నివసించియుండువానిని, సమస్తభూతములు తన స్వరూపమే యైనవానిని, నాలో నేనని పేర్కొనఁబడువానిని, దేవదేవుని శరణొందుచున్నాఁడను.

(విశ్వగీత 38)

శ్లో॥ సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని।
యః పశ్యన్ సంచరత్యేష జీవన్ముక్తోఽభిధీయతే॥

సమస్తభూతములయందు తన్ను, తనయందు సమస్త భూతములను చూచుచు ఎవఁడు సంచరించుచున్నాఁడో అట్టివాఁడు జీవన్ముక్తుఁడని పేర్కొనఁబడుచున్నాఁడు. (శివగీత 13 అ. 29 శ్లో.)

మూ॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి॥
తస్యాహం నప్రణస్యామి సచ మే నప్రణస్యతి॥ 30.

తా॥ ఎవఁడైతే సర్వత్ర నన్నుఁజూచుచున్నాఁడో, నాయందు సర్వమును జూచుచున్నాఁడో వానికి నేను అదృశ్యుఁడనుకాను. వాఁడు సైతము నాకు అదృశ్యుఁడుకాఁడు. (ఈచట నేననఁగా సర్వభూతములయందు ''నేనునే'' నని వాడఁబడు అస్మచ్ఛబ్ద లక్ష్యార్థమని తెలియవలయును.)

శ్లో॥ మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్।
మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహమ్॥

సమస్త భూతజాలము నా యందే సంభవించుచున్నది. నా యందే వసించియున్నది. నా యందే కలిసిపోవుచున్నది. ఏకస్వరూపమైన ఆ పర బ్రహ్మ తత్త్వము నేనైయున్నాఁడను (కైవల్యోపనిషత్తు 1 ఖం. 19)

శ్లో॥ త్వత్త ఏవ జగజ్జాతం త్వయి సర్వం ప్రతిష్ఠితమ్।
త్వయ్యేవ లీయతే కృత్స్నం తస్మాత్త్వం సర్వకారణమ్॥

జగత్తుఅంతయు నీవలననే సంభవించుచున్నది. నీయందే నిలిచి యున్నది నీయందే లయించుచున్నది. అందువలన సమస్తమునకు నీవే కారణము. (అధ్యా. ఆయో. 1. 25.)

మూ॥ సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥ 31.

తా॥ బ్రహ్మాదిస్తంబపర్యంతము భూతములయందు "నేను నేను" అని చెప్పఁబడు రమణీయమైన చిత్కళాస్వరూపమంతయు శరీర భేదము లచేత స్థూలదృష్టికి వేఱువేఱు నేనులుగా కనబడినను అంతరంగిక దృష్టి యందు వేఱువేఱు నేనులు కాదు, ఒకటే నేను అని తెలిసికొని యేకభావముతోఁగూడినవాఁడై నేనని చెప్పఁబడు పరిశుద్ధాత్మ తత్త్వమును ఎవఁడు భజించుచున్నాఁడో అట్టియోగీశ్వరుఁడు సర్వవిధముల అనఁగా దేహధర్మము ననుసరించి చతుర్దశేంద్రియముల ద్వారా శబ్దాదివిషయముల యందు వర్తించుచున్నవాఁడయ్యును అస్మత్పద లక్ష్యార్థమైన పరమాత్మ యందే వర్తించినవాఁడగును.

శ్లో॥ సర్వభూతస్థితం దేవం సర్వేశం నిత్యమర్చయేత్।
ఆత్మరూపం సమాలోక్య జ్ఞానరూపం నిరామయమ్॥

సమస్తభూతములయందు అంతర్యామియైయుండు దేవుని సర్వేశ్వరుని జ్ఞానస్వరూపుని నిరామయుని తన స్వరూపముగానే చూచి నిరంతరము పూజింపవలయును. (బ్రహ్మవిద్యోపనిషత్తు. 77 శ్లోకము.)

శ్లో॥ యేన వ్యాప్తమిదం సర్వం విశ్వం స్థావరజంగమమ్।
తమాత్మస్థం నిరాలంబం రంగదేవం భజామ్యహమ్॥

చరాచరరూపమైన యీ విశ్వమంతయు యెవనిచేత పరిపూర్ణమై యున్నదో ఆ రంగదేవుని ఆలంబరహితుని, ఆత్మయందే నిలిచియుండు వానిని భజించుచున్నాఁడను. (విశ్వగీత 37 )

"ఏకో దేవో బహుధా నివిష్ట అజాయమానో బహుధా విజాయతే"

దేవుఁడొక్కఁడు బహువిధములుగ అవతరించుచున్నాఁడు. జన్మము లేనివాడు బహువిధములుగ జన్మించుచున్నాఁడు. (ముద్గలోపనిషత్తు)

శ్లో॥ ఏక ఏవ హి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్॥

ప్రాప్తిస్వరూపమైన సాకారబ్రహ్మ ప్రతి భూతమునందును ఉన్నది. జలములోఁ గనఁబడు చంద్రబింబమువలె ఏకముగాను, అనేకముగాను కనఁ

బడుచున్నది. అంతయు నొకటేయాత్మకదా? (ఈశ్లోకము త్రిపురతాపిన్యుపనిషత్తు 5 ఉపనిషత్తులోను, బ్రహ్మబిందూపనిషత్తులోను జదివినట్లు జ్ఞాపకం

"యథా శుద్ధసువర్ణస్య కటకముకుటాంగదాదిభేదః యథా సముద్రసలిలస్య స్థూల సూక్ష్మ తరంగ ఫేన బుద్బుద కరక లవణ పాషాణాద్యనంత వస్తుభేదః యథా భూమేః పర్వత వృక్ష తృణ గుల్మ లతాద్యనంత వస్తుభేదః తథైవాద్వైత పరమానంద లక్షణ పరబ్రహ్మణో మమ సర్వాద్వైతముపపన్నం భవత్యేవ మత్స్వ రూపమేవ సర్వం మద్వ్యతిరిక్తమణుమాత్రం న విద్యతే"

పరిశుద్ధమైన బంగారమునకు కడియములు, కిరీటములు, సందిదండలు మొదలైన భేదమెట్లో; సముద్రజలమునకు గొప్పవియు, చిన్నవియునైన అలలు, నురుగు, బుగ్గలు, వడగండ్లు, లవణములు, పాషాణములు మొదలైన వస్తుభేదమెట్లో; భూమికి పర్వతములు,వృక్షములు లతలు గుల్మములు, తృణములుమొదలైన వస్తుభేదమెట్లో అట్లే యేకస్వరూపుడను,పరమానంద లక్షణోపేతుడను, పరబ్రహ్మమయుడనుఅగునాకు సర్వముఏకస్వరూపమే యగుచున్నది. సర్వము నాస్వరూపమే. నాకంటె వ్యతిరిక్తమైనది అణుమాత్రమైననులేదు (త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్తు 8 అ.)

"మృద్వికారేషు మృదివ స్వర్ణవికారేషు స్వర్ణమివ తంతు వికారేషు తంతురివావ్యక్తాది సృష్టిప్రపంచేషు పూర్ణం వ్యాపకం చైతన్యమనంత మిత్యుచ్యతే"

మంటితో జేయబడిన కడవ, కుండ మొదలైన పాత్రలయందు మంటివలెను, బంగారముతో జేయబడినవివిధాభరణములయందు బంగారమువలెను, నూలుతో తయారుచేయబడిన నానావస్త్రములయందు నూలువలెను అవ్యక్తముమొదలు పాంచభౌతికమైన సృష్టిలో సర్వవస్తువులయందు పరిపూర్ణముగ వ్యాపించియుండు చైతన్యము "అనంత" మని చెప్పబడుచున్నది. (సర్వసారోపనిషత్తు)

శ్లో॥ ఏకో విష్ణురనేకేషు జంగమస్థావరేషు చ।
అనుస్యూతో వసత్యాత్మా భూతేష్వహమవస్థితః॥

ఒక్కడైన విష్ణువు చరాచరములైన అనేక భూతములయందు కూర్పఁబడి వసించుచున్నాఁడు. భూతములయందు అస్మత్పద లక్ష్యార్థమైన ఆత్మరూపుఁడైయున్నాఁడు. (వాసుదేవోపనిషత్తు)

"తైలంతిలేషు కాష్ఠేషువహ్నిః క్షీరేఘృతం యథాగంధఃపుష్పేషు।
భూతేషు తథాఽఽత్మాఽవస్థితోహ్యహమ్"

నూగులలో నూనెయు, కొయ్యలయందగ్నియు, పాలయందు నేయియు పుష్పములయందు వాసనయు నెట్లో అట్లే భూతములయందు నేను ఆత్మనై యున్నాడనుకదా?(వాసుదేవోపనిషత్తు ఈ విషయమింకను శ్వేతాశ్వతరోపనిషత్తు 1 అధ్యాయములోను, బ్రహ్మోపనిషత్తులోను, బ్రహ్మవిద్యోపనిషత్తులోను, ధ్యానబిందూపనిషత్తులోను, ఇంచుమించుగ నిట్లే వర్ణింపఁబడినది)

సుబాలోపనిషత్తు 5 ఖండము:- శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణములనెడు జ్ఞానేంద్రియములయందును, వీనికి లక్ష్యములైన శబ్దస్పర్శరూపరస గంధములయందును, ఈయింద్రియాధి దైవతములైనదిగ్వాయురాదిత్యవరుణ పృథివీ దేవతలయందును, వాక్పాణి పాదపాయు, గుహ్యములనెడు కర్మేంద్రియములయందును, వీనికి లక్ష్యములైన వక్తవ్యము, ఆదాతవ్యము, గంతవ్యము, విసర్జయితవ్యము, ఆనందయితవ్యము అను విషయములయందును, ఈ కర్మేంద్రియముల కధిదైవతములైన అగ్నీంద్ర, విష్ణు మృత్యు ప్రజాపతులయందును; మనోబుద్ధి చిత్తాహంకారములనెడు అంతరింద్రియములయందును అంతఃకరణ లక్ష్యములైన మంతవ్య బోద్ధవ్య చేతయితవ్యాహంకర్తవ్యములయందును, యీ ఇంద్రియాధి దైవతములైన చంద్ర బ్రహ్మ క్షేత్రజ్ఞ రుద్రులయందును, ప్రాణమయ కోశమునందును, విజ్ఞానమయ కోశమందును, ఆనందమయ కోశమునందును, హృదయాకాశమునందును యీయన్నిటియందును లోపలఏది సంచరించుచున్నదో అది యాత్మ

జరా, మరణము, భయము, శోకములేనట్టియు, అనంతమైనట్టియు, ఆయాత్మ నుపాసింపవలయును. ఈయాత్మయే సర్వజ్ఞుడు, సర్వేశ్వరుఁడు, సర్వాధిపతి, సర్వాంతర్యామి, సర్వమునకు ఉత్పత్తిస్థానము.

మూ॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున।
సుఖం వా యదివా దుఃఖం స యోగీ పరమో మతః॥ 32.

తా॥ (సమస్తభూతములయందలి ప్రత్యగాత్మ స్వరూపము తనకంటె అన్యమైనదికాదని యింతకుముందు చెప్పబడియుండెను. అందువల్ల) ఓ యర్జునా! సర్వభూతములు తనవంటివేయనియు, సుఖముగాని దుఃఖముగానితనకుఁ గలిగినప్పు డెట్లుండునో యితర భూతములకుఁ గలిగినప్పుడుఁ గూడ అట్లే యుండుననియు సమభావముతో ఎవఁడు చూచుచున్నాఁడో అట్టి యోగీశ్వరుడు శ్రేష్ఠుఁడని తలఁపఁబడును.

శ్లో॥ ఆత్మవత్సర్వభూతాని పరద్రవ్యాణి లోష్టవత్।
స్వభావాదేవ న భయాద్యః పశ్యతి స పశ్యతి॥

సర్వభూతములను తనవంటివానినిగను, పరులవస్తువులను మంటిపెళ్లవంటి వానినిగాను స్వభావమువల్లనే నిరపాయముగ ఎవఁడుచూచుచున్నాడో అట్టివాడు (పరతత్వము) గాంచుచున్నాడు (అన్నపూర్ణోపనిషత్తు 1-38.)

శ్లో॥ సర్వేషు నామరూపేషు నామరూపాది వర్జితమ్।
పశ్యేదేకం సర్వసమం తతః పరం గమిష్యతి॥

నామరూపములుగల సర్వవస్తువులయందును ఒకటేయాత్మ నామరూపాదులులేనిదై యున్నదనుకొని సర్వభూతములను సమముగఁ జూడవలయును. అందువల్ల మోక్షము పొందఁగలడు. (విశ్వగీత 76)

శ్లో॥ యథేక్షురస సంవ్యాప్తా శర్కరా వర్తతే తథా
అద్వయబ్రహ్మరూపేణ వ్యాప్తోఽహం వై జగత్త్రయమ్॥

చెరకురసమునందు చక్కెర యెట్లు వ్యాపించియున్నదో అట్లే యద్వితీయ పరబ్రహ్మస్వరూపుఁడనైన నేను ముల్లోకములయందు వ్యాపించి యున్నాఁడను. (ఆత్మప్రబోధోపనిషత్తు 13 శ్లో)

అర్జునుఁడు చెప్పుచున్నాడు;

మూ॥ యోఽయం యోగస్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూదన।
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్॥ 33

తా॥ ఓ కృష్ణా! నీచేత సర్వభూత సమత్వముతోఁ జెప్పబడిన యీ యోగమేదో దానియొక్క స్థిరమైన స్థితిని నేను చాంచల్యము వలనఁ గాంచకున్నాడను.

వివ॥ అభ్యాసయోగముచేత వాసనాక్షయము, చిత్తోపశమము కలుగుననియు, అందువల్లనే బుద్ధి స్థిరపడుచున్నదనియు పెక్కుసారులు చదివియున్న పాఠకులకు ఈశ్లోకమునందు సంశయము పుట్టును. చిత్తోపశమమునకుఁ గావలసిన అభ్యాసయోగ సూత్రములన్నియుఁ జాలవఱకు వర్ణింపఁబడియేయున్నవి. ఇట్లుండియు చిత్తము స్థిరపడకపోవుట చోద్యముగనే కనఁబడవచ్చును.

అన్నలారా వంటచేసి భుజించినప్పుడు ఆఁకలిబాధ మానుచున్నదే కాని; అన్నమునుగుఱించి క్రియాశూన్యములైన శుష్కవాక్యములతో ఎంతసేపు వర్ణించుచుఁ గూర్చున్నను ఆబాధమానదు. దీపమును వెలిఁగించినప్పుడు చీకటి నశించిపోవుచున్నదేకాని అటుల వెలిఁగింపక చీకటింటిలోఁ గూర్చుండి “దీపము, దీపము, దీపము” అని యెంతసేపు ప్రలాపించినను ఆచీఁకటిపోదు. అట్లే గురువులయొద్దఁజేరి పట్టుదలతో అభ్యాసయోగము చేసినప్పుడు చిత్తము స్థిరపడవచ్చునేమోకాని వేదాంతోపన్యాసములు విన్నంతనే చిత్తోపశమము కలుగదని యిందువలన ఋజువు చేయబడుచున్నది.

మూ॥ చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥ 34

తా॥ ఓకృష్ణా! మనస్సు చంచలమైనది, బలవంతమైనది, దృఢమైనది, పురుషుని కలఁగించునదికదా? (అందువలన) వాయు నిగ్రహమువలె మనోనిగ్రహము మిక్కిలి దుస్సాధ్యమని తలఁచెదను.

శ్లో॥ మనఏవ మహద్దుఃఖం మనఏవ జరాదికమ్।
మనఏవ హి కాలశ్చ మనఏవ మలం తథా॥

మనస్సే గొప్పదైన దుఃఖము, వార్ధకము మున్నగునది యంతయు మనస్సే, మనస్సేకాలము, అదేవిధముగ మలినస్వరూపమైనది మనస్సే.
(తేజోబిందూపనిషత్తు 5అ. 99శ్లో.)

శ్లో॥ ఇతశ్చేతశ్చ సువ్యగ్రం వ్యర్థమేవాభిధావతి।
మనో దూరతరం యాతి గ్రామే కౌలేయకో యథా॥

మనస్సు మిగుల తొట్రుపాటుతో వ్యర్థముగానే ఇటునటు పరుగులెత్తుచున్నది. గ్రామములో కుక్క యెట్లుసంచారము వెళ్లుచున్నదో అదేవిధముగ చాలదూరము పోవుచున్నది. (మహోపనిషత్తు 3అ. 18శ్లో.)

శ్లో॥ అప్యబ్ధిపానాన్మహతః సుమేరూన్మూలనాదపి
అపిబహ్వ్యశనాద్ బ్రహ్మన్ విషమశ్చిత్తనిగ్రహః॥

ఓబ్రాహ్మణోత్తమా! మహాసముద్రమును పానముసేయుటకంటెను, మేరుపర్వతమును పెకలించుటకంటెను, అధికభోజనమునకంటెను మనోనిగ్రహము విషమమైనది. (మహోపనిషత్తు 3అ. 20శ్లో. ఇంకను శతపత్రము 39 పత్రము కడపటిపేరాయందు ఈవిషయము కొంతసూచింపఁబడినది.)

శ్లో॥ పాతాలమావిశసి యాసి నభో విలంఘ్య
దిఙ్మండలం భ్రమసి మానస చాపలేన
భ్రాంత్యాపి జాతు విమలం కథమాత్మనీనమ్
న బ్రహ్మ సంస్మరసి నిర్వృతిమేషి యేన॥

ఓ మానసమా! చపలత్వముచేత పాతాళమునకు దూఱిపోవుచున్నదానవు. ఆకాశమున కెగిరిపోవుచున్నదానవు దిగంతములకు వెళ్లిపోవుచున్నదానవు. అంతేకాని దేనిచేత ఊఱటఁ జెందఁగలవో అనిర్మలమైన, ఆత్మహితమైన పరబ్రహ్మమును ఒకప్పుడును పొరపాటుచేతనైనను ఎందుకు తలఁపకున్నదానవు? (శ్రీభర్తృహరి 3-70)

శ్లో॥ జాయంతే మనసస్సర్వే వర్తంతే మనసస్సదా
ప్రలీయంతే మనస్యేవ మనస్సర్వమయం స్మృతమ్॥
మన ఏవ జగత్సర్వం కామసంకల్పసంకులమ్।
మనోజేతా సర్వజేతా తస్మాజ్జేతా భవేద్యతిః॥

లోకములోపుట్టుచున్న సర్వభూతములు మనస్సువల్లనే పుట్టుచున్నవి. మనస్సువల్లనే ప్రవర్తించుచున్నవి మనస్సునందే లయించుచున్నవి. మనస్సే సర్వరూపములు ధరించియున్నదని తలఁపఁబడినది. కామసంకల్పములతో నిండిపోయిన ఈజగమంతయు మనస్సేయైయున్నది. మనస్సును జయించినవాఁడు సర్వమును జయించినవాఁడగుచున్నాడు. అందువలన యతీశ్వరుఁడు మనస్సును జయింపవలయును. (విశ్వగీత 64-65)

శ్రీ భగవానుఁడు చెప్పుచున్నాఁడు.

మూ॥ అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్।
అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే॥ 35

తా॥ అర్జునా! మనస్సు చంచలస్వభావముగలది, సులభముగ నిగ్రహింపరానిది (ఐనను) అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను నిగ్రహింపఁబడుచున్నది. సంశయములేదు.

"అభ్యాసాత్తజ్ జ్ఞానం క్రమేణ పరిపక్వం భవతి పక్వవిజ్ఞానాజ్జీవన్ముక్తో భవతి"

యోగాభ్యాసముచేయుటవలన జ్ఞానము క్రమముగా పరిపక్వ మగుచున్నది. పరిపక్వమైన విజ్ఞానమువలన యోగీశ్వరుఁడు జీవన్ముక్తుఁ డగుచున్నాఁడు (మహానారాయణోపనిషత్తు 5 అధ్యా)

శ్లో॥ అనభ్యాసవతశ్చైవ వృథా గోష్ఠ్యా నసిధ్యతి
తస్మాత్సర్వప్రయత్నేన యోగమేవ సదాభ్యసేత్॥

యోగాభ్యాసములేనివానికి వ్యర్థమైన గోష్ఠిచేత ప్రయోజనమేలేదు. అందువలన సర్వవిధముల ప్రయత్నించి యెల్లప్పుడును యోగాభ్యాసమే చేయవలయును. (యోగతత్త్వోపనిషత్తు 80)

శ్లో॥ మనసైవ మనశ్ఛిత్వా కుఠారేణేవ పాదపమ్
పదం పావనమాసాద్య సద్య ఏవ స్థిరో భవ॥

గొడ్డలిచే వృక్షమును ఛేదించినట్లు మనస్సుచేతనే మనస్సును ఛేదించి పవిత్రమైన పదమునుబొంది అప్పుడే సుస్థిరుఁడవుకమ్ము. (మహోపనిషత్తు 6అ 33 శ్లో. )

శ్లో॥ దృశ్యమాశ్రయసీదం చేత్తత్సచ్చిత్తోఽసి బంధవాన్।
దృశ్యం సంత్యజ్యసీదం చేత్తదాచిత్తోఽసి మోక్షవాన్॥

చతుర్దశేంద్రియములకు గోచరించుచున్న యీవిశ్వము నాశ్రయించెదవేని చిత్తముకలవాడవగుదువు. జన్మబంధము కలవాడవగుదువు. ఈదృశ్యమును వదలివేయుదువేని అప్పుడు చిత్తము లేనివాడవగుదువు. మోక్షము కలవాడవగుదువు. (మహోపనిషత్తు 6 అ. 35 శ్లో.)

శ్లో॥ న నిజవద్భాతి అంతఃకరణ జృంభణాత్।
అంతఃకరణనాశేన సంవిన్మాత్రస్థితో హరిః॥

అంతఃకరణము విజృంభించుటవలన నిజముకానివస్తువు నిజమైనదానివలె దోఁచుచున్నది. అంతఃకరణము నశించుటచేత జ్ఞానస్వరూపమైనస్థితి పొంది శ్రీహరి తానగును. (స్కందోపనిషత్తు 2 శ్లో.)

విషయానురాగమునువదలి అభ్యాసయోగము చేయుటచేత మనస్సు నిగ్రహింపఁబడునని యింతకుముందు పలుసారులు చెప్పఁబడినది. చెప్పిన దానినే మరలఁ జెప్పుటచేత కేవలము ముఖ్యాంశమని నమ్మవలయును.

మూ॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః॥ 36

తా॥ అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను మనస్సును వశముగావించుకొనవచ్చునని పూర్వశ్లోకములోఁ జెప్పబడినది. అటుల వశముచేసికొననివానికి యోగప్రాప్తియగుట దుర్లభము. ఉపాయమువలన మనస్సును స్వాధీనము చేసికొనిన ప్రయత్నపరునకు అట్టియోగప్రాప్తి శక్యమగునని నాయభిప్రాయము।

అర్జునుఁడు చెప్పుచున్నాడు:-

మూ॥ అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః।
అప్రాప్య యోగ సంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి॥ 37

తా॥ ఓ కృష్ణా! విశ్వాసముతోఁ గూడియుండియు యోగమునుండి మనస్సు చలింప ఆత్మశాంతి పొందలేనివాఁడు యోగఫలముఁ బొందక యేగతిఁబొందును?

వివ॥ ఈకాలములో మోక్షమునందును, మోక్షదాయకమైన యోగవిద్యయందును విశ్వాసముగలవారు ఒక్కొక్కగ్రామములో ఎందరున్నారో లెక్కించుటకు గణితశాస్త్రములు చాలవని యేబుద్ధిహీనుఁడైనను సులభముగఁ జెప్పవచ్చును కాని గట్టిప్రయత్నముతో ఈవిద్యను సాధింపఁగలిగిన యతీశ్వరు లెందఱున్నారనిన ఈప్రశ్నమునకు సమాధానము సులభముగఁ

జెప్పలేము. విశ్వాసముండియు ఫలములభింపనివాఁడు మఱేమగునని పైశ్లోక మురీతిగా ఇప్పుడు శంకింతుమేని ఆశంక కెందఱు గుఱికావలసివచ్చునో!

మూ॥ కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి॥ 38.

తా॥ ఓ కృష్ణా! బ్రహ్మవిద్యా పద్ధతియందు నిలుకడఁగాంచఁ జాలని కేవలమూఢుఁడు ప్రవృత్తినివృత్తి పద్ధతులకు రెంటికిఁ దప్పిపోయినవాడై చెదరగొట్టఁబడిన మేఘమువలె నశింపఁడుగా?

మూ॥ ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్యశేషతః।
త్వదన్యస్సంశయస్యాస్య ఛేత్తా నహ్యుపపద్యతే॥ 39.

తా॥ ఓకృష్ణా! నాకుఁ గలిగిన యీ సంశయమును మిగులులేకుండ పోఁగొట్టుటకు (నీవే) తగుదువు. ఈ సంశయమును పోఁగొట్టఁగలవాఁడు నీకంటె వేఱొకఁడు దొరకఁడుకదా?

వివ॥ శ్రీకృష్ణార్జున సంవాదము ఆరంభించినది మొదలు ఇంతవఱకు బోధింపబడినది అర్జునుని కొఱకేయని గ్రంథములోఁ జెప్పఁబడినందున మనము కాదనరాదు కాని వాసనాక్షయము, చిత్తోపశమము కలుగఁదగిన అభ్యాసయోగ పద్ధతులు, తత్త్వజ్ఞానము కలుగఁదగిన జ్ఞానయోగ పద్ధతులు సమగ్రముగ బోధింపఁబడి ఆపథముగఁ జేయఁదలఁచుకొన్న యర్జునుడంత టితోనుండక చిత్తోపశమములేనివాఁడేగతిఁ బొందునని ప్రశ్నించుటఁజూడ ఈయన స్వప్రయోజనమునకై గీతాశ్రవణము సేసినట్లు కనఁబడదు.

శ్రీభగవానుఁడు చెప్పుచున్నాడు:-

మూ॥ పార్థ! నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే।
న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి॥ 40.

అర్జునా! పూర్వోక్తశ్లోకరీతిగ భ్రంశము నొందినవానికి ఈలోకములోఁ గాని, పరలోకములోగాని వినాశములేదు. నాయనా! క్షేమకరమైన కార్యము జేయువాడెవ్వఁడును దుర్గతిఁబొందదుకదా?

శ్లో॥ వనే రణే శత్రుజలాగ్నిమధ్యే। మహార్ణవే పర్వత మస్తకే వా।
సుప్తం ప్రమత్తం విషమస్థితం వా। రక్షంతి పుణ్యాని పురాకృతాని॥

అరణ్యమునఁగాని, యుద్ధరంగమునగాని, శత్రుమధ్యమునఁగాని, జలమధ్యమునఁగాని, అగ్నిమధ్యమునఁగాని, మహాసముద్రమునఁగాని, పర్వతశిఖరమునఁగాని, నిద్రించువానినైనను, మతితప్పినవానినైనను, విషమదశయందుండినవానినైనను పురాకృతములైన పుణ్యములు కాపాడుచున్నవి.

(శ్రీభర్తృహరి 1-99.)

మూ॥ ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభి జాయతే॥ 41.

తా॥ యోగమునుండి చలనము నొందినవాఁడు పుణ్యము చేసినవారు పొందఁదగిన లోకములను పొంది అందు పెక్కు సంవత్సరములు గడపి పరిశుద్ధులైన శ్రీమంతుల యింటియందు పుట్టుచున్నాఁడు.

మూ॥ అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్॥ 42.

తా॥ అటుఁగాకున్నను ధీమంతులైన యోగుల సమూహమునందే కలుగును. లోకములో ఇటువంటి జన్మమేదికలదో అదిమిగుల దుర్లభముకదా?

"ధీమతాం యోగినాంకులే" అనుటచేత జ్ఞాన కర్మయోగములు రెండును అభ్యసించిన యతీశ్వరుల సంఘమునందు జన్మించునని చెప్పపలయును.

మూ॥ తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్।
యతతేచ తతో భూయస్సంసిద్ధౌ కురునందన॥ 43.

తా॥ అర్జునా! అట్టియోగి కులమునఁ గలిగిన జన్మమునందు పూర్వజన్మములో సంపాదింపఁబడియుండిన జ్ఞానయోగమును లెస్సగ పొందుచున్నాఁడు. అందువలన లెస్సైన శుభప్రాప్తికై మరలఁ బ్రయత్నించుచున్నాడు.

మూ॥ పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతేహ్యవశోఽపి సః
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే॥ 44

తా॥ యోగమునుండి చలించిన ఆయోగి తనవశములోఁ దానులేనివాఁడైయుండియు పూర్వజన్మములోఁ జేయబడియుండిన అయభ్యాసముచేతనే

లాగఁబడుచున్నాఁడు. (గ్రహింపఁబడుచున్నాఁడు.) యోగవిద్యాజ్ఞానమునం దు అభిలాషగలవాడగుచు అనిర్వాచ్య (శబ్దాతీత) పరబ్రహ్మతత్త్వమును పొందుచున్నాఁడు.

వివ|| ఆచార్యోక్త పద్ధతితో నిర్దుష్టముగ యోగభ్యాసము చేయుచువచ్చినవాఁడు అవసానకాలమునకు అనిష్టపూర్తి కాకపోవుటచే బుద్ధిస్థిరపడక చిత్తచలన ముడుగక అపరిపక్వదశయందు మరణించినయెడల అట్టియోగి యింకొక జన్మములో పూర్వాభ్యాసముచేత ఉద్ధరింపఁబడవచ్చును. "అయతిః శ్రద్ధయోపేతః" అని ముప్పదియేడవశ్లోకములోఁ జెప్పుటచేత విశ్వాసముండియు యత్నము నెఱవేఱనియోగినిగుఱించినదేయీసమస్య కావచ్చును.

పదిదినములు వైరాగ్యవేషములతో పీజోగులవెంటనో తిరిగినంతనే మేము తపస్సంపన్నులమైతిమని చెప్పుకొనుచు యోగసిద్ధాంతులు కాకపోవుట యటుండఁ జెప్పరాని సజ్జనాపరాధములఁ జేయుచు ఉత్పితమార్గములఁ జరించుచుండు జ్ఞానశూన్యులు, విశ్వాసహీనులు, సంశయాత్ములు, ధూర్తవేదాంతస్వాములుసైతము పైశ్లోకమురీతిగ ఇంకొక జన్మములో అప్రయత్నముగ ఉత్తీర్ణులగుదురని నమ్ముటకు వీలుపడదు. భీష్మపర్వము 28 అధ్యాయము 40 శ్లోకములో ఇందుకుఁ గావలసినంత సాదృశ్యమున్నది.

మూ|| ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః
అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాంగతిమ్|| 45

తా|| అనేకజన్మములయందు క్రమక్రమముగా సమకూర్చఁబడిన పుణ్యప్రాప్తిగలిగి నిష్కల్మషుఁడైన యోగీశ్వరుఁడు ప్రయత్నపూర్వకముగ మనోనిగ్రహము చేయుచున్నవాఁడై అందువల్లనే శ్రేష్ఠమైన పదవిని పొందుచున్నాఁడు. (బ్రహ్మనిష్ఠ విడిచిపెట్టి దుర్మార్గమునఁ బ్రవేశించినవాడు సైతము మఱుజన్మమునఁ బరిశుద్ధుఁడగునని యీశ్లోకములో ఋజువులేదు.)

వివ|| ఈయధ్యాయములో 40 శ్లోకము మొదలుకొని 45 శ్లోకమువఱకు గల విషయములను పాఠకు లింకొకసారి గమనింతురుగాక. బ్రహ్మనిష్ఠయందు సంపూర్ణుఁడుగఁగాని, అసంపూర్ణుఁడుగఁగాని దేహత్యాగము సేసినవాఁడు ఈసుకృతబలముచేత నింకొకసారి యుత్తమజన్మము పొందవలయునేకాని

యింతకు నీచజన్మమును పొందరాదు. పూర్వాభ్యాసముచేత ఆకర్షింపబడి తనప్రయత్నము లేక యే యుత్తమగతికిఁ బోవలయును. మనఃక్లేశము లకు, శోక మోహములకు లోఁబడరాదు. అని యిందువలనఁ దెలియుచున్నది. యోగశిఖోపనిషత్తు ప్రథమాధ్యాయములో నిట్లే చెప్పఁబడినది.

భౌతికయుద్ధచరిత్రమునఁ బేర్కొనఁబడిన అర్జునుఁడు పూర్వజన్మమున లోకోత్తరుఁడైన యొకఋషీశ్వరుఁడని యందందు వర్ణింపఁబడినది.

శ్లో॥ నరస్త్వం పూర్వదేహే వై నారాయణసహాయవాన్
బదర్యాం తప్తవానుగ్రం తపో వర్షాయుతాన్ బహూన్॥

నీవు పూర్వజన్మమున బదరీవనములో శ్రీమన్నారాయణుఁడు సహాయుఁడుగ అనేక దశసహస్రముల సంవత్సరములు ఉగ్రమైన తపస్సుచేసిన నరుఁడవు. (అని మహాదేవుఁడు చెప్పెను. అరణ్యా. 40) ఇంకను పెక్కుచోట్ల ఈభావమే వెల్లడింపబడినది. అదిగాక యోగసిద్ధాంతులైన బ్రాహ్మణ దంపతులయందుఁ బుట్టియుండినట్లును పురాణములలో వినుచుంటిమి. అంతటి మహాపురుషుఁడు మఱుజన్మమున అంతకంటెను ఎక్కువభూమిక కుఁబోవుట న్యాయ్యమైయుండఁగా అటుల పోనీయక యెందులకో మనకవీశ్వరులు క్రిందభూమికకు దింపుకొని వచ్చినారు. లోభభూయిష్ఠమైన క్షత్రియజాతిలో పాండురాజ పత్నియందు కుండపుత్రుడుగ జన్మించినట్లు, ఆజన్మాంతము రాగద్వేషాదులలో, హర్షశోకములలో, చెప్పరాని మనఃక్లేశముల లో ఈదులాడిచుండినట్లు వర్ణించినారు.

వైకుంఠపురవాసులైన జయ విజయులు సజ్జనాపచారము గావించుటచేతను, చిత్రకేతుఁడీశ్వర ధిక్కార మొనర్చుటచేతను, భరతుడు జింకను ప్రేమించుటచేతను, ప్రభాసుడనువసువువసిష్ఠులవారి యావునుదొంగిలించుటచేతను నీచజన్మమునకు బోవలసివచ్చినదని చమత్కారముగ కారణముల నిరూపించినారు కాని యీయర్జునుఁడుఋషిజన్మమును విడిచి యేకారణముచేతతక్కువభూమికకు వచ్చెనో చెప్పలేదు. సాధుజనులను రక్షించుటకు, దుష్టులను శిక్షించుటకు, ధర్మమును స్థాపించుటకు క్షత్రియకులములోఁ గొందఱు దివ్యపురుషు లవతరించుట న్యాయ్యమే. కౌంతేయుడట్టివాఁడేయని

యొప్పుకొనుటయు సమంజసమే. ఐనను పూర్వజన్మమునందలి ధీరత్వము, ఆత్మబలము, తపశ్శక్తి శ్రమించిపోయినట్లు మూఢత్వ మ్మావహించినట్లు ఈయన చరిత్రములో అక్కడక్కడ కనఁబడుచుండుటమాత్రము గీతాగ్రంథ కర్తల యభిప్రాయమునకు విరుద్ధముగనున్నది.

అందువలన్న భగవద్గీత భౌతికయుద్ధచరిత్రములోనిదా? ప్రత్యేకగ్రంథమా? యను సందర్భమున పౌరాణిక స్వాములకును, వేదాంతస్వాములకును అభిప్రాయభేదములు విరివిగా గలుగుచున్నవి. భేదములఁ బట్టిచూడ భౌతికచరిత్రము రచించిన కవిచేతనేగీతాగ్రంథము రచింపఁబడినదని నమ్ముటకు సైతము వీలుపడదని కొంపఱు విమర్శకులు వాదింతురు.

ఇది ప్రత్యేకగ్రంథమైనప్పుడు భారతవీరుల నామము లిగ్రంథములో రానేలయని కొంఱు ప్రశ్నింతురు. ఇందుకు సమాధానము మఱికొందఱిట్లు చెప్పుదురు. శశిరేఖాపరిణయము, గయోపాఖ్యానము మున్నగు కొన్నిగ్రంథములు మనము చూచుచుండఁగనే కొత్తగ తయారైన కల్పితకథలని యాంధ్రసోదరులకు బాగుగఁ దెలియును. మఱియు రామాయణములో కాలనేమికథ, సులోచనాసహగమనము, పాతాల హోమము, రామేశ్వర లింగప్రతిష్ఠ; భాగవతములో నరకాసుర సరహారఘట్టములో సత్యభామాయుద్ధము మున్నగు పెక్కుకథలు క్రొత్తగ కల్పింపబడినవని మీలో చాలమంది వినియుందురు. వీనిలోఁ గొన్నికథలు కాలాంతరమున ప్రధాన గ్రంథములలోఁ జేర్పఁబడినవి. కొన్నికథలింకను ప్రత్యేకముగనే యున్నవి.

అదిగాక నీతులను, భక్తిజ్ఞాన వైరాగ్యములను బోధించు కొన్ని గ్రంథములు సంవాద రూపముగ నుండుటయు మనకుఁ దెలిసినవిషయమే. ఇంకను వాల్మీకికి నారదుడు చెప్పెననియు, భరద్వాజునకు వాల్మీకిమునీంద్రుడు చెప్పెననియు ఇట్టివి కొన్ని వినియుందురు. ఈకాలములోసైతము పెక్కువిధముల సంవాదగ్రంథములు అందందు తయారుచేయఁబడుచునేయున్నవి.

ఏ గ్రంథమునకైన లోకములో ఎక్కువవ్యాప్తి కలుగవలెనని గొప్ప విషయములు సమకూర్చి వ్రాయుటేకాక ప్రసిద్ధపురుషుల నామములందు బ్రకటించుటయుఁ గొంతవఱకు లోకాచారమైయున్నది. భగవద్గీతాగ్రంథము కూడ అట్లుతయారైనదే కావచ్చునేమోయని పై విమర్శకులు సమాధానము చెప్పుదురు.

ఉపనిషదర్థ ప్రతిపాదకమైన యీభగవద్గీత భౌతిక యుద్ధరంగమున అర్జునునకు శ్రీ కృష్ణునిచే బోధింపబడినదే యని వాదించువారిలోఁ గాని, అందుకు వ్యతిరేకముగ వాదించువారిలోఁగాని నేను చేరను. ఈగీతాగ్రంథ మేకాలమున నేవ్యక్తిచే రచింపఁబడినను ఆరచయితయే కృష్ణపరమాత్మ యని గ్రంథమాహాత్మ్యమునుబట్టి యొప్పుకొందును.

మూ॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః॥
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున॥ 46

తా॥ అర్జునా! పవనేంద్రియములను, మనోవృత్తులను, గుణకర్మాదులను అన్నిఁటిని వశముగావించుకొని పరమాత్మయందు లయింపఁజేసిన యోగీశ్వరుఁడు చాంద్రాయణాది వ్రతములచేత శరీరమును తపింపఁజేయు వారికంటే గొప్పవాఁడు ప్రకృతి పురుషుల లక్షణములఁ దెలిసికొనిన వారి కంటె సైతము గొప్పవాఁడు (అనుభవము లేనప్పుడు తెలిసికొన్నను లాభములేదని భావము ఇష్టాపూర్తాది వైదిక లౌకిక కర్మలఁజేయువారి కంటెను గొప్పవాఁడని తలఁపఁబడును. అందువలన నీవు యోగివికమ్ము.

శ్లో॥ యోగాత్పరతరం పుణ్యం యోగాత్పరతరం శివమ్॥
యోగాత్పరతరం సూక్ష్మం యోగాత్పరతరం నహి॥

యోగమునకంటె మిక్కిలిశ్రేష్ఠమైన పుణ్యములేదు. యోగమునకంటె మిక్కిలిశ్రేష్ఠమైన శుభములేదు యోగమునకంటె మిక్కిలి సూక్ష్మమైనది లేదు. యోగమునకంటె మిక్కిలి శ్రేష్ఠమైనదిలేదుకదా?

(యోగశిఖోపనిషతు 1 అ. 67)

మూ॥ యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా।
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః॥ 47.

తా॥ అస్మచ్ఛబ్దలక్ష్యార్థమును జెందిన అంతరాత్మతో నేననెడు స్వస్వరూపమును శ్రద్ధగలవాఁడై యెవఁడు భజించుచున్నాఁడో అట్టివాఁడు యోగులలో సైతము ఉత్తమయోగీంద్రుడని నా యభిప్రాయము.

శ్లో॥ మయి నిర్బద్ధహృదయాస్సాధవస్సమదర్శినః॥
వశీకుర్వంతి మాం భక్త్యా సత్‌స్త్రియస్సత్పతింయథా॥

ఉత్తమస్త్రీలు ఉత్తములైన భర్తనెటుల వశపఱచుకొనుచున్నారో అటులే సాధుపురుషులు సర్వభూతమయుఁడనైన నాయందు మనస్సును హత్తించి సమదృష్టిగలవారై భక్తిచే నన్ను వశపరచుకొనుచున్నారు.

(భాగవతము 9 స్కం. 4 అధ్యా. 69. శ్లో)

ఇది శ్రీమహాభారతము భీష్మపర్వములో ఆత్మసంయమ యోగమనెడు ముప్పదవ అధ్యాయము.

ఓం. తత్. సత్.



# శత పత్రము

# 99



## శ్రీ మహాభారతము భీష్మపర్వము 31 అధ్యాయము.

శ్రీభగవానుఁడు చెప్పుచున్నాఁడు:-

మూ॥ మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్ మదాశ్రయః।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥ 1.

తా॥ అర్జునా! అస్మత్పదలక్ష్యార్థమైన భగవత్తత్త్వమునందు మనస్సు సక్తముగావించి అట్టి పరిశుద్ధతత్త్వమునే యాశ్రయించి యోగాభ్యాసము చేయుచు సర్వభూతములయందు నేనని వాడఁబడు పరిశుద్ధాత్మ తత్త్వము ను ఏవిధముగనైతే సమగ్రముగఁ దెలిసికొనఁగలవో దానిని సంశయము లేకుండ వినుము.

మూ॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యజ్జ్ఞాతవ్యమవశిష్యతే॥ 2.

తా॥ దేనిని తెలిసికొన్నమీఁదట ఈ లోకములో నింకను దెలియదగినది మఱేదో మిగిలిపోయినదన్నమాటయుండదో! అట్టిచిత్కళా స్వరూపానుభవముతోఁగూడిన జ్ఞానయోగమును నీకు కొదవలేకుండ ఇదిగో చెప్పఁబోవుచున్నాఁడను.

శ్లో॥ అన్యవిద్యాపరిజ్ఞానమవశ్యం నశ్వరం భవేత్।
బ్రహ్మవిద్యాపరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం స్థితమ్॥

బ్రహ్మవిద్యవలనఁ గలిగిన జ్ఞానము పరబ్రహ్మతత్త్వసిద్ధి గావించునదిగనున్నది. దానికంటె ఇతరమైన మఱియొక విద్యవలనఁ గలిగిన జ్ఞానము తప్పక నశించునదేయగును. (శుకరహస్యోపనిషత్తు 3. 14.)

బ్రహ్మవిద్యచేత పరమాత్మ స్వరూపమిట్టిదని తెలియుచున్నది. సర్వము పరమాత్మమయమే యగుటచేత పరమాత్మను తెలిసికొన్నామనగా సర్వము తెలిసిపోయినదన్నమాటే. అందువల్లనే యిఁక దెలిసికొనదగిన కొదవ యుండదని చెప్పఁబడినది.

మూ॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥ 3

తా॥ వేలకొలఁది ప్రజలలో ఒకానొకఁడుమాత్రము యోగసిద్ధికొఱకు ప్రయత్నము చేయుచున్నాఁడు. అటుల ప్రయత్నించిన యోగసిద్ధులలో సైతము అస్మత్పదవాచ్యమైన అంతర్యామి తత్త్వమును ఒకానొకఁడు మాత్రము యదార్థముగఁ దెలిసికొనుచున్నాఁడు. (ఏకమాత్రస్వరూపుఁడగుచున్నాఁడు.)

వివ॥ అనేకజన్మములనుండి ప్రవృత్తియందే వర్తించుచు విషయముల యందు వ్యాపించుట కలవాటుపడిన మానసేంద్రియములు ఆవాసనాబలము చేత అదోమార్గమునకే లాగఁబడుచుండును గొప్పప్రయత్నముచేసి బలవంతముగఁబట్టి యూర్ధ్వమార్గమునకుఁ దీసికొనిపోవుచున్నను పూర్వాభ్యాసము చేత దొంగపిల్లివలె విషయములమీదఁకి దాఁటువెయుటకే చూచుచుండును. అందువల్లనే కొంతదూరము యోగాభ్యాసముచేసిన వేదాంతస్వాములుకూడ పెక్కుమంది మరలఁ బ్రవృత్తియందు పడిపోవలసి వచ్చుచున్నది. ప్రయత్నపరులయందొకానొకఁడు మాత్రమే స్వస్వరూపముఁ గాంచగలిగియున్నాడు.

మూ॥ భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా॥ 4

తా॥ భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అని యీప్రకృతి యెనిమిది విధముల భేదము కలిగియున్నది.

శ్లో॥ మనోబుద్ధిరహంకారః ఖానిలాగ్నిజలాని భూః
ఏతాః ప్రకృతయస్త్వష్టౌ వికారః షోడశాపరే॥

మనస్సు, బుద్ధి, అహంకారము, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి ఈయెనిమిదియు ప్రకృతులు. ఇంకను పదునాఱు ప్రకృతి వికారములు. (శారీరకోపనిషత్తు 6శ్లో.)

వివ॥ అష్టప్రకృతుల యుత్పత్తినిగుఱించి యందందు గ్రంథములలో వర్ణించియున్నారు. ఆయుత్పత్తి క్రమమిచ్చట సందర్భోచితముగ తవఁబడు కపోవుటచే వ్రాయలేదు.

మూ॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్॥ 5.

తా॥ అర్జునా! పూర్వశ్లోకములోఁ వర్ణింపఁబడిన ప్రకృతి యనునది తక్కువ తరగతిలోఁ జేరినది ఇంతకంటె వేఱైనదియు, జీవరూపమును బ్రాపించినదియుఁ నైన యేప్రకృతిచేత జగత్తు ధరింపఁబడుచున్నదో అది శ్రేష్ఠమైన నాప్రకృతియని తెలిసికొనుము.

వివ॥ " పరాప్రకృతి శ్రేష్ఠమైనది, అపరాప్రకృతి శ్రేష్ఠముకానిది. " అని శబ్దార్థమునుబట్టి తెలియుచున్నది. అపరాప్రకృతిలోఁ జేరిన యెనిమిది తత్త్వములు జడాత్మకములు నిర్గుణ పరమాత్మ సాన్నిధ్యమును గాంచుటకును, కర్మలయందుఁ బరిభ్రమించుటకును సమర్థములుకావు. కనుకనే యీప్రకృతి శ్రేష్టమైనదికాదు.

వృత్తిరహితమైన పరమాత్మయందు దేనిచే జీవతత్వ మారోపింపబడుచున్నదో దానికి పరాప్రకృతియని పేరు. జగత్స్వరూపమైన శరీరత్రయము దేనిచే ధరింపఁ బడుచున్నదో, పోషింపఁబడుచున్నదో దానికి పరాప్రకృతి యనిపేరు రూపనామక్రియా రహితమైన పరమాత్మయందు సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము, సర్వమంతృత్వము, సర్వకర్తృత్వము, సర్వభోక్తృత్వము, సర్వసంహారకత్వము, మొదలైన గుణములు దేనిచేఁ గల్పింపబడుచున్నవో దానికి పరాప్రకృతియని పేరు. నిర్గుణము, నిరాకారము నైన పరమాత్మ దేనిచే సగుణముగను, సాకారముగను దోఁచుచున్నదో దానికి పరాప్రకృతి యనిపేరు.

ప్రకృతియనునది పరమాత్మకంటె వేఱుగ మఱెచ్చటనో పుట్టి వచ్చినది కాదనియు, ఆత్మ సాన్నిధ్యముచేతనే జగత్స్వరూపముగ పరిభ్రమించుచున్నదనియు, వేదాంతులు చెప్పుచున్నందున ఆత్మకు సంబంధించినదే ప్రకృతియని తలపబడుచున్నది. మఱియు పరమాత్మకులేనినామరూపములు

గుణకర్మాదులు దీనికి గలిగియుండుట చేతను, ప్రకృతి వికారములైన సర్వవస్తువులకు అద్యంతములుండుటచేతను పరమాత్మకంటె ప్రకృతి వేఱైనదనియుఁ దలఁపఁబడుచున్నది.

మూ॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా॥ 6.

తా॥ పూర్వశ్లోకములో జెప్పబడిన నాప్రకృతి సమస్తభూతములకు ఉత్పత్తిస్థానమని తెలిసికొనుము. (భూతోత్పత్తికారణమైన ప్రకృతికి అస్మత్పద లక్ష్యార్థమైన పరమాత్మయే యీశ్వరుడగుటచేత) సమస్త జగదుత్పత్తి లయములు పరమాత్మకంటె వేఱైనవి కావని పైవిధముగనే తెలిసికొనుము.

శ్లో॥ యేన ప్రకాశతే విశ్వం యత్రైవ ప్రవిలీయతే।
తద్బ్రహ్మ పరమం శాంతం తద్బ్రహ్మాస్మి పరంపదమ్॥

విశ్వము దేనిచే వెల్లడియగుచున్నదో దేనియందు లయమగుచున్నదో అది శాంతస్వరూపమైన పరబ్రహ్మము. పరమపదవాచ్యమైన అబ్రహ్మమే నేనగుదును. (పంచబ్రహ్మోపనిషత్తు 20 శ్లో.)

శ్లో॥ యస్మిన్ సర్వమిదం ప్రోతం బ్రహ్మ స్థావరజంగమమ్।
తస్మిన్నేవ లయం యాంతి స్రవంత్యః సాగరే యథా॥
యస్మిన్ భావాః ప్రలీయంతే లీనాశ్చావ్యక్తతాం యయుః।
పశ్యంతి వ్యక్తతాం భూయో జాయంతే బుద్బుదా ఇవ॥

చరాచరరూపమైన యీవిశ్వమంతయు దేనియందుఁ గూర్చబడినదో అది బ్రహ్మము. సముద్రమునందు నదులెట్లు కలియుచున్నవో అట్లే (సర్వభూతములు) బ్రహ్మమునందే కలిసిపోవుచున్నవి. భావములు దేనియందు కలియుచున్నవో జీవులుసైతము దానియందేకలిసి అవ్యక్తత పొందుచున్నవి. నీటిలో బుగ్గలు పుట్టినట్లు జీవులు మరల పుట్టి వ్యక్తములగుచున్నవి.
(మంత్రికోపనిషత్తు 17-18శ్లో)

"నారాణాదఖిలలోకస్రష్టృప్రజాపతయో జాయంతే నారాయణాదేకాదశరుద్రాశ్చ జాయంతే నారాయణాదఖిలలోకాశ్చ జాయంతే నారాణాదింద్రో జాయతే నారాయణాత్సర్వే దేవాశ్చ జాయంతే నారాయణాద్ద్వాదశాదిత్యాః సర్వే వసవః సర్వే ఋషయః సర్వాణి భూతాని సర్వాణి ఛందాంసి నారాయణాదేవ సముత్పద్యంతే నారాయణాత్ప్రవర్తంతే నారాయణే ప్రలీయంతే".

సమస్తలోకములను సృజించు ప్రజాపతులు, ఏకాదశరుద్రులు శ్రీమన్నారాయణుని వలన జనించుచున్నారు. సమస్తలోకములు నారాయణుని వలన జనించుచున్నవి. ఇంద్రుఁడు, సర్వదేవతలు, ద్వాదశాదిత్యులు, సర్వ వసువులు, సర్వఋషులు నారాయణునివలన జనించుచున్నారు. సర్వభూతములు, సర్వవేదములు నారాయణునివలన జనించుచున్నవి, నారాయణుని వలన బ్రవర్తించుచున్నవి. నారాయణునియందుఁగలిసి పోవుచున్నవి.

(త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్తు. 2.అ)

మూ॥ మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥ 7.

తా॥ అర్జునా! అస్మత్పదలక్ష్యార్థమైన సర్వాంతర్యామి తత్త్వమునకంటే శ్రేష్ఠమైనది వేఱొకటి కొంచెమైననులేదు. దారమునందు రత్నసమూహము వలె అంతర్యామి తత్త్వమునందీ విశ్వమంతయు గూర్చబడియున్నది.

శ్లో॥ యేన సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ।
తత్సూత్రం ధారయేద్యోగీ యోగవిత్తత్త్వదర్శివాన్॥

అభ్యాసయోగము నెఱిఁగి పరతత్త్వముఁగాంచఁ గలిగిన యోగీశ్వరుఁడు-దారమునందుఁ గూర్పఁబడిన మాణిక్యములవలె దేనియందీప్రపంచము కూర్పఁబడినదో అసూత్రమును ధరింపవలయును. (ఈ శ్లోకము బ్రహ్మోపనిషత్తునందును, నారదపరివ్రాజకోపనిషత్తు 3 ఉపదేశములోను కొంచెము వర్ణభేదముతోఁ జదివినట్టు జ్ఞాకము.)

సమస్తచేతనాచేతనములు నిష్కళారూపమైన పరిశుద్ధాత్మ తత్త్వమునందు గూర్పఁబడియున్నవనియు, భాహ్యరూపములను విడిచిపెట్టి అంతర్యామియైన పరమాత్మనే లక్ష్యముగ గమనింపవలయు ననియు నిందువలనఁ దెలియుచున్నది.

''సర్వలోకా ఆత్మని బ్రహ్మణి మణయ ఇవౌతాశ్చ ప్రోతాశ్చ''
''ఏవమేతాన్ లోకానాత్మని ప్రతిష్ఠితాన్వేదాత్మైవ స భవతి''

సమస్తలోకములు బ్రహ్మస్వరూపమైన తనయందు రత్నములవలె నేయబడినవి, కూర్పఁబడినవి. ఈ ప్రకారము ఈలోకముల నన్నిఁటిని తనయందు ప్రతిష్ఠింపఁబడిన వానిగాఁ దెలిసికొనినవాఁడు పరమాత్మయే యగుచున్నాడు. (సుబాలోపనిషత్తు 10 ఖం.)

శ్లో॥ శివో విష్ణురహంత్వంచ సర్వం స్థావరజంగమమ్।
ఆత్మైవేతి విజానీయ విశ్వమారాధయేద్యతిః॥

శివుఁడు, విష్ణువు, నేను, నీవు, చరాచర రూపమైన యీ విశ్వము ఇదంతయు తన స్వరూపమేయని తెలిసికొని యతీశ్వరుఁడు విశ్వము నారాధింపవలయును. (విశ్వ॰గీత 73)

శ్లో॥ సర్వం బ్రహ్మేతి యస్యాంతర్భావనా సా హి ముక్తిదా।
భేదదృష్టిరవిద్యేయం సర్వథా తాం విసర్జయేత్॥

సర్వము బ్రహ్మయనుభావన యెవనికి కలుగుచున్నదో వానికది ముక్తినొసఁగుచున్నది. బేదదృష్టితో జూచుట అవిద్యయగును. సర్వవిధముల దానిని విడిచిపెట్టవలయును. (మహోపనిషత్తు 5-113.)

శ్లో॥ బ్రహ్మాద్యం స్థావరాంతంచ పశ్యంతి జ్ఞానచక్షుషః।
తమేకమేవ పశ్యంతి పరిశుభ్రం విభుం ద్విజాః॥

జ్ఞానమయమైన దృష్టిగల బ్రహ్మనిష్ఠులు బ్రహ్మమొదలు స్థావరపర్యంతము (నామారూపాదిభేదములుగల) సర్వభూతములను చూచుచున్నారు. (కాని) పరిశుద్ధమైన, విశేషప్రాప్తిమంతమైన అపరబ్రహ్మతత్త్వమును ఏకస్వరూపముగనే చూచుచున్నారు. (మంత్రికోపనిషత్తు 10 శ్లో.)

శ్లో॥ మయి జీవత్వమీశత్వం కల్పితం వస్తుతో నహి।
ఇతి యస్తు విజానాతి స ముక్తో నాత్ర సంశయః॥

నా యందు జీవత్వము, ఈశత్వము అనునది కల్పితమే కాని యథార్థముగలేదు. అనియెవడైతే తెలిసికొనుచున్నాఁడో వాఁడు ముక్తుఁడు. ఇందు సంశయములేదు. (సరస్వతీరహస్యోపనిషత్తు)

మూ॥ రసోఽహమప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః।
ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥ 8.

తా॥ అర్జునా! నీళ్లయందుండెడు రసశక్తి నేనైయున్నాఁడను చంద్రునియందును, సూర్యునియందునుండు వెలుతురు. సర్వవేదములయందు ధ్వనించు ప్రణవనాదము. ఆకాశమునందలి శబ్దము నరులయందలి పౌరుషము (అంతయు) నేనైయున్నాఁడను.

వివ॥ నేననఁగా సర్వభూతములయందు "నేను నే"నని చెప్పఁబడు పరిశుద్ధాత్మయని జ్ఞాపకముంచుకొనవలయును. దారమునందు మణులు కూర్పఁబడినట్లు నిరాకారమైన పరిశుద్ధాత్మయందు సాకారవస్తువులు కూర్పబడినవని యిచట ఋజువుచేయబడుచున్నది.

మూ॥ పుణ్యో గంధః పృథివ్యాంచ తేజశ్చాస్మి విభావసౌ
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు॥ 9.

తా॥ భూమియందు పవిత్రమైన గంధము, అగ్నియందు తేజస్సు, సర్వభూతములయందు జీవనము, తపస్సుచేయువారియందు తపస్సు నేనై యున్నాఁడను.

మూ॥ బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్।
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్॥ 10

తా॥ అర్జునా! (కారణములేనిదే కార్యముండదు) జన్మప్రాప్తిగల సర్వజీవులకు సనాతనమైన అస్మచ్ఛబ్ద లక్ష్యార్థమైన పరిశుద్ధాత్మయే కారణమని తెలిసికొనుము. బుద్ధిమంతులయొక్క బుద్ధి (జ్ఞానయోగము) తేజశ్శాలురయొక్క తేజస్సు (ఆత్మశక్తి) నేనై యున్నాఁడను.

మూ॥ బలం బలవతామస్మి కామరాగవివర్జితమ్।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ॥ 11.

తా॥ అర్జునా! బలవంతులలో కామరాగములులేని బలము నేనై యున్నాఁడను. జన్మప్రాప్తిగల జీవులయందు ధర్మమునకు విరుద్ధముకాని కోరిక నేనై యున్నాఁడను. (ధర్మబద్ధమైన కామము భగవత్స్వరూపమేయని యిందువలన తెలియుచున్నది.)

మూ॥ యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే।
మత్త ఏవేతి తాన్విద్ధి నత్వహం తేషు తే మయి॥ 12.

తా॥ (నిర్గుణ పరాత్మయందు పరాప్రకృతిచేత సత్త్వరజస్తమో గుణములు కల్పింపఁబడినవని వేదాంతస్వాములు చెప్పుటచేత) సత్త్వగుణము వలన, రజోగుణమువలన, తమోగుణమువలన సంభవించుభావము లేవేవి

కలవో వాని నన్నిఁటిని అస్మత్పద లక్ష్యార్థమైన పరమాత్మవలన ఉద్భవిం చినవానినిగాఁ దెలిసికొనుము. (ఐనను) వానియందు పరమాత్మలేదు, పర మాత్మయందవిలేవు. (అభావములయందు పరమాత్మ అధీనమైయుండదు. పరమాత్మయందాభావములు అధీనములైయుండును. అని కొందఱుచెప్పు దురు.)

మూ.। త్రిభిర్గుణమయైర్భావైరేభిస్సర్వమిదం జగత్।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్॥ 13.

**తా॥** త్రిగుణములయొక్క వికారరూపములైన, పూర్వోక్తములైన రా గాది భావములచేత సమస్తమైన యీజనసమూహము మోహము నొందింపఁ బడినది. (వివేకము చెడఁగొట్టఁబడినది. అందువలన) అభావములకంటె వే రైనట్టియు, నాశరహితమైనట్టియు, అస్మత్పద లక్ష్యార్థమైనట్టియు భగవత్తత్త్వ మును మిగుల తెలిసికొనకున్నది.

**వివ॥** "త్రిగుణముల కూడికచేత జగత్తు కలుగుచున్నది. గుణవికా రములచే మోహితమగుచున్నది. గుణములు లేకపోయినప్పుడు జగత్తు లేక పోవుచున్నది. అప్పుడు నిర్గుణమైన పరమాత్మయొక్కటిమాత్రము మిగిలి యుండును." అని కొందఱందురు.

"జగత్స్వరూపమైన స్థూలశరీరముసందలి యిరువదినాలుగు తత్త్వ ములలో నొకటిమనస్సు. 'గుణఅభ్యాసే' అనుసూత్రమువలన మనోవృత్తుల లోఁ జేరిన అభ్యాసములే త్రిగుణములని చెప్పఁదగియున్నది. అందుచేత జగత్తువలన త్రిగుణములు, గుణవికారములైన రాగాదులు కలుగుచున్నవి. ఇంధనములు లేకపోయినప్పు డగ్ని నశించినట్లు జగత్స్వరూపమైన స్థూల దేహము, మానసేంద్రియములు, ఇంద్రియార్థములైన విషయములు నశిం పఁగా రాగాది గుణవికారములు నశించుచున్నవి. అటుపిమ్మట నిర్గుణ పరాత్మతత్త్వమొక్కటే మిగులుచున్నది. అదే మోక్షము" అని మఱికొంద అందురు.

గుణములవలన జగత్తు పుట్టినదో జగతువలన గుణములు పుట్టినవో నిరూపించుట సులభమైనపనికాదు కాని నరుల కీరెండును బంధకారణ ములేయని సర్వయోగీంద్రులమతము. కాఁబట్టి యీరెంటిని విస్మరించి వీని

కంటె వేఱైన పరిశుద్ధాత్మతత్త్వమునుపొందుట నిత్యశుభప్రాప్తికరమని తెలియవలయును.

మూ॥ దైవీ హ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే॥ 14.

తా॥ "మా మానే" అనుసూత్రమువలన "ఇది యిట్టిది, యింతమాత్రమైనది" అని నిరూపించి చెప్పఁదగినదిమాయ. దేవసంబంధిని, త్రిగుణాత్మిక, అంతర్యామి భగవత్తత్త్వమునకు స్వకీయయునైన యీమాయ (పరాప్రకృతి) సులభముగదాఁటరానిది. అస్మత్పద లక్ష్యార్థమైన పరిశుద్ధాత్మనే యెవరు లెస్సగఁ బ్రాపింతురో అట్టివార లామాయను దాఁటుచున్నారు. (ఈశ్లోకము శివగీత 14 అధ్యాయమునందున్నది.)

"ఏతాం మహామాయాం తరంత్యేవ యే విష్ణుమేవ భజంతి నాన్యే తరంతి కదాచన"

విష్ణువునే భజించువారెవరో వారుమాత్రము ఆమహామాయను తప్పక దాఁటుచున్నారు. ఇతరులెప్పుడును దాఁటలేరు. (త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్తు 4అధ్యా )

వివ॥ పరిశుద్ధాత్మను పొందినప్పుడే మాయను దాఁటుటకు వీలగును. రాగాది గుణవికారములకు మూలమైన మాయను దాఁటినప్పుడే పరిశుద్ధాత్మను పొందుటకు వీలగును. ఇందు చదువరులు గమనింపదగిన ముఖ్యాంశము:- సూర్యుఁ డుదయించినప్పుడే నిశాంతమగుచున్నది, నిశాంతమైనప్పుడె సూర్యుఁడుదయించుచున్నాఁడు ప్రజలకు మెలకువ వచ్చినప్పుడే నిద్ర తొలఁగిపోవుచున్నది, నిద్ర తొలగిపోయినప్పుడే మెలకువ వచ్చుచున్నది. మరణము వచ్చినప్పుడేజీవితకాలముముగియుచున్నది, జీవితముముగిసినప్పుడే మరణమువచ్చుచున్నది. వస్త్రము శుద్ధిచేయఁబడినప్పుడే మురికిపోగొట్టబడుచున్నది, మురికి పోయినప్పుడే శుద్ధియగుచున్నది. నదియొక్క ఆవలియొడ్డుజేరినప్పుడే నదినిదాటిన వారమగుదుము, నదినిదాటినప్పుడే యావలియొడ్డుజేరినవారమగుదుము. మనుష్యుడు మోక్షముగాంచినప్పుడేసమస్తబంధములువీడిపోవుచున్నవి, బంధములువీడిపోయినప్పుడేమోక్షప్రాప్తియగుచున్నది

పరమాత్మయనగా మాయాసాగరముయొక్క అవలితీరమని భావముకాబట్టి పరమాత్మతత్త్వమును ప్రాపించినాఁమనగా మాయాసాగరమును దాఁటినామన్నమాట, మాయను దాఁటినామనఁగా పరమాత్మస్థానమును పొందినామన్నమాటే. ఈరెంటికిని క్రియాసూత్రమొకటే. అది కర్మయోగమని చెప్పబడును.

మూ॥ న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః।
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః॥ 15.

తా॥ త్రిగుణాత్మకమైన మాయచే జ్ఞానమును కోలుపోయిన నీచమానవులు నిత్యశుభ ప్రతిపాదకమైన పరమాత్మయొక్క సేవయనికాని, తక్కినదంతయు దుఃఖహేతువేయని కాని తెలిసికొను వివేకములేనివారై దుష్టస్వభావమునకుఁబాల్పడి దుఃఖప్రాప్తికరమైన కర్మచేయుచున్నారు (ఇట్టిమూఢులు) అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వమును పొందఁజాలరు. (జ్ఞానకర్మయోగముల నెఱుఁగనివారి స్థితి యిచట వర్ణింపఁబడినది)

శ్లో॥ య ఏషాం పురుషం సాక్షాదాత్మప్రభవమీశ్వరమ్।
న భజంత్యవజానంతి స్థానాద్భ్రష్టాః పతంత్యధః॥

సాక్షాత్తుగా తనయందే ప్రభవించిన దివ్యపురుషుని పరమేశ్వరుని ఈప్రజలలో ఎవరైతే భజింపక అవమానించుచున్నారో (అట్టివారు) ఆత్మస్థానమునుండి జారిపోయినవారై అధోగతియందు పడిపోవుచున్నారు.

(ఉద్ధవగీత 4అ. 3శ్లో.)

మూ॥ చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ॥ 16.

తా॥ భరతకులములో ముఖ్యుఁడవైన అర్జునా! సౌఖ్యకాలములో ఎన్నడును పొరపాటుగనైన దేవునిమాటఁ దలపెట్టఁజాలని ధూర్తుఁడుసైతము ఆపత్సమయములో "దేవుఁడు, దేవుఁడు" అని గొంతుచినుగునట్లు మొఱపెట్టుట అందందు కనఁబడుచున్నది అపదయనునది తనలోఁబుట్టిన రోగములవల్లఁగాని, ఇతర భూతములవల్లగాని, దైవికములైన ప్రమాదములవల్లఁగాని కలుగుచుండును. జన్మముండునంతవఱకు ఆపదలున్నవి. కనుక

జన్మ భయమునుండి, ఘోరసంసార దావాగ్నినుండి అవలఁబడుట యెన్నఁడాయని దుఃఖముతోఁ బరితపించువాఁడార్తుఁడు. భవసాగరమునుండి గట్టెక్కించునది భగవత్తత్త్వమే కావున దానిని తెలిసికొనుటకై తీవ్రమైన కోరికతో గట్టిగఁ బ్రయత్నము చేయువాడు జిజ్ఞాసువు. నిత్యశుభప్రతిపాదకమైన భగవత్తత్త్వమనెడు పరమార్థముకొఱకు గురువును యాచించువాఁడు అర్థార్థియనఁబడును, భగవత్తత్త్వ మిట్టిదనియు, మాయ యిట్టిదనియుఁ దెలిసికొని సుఖవంతమగు మార్గమును కనిపెట్టినవాడు జ్ఞాని. ఇట్లు నాలుగువిధముల సుకృతవంతులైన ప్రజలు అమృతప్రద లక్ష్యార్థమైన భగవత్తత్త్వమును సేవించుచున్నారు.

మూ॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం సచ మమప్రియః॥ 17

తా॥ ఇట్లు చెప్పఁబడినవారందఱిలోను నియతమైన అభ్యాసయోగము చేసి తత్త్వజ్ఞానమును పొందియుండువాఁడు; సర్వభూతములలో ఏకమైన పరమాత్మను భజించువాడు మిగుల శ్రేష్ఠుఁడగుచున్నాఁడు. అట్టి జ్ఞానయోగికి అమృతప్రద లక్ష్యార్థమైన పరమాత్మయునిన మిక్కిలి ప్రియము. ఆయోగియు పరమాత్మ తత్త్వమునకు ప్రియుఁడే కదా!

శ్లో॥ జ్ఞానవిజ్ఞానసంపన్నాః పదంశ్రేష్ఠం విదుర్మమ।
జ్ఞానీహ మే ప్రియతమో జ్ఞానేనాసౌ బిభర్తిమామ్॥

శ్రేష్ఠమైన నాపదమును జ్ఞానవిజ్ఞాన సంపన్ను లెఱుగుదురు. ఇందు జ్ఞాని నాకు మిక్కిలిప్రియుఁడు. అతఁడు జ్ఞానముచేత నన్ను భరించుచున్నాఁడు. (భాగవతము 11 స్కం. 19 అధ్యా. 3 శ్లోకము )

శ్లో॥ నాస్తి నాదాత్పరో మంత్రో న దేవస్స్వాత్మనః పరః।
నానుసంధేః పరా పూజా నహి తృప్తేః పరం సుఖమ్॥

తనలోపల ధ్వనించు ప్రణవనాదమునకంటె శ్రేష్ఠమైన మంత్రము లేదు. తన లోపల చిత్కళాస్వరూపమున వెలుఁగొందు పరమాత్మకంటె శ్రేష్ఠమైన దేవుఁడులేఁడు. స్వస్వరూపాను సంధానమునకంటె శ్రేష్ఠమైన పూజలేదు. తనలోఁదాను తృప్తిజెందుటకంటె శ్రేష్ఠమైన సుఖములేదు.
(యోగశిఖోపనిషత్ 2 అ. 20-21 శ్లోక )

ఇట్లు తనకంటెవేఱుగ నింకొకదేవుఁడు లేఁడనుభావముతో తన స్వరూపమును తాననుసంధించుచుఁ దనలోఁదాను తృప్తుఁడైయుండు జ్ఞానయోగి శ్రేష్ఠుఁడు,

మూ॥ ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్।
అస్థితస్సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్॥ 18.

(16 శ్లోకములోఁ జెప్పఁబడినటుల భగవత్తత్త్వమును సేవించు) ఈభక్తులెల్లరు గొప్పవారే. ఇఁక జ్ఞానియన్నసో పరమాత్మయే తానని నాయభిప్రాయము. ఆత్మానుసంధానము స్వభావముగఁ గలిగిన ఆ తత్త్వజ్ఞాని అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వమనెడు అత్యుత్తమ గతిని ప్రాపించి యెల్లెడల సుస్థిరుడైయుండునుకదా.

వివ॥ జ్ఞానులకంటె యోగి యధికుడని కడచిన అధ్యాయమునందు 46 శ్లోకములో జెప్పబడియుండెను. సర్వభక్తులలో జ్ఞానిశ్రేష్ఠుడని యిచ్చటఁ జెప్పబడినది. యిది పూర్వోత్తర విరుద్ధముకాదాయని కొందఱు భక్తులు సంశయింతురు.

ఇందుకు సమాధానము – అభ్యాసయోగము చేయని జ్ఞానికంటె అభ్యాసయోగి శ్రేష్ఠుడని పూర్వాధ్యాయములో 46 శ్లోకమువల్లఁ దెలిసియుండెను. యోగులలో సైతము అంతర్వృత్తియందు పరమాత్మను పొందియుండువాఁడు శ్రేష్ఠుడని పైయధ్యాయములోనే 47 శ్లోకమువల్ల దెలుపబడియుండెను. జ్ఞానకర్మయోగములు రెండును సమగ్రముగఁజేసి పరమాత్మ తనకంటె అన్యముకాదని తెలిసికొనిన జ్ఞాని యితరభక్తులకంటె గొప్పవాడని యీయధ్యాయములో పైశ్లోకమువల్ల దెలియుచున్నది. కాబట్టి పూర్వోత్తర విరుద్ధములేదని ఒప్పుకొనవలసినదే.

మూ॥ బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే।
వాసుదేవస్సర్వమితి సమహాత్మా సుదుర్లభః।

ఈ జగమునందంతట ఏదైతే క్రీడాస్వరూపమున నివసించియున్నదో దేనియందు జగమంతయు గూర్చబడి రమణీయమగుచున్నదో అట్టి పరిశుద్ధాత్మ తత్త్వము సర్వము తానేయైయున్నదను జ్ఞానము పెక్కుజన్మముల

మీదట కలుగుచున్నది. ఇటుల జ్ఞానియైనవాడు అస్మత్పద లక్ష్యార్థమైన భగవతత్త్వమును పొందుచున్నాడు. అట్టిమహాత్ముడు లభించుట దుస్తరము.

"సత్కర్మపరిపాకతో బహూనాం జన్మనామంతే నృణాం మోక్షేచ్ఛా జాయతే తదా సద్గురుమాశ్రిత్య చిరకాలసేవయా బంధాన్మోక్షం కశ్చిత్ప్రయాతి"

అనేక జన్మములకుఁ గడపట సత్కర్మఫలము కలిసివచ్చుటవలన మానవులకు మోక్షము కావలయునని యాసక్తి పుట్టుచున్నది. అప్పుడు ఒకానొకడు మంచిగురువు నాశ్రయించి చాలకాలము సేవించుటచేత జన్మబంధమునుండి విడుదలపొందుచున్నాడు. (పైంగలోపనిషత్తు 2 అధ్యా.)

శ్లో॥ అనేకజన్మసంస్కార గురుదేవ ప్రసాదతః।
యోగాభ్యాసాత్తతో వేధో జాయతే తస్యయోగినః॥

పెక్కుజన్మములనుండి లెస్సగ సంస్కరింపబడిన గురుదేవుని యనుగ్రహమువలన ఆయోగి కటుమీఁదట పరబ్రహ్మ తత్త్వము కలుగుచున్నది.
(వరాహోపనిషత్తు 5అ. 66-67)

మహానారాయణోపనిషత్తు పంచమాధ్యాయములో ఈవిషయమే విపులముగ వ్రాయబడినది. ఇందువలన పూర్వజన్మ సుకృతము, గురుకటాక్షము యోగాభ్యాసము ఈమూఁడు లక్షణముల వల్లనే తత్త్వజ్ఞానము కలుగవలయునని తెలియుచున్నది.

ఇంకొకమాటః- దివ్యపురుషులచే ఆర్షధర్మము కాపాడబడుచుండు పూర్వయుగములయందు తత్త్వజ్ఞానులు కేవలమరుదుగ నుండిరని పైగీతా శ్లోకమువలనదెలియుచుండ; ఇప్పుడన్ననో, పల్లెలలో, పట్టణములలో, రైళ్లలో, మోటారుచౌకీలలో, సంతలలో, కల్లుదుకాణములలో ఎచ్చటజూచినను బైరాగిస్వాములే, అంతా రామమయం - ఈజగమంతా రామమయం - అని తన్మయత్వముతోఁ బాడుచుండుటఁ జూచుచున్నారము. ఇదంతయు కలియుగ మాహాత్మ్యముగాక మఱేమందురు.

మూ॥ కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః।
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా॥ 20.

తా॥ "ప్రకృష్టం కరణం ప్రకృతిః దుకృఞ్ కరణే" పూర్వజన్మములో తమచేఁజేయఁబడియుండిన కర్మఫలము మఱియొక జన్మమును గలిగించుటకును, మఱుజన్మమున ఆజీవులను కర్మలయందుఁబ్రవర్తింపఁజేయుటకును నియంతయగుచున్నది. అది ప్రకృతియనఁబడుచున్నది. ఇట్లు తమ ప్రకృతిచేతనే తాము నియమింపబడుచు దానికి వశులై చరించు జీవులు అప్రకృతి కనురూపములైన ఆయాకోరికలచేత జ్ఞానము తిరస్కరింపబడగా అజ్ఞానమునఁ బడిపోవుచున్నారు. తమయందుఁబ్రకాశించు పరమాత్మ నెఱుగక అంతకంటె వేఱుగ మఱియెచ్చటనో దేవతలనెడు వారున్నారనియు, వారిచేతనే తమ కోరికలు నెఱవేఱగలవనియు నమ్ముచున్నారు. అట్టి దేవతల నర్చించు నియమములెట్లో తెలిసికొని ఆయానియమముల నాశ్రయించి ఆదేవతలనే పూజించుచున్నారు.

శ్లో॥ కామ జానామి తే మూలం సంకల్పాత్కిల జాయసే।
న త్వాం సంకల్పయిష్యామి సమూలో నభవిష్యసి॥

ఓ కామమా! నీకుఁ గారణమేమిటిదో నేనెఱుగుదును. సంకల్పము వలన పుట్టుచున్నదానవు. చీ' యిఁక మీఁద నిన్ను సంకల్పముచేయింపను. నీకు మూలమైన సంకల్పముతోఁగూడ నీవిఁక నుండఁజాలవు

(మంకిగీత 25 శ్లోకము)

శ్లో॥ యదా నేచ్ఛతి నద్వేష్టి బ్రహ్మ సంపద్యతే తదా।
ఉభే సత్యానృతే త్యక్త్వా శోకానందౌ భయాభయే॥

ఎప్పుడైతే ఇచ్ఛాద్వేషములు లేనివాఁడగుచున్నాఁడో అప్పుడు సత్యాసత్యములను, శోకానందములను, భయాభయములను వదలివేసి పరబ్రహ్మ తత్త్వమును పొందుచున్నాఁడు. (పింగళాగీత 54 శ్లోకము)

ఇచ్ఛాద్వేషముల ననుసరించి కామసంకల్పములుండును. ఇచ్ఛాద్వేషములు లేకపోయినప్పుడు కామసంకల్పములు లేకుండ పోవుచున్నవి. బుద్ధి స్థిరపడుచున్నది.

మూ॥ యో యో యాం యాం తనుం భక్తశ్శ్రద్ధయార్చితుమిచ్ఛతి।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహం॥ 21.

తా॥ (పైఁజెప్పఁబడిన కామసంకల్పయుక్తులైన భక్తులలో) ఏయేభక్తుడు ఏయేదేవతారూపమును విశ్వాసముతోఁ పూజించుట కిష్టపడుచున్నాడో ఆయాభక్తునకు నిశ్చలమైన అవిశ్వాసమునే అంతర్యామినైన నేను విధించుచున్నాఁడను.

మూ॥ స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే।
లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్॥ 22.

తా॥ కామసంకల్పయుక్తుఁడైన ఆభక్తుడు పూర్వోక్తరీతి నిశ్చలమైన శ్రద్ధతో గూడినవాడై ఆదేవతారూపముయొక్క ఆరాధనమునే వాంఛించుచున్నాఁడు. దానివలనఁగూడ శాస్త్రవిహితములైనట్టియు, హితములైనట్టియు, వాంఛితములను అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వము చేతనే పొందుచున్నాఁడు.

వివ॥ పూజించుభక్తునియందును, పూజింపఁబడు దేవతామూర్తియందును, పూజాపదార్థములయందును ఉన్నది పరమాత్మ యొక్కఁటే కనుక ఆపూజ యేరూపముగ ఫలించినను పరమాత్మచేతనే ఫలించినదని చెప్పఁబడుచున్నది.

ఇంకొక రహస్యము:— భక్తుఁడు బాహ్యవిగ్రహమును పూజించినను తనయందలి ఆత్మశక్తిచేతనే ఫలవంతమగుచున్నది కాని విగ్రహముచేత ఫలవంతమగుటలేదు. ఐన నతఁడు పృథగ్భావముతోఁ బూజించినందున కలిగిన ఫలము అల్పకాలభోగ్యమగుచున్నది.

శ్లో॥ అనాత్మవిదముక్తోఽపి నభోవిహరణాదికమ్।
ద్రవ్యమంత్రక్రియాకాలశక్త్యాప్నోత్యేవ సద్విజః॥

ఆ ద్విజుఁడు ఆత్మజ్ఞానము లేనివాడయ్యును, ముక్తుఁడుకాకుండియు ఆకాశసంచారము మొదలైన మహిమలు, ధనాకర్షణము, మంత్రశక్తి, క్రియాశక్తి, కాలశక్తి సంపాదించుచునే యున్నాఁడు.

(అన్నపూర్ణోపనిషత్తు 4 అ, 2 శ్లోకము,)

శ్లో॥ యస్తు మూఢోఽల్పబుద్ధిర్వా సిద్ధిజాలాని వాంఛతి
స సిద్ధిసాధనైర్యోగైస్తాని సాధయతి క్రమాత్॥

అల్పబుద్ధిగల యేమూఢుడైతే అనేకములైన లాభములను కోరుచున్నాడో వాఁడు లాభములకు దగిన యోగసాధనలచేత క్రమముగ అలాభములనే సాధించుచున్నాఁడు. (అన్నపూర్ణోపనిషత్తు 4 అ. 5 శ్లోకము)

మూ॥ అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్।
దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి॥ 23.

తా॥ పూర్వశ్లోకమురీతిగా కామమును పురస్కరించుకొని సంపాదించిన ఆకర్మఫలము అన్యదేవతారాధన తత్పరులైన అయల్పమతులకు స్థిరముఁగ నిలిచియుండునదికాదు. ఒకప్పుడు అంతమొందుచున్నది. అట్టియంతవంతములైన స్వర్గభోగాది ఫలములనిచ్చు దేవతలను పూజించువారు దేవతలజేరుచున్నారు. ప్రతి శరీరములోను అంతర్వీధియందు జ్ఞానస్వరూపమున వెలుగొందుచు "నేను నే"నని పేర్కొనఁబడు పరమాత్మతత్త్వమును ప్రేమించువారు అట్టి పరమాత్మను సైతము పొందుచున్నారు.

శ్లో॥ ఆపదః క్షణమాయాంతి క్షణమాయాంతి సంపదః।
క్షణం జన్మాథ మరణం సర్వం నశ్వరమేవ తత్॥

ఆపదలు క్షణములో వచ్చుచున్నవి, సంపదలు క్షణములో వచ్చుచున్నవి. క్షణములో జన్మము వచ్చుచున్నది. అట్లే మరణము వచ్చుచున్నది. అట్టిది సర్వము నశించునదే.

(మహోపనిషత్తు 3 అ. 53 శ్లోకము.)

మూ॥ అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః
పరం భావమజానంతో మమావ్యయమనుత్తమమ్॥ 24

తా॥ సమస్తభూతములయందు నేను నేనని వాడఁబడు పరిశుద్ధాత్మతత్త్వము ఇంద్రియములకు గోచరముకానిది, ఎన్నఁటికి క్షీణింపనిది, అత్యుత్తమమైనది. అట్టిపరమాత్మ స్వరూపము తమయందే ప్రకాశించుచున్నను, శ్రేష్ఠమైనదాని భావము నెఱుఁగని బుద్ధిహీనులు స్థూలశరీరము కనఁబడుచుండ నేను కనఁబడుచున్నాఁడనని తలఁచుచున్నారు. శరీరమాపదలోఁబడిపోవుచుండ "అయ్యో నేనాపదలోఁబడి పోవుచున్నాడనే" యని భావించుచున్నారు.

శ్లో॥ త్వన్మాయామోహితధియస్త్వాం నజానంతి తత్త్వతః।
మానుషం త్వాభిమన్యంతే మాయినం పరమేశ్వరమ్॥

నీమాయచేత బుద్ధివైకల్యముఁజెందిన మూఢమానవులు మాయాసమే తుఁడవైన పరమేశ్వరుని నిన్ను సామాన్యమానవునిగాఁ దలఁచుచున్నారు. (అధ్యా. బాల. 5స. 55శ్లో.)

శ్లో॥ సర్వేషు ప్రాణిజాతేషు హ్యహమాత్మా వ్యవస్థితః
తమజ్ఞాత్వా విమూఢాత్మా కురుతే కేవలం బహిః॥

సర్వప్రాణులయందు నేను ఆత్మస్వరూపుఁడనై యున్నాఁడనుకదా? అది తెలిసికొనక మూఢమానవుఁడు కేవలము వేఱుభావమును కలిగించు కొనుచున్నాఁడు. (అధ్యా. ఉత్త. 7స. 74శ్లో.)

మూ॥ నాహంప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్॥ 25.

తా॥ (నిర్గుణము, నిరాకారమునైన పరమాత్మయందు పరాప్రకృతిచే సత్త్వాదిగుణములు, శరీరత్రయాది రూపములు ఆరోపింపబడుటచే సగుణము, సాకారమునైన ప్రత్యగాత్మయని చెప్పబడుచున్నది.) అస్మత్పద లక్ష్యార్థమైన పరిశుద్ధాత్మ యిట్లు మాయచే పరివేష్టింపఁబడిన లోకమున కంతటికి వెల్లడి యగుటలేదు. (తెలియఁబడుచున్న స్థూలదేహాది ప్రపంచమంతయు, ఆత్మచే జూడఁబడుచున్నదికాని ఆత్మను జూడజాలదు. అందుకే దీనికి మూఢలోకమని పేరుకలిగినది.) జన్మములేనట్టియు, నాశము కానట్టియు, అంతర్వీధియందు నేనని పేర్కొనఁబడునట్టియు పరిశుద్ధాత్మను ఈమూఢలోకము మిగుల తెలిసికొనలేకున్నది.

శ్లో॥ తత్త్వం న జానంతి పరాత్మనస్తే జనాః సమస్తాస్తవ మాయయాతః।
త్వద్భక్తసేవామల మానసానాం విభాతి తత్త్వం పరమైకమైశమ్॥

నీమాయచే కప్పఁబడిన సమస్తజనులు నీయథార్థ స్వరూపమును తెలిసికొనఁజాలరు. నీభక్తులను సేవించుటచే పరిశుద్ధాంతఃకరణులైన జనులకు శ్రేష్ఠమైనట్టియు, అద్వితీయమైనట్టియు. ఈశ్వరసంబంధమైనట్టియు నీతత్త్వము వెల్లడియగుచున్నది. (అధ్యా. యుద్ధ. 15స. 60శ్లో.)

మూ॥ వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున।
భవిష్యాణిచ భూతాని మాంతు వేద న కశ్చన॥ 26.

తా॥ అర్జునా! "భూపాప్రా" అనుసూత్రమువలన ప్రత్యగాత్మతో సంయోగముఁజెంది జన్మప్రాప్తిఁగాంచిన స్థూలశరీర తత్త్వములు భూతములు. ఇట్టిభూతములు సృష్టిలో ఇదివఱకెన్ని కడచిపోయినవో! ఇప్పుడెన్నియున్నవో! ఇఁకపైనెన్ని పుట్టిరాఁబోవుచున్నవో! అన్నిటియందు నుండునది పరమాత్మ యొకటేయని యోగీశ్వరులమతము. కనుక భూతభవిష్య ద్వర్తమాన కాలములయందలి సర్వశరీరములలోనుండు ఇరువదినాలుగు తత్త్వములను నేననెడు ఇరువదియైదవ తత్త్వము ఎఱుఁగును కాని నన్నెఱిఁగినది ఇరువదినాలుగు తత్త్వములలో ఒక్కటియులేదు.

మూ॥ ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత
సర్వభూతాని సమ్మోహం సర్గేయాంతి పరంతప॥ 27

తా॥ ఓభారతా! పరంతపా! జీవులకు దేహమేర్పడుచుండగానే శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలైన ద్వంద్వములు కలుగుచున్నవి. అందులో ప్రియమైన విషయములయం దనురాగము, అప్రియమైన విషయములయందు ద్వేషము కలుగుచున్నవి. ఈరాగద్వేషములచేత మనస్సువైకల్యము జెందుచున్నది. మనోవైకల్యముచేత జీవులు అజ్ఞానములోఁ బడిపోవుచున్నవి. అందువల్ల సర్వభూతములు జన్మమూదిగా అజ్ఞానముఁ బెందుచున్నవని యర్థము.

మూ॥ యేషాంత్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్।
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః॥ 28

తా॥ "పుణశుభకర్మ్మ" అనుసూత్రమువలన నిత్యశుభప్రాప్తికరమైన అభ్యాసయోగమే పుణ్యకర్మయని యోగీశ్వరులమతము.- ఇట్టియభ్యాసయోగరూపమైన పుణ్యకర్మ యేమనుష్యులు చేయుదురో వారికి వాసనాక్షయము, చిత్తోపశమము కలుగుచున్నవి. శీతోష్ణాది ద్వంద్వములయందు సంభవించు మనోవైకల్యముతొలఁగిపోవుచున్నది. అందువల్లనే యట్టివారిపాపమంతమొందుచున్నది.) ఇటుల అభ్యాసయోగానుష్ఠానపరులైన యేమనుష్యులపాపము నశించిపోవుచున్నదో నియమబద్ధులైన ఆయోగీశ్వరులు మనోవైకల్యమునుండి విడువఁబడినవారై అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వమును సేవించుచున్నారు.

మూ॥ జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతంతియే।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మచాఖిలమ్॥　29

తా॥ అంతర్యామియైన భగవత్తత్త్వము నాశ్రయించి వృద్ధత్వమును, మరణమును విడిపించుకొనుటకై యెవరైతే ప్రయత్నము చేయుచున్నారో అట్టివారా పరబ్రహ్మతత్త్వమును తెలిసికొనుచున్నారు. ప్రత్యగాత్మస్వరూపమును సంపూర్ణముగఁ దెలిసికొనుచున్నారు. సమస్తమైన కర్మనుకూడ తెలిసికొనుచున్నారు. (సర్వము పరమాత్మ మయమగుటచేత పరమాత్మ నాశ్రయించినామనఁగా సర్వము తెలిసిపోయినదన్నమాట.)

మూ॥ సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞంచ యే విదుః
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః　30

తా॥ అధిభూతముతో, అధిదైవముతో, అధియజ్ఞముతోసహ అస్మత్మదలక్ష్యార్థమైన భగవత్తత్త్వము నెవరెఱుఁగుదురో అట్టియోగాసక్త చిత్తులు దేహమును విడిచిపెట్టి వెళ్లిపోవుచుండు సమయమునసైతము అంతర్వీధియందు సర్వము తానైన స్వస్వరూపమును దెలిసికొనుచున్నారు.

శ్లో॥ అదర్శనే తిష్ఠతి రూపమస్య పశ్యంతి చైనం సుసమిద్ధసత్త్వాః
హనో మనీషి మనసాభిపశ్యేత్ య ఏనం విదురమృతాస్తేభవన్తి॥

ఆపరమాత్మస్వరూపము బాహ్యేంద్రియములచే దర్శింపరానిచోట నిలుచుచున్నది. మంచి మతి ప్రకాశముగల సత్త్వస్వరూపులు దానిని చూచుచున్నారు. జన్మకర్మహీనమైపోయిన బుద్ధిమంతుడు తనతెలివితోజూడ వచ్చును. ఆస్వరూపము నెవరు తెలిసికొనుచున్నారో వారు మరణములేనివారగుదురు. (సనత్సుజాతీయము 5-18)

శ్లో॥ అవారణీయం తమసః పరస్తాత్
తదంతతోఽభ్యేతి వినాశకాలే।
అణీయరూపంచ తథాప్యణీయసామ్
మహత్స్వరూపంత్వపి పర్వతేభ్యః
తదేతదహ్నా సంస్థితం భాతి సర్వం
తదాత్మవిత్పశ్యతి జ్ఞానయోగాత్

తస్మిఞ్ జగత్సర్వమిదం ప్రతిష్ఠితమ్
యే తద్విదురమృతాస్తే భవంతి॥

**జీవితమంతమగుచుండ** శరీరము నశింపఁదగిన కాలమురాఁగా అజ్ఞానాంధకారమువలన నివారింపఁబడని పరిపూర్ణతత్త్వము అణువులలో అణువు, పర్వతములకంటె సైతము గొప్పదియునగు మహాస్వరూపముతో అంతరంగమున జెందుచున్నది. ఆతత్త్వప్రకాశమువలన గలిగిన పగటిచే సర్వము వెలుఁగుచున్నది, దాని నాత్మజ్ఞుఁడు జ్ఞానయోగమువలన జూచుచున్నాఁడు. జగమంతయు దానియందు నిల్చియున్నది. దాని నెఱిగినవారందఱు మరణములేనివారగుదురు. (సనత్సుజాతీయము 3 అ 22-28 శ్లోకము)

ఇది శ్రీ మహాభారతము భీష్మపర్వములో విజ్ఞానయోగమనెడు ముప్పదియొకటవ అధ్యాయము.

ఓం తత్ సత్.



# శ త ప త్ర ము

# 100



## శ్రీ మహాభారతము భీష్మపర్వము 32 అధ్యాయము.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు -

మూ॥ కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ।
అధిభూతంచ కిం ప్రోక్తమధిదైవం కిముచ్యతే॥ 1

తా॥ ఓపురుషోత్తమా! ఆబ్రహ్మమనునది యేది? అధ్యాత్మమననేమి? కర్మయన నేమి? అధిభూతమని యేది చెప్పఁబడినది? అధిదైవమని యేది చెప్పబడుచున్నది.

మూ॥ అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన।
ప్రయాణకాలేచ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః। 2.

తా॥ ఓ కృష్ణా! ఇచట ఈదేహమునందు అధియజ్ఞుఁడన నెవఁడు? ఎట్లుండును? దేహమువిడిచి వెళ్లు సమయములో నియతమైన స్వభావము గలవారిచే త్వం పదలక్ష్యార్థమైన పరమాత్మ యెట్లు తెలియబడుచున్నడ?

శ్రీభగవానుడు చెప్పుచున్నాఁడు -

మూ॥ అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః॥ 3.

తా॥ క్షీణముకానిది, శ్రేష్ఠమైనది బ్రహ్మ. (త్రిగుణాత్మకయైన ప్రకృతికి ఆశ్రయమగుటచే దీనిని సగుణమని కొందఱందురు.) ఈ యక్షర పరబ్రహ్మయొక్క స్వభావము అధ్యాత్మమనఁబడును. శరీరాద్యావరణముల

చేత వేఱుగకనఁబడు ప్రత్యగాత్మ అధ్యాత్మమనఁబడును. ఆవరణముచే వేఱుచేయఁబడుట మొదలు మరల పరబ్రహ్మమునందు కలిసిపోవు వఱకు జీవులేభావముతో వర్తించునో ఆభావమే యధ్యాత్మమని కొందఱు వేదాంత స్వాములు చెప్పుదురు. జీవులకు జన్మప్రాప్తిగలవాఁడనను భావము పుట్టించు సృష్టి క్రియాసూత్రము కర్మయనఁబడును. జన్మకారణమైన జీవభ్రాంతిని బుట్టించు సంసృతిబంధము కర్మయనబడును.

శ్లో॥ కర్మణా జాయతే జంతుః కర్మణైవ ప్రలీయతే।
సుఖం దుఃఖం భయం క్షేమం కర్మణైవ ప్రపద్యతే॥

జీవి కర్మచేఁ బుట్టుచున్నది, కర్మచేతనే లయించుచున్నది సుఖము దుఃఖము, భయము, క్షేమము కర్మచేతనే పొందుచున్నది.
(భాగవతము 10 స్కం. 24 అ 13 శ్లో)

"సంకల్పమాత్రప్రభవో బంధః" అని నిరాలంబోపనిషత్తులోఁ జెప్పఁబడినది. "సంకల్పః కర్మ మానసమ్" అని యమరకోశములోఁ జెప్పబడినది. మనోవాక్కాయములలో మనస్సు ప్రధానమైనది కనుక మానసికకర్మయైన సంకల్పమే జన్మకారణమైనకర్మ.

మూ॥ అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర॥ 4.

తా॥ శరీరమును ధరించిన వారిలో శ్రేష్ఠుఁడవైన అర్జునా! ఇలలోఁ బుట్టిన జీవులన్నియు క్షీణించు స్వభావము కలిగియున్నవి. ఇరువదినాలుగు తత్త్వములతోఁగూడిన స్థూలశరీరము ఇట్టి స్వభావముతోనే పుట్టుచున్నది కావున అధిభూతమనఁబడును. "క్షేత్రజ్ఞ ఆత్మా పురుషః" అని అమరకోశములోఁ జెప్పఁబడినది. స్థూలదేహమునందలి యిరువదినాలుగు తత్త్వములను, పంచకోశములను, జాగ్రత్స్వప్న సుషుప్తులను, ఇంద్రియార్థములైన విషయములను అన్నిఁటినెఱిఁగినయాత్మ అధిదైవతము. "మనర్జ్ఞానే" అను సూత్రమువలన దేహేంద్రియాదుల నెఱుఁగుటయును మనోవ్యాపారములోఁ జేరినదే. వీనికన్నిఁటికి విలక్షణమై, నిర్వికల్పసమాధిస్థితమై, ఏకమాత్రస్వరూపమై, అస్మత్పద లక్ష్యార్థమైయున్న పరిశుద్ధాత్మ అధియజ్ఞుఁడనఁబడును.

పూర్వశ్లోకమునందలి అధ్యాత్మమునకు ఈశ్లోకమునందలి అధిదైవతమునకు ఏమి భేదమున్నదని కొందఱడుగుచున్నారు. శరీరతత్త్వములను,

వానివృత్తులను విమర్శించి తెలిసికొనలేని మూఢదశలోఁ బడియుండినది అధ్యాత్మము. విమర్శించి తెలిసికొనఁ గలిగినది అధిదైవతము.

మూ॥ అంతకాలేచ మామేవ స్మరన్ ముక్త్వా కలేవరమ్।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥ 5

అవసానసమయమున తనలోఁ బ్రకాశించు చిత్కళాస్వరూపమైన, నామరూప గుణకర్మాదుల కతీతమైన, అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వమును మననము సేయుచు ఎవడైతే దేహమును వదలిపెట్టి పోవుచున్నాఁడో అట్టి యోగీశ్వరుఁడు ఆపరమాత్మ స్వరూపమును పొందుచున్నాఁడు. ఇందు సంశయములేదు.

॥ యథా నద్యస్స్యందమానాస్సముద్రేః
స్తం గచ్ఛంతి నామరూపే విహాయ
తథా విద్వాన్ నామరూపాద్విముక్తః
పరాత్పరం పురుషముపైతి దివ్యమ్॥

ప్రవహించుచుండు నదులు నామరూపములను వదలివేసి యెట్లు సముద్రములో అస్తమించుచున్నవో అట్లే జ్ఞానియు నామరూపములనుండి విడువబడినవాడై ఉత్తమోత్తముఁడైన దివ్యపురుషుని (పరమాత్మను) పొందుచున్నాఁడు. (ముండకోపనిషత్తు 3-2-8 )

"తత్త్వప్రదీపప్రకాశం స్వాత్మానం పశ్యన్ యోగీ మత్సాయుజ్యమవాప్నోతి"

యోగీశ్వరుఁడు పరతత్త్వమనెడు దీపఁపువెలుఁగైన స్వస్వరూపమును జూచుచు సర్వత్ర నేనని చెప్పబడు భగవత్తత్త్వముయొక్క సాయుజ్యమును పొందుచున్నాఁడు. (వాసుదేవోపనిషత్తు)

మూ॥ యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కలేవరమ్।
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః॥ 6.

తా॥ అవసానకాలములో ఏయేభావమును జింతించుచు దేహమును వదలుచున్నాఁడో ఆయాభావమునే పొందుచున్నాఁడు. అర్జునా! ఆభావమే

సర్వదా యెవ్వనిచేత భావింపఁబడుచుండినదో అట్టివాఁడు అవసానమున దానినే చింతించి అభ్భావమునే పొందుచున్నాడు. (ఈశ్లోకము నారద పరివ్రాజకోపనిషత్తు 5 ఉపదేశములో కొంచెముశబ్దభేదముతోఁ జదివినట్టు జ్ఞాపకం)

శ్లో॥ దేహావసానసమయే చిత్తే యద్యద్విభావయేత్।
తత్తదేవ భవేజ్జీవ ఇత్యేవం జన్మకారణమ్॥

జీవుడు మరణకాలమునఁ దనమనస్సున నేదేది భావించుచున్నాఁడో తాను నదేయగుచున్నాఁడు. ఈవిధముగా జన్మమునకుఁ గారణమగుచున్నది.
(యోగశిఖోపనిషత్తు 1-31)

శ్లో॥ యం యం లోకం మనసా సంవిభాతి
విశుద్ధసత్త్వః కామయతే యాంశ్చ కామాన్
తం తం లోకం జయతే తాంశ్చ కామాం
స్తస్మాదాత్మజ్ఞం హ్యర్చయేద్భూతికామః॥

పరిశుద్ధాత్మస్వరూపుడైన యోగీశ్వరుఁడు మనస్సుచేతనేయేలోకమును స్ఫురింపఁజేయుచున్నాఁడో యేకోరికల గల్పించుచున్నాఁడో ఆయాలోకములను, ఆకోరికలనుసైతము జయించుచున్నాడు. అందువలన శుభప్రాప్తిఁ గోరినవాఁడు ఆత్మజ్ఞుని పూజింపవలయునుగదా? (ముండకోపనిషత్తు 3-1-10)

యోగి తనలోపల ఏస్థానమును సర్వదా భావించుచున్నాఁడో అతనికాస్థానము చరమదశయందును వశపడియుండునని యిందువలన ఋజువగుచున్నది.

మూ॥ తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ।
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః॥ 7.

అందువలన సర్వకాలములయందు అస్మత్పదలక్ష్యార్థమైన పరమాత్మతత్త్వమును ఉచితరీతిని జింతింపుము. శత్రువులను లెస్సగఁ బ్రహరింపుము (జ్ఞానికి కామాదులే శత్రువులని యిదివఱకు 27అ. 39 శ్లోకములో జెప్పబడినది.) మనస్సును, బుద్ధిని అంతర్వీధియందు ఊర్ధ్వస్థానమున నేననిపేర్కొనబడిన పరిశుద్ధాత్మయందు కలిపివేసినవాడవై ఆపరిశుద్ధాత్మనే పొందఁగలవు. (ఇందుకు) సంశయములేదు. (ఈశ్లోకములో జ్ఞానకర్మ యోగముల రెంటి ప్రయోజనము వర్ణింపబడినది.)

మూ॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్॥ 8.

తా॥ అర్జునా! అభ్యాసయోగముతోఁ గూడినట్టియు, ఇంతకంటె వేఱు దారిఁ బొక్కనట్టియు మానసముతో (భగవత్తత్త్వమును) మననము సేయు చుండువాఁడు దివ్యమైన పరమాత్మను పొందుచున్నాఁడు. (సారూప్యమును బెందునని భావము.) ఈశ్లోకములోను జ్ఞాన కర్మయోగముల రీతులే వర్ణింప బడినవి.

మూ॥ కవిం పురాణమనుశాసితార మణోరణీయాంసమనుస్మరేద్యః
సర్వస్యధాతారమచింత్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్॥ 9.

మూ॥ ప్రయాణకాలే మనసాచలేన భక్త్యాయుక్తోయోగబలేనచైవ
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్ సతం పరం పురుషముపైతి దివ్యమ్॥

తా॥ దేహమును విడిచివెళ్లఁబోవు సమయములో భక్తితోఁగూడినవాడై చలింపని మనస్సుతోను, ముఖ్యముగ యోగబలముతోను భ్రూమధ్యస్థానమున ప్రాణవాయువులను సమావేశముగావించి బాహ్యాంతరముల సమస్త వృత్తులను గుణదోషముల నెఱిఁగినట్టియు, సనాతనమైనట్టియు, సర్వమును శాసించునట్టియు, అణువుకంటె సూక్ష్మమైనట్టియు, సర్వమును ధరించి యుండునట్టియు, అట్టి దిట్టిదని మనస్సుచేఁ జింతింపరానట్టియు, గాఢాంధకారమునకంటె వేఱైన సూర్యమండలమువలెఁ బ్రకాశమానమైనట్టియు, ఆస్వస్వరూపమును ఏవడైతే ఉచితరీతిని లెస్సగఁ జింతించుచున్నాఁడో అట్టి యోగీశ్వరుఁడు దివ్యమైన ఆపరమాత్మను పొందుచున్నాడు.

మూ॥ యదక్షరం వేదవిదో వదంతి విశంతి యద్యతయో వీతరాగాః॥
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే.॥

తా॥ తత్త్వజ్ఞానులు (జ్ఞానయోగులు) దేనినైతే అక్షరపరబ్రహ్మ (నాశరహితము) అని చెప్పుచున్నారో, రాగాది గుణములు వదలివేసిన యతీశ్వరులు (అభ్యాసయోగులు) దేని నుపాసించుచున్నారో, దేనిని వాంఛించినవారు (ముముక్షువులు) బ్రహ్మచర్యము నాచరించుచున్నారో ఆపదమును లెస్సగ గ్రహించురీతి నీకు బాగుగఁ జెప్పఁబోవుచున్నాఁడను.

మూ॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్యచ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్।

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్॥ 13.

తా॥ మనస్సు అంతర్వీధినుండి బాహ్య వ్యాపారములకుఁ జరించుబాట లేవేవికలవో ఆద్వారములనన్నిటిని స్వాధీనపెట్టుకొని, మనస్సును హృదయ గోళమునందే నిలువరించి, ప్రాణమును తన శిరమునందు సంధించి, అంత టనిలుకడగలవాఁడై, యోగముద్రను ధరించి, ఏకాక్షర బ్రహ్మస్వరూపమైన ప్రణవమంత్రమును జపించుచు, అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వమును జింతించుచు ఎవ్వఁడైతే దేహమును విడిచి వెళ్ళుచున్నాఁడో అట్టివాఁడు పరమ పదమును బొందుచున్నాఁడు.

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వముముక్షుభిః"

"ఓం" అని యేకాక్షర స్వరూపమైన బ్రహ్మము సర్వముముక్షువుల చేత ధ్యానింపఁబడఁదగినది. (ధ్యానబిందూపనిషత్తు 9 శ్లోకము)

శ్లో॥ ఓంకారప్రభవా దేవా ఓంకారప్రభవాః స్వరాః।
ఓంకారప్రభవం సర్వంత్రైలోక్యం సచరాచరమ్॥

దేవతలు ప్రణవమువలన కలిగినారు. సమస్తస్వరములు ప్రణవము వల్లనే కలిగినవి. మూఁడులోకములలో చరాచరరూపమైన వస్తుసముదాయ మంతయు ప్రణవమువల్లనే కలిగినది. (ధ్యానబిందూపనిషత్తు 16శ్లో.)

శ్లో॥ హృత్పద్మకర్ణికామధ్యే స్థిరదీపనిభాకృతిమ్।
అంగుష్ఠమాత్రమచలం ధ్యాయేదోంకారమీశ్వరమ్॥

హృదయకమలమున కర్ణికామధ్యమున బొటనవ్రేలెడు పరిమాణము తో స్థిరమై వెలుఁగు దీపమువలె నిశ్చలముగనుండు ప్రణవరూపుఁడైన పర మేశ్వరుని ధ్యానింపవలయును. (ధ్యానబిందూపనిషత్తు 19శ్లో.)

శ్లో॥ గమాగమస్థం గమనాదిశూన్య మోంకారమేకం రవికోటిదీప్తిమ్।
పశ్యంతి యే సర్వ జనాంతరస్థం హంసాత్మకం తే విరజా భవంతి॥

చరాచరములైన వస్తువులన్నిఁటియందుండునట్టియు, సంచారాదిక్రియలు లేనట్టియు, కోటిసూర్యుల ప్రకాశముతో సమస్తజనులయందు హంసస్వరూపముననుండునట్టియు అద్వితీయమైన ఓంకారము నెవరు చూచుచున్నారో అట్టివారు వైరాగ్య పురుషులగుచున్నారు. (ధ్యానబిందూపనిషత్తు 24శ్లో.)

శ్లో॥ భ్రువోర్మధ్యే లలాటేతు నాసికాయాస్తు మూలతః।
జానీయాదమృతం స్థానం తద్బ్రహ్మాయతనం మహత్॥

నొసట రెండు కనుబొమలకు నడుమ నాసికయొక్క మూలభాగమున మోక్షస్థానమును తెలిసికొనవలయు. అది పూజనీయమైన బ్రహ్మమందిరము
(ధ్యానబిందూపనిషత్తు 40శ్లో.)

శ్లో॥ దృష్టిః స్థిరా యస్య వినా సదృశ్యం
వాయు స్థిరో యస్య వినా ప్రయత్నమ్।
చిత్తం స్థిరం యస్య వినావలంబం।
స బ్రహ్మ తారాంతర నాదరూపః॥

దృశ్యము లేకపోయినను ధ్వనిలో దృష్టి స్థిరముగ నిలుచుచున్నదో, ప్రయత్నము చేయకున్నను ధ్వనిలో వాయువు స్థిరముగ నిలుచుచున్నదో ఆశ్రయము లేకున్నను ధ్వనిలో మనస్సు స్థిరముగ నిలుచుచున్నదో, తారకయోగమునందలి అనాదరూపమే పరబ్రహ్మము (నాదబిందూపనిషత్తు 56)

"ఓం నమో నారాయణాయేతి తారకం చిదాత్మక మిత్యుపాసితవ్యమ్। ఓమిత్యేకాక్షరమాత్మస్వరూపమ్"

"ఓం" అనెడు ఏకాక్షరము ఆత్మస్వరూపము. జన్మసాగరమునుండి తరింపఁజేయునది. జ్ఞానస్వరూపమైనది, దానిని "ఓం నమోనారాయణాయ" యని ధ్యానింపవలయును. (తారసారోపనిషత్తు 1 పాదః)

శ్లో॥ తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘఘంటానినాదవత్।
ప్రణవస్యధ్వనిస్తద్వత్తదగ్రం బ్రహ్మచోచ్యతే॥
జ్యోతిర్మయం తదగ్రంస్యాదవాచ్యం బుద్ధిసూక్ష్మతః।
దదృశుర్యే మహాత్మానో యస్తం వేద స వేదవిత్॥

తైలధారవలె ఎడతెగనిదై ఘంటానాదమువలె దీర్ఘముగ ప్రణవము ధ్వనించుచున్నది. దాని యగ్రము బ్రహ్మమని చెప్పఁబడును, అట్టి యగ్ర

ము జ్యోతిస్వరూపమగును. అది ఇట్టిదని సూక్ష్మబుద్ధివలన గ్రహింపవల యును. మాటలతో వర్ణించుటకు వీలుపడదు. దానిఁజూచినవారు మహాత్ము లు. దాని నెఱిఁగినవాఁడు తత్త్వజ్ఞుఁడు.

(యోగచూడామణ్యుపనిషత్తు 80-81 శ్లో.)

శ్లో॥ వామ దక్షే నిరుంధంతి ప్రవిశంతి సుషుమ్నయా।
బ్రహ్మరంధ్రం ప్రవిశ్యాంతస్తే యాంతి పరమాం గతిమ్॥

ఇడాపింగళానాడులను నిరోధించుచున్నారు. సుషుమ్నానాడి ద్వారా బ్రహ్మరంధ్రమును ప్రవేశించుచున్నారు. వారు లోపల ప్రవేశించి మోక్ష ము పొందుచున్నారు (యోగశిఖోపనిషత్తు 6 అ. 34 శ్లోకము)

మూ॥ అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః॥ 14

తా॥ అర్జునా! అన్యమార్గమునఁబోక లక్ష్యమునందే స్థిరపడిన చిత్తము గలవాఁడై నిరంతరము అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వము ఎవఁడు నియతముగఁ జింతించుచున్నాఁడో అట్టి నియమముతోఁ గూడిన యోగికి అంతర్యామియైన ఆపరమాత్మ లెస్సగ లభించుచున్నది. (అభ్యాసయోగము వలన చిత్తోపశమము, జ్ఞానయోగమువలన తత్త్వప్రాప్తి కలుగుచున్నదని తెలియవలయును )

శ్లో॥ మామనుస్మరతశ్చిత్తం మయ్యేవాత్ర విలీయతే।
సర్వజ్ఞత్వం పరేశత్వం సర్వసంపూర్ణశక్తితా।
అనంత శక్తిమత్త్వంచ మదనుస్మరణాద్భవేత్॥

నన్నుధ్యానించు యోగీశ్వరుని మనస్సు నాయందే కలిసిపోవుచున్నది. నన్ను స్మరించుటవలన (ఆయోగీశ్వరుడు) సర్వజ్ఞుఁడు, పరమేశ్వరుఁడు, సర్వసంపూర్ణశక్తిమంతుడు, అనంతశక్తిమంతుఁడు అగుచున్నాడు.

(యోగశిఖోపనిషత్తు 3అ. 25శ్లో.)

మూ॥ మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్।
నాప్నువంతి మహాత్మానస్సంసిద్ధిం పరమాం గతాః 15

తా॥ అస్మత్పద లక్ష్యార్థమైన పరమాత్మతత్త్వమును పొంది శ్రేష్ఠమైన జ్ఞానోపలబ్ధిని లెస్సగ పొందియుండు మహాత్ములు అశాశ్వతమైనట్టియు, దుఃఖనిలయములైనట్టియు పునర్జన్మమును పొందరు.

మూ॥ ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున
మాముపేత్యతు కౌంతేయ పునర్జన్మ న విద్యతే॥ 16.

తా॥ "బృహవృద్ధౌ" అనుసూత్రమువలన భూతజాలములను వృద్ధి పఱచునదిబ్రహ్మ. అందువలన త్రిగుణాత్మకమైన మాయతోఁగూడినది, శబ్ద రూపములు కలిగినవిబ్రహ్మ. ఇట్టిసగుణబ్రహ్మయొక్క స్థితియు, దానికివల నుండు సమస్తదృశ్య వస్తువుల యునికియు మనోబుద్ధీంద్రియములకు గోచరించుచున్నవికాబట్టి అర్జునా! బ్రహ్మ భువనము (సత్య) మొదలుకొని యీవల మనోబుద్ధీంద్రియములచేఁ జూడఁబడు సర్వవస్తువులు మరల జన్మము నకు వచ్చు స్వభావము కలిగియున్నవి ఓ కౌంతేయా! అస్మత్పదలక్ష్యార్థమైన భగవత్తత్త్వమును పొందినమీఁదట మఱుజన్మము కలుగదు.

మూ॥ సహస్రయుగపర్యంత మహర్యద్బ్రహ్మణో విదుః॥
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః॥ 17.

తా॥ 1. ఈలోకమునకంటె చాలపైన ఎచ్చటనో సత్యలోకమని యొకటియుండును. ఆలోకమునుపాలించు ప్రభువు చతుర్ముఖబ్రహ్మ. భూలోకములో సర్వభూతములను పుట్టించినవాఁడీయనయే. భూలోకవాసులకు వేయి చతుర్యుగములుకాఁగా బ్రహ్మదేవునికి ఒక్కపగలు, మానవులకు మఱియొక్క వేయి చతుర్యుగములుకాగా ఆ బ్రహ్మకొకరాత్రియగును. (అని పౌరాణికస్వాముల మతము) ఇట్లు బ్రహ్మదేవుని యొక్కపగలు, రాత్రి యెవరు తెలిసికొనుచున్నారో ఆజనులు అహోరాత్రముల నెఱిఁగినవారు (ఈశ్లోకము భారత. శాంతి. 231 అధ్యాయములో జది వినట్టు జ్ఞాపకము.)

"దైవేయుగసహస్రేద్వే బ్రాహ్మఃకల్పౌతు తౌనృణామ్."

రెండువేల దివ్యయుగములు బ్రహ్మ కొకదినము. అవి మనుష్యులకు రెండుకల్పములు. (అమరకోశము,)

"చతుర్యుగసహస్రాణి బ్రహ్మణో దివా భవతి తావతా కాలేన పునస్తస్య రాత్రిర్భవతి ద్వే అహోరాత్రే ఏకందినంభవతి"

వేయిచతుర్యుగములు బ్రహ్మకొక పగలగుచున్నది. మరల అంత మాత్రము కాలముచేత ఆబ్రహ్మకు రాత్రియగుచున్నది. పగలు, రాత్రి రెండు కలిసి ఒకదినమగుచున్నది. (మహానారాయణోపనిషత్తు 3 అధ్యా)

ఈ కాలములో గ్రంధములు చదువుకొని యిట్టి యహోరాత్రముల దెలిసికొనిన స్వాములు తఱుచు కనబడుచున్నారు. కాని స్వతంత్ర జ్ఞానముతో దెలిసికొనిన స్వాములు కనబడుట దుర్లభము.

2. "బృహవృద్ధౌ" అను సూత్రమువలన సమస్త భూతములు దేనిచే వృద్ధి నొందింపబడుచున్నవో అది బ్రహ్మ యనబడును. వృద్ధిసేయునది రజోగుణము కనుక ఇదిరజోగుణ ప్రధానమని తలపబడును. అందువలన త్రిగుణాత్మికయైన మాయతోఁగూడి ప్రతి శరీరమునందును ప్రణవరూపమున ధ్వనించుచు ఇరువదినాలుగు తత్త్వములతో గూడిన స్థూల శరీరములను వృద్ధిసేయుచున్నది. రకించుచున్నది. ఈకారణము చేతనె యిది సగుణ బ్రహ్మమనియు, శబ్దబ్రహ్మమనియు. బేర్కొనబడుచున్నది. అని వేదాంత స్వాములు చెప్పుదురు.

యుగము, యుగ్మము, యుగళము అను పదముల కన్నిటికిని ఒకటే యర్థము. "యుజిర్ యోగే" అను సూత్రమువలన యుగమనగా జోడుగ గూర్పబడిన దానికి బేరగును. దీనిని తెలుగులో జత, జంట, దంట, జోడు అని చెప్పుదురు. వేదాంతులు ద్వంద్వమందురు అందువలన శీతోష్ణములు క్షుత్పిపాసలు, జరామరణములు, బంధమోకములు సుఖదుఃఖములు, హర్ష శోకములు, ఇచ్ఛాద్వేషము మొదలైన ద్వంద్వములన్నియు యుగములనబడును. సహస్రమనగా వేయికిని, అధికసంఖ్యకును బేరగును.

సగుణబ్రహ్మ రజోగుణ ప్రధానమైనను ఎల్లవేళల రజోగుణమొక్కటే నిలిచియుండుటలేదు కొంతకాలము సత్త్వగుణము మిశ్రమమగుచున్నది. అప్పుడు కార్యాకార్యములను విధినిషేధములను గుర్తించునంతటి మతి ప్రకాశము కలిగియుండును. ఈ కాలమును "పగలు" అని తలపవచ్చును. ఈపగటికాలము ముగియులోపల జీవులకనేక ద్వంద్వములు (యుగ

ములు కడచిపోవుచున్నవి. మఱికొంతకాలము సత్త్వగుణము వణచివేసి యీరజోగుణమునందు తమోగుణము సంక్రమించుచున్నది, అందువలన మతిప్రకాశము తగ్గిపోయి ఏకార్యము చేయవచ్చునో యేదిచేయరాదో తెలిసికొనలేకుండునట్లు అజ్ఞానాంధకారము ఆవరించుచున్నది జ్ఞానజ్యోతి మఱుగుపడి పోవుచున్నది. ఈకాలము సగుణబ్రహ్మకు రాత్రియని తలపవచ్చును, ఇట్టి రాత్రియందును జీవులకనేక ద్వంద్వములు (యుగములు) కడచిపోవుచున్నవి. ఈవిధముగా సగుణబ్రహ్మయొక్క పగలనగానేమో, రాత్రియనగానేమో ఈరెంటి నెవరైతే తెలిసికొనుచున్నారో అట్టి జనులు అహోరాత్రముల నెఱిగినవారు అని వేదాంతస్వాములమతము.

మూ॥ అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః ప్రభవంత్యహరాగమే।
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే॥ 18.

పగలురాగా మానసేంద్రియములకు గోచరింపని దశనుండి సర్వభూతములు ఇంద్రియగోచరములగుచున్నవి. రాత్రిరాగా మరల అవ్యక్తదశయందే గలిసిపోవుచున్నవి. ప్రత్యగాత్మ వృత్తిజ్ఞానముతో గూడినప్పుడు సర్వవిషయములు గోచరించుచున్నవి. తమస్సుచే కప్పబడినప్పు డేదియు గోచరముగాదు.

మూ॥ భూతగ్రామస్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే।
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే॥ 19.

తా॥ అర్జునా! స్థావరజంగమ స్వరూపలక్షణములతో గూడిన అభూతజాలమే పలుసారులు సంభవించుచుండి సగుణబ్రహ్మయొక్క రాత్రికాలమురాగాస్వాతంత్ర్యములేకయే అవ్యక్తదశయందు లీనమగుచున్నది. పగటికాలమువచ్చినప్పుడు మరల సంభవించుచున్నది.

మూ॥ పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః
యస్ససర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి॥ 20

తా॥ సర్వభూతములయొక్క అదృశ్యభావమైన ఆసగుణబ్రహ్మకంటె వేఱైనట్టియు, శ్రేష్ఠమైనట్టియు, మనోబుద్ధీంద్రియములచే జూడరానట్టియు భావమేదికలదో అట్టినిర్గుణపరమాత్మయొక్క భావము సనాతనమైనది.

సర్వభూతములు నాశముగావింపఁ బడుచుండగా ఆపరమాత్మ భావము నాశము చేయఁబడదు.

శ్లో॥ భూతగ్రామశరీరేషు నశ్యత్సు న వినశ్యతి
అజో నిత్యశ్శాశ్వతశ్చ నిర్గుణో నిష్కళస్తథా॥
ద్విర్ద్వాదశేభ్యస్తత్త్వేభ్యః ఖ్యాతో యః పంచవింశకః।
పురుషో నిష్క్రియశ్చైవ జ్ఞానదృశ్యశ్చ కథ్యతే॥

స్థూలశరీరమునందు ఇరువదినాలుగు తత్త్వములకంటె ఎవడు విఖ్యాతుడై యున్నాడో అతడిరువదియైదవ తత్త్వమగు ఆత్మయని చెప్పబడును. అయన జన్మములేనివాడు, శాశ్వతుడు, నిత్యుడు, గుణరహితుడు, నిష్కళాస్వరూపుడు, క్రియారహితుడు, జ్ఞానయోగముచే జూడదగినవాడు, భూతకోటుల శరీరములు నశించిపోవుచుండగా తాను వినాశమునొందక యథారీతి నుండువాడు. (భారత. శాంతి 340అ. 23-24శ్లో)

శ్లో॥ వినశ్యత్సు చ భూతేషు న భయం తస్య జాయతే।
క్లిశ్యమానేషు భూతేషు న స క్లిశ్యతి కేనచిత్॥

భూతములు నశించుచుండగా ఆయనకు భయముపుట్టదు. భూతములు సంకటపడుచుండగా ఆయన దేనిచేతనైన సంకటపడడు.

(అనుగీత 4అ. 27శ్లో)

మూ॥ అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిమ్।
యం ప్రాప్య ననివర్తంతే తద్ధామ పరమంమమ॥ 21.

తా॥ అవాఙ్మానసగోచరము, నాశరహితము అని యేది చెప్పఁబడుచున్నదో దానిని ఉత్తమగతియని చెప్పుదురు యోగులు దేనిని ప్రాపించిన తరువాత తిరిగి జన్మమునకురారో అది యస్మత్పదలక్ష్యార్థమైన పరమాత్మ తత్త్వమునకు నిలయము.

మూ॥ పురుషస్స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా।
యస్యాంతస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్॥ 22.

తా॥ అర్జునా! సమస్తభూతములు ఎవనిలోపల నిలిచియున్నవో, ఈ సర్వజగత్తు ఎవనిచే వ్యాప్తమైయున్నదో అయన పరమపురుషుడు. తనకంటె

వేఱుగ మఱియొచ్చటనో దేవుడనేవాడొక డున్నాడను విశ్వాసమును మాను కొని తనయందే వెలుగొందు చిత్కళాస్వరూపమును సేవించుటచేతనే లభిం పదగినవాడు.

మూ॥ యత్రకాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ॥ 23.

తా॥ అర్జునా! ఏకాలమున శరీరములను వదలిపోయిన యోగీశ్వరులు జన్మరాహిత్యమును పొందుచున్నారో యేకాలమున బోయిన యోగులు పున ర్జన్మమునకు బోవుచున్నారో అకాలమును చెప్పబోవుచున్నాడను.

మూ॥ అగ్నిర్జ్యోతిరహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణమ్॥
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥ 24.

తా॥ అగ్నియందును, జ్యోతియందును, పగటికాలములోను, శుక్లపక్ష మునందును, (మకరమాసము మొదలు ఆఱునెలలుగల) ఉత్తరాయణము నందును, దేహము విడిచి వెళ్లిపోయిన బ్రహ్మజ్ఞాన స్వాములు బ్రహ్మపదము పొందుదురు. (కొందఱు స్వాములు అగ్నిసంస్కారము చేతనే పరమపదము పొందుదురు. మఱికొందఱు స్వాములు సూర్యమండలము ద్వారా పోయి బ్రహ్మలోకము చేరుదురని వదంతి.)

వివ॥ అహోరాత్రములు, శుక్ల కృష్ణపక్షములు, ఉత్తర దక్షిణాయన ములు కాలపరిమానమునందు సమానములుగ నున్నవి. పగలు చచ్చినన్ని జీవులు రాత్రికూడ చచ్చుచుండునని యెవరైనను ఒప్పుకొనుచున్నారు. పక్షములయందు, ఆయనములయందు ఇంచుమించుగ నిట్లేయుండును. పగటికాలములోను, శుక్లపక్షములోను, ఉత్తరాయణములోను, చచ్చిన స్వా ములందఱు బ్రహ్మపదము జేరుదురనిన లోకములో పుట్టి గిట్టుచుండు స్వాములలో నూటికేబది మంది బ్రహ్మపదము జేరుదురని నమ్మవలసి వచ్చును.

"పింగళాయా ఇడాయాంతు వాయోసంక్రమణం తు యత్
తదుత్తరాయణం ప్రోక్తం మునే వేదాంతవాదిభిః"

ఓ మునీంద్రా! హంస పింగళానాడి నుండి యిడానాడియందు సంక్ర మించుట యేదికలదో అది యుత్తరాయణమని వేదాంతశాస్త్రజ్ఞులచే జెప్ప బడినది. (జాబాలదర్శనోపనిషత్తు 4 ఖం. 40-41 శ్లో.)

"నిశ్శ్వాసోచ్ఛ్వాసనం సర్వం మాసానాం సంక్రమో భవేత్"

నాసామార్గమున వాయువును బయటికి విడుచుట, లోపలికి పీల్చుకొనుట ఇదంతయు మాసములయొక్క సంక్రమణమగును.

(జాబాలదర్శనోపనిషత్తు 4 ఖం. 45 శ్లోకము.)

మఱియు అగ్నియనగా తపస్సుచే గలిగిన వేడిమి (జ్ఞానాగ్ని) జ్యోతి యనగా జ్ఞానజ్యోతి, పగలనగా సత్త్వగుణ సాంకర్యముచేగలిగిన మతిప్రకాశము, ఇట్టివేళలయందు నిర్యాణముజెందిన బ్రహ్మజ్ఞానులు బ్రహ్మపదము పొందుదురు, పరిపూర్ణజ్ఞానికి దేశకాలవస్తు పరిచ్ఛేదములులేవు. అనివేదాంతస్వాములందురు.

తారకయోగులకు చిన్ముద్రయందు అగ్నిమండలములు, జ్యోతిర్మండలములు, పగలు సామాన్యముగ గనబడుచుండు విషయమే. ధమని నాడి యెఱుపువర్ణముకలిగియుండును. సిరానాడి మలినవర్ణము కలిగియుండును. కేశనాళికలు మిశ్రవర్ణము కలిగియుండును. సుషుమ్నానాడి ధవళవర్ణము కలిగియుండును. ఈనాడిస్థానమే శుక్లము. షడాధారము ద్వారా హంస ఊర్ధ్వముఖముగా నడచుట ఉత్తరాయణము. ఇట్లు చెప్పబడిన మార్గముల ద్వారా పోయిన బ్రహ్మజ్ఞానులు బ్రహ్మపదము జెందుదురు.

మూ॥ ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్।
తత్ర చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే॥ 25.

తా॥ పొగ, రాత్రి, అదేవిధముగ కృష్ణపక్షము, (కర్కాటకము మొదలు ఆఱునెలలతోగూడిన) దక్షిణాయనము. ఇట్టిమార్గములయందు పోయినయోగి చంద్రసంబంధమైన జ్యోతినిగూడి మరల జన్మమునకు వచ్చుచున్నాఁడు.

వివ॥ తారకయోగి సంపూర్ణముగా తర్పితు కాకముందు ఆరంభదశలో కొంతకాలమువఱకు దహరాకాశమున అప్పుడప్పుడు పొగవంటి లక్ష్యము కనఁబడుచుండును. కొందఱు దీనినే పొగయందురు. ఒకప్పుడు గాఢమైన చీఁకటి కనబడును. దీనిని కృష్ణపక్షమందురు. ఒకప్పుడు తమోగుణ సాంకర్యముచే అజ్ఞానాంధకారము కప్పుకొని మతిప్రకాశమును తగ్గించును. దీనిని రాత్రియందురు. ఇడానాడినుండి హంస పింగళానాడియందు సంక్రమించుట దక్షిణాయణమని జాబాలదర్శనోపనిషత్తు 4 ఖండములో జెప్పబడినది.

అదిగాక షడాధారమునందు హంస అధోమార్గమున జరించుట దక్షిణాయన మని కొందఱు యోగీశ్వరులు చెప్పుదురు. బ్రహ్మనిష్ఠ పర్యాప్తముకాని యోగికే తఱుచు అవసానమున నిట్టివి సంభవించుచుండును.

మఱియు చంద్రజ్యోతియనగా చల్లదనముతోగూడిన చిజ్జ్యోతియనియు జెప్పుదురు. తపశ్శక్తి తక్కువగనున్న యోగికే అవసానకాలములో శరీరమున చల్లదనము కలుగుచున్నది. అందువలన శ్లేష్మవాతములచే నాడులకు అవరోధ మేర్పడుచున్నది. జీవతత్త్వము అధోగతికి తిరుగవలసి వచ్చుచున్నది. కనుకనే ఇట్టి అపరిపక్వయోగి పునర్జన్మమునకు తిరుగవలసి వచ్చుచున్నది.

మూ॥ శుక్లకృష్ణే గతీహ్యేతే జగతః శాశ్వతే మతే।
ఏకయా యాత్యనావృత్తిమన్యయాఽఽవర్తతే పునః॥ 26.

తా॥ జ్ఞానప్రకాశమే వెలుతురు, అజ్ఞానాంధకారమే చీకటి. ఇటుల వెలుతురుమార్గము, చీకటిమార్గము అనెడి యీరెండుమార్గములు జగత్తునకు ఎల్లప్పటికి ఉండినవెయని తలపబడినవి. అందులో ఒకటైన వెలుతురు మార్గముచే యోగి జన్మరాహిత్యమును పొందుచున్నాడు. వేఱొకటైన చీకటిమార్గముచే మరల జన్మమునకు వచ్చుచున్నాడు.

మూ॥ నైతే సృతీ పార్థ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున॥ 27,

తా॥ ఓ పార్థా! వెలుతురు మార్గము (జ్ఞానమార్గము) చీకటిమార్గము (అజ్ఞానమార్గము) అనెడి యీరెంటిని తెలిసికొనిన యోగి యొకానొకప్పుడైనను మనోవైకల్యమును పొందడు. అందువలన అర్జునా! నీవు ఎల్లవేళలయందు యోగముతో గూడినవాడవై యుండుము. (కర్మయోగము, జ్ఞానయోగము పర్యాప్తముగ సాధించిన పిమ్మట పునరావృత్తి లేదన్నమాట)

మూ॥ వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ
దానేషు యత్పుణ్య ఫలం ప్రదిష్టమ్
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరంస్థాన ముపైతి చాద్యమ్॥ 28.

తా॥ (పూర్వోక్త శ్లోకరీతిగా) ఈసమాచారమంతయు దెలిసికొనిన యోగీశ్వరుడు వేదములయందును, యజ్ఞములయందును, తపోవృత్తులయందును,

దానములయందును, ఏపుణ్యఫలముండునని చెప్పబడినదో దాని నంతటిని దాటివేసి పోవుచున్నాడు. అన్నిటికి మొదటిదైన పరమాత్మస్థానమును పొందుచున్నాడు.

"ఆద్యం" అనుటచే జ్ఞానాజ్ఞానములకంటె పరమాత్మ విలక్షణమైనదని తెలియవలయును. అ టెట్ల ని న "నాజ్ఞానము" అనుటచే జ్ఞానము నాకంటె వేఱైనదనియు, నేను జ్ఞానమునకంటె విలక్షణుడననియు అర్థమగుచున్నది. అదిగాక 'మనజ్ఞానే' అనుసూత్రముచేత మనోవ్యాపారములో జేరినది. జ్ఞానముకనుక నేను స్వస్వరూపమును బొందినప్పుడు మనస్సు నాయందు లయించుచుండ మనోవృత్తికి సంబంధించిన జ్ఞానాజ్ఞానములు నిలుచుటకు తావు లేకపోవుచున్నది. అందువల్లనే ప ర మ ప ద ము జ్ఞానాజ్ఞానములకు విలక్షణమైనది. మొదటిదని తలపబడినది.

శ్లో॥ ఉల్కాహస్తో యథా లోకే ద్రవ్యమాలోక్య తాం త్యజేత్।
జ్ఞానేన జ్ఞేయమాలోక్య పశ్చాజ్జ్ఞానం పరిత్యజేత్॥

లోకములో కొఱవి చేతబట్టుకొన్నవాడు తనకుగావలసిన యర్థమును వెదకి కనుగొనినమీదట ఆకొఱవి నెట్లు వదలివేయుచున్నాడో అట్లే యోగీశ్వరుడు జ్ఞానముచే దెలియదగిన స్వస్వరూపమును కనుగొనినమీదట జ్ఞానమును వదలివేయవలయును. (బ్రహ్మవిద్యోపనిషత్తు 36)

ఇది శ్రీమహాభారతము. భీష్మపర్వములో అక్షరపరబ్రహ్మ యోగమనెడు ముప్పది రెండవ అధ్యాయము.

ఓం. తత్. సత్.

# శతపత్రము

# 101



## శ్రీ మహాభారతము భీష్మపర్వము 33 అధ్యాయము.

శ్రీ భగవానుఁడు చెప్పుచున్నాఁడు.

మూ॥ ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే।
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥ 1.

తా॥ అర్జునా! దేనిని తెలిసికొని నీవు అశుభస్వరూపమైన జన్మబంధము నుండి విడువబడగలవో అట్టి విజ్ఞానముతో గూడినట్టియు, కేవలము రహస్య మైనట్టియు జ్ఞానమును (బుద్ధియోగసూత్రమును) అసూయారహితుడవైన నీకొఱకై యిడిగో బాగుగ జెప్పబోవుచున్నాడను.

మూ॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్॥ 2.

తా॥ ఈయోగవిద్య విద్యలలో ముఖ్యమైనది. రహస్యములలో ప్రధాన మయినది పవిత్రమైనది. ఉత్తమమైనది. ధర్మమునకు సంబంధించినది. నాశములేనిది. ప్రత్యక్షముగ ఎఱుగదగినది అభ్యసించుటకు మిక్కిలి సుల భమైనది. (ఈవిద్య కష్టమైనదని యొకచోట సూచింపఁబడి యుండెను, పూర్వసుకృతము, గురుకటాక్షము, యోగాభ్యాసము కలిగినవారి కీవిద్యయు సులభమే కావచ్చును)

మూ॥ అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప।
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని॥ 3.

తా॥ పురుషుడు సాధింపదగిన ధర్మములలో అత్యుత్తమమైనది మోక్ష ధర్మము. దానికి పూర్వసుకృతము, గురుకటాక్షము, యోగాభ్యాసము అను నవేకాక శ్రద్ధయుండుట అత్యవసరము. అర్జునా! యీ ధర్మములో శ్రద్ధను (విశ్వాసమును) నిలుపుకొనని పురుషులు అస్మత్పద లక్ష్యార్థమైన పరమాత్మ తత్త్వమును పొందజాలక మృత్యువునకు నివాసభూతమైన సంసార పద్ధతి యందే తిరుగాడుచుందురు. శ్రద్ధతో ధర్మమును సాధించుటే యిహపర సాధకము.

మూ॥ మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా।
మత్‌స్థాని సర్వభూతాని నచాహం తేష్వవస్థితః॥ 4.

తా॥ మనోబుద్ధీంద్రియములకు గోచరింపక నిరాకారమై సర్వత్ర "నేను నే" ననుచు పేర్కొనబడు భగవత్తత్త్వముచే ఈజగమంతయు వ్యాప్తమైయున్నది. సమస్త భూతములు నాయందు నిలిచియున్నవి. నేను మాత్ర ము అభూతములయందు సక్తమైయుండుట లేదు.

నేను లేకపోయినప్పుడు శరీరములు మాటాడజాలవు కనుక శరీర ములలో నేనను తత్త్వముండినట్లేకదాయని కొందఱడుగుదురు. కొన్ని యంత్రములు విద్యుచ్ఛక్తిచేవ్యాప్తములై పనిచేయుచున్నవి కాని విద్యుచ్ఛక్తి ఆయంత్రములయందు స్థిరముగ అంటుకొనియుండునదికాదు. ఈశరీరము లయందలి నేనుకూడ అట్లేయని తెలియవలయును.

మూ॥ నచ మత్‌స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్।
భూతభృన్నచ భూతస్థో మమాత్మా భూతభావనః॥ 5.

తా। సర్వత్ర నేను నేనని చెప్పబడు ఈశ్వరతత్త్వముయొక్క సంఘ టనశక్తిని (పరాప్రకృతిని) పరిశీలింపుము. అటుల నేనైన పరమాత్మ భూత ములను భరించుచున్నది. భూతములకు సత్త్వము గలిగించుచున్నది. యథార్థము విమర్శింపగా నేననెడు పరిశుద్ధాత్మయందు భూతములులేవు. భూతములయందు పరిశుద్ధాత్మలేదు.

వివ॥ పట్టనములలో విద్యుద్దీపములు వెలుగుచుండుట చూచియుందు రు. వానియందు మెఱుపుశక్తి ప్రసరించుటచే కాచగోళములు (గాజుకుప్పె లు) ప్రకాశించుచున్నవి. "కరెంటుమిషను" ఆగిపోగానే మెఱుపుశక్తియందు

కాచగోళములులేవు, కాచగోళములయందు మెఱుపుశక్తిలేదు. రాత్రికాలము లో లోకమువెన్నెలచే వ్యాప్తమగుచున్నది. తెల్లవాఱినపిమ్మట చూతముకదా వెన్నెలలో లోకముఃలేదు, లోకములో వెన్నెలలేమ, పరాప్రకృతిచేశరీరాత్మలకు సంయోగము కల్పింపబడినప్పుడు ఆత్మయందు శరీరములుండినట్లు శరీర ములయందు ఆత్మయుండినట్లు స్వభావముచేత కనబడుచుండును. మరల శరీరాత్మలు వియోగముఃజెందుసమయమురాగా ఆత్మయందుశరీరములులేవు. శరీరములయందు ఆత్మలేదు. ఈశ్వరత్వముఃయొక్క సంఘటనశక్తియిట్టిదే.

మూ॥ యథాకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్।
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ॥ 6.

తా॥ ఏల్లెడల వ్యాపించు స్వభావముగల మహావాయువు ఆకాశమునం దెట్లున్నదో అట్లే సమస్తభూతములు నేననెడు పరమాత్మయందు ఉన్నవని తెలిసికొనుము.

వివ॥ ఆకాశములోగాలి, మేఘములు, పక్షులు, విమానములు ఎన్నె న్నో సంచరించుచున్నవికాని; ఆకాశమున కంటుకొనినది అందులో నొక్క టియులేదు. ఆకాశముగూడ వానిలో దేనికిని అంటునదికాదు. నేననెడు పరి శుద్ధాత్మ ఆకాశమువలె నిర్మలమైనదికనుక దీనియందు భూతములున్నను భూతములు, ఆత్మ ఒకదానితో నొకటి సక్తతఃజెందుటలేదని భావము.

శ్లో॥ మాతా పితాచ తనయాశ్చ నమే కదాచిత్।
జాతం మృతం నచ మనో నచ మే కదాచిత్।
నిర్వ్యాకులం స్థిరమిదం పరమార్థతత్త్వమ్।
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

తల్లిదండ్రులు, కుమారులును నాకొకప్పుడునులేరు. జననమరణ ములులేవు. మనస్సుసైతము నాకొకప్పుడునులేదు. వ్యాకులము కానట్టియు, స్థిరమైనట్టియు, జ్ఞానస్వరూపమైనట్టియు, అమృతస్వరూపమైనట్టియు, సర్వ సమత్వము కలిగినట్టియు, ఆకాశమువలె నిర్మలమైనట్టియు ఈపరమాత్మ తత్త్వము నేను. (అవధూతగీ, 3-15)

మూ॥ సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్॥ 7.

తా॥ అర్జునా! కల్పాంతమున సమస్తభూతములు ఆత్మీయమైన పరాప్రకృతియందు కలిసిపోవుచున్నవి. మరల కల్పాదియందు ఆభూతములన్నియు (సగుణబ్రహ్మమైన) నాచే సృజింపఁబడుచున్నవి. (పరమాత్మయందు త్రిగుణాత్మకయైన పరాప్రకృతి చేరుటచేతనే ఉత్పత్తిస్థితి లయములు జరుగుచున్నవని భావము.)

మూ॥ ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః।
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్॥ 8.

తా॥ ఈసమస్తమైన భూతజాలము ప్రకృష్టమైన కర్మచే ఏర్పడిన స్వభావమునకు వశపడియున్నది. అందువలన స్వాతంత్ర్యమును కోలుపోవుచున్నది. అస్మత్పద లక్ష్యార్థమైన పరిశుద్ధాత్మ తనయందలి త్రిగుణాత్మకయైన మాయ నవలంబించి అస్వతంత్రమైన యీసమస్త భూతజాలమును మరల మరల సృజించుచున్నది. (ఈసృష్టి కార్యమునకు ప్రకృతి మాత్రమే కర్తయగుచున్నది. పరిశుద్ధాత్మ కర్తకాదు )

మూ॥ నచ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ।
ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు॥ 9.

తా॥ ఓధనంజయా! అట్టిభూతసర్గాది కర్మలయందు ఆసక్తిఁ జెందనట్టియు, ఏదియు కాబట్టనియట్లు తాటస్థ్యభావమున నుండునట్టియు అస్మత్పదలక్ష్యార్థమైన పరిశుద్ధాత్మను ఆకర్మలు బంధింపజాలవు. త్రిగుణాత్మకయైన పరాప్రకృతిచే జేయబడినకర్మకు త్రిగుణాతీతమైన భగవత్తత్త్వము కర్తయు, భోక్తయు కాదని భావము.

మూ॥ మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్।
హేతునానేన కౌంతేయ! జగద్విపరివర్తతే॥ 10.

తా॥ అర్జునా! సకలలోకములకు దివ్యచక్షువైన నేననెడు భగవత్తత్త్వముయొక్క సాన్నిధ్యముచేత ప్రకృతి చరాచరములతోఁ గూడిన సర్వప్రపంచమును సంభవింపఁజేయుచున్నది. ఆకారణముచేత జగత్తు విపరీతముగ వర్తించుచున్నది.

శ్లో॥ ఆదిత్యసన్నిధౌలోకశ్చేష్టతే స్వయమేవ తు।
తథా మత్సన్నిధావేవ సమస్తం చేష్టతే జగత్॥

సూర్యునిసన్నిధియందు లోకము తనకుదానే సర్వచేష్టలు చేయుచున్నది. అదేవిధముగా దేహేంద్రియాది ప్రపంచమంతయు నాసన్నిధియందే సర్వచేష్టలు చేయుచున్నది. (వరాహోపనిషత్తు 3-14)

మూ॥ అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్।
పరం భావమజానంతో మమ భూతమహేశ్వరమ్॥ 11.

తా॥ అస్మత్పద లక్ష్యార్థమైన పరిశుద్ధాత్మ తత్త్వముయొక్క ఉత్తమమైన భావమిట్టిదని యెఱుగజాలని అవివేకులు మందమతులు మనుష్యశరీము నవలంబించియుండునట్టియు, సర్వభూతములకు (అంతర్యామి) ఈశ్వర స్వరూపమైయుండునట్టియు నేననెడు ఆభగవత్తత్త్వము నవజ్ఞసేయుచున్నారు.

శ్లో॥ అహం సర్వేషు భూతేషు భూతాత్మావస్థితస్సదా।
తమవజ్ఞాయ మాం మర్త్యః కురుతేఽర్చావిడంబనమ్॥

సర్వభూతములయందు నేనని చెప్పబడు పరిశుద్ధాత్మ యెల్లప్పుడును భూతభావము వహించియుండును. అట్టి స్వస్వరూపమును మానవుడు అవమానించుచున్నాడు. విగ్రహపూజలతో వ్యర్థముగ కాలము వెళ్లబుచ్చుచున్నాడు. (భాగవతము 3 స్కం. 29 అ. 22 శ్లో)

శ్లో॥ యో మాం సర్వేషు భూతేషు సంతమాత్మాన మీశ్వరమ్।
హిత్వార్చాం భజతే మౌఢ్యాద్భస్మన్యేవ జుహోతి సః॥

సమస్తభూతములయందు నేను నేనని పేర్కొనబడుచుండు పరమేశ్వర తత్త్వమును వదలివేసి ఎవడైతే అవివేకమువలన దృశ్యములైన విగ్రహములను సేవించుచున్నాడో అట్టివాడు బూడిదయందు వేల్చినవాడే యగును. (భాగవతము 3 స్కం. 29 అ. 23 శ్లోకము)

శ్లో॥ ద్విషతః పరకాయే మాం మానినో భిన్నదర్శినః
భూతేషు బద్ధవైరస్య నమనశ్శాంతిమృచ్ఛతి॥

ఈ శరీరమే నే నని భావించి గర్వితుడైన వివేకశూన్యుడు పరుల శరీరమునందు నేనని చెప్పబడు ఆత్మను తనకంటె వేఱైన దానినిగ జూచు

చున్నాడు. ఇతర భూతములయెడ అప్రియుడగుచున్నాడు. అట్టివాని మనస్సు శాంతిపొందదు. ( భాగవతము 3 స్కం, 29 అ 24 శ్లో. )

సర్వభూతములయందలి చైతన్యమంతయు తానేయై నప్పుడు తనకంటె వేఱైన చైతన్యవస్తు వింకొకటి లేనప్పుడు లోకములో ఎవనిచే నెవడు అవమానింపబడినను అవమానించినవాడు, అవమానింపబడినవాడు అంతరంగిక దృష్టియందు అంతయు నొకడే కావలసివచ్చును అందువలన తనచేతనె తాను అవమానింపబడినవాడు కావలసివచ్చును. కాబట్టి అవమానించితి ననుకొనువాడు అవమానింపబడితి ననుకొనువాడు ఈ యిద్దఱు కూడ అవివేకులు కావలసివచ్చును.

మూ॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః॥
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః॥

తా॥ పూర్వశ్లోకమురీతిగా భగవత్తత్త్వము నవజ్ఞసేయు మూఢాత్ములు మోక్షమార్గమునకువ్యతిరిక్తమైనట్టియు, ఆత్మపూజాభాగులైన ముముక్షువులచే నిరసింపబడినట్టియు, మృత్యురూపమైనట్టియు, మోహకారణమైనట్టియు, రాక్షస స్వభావమునే అవలంబించుచున్నారు. వీరియాశ విఫలమగుచున్నది. వీరి క్రియలు నిరర్థకములగుచున్నవి. వీరి చిత్తము విపరీతముగ మాఱుచున్నది.

మూ॥ మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః॥
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్॥ 13.

తా॥ అర్జునా! దేవస్వభావమును అవలంబించిన మహాత్ములైతేనో అస్మత్పదలక్ష్యార్థమైన భగవత్తత్త్వమును సమస్తభూతములకంటె మొట్టమొదటిదానినిగాను, నాశరహితమైనదానినిగాను తెలిసికొని మనస్సును వేఱుమార్గమున పోనీయక తమవశములో నిలుపుకొని ఆభగవత్తత్త్వమును సేవించుచున్నారు.

మూ॥ సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః।
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥ 14,

తా॥ అంతర్వీధియందు నేనని పేర్కొనబడిన పరిశుద్ధాత్మను నిరంతరము కీర్తించువారు, ఆభగవత్తత్త్వమును పొందుటకు ప్రయత్నము చేయువారు, శమదమాది సుగుణములయందు చలింపని వ్రతానుష్ఠానము కలవారు, తమలో చిత్కళారూపమైన నేననెడు భగవత్తత్త్వమును గూర్చి భక్తితో మ్రొక్కువారు, నియతమైన అభ్యాసయోగము సేయువారు వీరందఱు ఆపరిశుద్ధాత్మ తత్త్వమును ఉపాసించుచున్నారు.

మూ॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్॥ 15.

తా॥ (జ్ఞానయజ్ఞమును గుఱించిన యంశమంతయు భీష్మపర్వము 28 అధ్యాయములో 23 శ్లో. మొదలు 33 శ్లో. వఱకు వ్రాయబడినది.) అట్టిజ్ఞానయజ్ఞముచేత భగవతత్త్వమునర్చించు మఱికొందఱు జ్ఞానయోగులు సర్వరూపములుతానై సర్వత్ర నేనని పేర్కొనబడు అభగవత్తత్త్వము నంతటిని అంతరంగికదృష్టిచేత ఒకటేరూపముగాను, నానారూపములుగాను బహు ప్రకారముల ఉపాసించుచున్నారు. (ఇచట అద్వైతమతము, ద్వైతమతము వెల్లడింపబడినవి )

మూ॥ అహంక్రతు రహంయజ్ఞస్స్వధాహమహమౌషధమ్।
మంత్రోఽహమహమేవాజ్యమహమగ్నిరహంహుతమ్॥ 16

తా॥ బాహ్యేంద్రియములతో జేయబడు క్రియారూపమైన కాయికపూజ నేను, అంతరంగమున జేయబడు నిష్క్రియారూపమైన మానసికపూజ నేను, బలిప్రదానమునందు జేయబడు వాచికపూజనేను, నైవేద్యాన్నము నేను, మంత్రము నేను, నేయి నేను, అగ్నిహోత్రము నేను, అగ్నిహోత్రములో వేల్వబడు వస్తువునేను, (నేననగా సర్వభూతాత్మయైనపరమాత్మ. 28 అధ్యాయము 24 శ్లోకములోసైతమిట్టిభావము సూచింపబడియుండెను.)

మూ॥ పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః।
వేద్యం పవిత్రమోంకార ఋక్సామ యజురేవచ॥ 17.

తా॥ అస్మత్పద లక్ష్యార్థమైన పరిశుద్ధాత్మ యీజగత్తునకు తండ్రి. "పా రక్షణే" అనుసూత్రమువలన సంరక్షణకర్త యనియు గొందఱందురు. మఱియు, "మా మానే వర్తనేచ" అనుసూత్రమువలన సమస్తమైన జగత్తును తనగర్భమున వర్తింపజేయు మాతృస్వరూపము పరిశుద్ధాత్మ. ఇంకను చరాచరరూపమైన యీవిశ్వమును ధరించునది. తండ్రులకు దండ్రియైనది. జిజ్ఞాసువులచే దెలియఁబడదగినది. పవిత్రమైనది. ప్రణవనాదస్వరూపమైనది. ఋగ్వేదము, సామవేదము, యజుర్వేదము తానేయైనది. ఆ పరిశుద్ధాత్మ.

ఓం తత్. సత్.

# శత పత్రము
# 102

మూ॥ గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్।
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్॥ 18.

తా॥ జీవులు పొందింపదగిన కర్మఫలము ఆపరిశుద్ధాత్మయే సర్వభూతములకు పోషణకర్త, ప్రభువు, మానసేంద్రియ వృత్తులను జూచు ఉపద్రష్ట ఆపరమాత్మయే. సర్వభూతములకు నివాసస్థానము, ఆశ్రయింప దగినది, ప్రతిఫలము గోరక హితముఁగూర్చునది. అంతయు నేననెడు పరిశుద్ధాత్మయే జగత్తుయొక్క ఉత్పత్తి స్థితి లయములు, ఉత్పత్తికి గారణము, పరమార్థ స్వరూపమైన నిక్షేపము, ఎన్నడును క్షీణముకానిది ఆపరమాత్మయే. (తనకంటె అన్యములేని అంతర్యామితత్త్వమని భావము )

మూ॥ తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ।
అమృతంచైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున॥ 19.

తా॥ అర్జునా! నేను (సూర్యస్వరూపుడనై) లోకమును తపింపజేయుచున్నాడను. కిరణములచే జలము నాకర్షించుచున్నాడను. వర్షము కురిపించుచున్నాడను. అమృతము, మృత్యువు, సత్తు, అసత్తు అంతయు నేనే.

విశే॥ జగత్స్వరూపమైన స్థూల శరీరమునందు నేననెడు పరిశుద్ధాత్మయున్నంతకాలము దేహమునకు వెచ్చదనము కలిగించుచున్నది. విషయానంద వర్షమును నిలువరించుచున్నది. యోగీశ్వరులయందు బ్రహ్మానందమును వర్షించుచున్నది. మఱియు దైవప్రకృతి నవలంబించిన వారికి అమృతస్వరూపముగాను, శాశ్వతముగాను దోచుచున్నది. రాక్షసప్రకృతి నవలంబించిన వారికి మృత్యుస్వరూపముగాను, అశాశ్వతముగాను దోచుచున్నది.

మూ॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్॥ 20.

తా॥ త్రైవిద్యులు (ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, తెలిసినవారు) సోమరసమనెడు ఒకవిధమైన పానీయమును తయారు చేసికొని త్రాగి దానిచేతనే పాపములను కడిగివేసికొనిన భూలోక వైదికస్వాములు జంతుబలి సంకలితములైన నానాయజ్ఞములచేత నన్ను (వ్యక్తరూపుడైన ఉపేంద్రుని) పూజించి స్వర్గము కావలయునని యాచించుచున్నారు. అట్టి యాజకస్వాములు శుభప్రదమైన దేవతల లోకముజేరి ఆ దేవలోకములో దేవతలనుభవింపఁగిన దివ్యములైన భోగముల ననుభవించుచున్నారు.

వివ॥ ఇరువదియేడవ అధ్యాయము పదునాల్గవ శ్లోకములో "యజ్ఞః కర్మసముద్భవః" అని చెప్పుటచే అయధ్యాయములోఁ జెప్పబడినవి భౌతిక కర్మయజ్ఞములనియు, 28 అధ్యాయములోఁ జెప్పబడినవి జ్ఞానయజ్ఞములనియు కొందఱందురు. ఆధ్యాత్మిక గ్రంథములో వర్ణింపబడినవన్నియు జ్ఞానయజ్ఞములే యుండునని మఱకొందఱందురు. ఇప్పుడు చదువుచున్న యధ్యాయములో 15వ శ్లోకమునందు "జ్ఞానయజ్ఞేన" అనుటవలన ఇచ్చట జెప్పబడినవికూడ జ్ఞానయజ్ఞములే కావచ్చుననియు జెప్పుదురు. కాని 20-21 వ శ్లోకములవలన ఇవి వైదిక కర్మయజ్ఞములు కాఁగూడదాయని అనేకులు సంశయింతురు.

ఉపనిషత్తులు, గీతలు, బ్రహ్మసూత్రములు శాస్త్రరీతిగ దెలిసినవారు త్రైవిద్యులు. అనుభవ జ్ఞానములోజేరిన బ్రహ్మవిద్య అన్నిశాస్త్రములలోను ఒకటేయుండునుకాని అనుభవములేని శాస్త్రవిద్య లనేకములుండును. కాబట్టి అనుభవములేని శాస్త్రవాదులు త్రైవిద్యులని తెలియవలయును.

"అవతి సర్వభూతానీత్యోమా, అవరక్షణే" అను సూత్రమువలన జీవరక్షణశక్తికి "ఉమ" యనిపేరు. ఈశక్తితోగూడిన ప్రణవ (శబ్ద) బ్రహ్మకు "సోమః" అనిపేరు. ఈశబ్దబ్రహ్మము నాస్వాదించు సగుణోపాసకులకు

"సోమపాః" అనిపేరు. ఇట్టిసోమపాన నిరతుల పాపములు కడిగివేయ బడు ననుట సమంజసమే. ఐనను సగుణోపాసకులకు నాకంబె అన్యము లేదనెడు అపరోక్షజ్ఞానము కలుగదు. కనుక వీరి కోరికలు నశింపవు.

"ప్రాపణాత్సర్వకామానాం పరిత్యాగో విశిష్యతే"

కోరికలను కొనసాగించుటకంటె సమస్తమైన కోరికలను వదలిచేయుట మంచిది. (మంకిగీత 17శ్లో) అనుభావము వీరికుండదు. అందువలన యజ్ఞములచేత భగవత్తత్త్వమును పూజించుచున్నారు. స్వర్గము కావలయునని అర్థించుచున్నారు.

శ్లో॥ న మోక్షో నభసః పృష్ఠే నపాతాలే నభూతలే।
సర్వాశా సంక్షయే చేతః క్షయో మోక్ష ఇతీష్యతే॥

మోక్షమనునది ఆకాశముమీదలేదు. పాతాళమునలేదు. భూమియందు లేదు. సమస్తమైన ఆశ క్షీణింపగా చిత్తము శమించుటే మోక్షము అని చెప్ప బడుచున్నది. (అన్నపూర్ణోపనిషత్తు 2అ 2శ్లో)

ఇట్లు నిత్యశుభప్రతిపాదకమైన సుఖస్థానము తమవశములోనే యున్న దను రహస్యము తెలియని త్రైవిద్యస్వాములు ఏలోకములోనో ఎవరియధీన ములోనో స్వర్గమనెడు సుఖస్థానమొకటియున్నదనియు, దానిని తమకిప్పించు వారుకూడ మఱియెవరో యున్నారనియు నమ్ముచున్నారు. పురాణములలోఁ గనబడు దేవతలను ప్రార్థించుచున్నారు.

అభ్యాసయోగమునందు శిష్యులకు చూపునిలుచుటకై లక్ష్యముగ గురువులొక గుఱుతుపెట్టుదురు. "ముదంరాతితిముద్రా, రాదానే" అను సూత్రమువలన శిష్యులకు సంతోషమునిచ్చు ఈగుర్తునకు "ముద్ర" యని పేరు. ఈముద్రతోగూడిన స్థానము సముద్రము. వీరీ చిన్ముద్ర నాధారము చేసికొని బ్రహ్మవిద్యాపయోధిని త్రచ్చఁగాఁద్రచ్చగా జరామరణములంటని బోధామృతము లభించుచున్నది. ఇట్టి యమృతమును సంపాదించినవారు సురలు.

"సుర ఐశ్వర్యే" అను సూత్రమువలన అభ్యాసయోగముచేసి అష్టై శ్వర్యములను పొందినవారుసురలు "సుష్ఠురాజంత ఇతిసురాః రాజ్యదీప్తౌ"

అను సూత్రమువలన బ్రహ్మనిష్ఠచేసి మంచిప్రకాశమును పొందినవారు సురలు. "భక్తైర్దత్తం సుష్ఠురాంతి గృహ్ణంతీతి సురాః, రాఆదానే" అను సూత్రమువలన భక్తులచే సమర్పింపబడు ఆహారాది వస్తువులను, అర్ఘ్యములను బాగుగ స్వీకరించువారు సురలు. "శుభం రాంతి బ్రువంతీతి సురాః రైశబ్దే" అనుసూత్రమువలన నిత్యశుభప్రతిపాదకములైన జ్ఞానవాక్యములను భాషించువారలు సురలు. "సుష్ఠువాంఛితం రాంతి దదతిభక్తానామితిసురాః రాదానే" అనుసూత్రమువలన తమ్ము సేవించు శిష్యులకు వాంఛితార్థముల నిచ్చువారు సురలు ఈమహాత్ములేస్థానమున సుఖమును పొందుచున్నారో ఆ స్థానమునకు స్వర్గమనిపేరు. సుఖముతప్ప వేఱొకటి లేని స్థానమున వీరు సర్వదానివసించుటచే నాకౌకసులనియుపిలువబడుదురు. వీరికి సుఖస్థానము నియతమైయుండును. త్రైవిద్యస్వాములు సైతము సుఖస్థానమును పొందుచున్నారు. కాని సగుణోపాసకు లీస్థానమున స్థిరముగ నుండుటకు వీలుపడదు.

మూ॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి
ఏవం త్రయీధర్మమనుప్రపన్నా గతాగతం కామకామా లభంతే॥21.

తా॥ సగుణోపాసకులైన ఆ త్రైవిద్యస్వాములు విశాలమైన ఆస్వర్గమున ఇంద్రియగోచరమైన భోగసముదాయమును అనుభవించిన పిమ్మట వారి శుభకర్మ క్షీణించిపోగా మరణము నిశ్చితమైయుండు మనుష్యలోకమున మరల ప్రవేసించుచున్నారు ఈవిధముగా కామ్యార్థముల వాంఛించు వైదికస్వాము లందఱు ఇటనుండి పోవుచున్నారు. మఱలి యిక్కడికేవచ్చుచున్నారు. ఇంతకెక్కువ స్వాతంత్ర్యము వీరికి లేదన్నమాట. (ఈగ్రంథములో వైదికకర్మను సమర్థించుటకు తావులేదని యిందువలన తెలియుచున్నది.)

శ్లో॥ కృతం మయాధికం పుణ్యం యజ్ఞదానాది నిశ్చితమ్॥
స్వర్గం గత్వాసుఖం భోక్ష్య ఇతి సంకల్పవాన్ భవేత్।
తథైవాధ్యాసతస్తత్ర చిరం భుక్త్వా సుఖం మహత్।
క్షీణపుణ్యః పతత్యర్వాగనిచ్ఛన్ కర్మచోదితః॥

యజ్ఞము, దానము మొదలైన అధికమగుపుణ్యము నాచే జేయబడినది. స్వర్గముజేరి నిశ్చితమైన సుఖమనుభవింపగలనని సంకల్పముగలవాడగు చున్నాడు. అదేవిధముగా అధ్యాసవలన అస్వర్గమునందు గొప్పసుఖమును చాలకాలమనుభవించి పుణ్యము క్షీణించిన మీదట తనకిష్టము లేకున్నను కర్మచోదితుడై దిగువ పడిపోవుచున్నాడు. (అధ్యా. కిష్కి. 8 స 18-19శ్లో)

"జ్ఞానం విశిష్టం న తథా హి యజ్ఞా జ్ఞానేన దుర్గం తరతే నయజ్ఞైః"
యజ్ఞైస్తపోభిర్నియమైర్వ్రతైశ్చదివం సమాసాద్య పతంతి భూమౌ"

జ్ఞానయోగముచేత (యతీశ్వరుఁడు) సంసృతిని దాటుచున్నాడు. యజ్ఞములచేత దాటజాలడు. (అందువలన) జ్ఞానముమేలైనది. యజ్ఞము లట్టివి కావుకదా? యజ్ఞములచేత. తపస్సులచేత, నియమములచేత, వ్రత ములచేత స్వర్గముచేరి (మరల) భూలోకమున పడిపోవుచున్నారు.

(భారత. శాంతి. 319, అ. 107-108 శ్లో)

మూ॥ అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥ 22.

తా॥ అంతర్వీధియందు ప్రకాశించునట్టి నేననెడు పరిశుద్ధాత్మకంటె వేఱొకదైవము మఱెందును లేనేలేదన్న నిశ్చయజ్ఞానము కలవారై ఆ పర మాత్మనే తలచుచు ఏజనులైతే మిక్కిలిగ ఉపాసించుచున్నారో అట్టినియత మైన అభ్యాసయోగముతో గూడిన ఆయతీశ్వరులయొక్క ఆత్మానుసంధాన క్రియయందు అమంగళము పుట్టకుండ అస్మత్పద లక్ష్యార్థమైన ఆ పరిశుద్ధా త్మయే చూపెట్టి యుండును.

శ్లో॥ అసదేవ గుణం సర్వం సన్మాత్రమహమేవ హి
స్వాత్మమంత్రం సదా పశ్యేత్స్వాత్మమంత్రం సదాభ్యసేత్॥

గుణముతో గూడిన దేదికలదో అదియంతయు అశాశ్వతమైనదే. శాశ్వత మైనది నేననెడు పరిశుద్ధాత్మ మాత్రమేకదా? (కనుక) స్వస్వరూపమును జపించుమంత్రమును సర్వదా చూడవలయును. స్వస్వరూప మంత్రమును సర్వదా అభ్యాసము చేయవలయును. (తేజోబిందూపనిషత్తు 3-59)

మూ॥ యేఽప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః।
తేఽపి మామేవ కౌంతేయ! యజంత్యవిధిపూర్వకమ్॥ 23.

తా॥ అర్జునా! అంతర్యామి స్వరూపమున ప్రకాశించు నేననెడు భగవత్తత్త్వమును గుర్తింపక దానికంటె వేఱైన యితర క్షుద్రదేవతలను ఏభక్తులైతే శ్రద్ధతో గూడినవారై పూజించుచున్నారో అట్టి భక్తులుకూడ నేననెడు భగవత్తత్త్వమునే పూజించినవారగుదురు. సర్వవస్తువులయందు నేననెడు అంతర్యామి తత్త్వము ఉండనేయున్నది అందువలన ఏవస్తువును పూజించినను తన్ను పూజించినట్లేయగును. కాని ఆభక్తులు అంతరాత్మను లక్షింపక బాహ్యరూపమునే లక్షించి దానినే దేవుడనుకొనుచు పూజించుచున్నారు. కనుక ఆపూజ విధ్యుక్తమైనదికాదు. దానిచేతనే నిత్యశుభము సిద్ధాంతముకాదు.

మూ॥ అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ।
నతు మామభిజానంతి తత్త్వేనతశ్చ్యవంతి తే॥ 24.

తా॥ నేనని పేర్కొనబడిన అంతర్యామి తత్త్వము మానసేంద్రియములద్వారా వ్యాపించి శరీరావయవములతో జేయించుచుండ సమస్తకార్యములు సాగుచున్నవి. అంతర్యామి తత్త్వము వికటించినప్పుడు శుష్కకళేబరముతో ఒక్కటియు నెఱవేఱదు. కాబట్టి సమస్తపూజలను అనుభవించునది, పాలించునది నేననెడు అంతర్యామితత్త్వమేకదా? సర్వభూతాత్మయైన నేననెడు స్వరూపమును పైజెప్పబడిన త్రైవిద్యస్వాములు తత్త్వజ్ఞానముచేత బాగుగ తెలిసికొనలేకున్నారు అందువలన పూజాఫలమును పొందదగిన స్థానమునుండి పతితులగుచున్నారు

మూ॥ యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః।
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్॥ 25,

తత్త్వజ్ఞానములేని త్రైవిద్యస్వాములలో దేవతలను పూజించు నియమము కలవారు దేవతలజేరుచున్నారు. పితరులబూజించు నియమముగలవారు పితరులజేరుచున్నారు. భూతముల పూజించువారు భూతములజేరుచున్నారు, ఇక సర్వాంతర్యామియైన నేననెడు పరిశుద్ధాత్మను గుర్తించి పూజించు తత్త్వజ్ఞానులు పరిశుద్ధాత్మను పొందుచున్నారు.

మూ॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః॥ 26.

తా॥ 1. తపస్వి జనులలోఁ గొందఱు కొన్నిచెట్ల ఆకులు తిను నియమము కలిగియుందురు. మఱికొందఱు కొన్నిరకముల పుష్పములను ఆహారము గొనుచుందురు. ఇకగొందఱు ఫలముల భుజించు నియమము కలిగియుందురు. సస్యములయందు ఫలించినదంతయు ఫలమేకనుక ధాన్యములు, దుంపలుకూడ ఫలముక్రిందనే చేర్పబడును. వేఱొకకొందఱు జలమునే భక్షించి తపస్సుచేయుచుందురు. వీరందఱు చిత్తోపశమము కలవారేయని చెప్పవచ్చును. ఎవరేవస్తువును భుజింపనున్నను అవస్తువును తమయందు ప్రకాశించు నేననెడు పరిశుద్ధాత్మకు అర్పించుచున్నామని నిర్మలమైన భక్తి భావముతో నివేదించుచున్నారు. భక్తిచే సంగ్రహింపబడి చక్కని చిత్తోపశమముగల వానివలన అర్పింపబడిన పైవస్తువులను నేననెడు అపరిశుద్ధాత్మ అహరించుచున్నది.

ఏయేశరీరములలో "నేను" ఉన్నదో ఆశరీరములయందు ఆహారము సంగ్రహించుట, ఆస్వాదించుటయున్నది. "నేను" లేని శరీరములయందు అర్పించుటయులేదు. ఆస్వాదించుటయులేదు. కనుక నేను భుజింతును. అనిచెప్పబడినది.

2. దేహధారియైన జీవుని విషయవ్యాపారములకు సాగించుకొనిపోవు కర్మేంద్రియ సముదాయము పత్రమనబడును. విషయస్పర్శచే వికసించు జ్ఞానేంద్రియ సముదాయము పుష్పమనబడును. విషయచింతనముచేతను, కామక్రోధాదులచేతను కొట్టబడి విశీర్ణమగు అంతఃకరణము ఫలమనబడును. దేహమును సంతతము రక్షించు వాయుపంచకము తోయ మనబడును. ఈ నాలుగు వస్తువులను అంతర్యామియైన భగవత్తత్త్వమునకు ఎవడైతే భక్తితో సమర్పించుచున్నాడో మంచి మనోనియమముగల ఆ యోగీంద్రునివలన భక్తిచే సంగ్రహింపబడిన అంతఃకరణ పవనేంద్రియ సముదాయమును నేననెడు అంతర్యామి తత్త్వము ఆస్వాదించుచున్నది.

3. జీవతత్త్వమును ఊర్ధ్వకుండలి స్థానమునకు జేరవేయు హంస పత్రమనబడును. ఈ హంసకు సంచార స్థానములైన షట్కమలములు పుష్పములనబడును. నియమవంతుడైన యోగీశ్వరుడుచేయు కర్మయోగ

నిష్పత్తి ఫలమనబడును. ఈవస్తు సముదాయమును అంతర్యామియైన భగవ త్తత్త్వమునకు ఎవడైతే భక్తితో అర్పించుచున్నాడో నియతాత్ముడైన ఆయోగి వలన భక్తితో సంగ్రహింపబడిన ఆ యర్పణమును నేననెడు పరిశుద్ధాత్మ స్వీకరించును. (ఈశ్లోకము భాగవత 10స్కంధ. 81 అధ్యాయములో జూచి నట్టు జ్ఞాపకము.)

మూ॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్॥ 27.

తా॥ అర్జునా! నీవు ఏమేమి చేయుచుందువో, ఏమి భుజించుచుందు వో, అగ్నిహోత్రములయందు ఏమి వేల్చుచుందువో, అర్థుల కేమిచ్చుచుం దువో, ఏమి తపస్సు చేయుచుందువో ఆదియంతయు అంతర్యామియైన నేన నెడు భగవత్తత్త్వమునకు సమర్పణముగ జేయుము. (ఈశ్లోకము శివగీత 14 అధ్యాయములో కొంచెము పదభేదముతో చదివినట్టు జ్ఞాపకము )

శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మనా వా ప్రకృతేస్స్వభావాత్,
కరోమి యద్యత్సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి॥

శరీరముచేతను, వాక్కుచేతను, మానసేంద్రియములచేతను, బుద్ధి చేతను, అంతరాత్మచేతను ప్రకృతి స్వభావమువలన ఏమేమి చేయుచున్నా డనో అదియంతయు శ్రీనారాయణ పరమాత్మ కొఱకేయని సమర్పించుచు న్నాడను. (మహాభారతములో ప్రతిపర్వాంతము )

మూ॥ శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి॥ 28.

తా॥ ఇటుల భగవదర్పణముగ కర్మచేయుటవలన శుభాశుభములైన ఫలములచేత, కర్మబంధములచేత విడువబడుదువు. సన్న్యాసయోగముతో గూడుకొని ముక్తుడవై అస్మత్పదలక్ష్యార్థమైన పరిశుద్ధాత్మను పొందగలవు.

మూ॥ సమోఽహం సర్వభూతేషు నమేద్వేష్యోఽస్తి న ప్రియః।
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషుచాప్యహమ్॥ 29.

తా॥ అస్మత్పద లక్ష్యార్థమైన పరమాత్మ తత్త్వము సర్వభూతముల యందు సమముగ నున్నది. అటుల నేనని వాడఁబడు అంతరాత్మకు ఒక

డప్రియుడులేదు. తమలో చిత్కళాస్వరూపమైయుండు ఆయంతరాత్మను ఎవరైతే భక్తితో సేవించుచున్నారో అట్టివారాయంతరాత్మయందు సక్తులై యుందురు. ఆయంతరాత్మకూడ వారియందు సక్తమైయుండును.

శ్లో॥ ఆత్మాపిచాయం న మమ సర్వా వా పృథివీ మమ।
యథా మమ తథాన్యేషామితి పశ్యన్నముహ్యతి॥

భూమియంతయు నాయొక్కనిదేకాదు. సర్వభూతాత్మయైన పరమాత్మ సైతమునాయొక్కనిదేకాదు. నాకెట్లో యితరులకు నట్లేయని చూచుచుండు వాడు మోహమునకు లోబడడు. (ఈశ్లోకము భారత శాంతి 25 అధ్యాయమునందును, పింగళాగీతయందును కొంచెము వర్ణభేదముతో జూచినట్లు జ్ఞాపకము.)

శ్లో॥ నతేఽస్తి కశ్చిద్దయితో ద్వేష్యోవా పర ఏవచ
త్వన్మాయాపిహితాత్మానస్త్వాం పశ్యంతి తథావిధమ్॥

నీకు ప్రియమైనవాడులేడు, అప్రియమైనవాడు లేడు, పరాయివాడు లేడు. నీమాయచే కప్పబడినవారుమాత్రము అట్టిభేదములను పాటింతురు.
(అధ్యా. 8స్క. 6స. 71శ్లో.)

శ్లో॥ సాధవో హృదయో మహ్యం సాధూనాం హృదయం హ్యహమ్।
మదన్యం తే నజానంతి నాహంతేభ్యో మనాగపి॥

సాధువులు నాకు హృదయము, నేను సాధువులకు హృదయమై యున్నాడను. వారు నాకంటె అన్యమెఱుగరు. నేనుసైతము వారికంటె అన్యమొకించుకయు నెఱుగను. (భాగవత. 9 స్కం. 4 అ. 71 శ్లో.)

మూ॥ అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్।
సాధురేవ సమంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః॥ 30.

తా॥ ఇకను గేవలము దుష్కరమైన ఆచారము కలవాడైనను పృథగ్భావములేని భక్తి కలవాడై నేననెడు అంతర్యామి తత్త్వమును సేవించునేని అట్టివాడు సాధుపురుషుడేయని తలపబడదగినవాడు. (ఎందుకనగా) అతడు లెస్సగ స్థిరపరుపబడిన బుద్ధికలవాడుకదా? (ఈశ్లోకము శివగీత 12 అధ్యాయములో చూడనగును.)

వివ॥ తనకంటె అన్యములేదన్న భావము గుణకర్మాదుల కతీతమైనది. అట్టిభావము కలిగినప్పుడే బుద్ధి స్థిరపడుచున్నది. ఈస్థితి పొందినవాడు సదాచారములకు, దురాచారములకు విలక్షణుడని చెప్పవలయును. ఇట్టి వాడే సాధుపురుషుడని తలపబడును. ఇట్లుండగా దురాచారము కలవాడు సాధుపురుషుడుగ దలపబడుట యెట్లులని కొందఱు సంశయింతురు. అటు గాక పూర్వము దుష్టవర్తనుడైనను తత్త్వజ్ఞానము కలిగినపిమ్మట సద్వర్తను డగుటచే సాధుపురుషుడు కావచ్చునేమోయని కొందఱు తలతురు. ఇదిసరి యైన సమాధానమగునేని ఇప్పుడు లోకములో గనబడు వేదాంతస్వాముల లో నూటికి నూఱుమంది తెలుక దురాచారమునందున్నవారు, నిదానముగా సదాచారమునకు రాదలచుకొన్నవారు అని చెప్పవలసివచ్చును. అట్లైన పైశ్లోకమువలన ఇపుడు క్రొత్తగ దెలిసికొనిన విశేషమేమి? అని యికగొంద అడుగుచున్నారు.

"సుష్ఠు దుష్కరే కర్మణి అసమంతాత్ చరతీతి సుదురాచారః, చర గతి భక్షణయోః" అను సూత్రమువలన కేవలము సుఖముగ ఆచరించు టకు శక్యముకాని కర్మనెవడాచరించుచున్నాడో అట్టివానికి "సుదురాచారః" అనిపేరు. అంతేకాక సుఖముగ లభింపరానిది దుర్లభము సుఖముగ ఘటిం చుటకు శక్యముకానిది దుర్ఘటము, సుఖముగ భరించుటకు శక్యముకానిది దుర్భరము, సుఖముగ జయించుటకుశక్యముకానిది దుర్జయము, సుఖముగ ఛేదించుటకు శక్యముకానిదిదుర్భేద్యము, సుఖముగసాధించుటకు శక్యము కానిది దుస్సాధ్యము. సుఖముగ తరించుటకుశక్యముకానిది దుస్తరము. ఇట్లే సుఖముగ ఆచరించుటకుశక్యము కానిది 'దురాచారము' అనగా విశేషప్రయత్న ముతోశ్రమపడిసాధించువానికిమాత్రమే ఆచరించుటకుశక్యమనియిందువలన దెలియపగియున్నది. 'దుష్కరం నిష్ప్రతి ద్వంద్వం చికీర్షన్ కర్మవానరః' సుఖ ముగజేయుటకు శక్యముకానట్టియు, సాటిలేనట్టియు కార్యముచేయుదలచిన అంజనేయుడు (రామా.సుం.1స 2శ్లో) అని వాల్మీకిచెప్పెను ఇచట 'దుష్కరం కర్మ" అనగా చెడ్డకార్యమని అర్థము తేలదు. కనుక "సుదురాచారః" అనగా నింద్యమైన ఆచారము కలవాడని చెప్పరాదు కేవలము కష్టముతో సాధింపదగిన అభ్యాసయోగము నాచరించువాడని చెప్పవలయును.

"సాధ్నోతి శుభమితిసాధుః, రాధసాధ సంసిద్ధౌ" అనుసూత్రమువలన పై విధముగ కష్టతరమైన అభ్యాసయోగ కర్మ నాచరించి స్థిరచిత్తుడై నిత్య శుభమును సాధించువాడు సాధువని చెప్పబడును.

మూ॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి॥ 31.

తా॥ అర్జునా! పైరీతిగా కష్టతరమైన బ్రహ్మవిద్యయను స్వధర్మమును సాధించిన యతీశ్వరుడు త్వరలో ధర్మస్వరూపు డగుచున్నాడు. నియతమైన చిత్తోపశమమును లెస్సగ పొందుచున్నాడు. 'అస్మత్పదలక్ష్యార్థమైన పరిశుద్ధాత్మను భజించువాడు నశింపడు" అని ప్రతిజ్ఞసేయుము.

మూ॥ మాంహి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్॥ 32

తా॥ "పాపాదవశ్యం నరకం ప్రయాతి పునర్దరిద్రః పునరేవపాపీ" పాపమువలన తప్పక నరకమును పొందుచున్నాడు. మరల దరిద్రుడై, మరల పాపాత్ముడే యగుచున్నాడు అను శాస్త్రోక్తినిబట్టి పాపాత్ములంపటు తఱుచు దరిద్రులే యగుచుందురు. ఈపాపిష్ఠుల కడుపున పుట్టి పెరిగిన వారు గర్భదరిద్రులగుదురు. కనుక శుభప్రదమైన కర్మచేయుటకు వీరి కవకాశముచిక్కుట దుర్లభము. స్త్రీలు సామాన్యముగ నందఱు పతులవశమున జరింపదగినవారు, అస్వతంత్రులు అని కడచిన ప్రపంచ చరిత్రమునుబట్టి చెప్పదగియున్నది అందువల్ల పతి యనుమతిలేనిదే యెట్టిశుభకర్మ సేయుటకును వీరికవకాశముండదని యెఱుగుదుము

నిరంతరము ఏదోయొక వ్యాపారప్రవృత్తిలో ప్రవేశించియుండు మనవైశ్య సోదరులకుసైతము శుభకర్మానుష్ఠానము నందవకాశము తక్కువయనియే యిప్పటి లోకానుభవమునుబట్టి తెలియదగియున్నది. స్వతంత్రమైన జీవన వృత్తి సంపాదించుకొనలేక పరులయొద్ద సేవకులుగనో, బానిసలుగనోచేరి పని చేయుచు విశేషించి కాయక్లేశములకు, మనఃక్లేశములకు గుఱియగుచుండు శూద్రజనులకు శుభకర్మయందు స్వాతంత్ర్య ముండదని యెల్లరకు దెలిసియుండును.

అర్జునా! ఎవరైతే పాపయోనిసంభూతులు, స్త్రీలు, వైశ్యులు, శూద్రులు అగుదురో అట్టివారుకూడ తమలో చిత్కళాస్వరూపమైన నేననెడు పరిశుద్ధాత్మను విశేషముగ ఆశ్రయించి యుత్తమగతిని పొందుచున్నారు. (ఈశ్లోకము అనుగీత 4 అధ్యాయములో కొంచెము వర్ణభేదముతో జెప్పబడినది.)

మూ॥ కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా।
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వమామ్॥ 33

తత్త్వజ్ఞానుల గర్భమున బుట్టినవారు, సహజమైన బ్రహ్మనిష్ఠగలవారు బ్రాహ్మణులు. పూర్వసుకృతముతో గూడుకొని జన్మించినవారు పుణ్యులు. సర్వభూతాత్మయైన పరిశుద్ధాత్మను భజించువారు భక్తులు. విరతిస్థానమును పొందినవారిలో శ్రేష్ఠులు రాజర్షులు ఇట్టివారికెల్లరకు శుభ ప్రతిపాదకమైన కర్మ సేయుటకు మంచియవకాశముండును. పూర్వశ్లోకమురీతిగా పాపయోని సంభవులే. అంతర్యామి తత్త్వమునాశ్రయించి శుభము జెందగలరని చెప్పుచుండగా సహజముగ పుణ్యమూర్తులైన వీరిమాట యిక నేమనవలయును? ఈలోకము అశాశ్వతమైనది, సౌఖ్యహీనమైనది. (కనుక నీవు) అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వమునుజేరి భజింపుము.

మూ॥ మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః 34

తా॥ అంతర్హృదయమందు నేననెడు పరమాత్మయందు మనస్సు నిలుపుము. ఆపరమాత్మనే సేవింపుము. పూజింపుము. నమస్కరింపుము అపరమాత్మయే యుత్తమగతియను భావముగలవాడవై యీవిధముగా ఆత్మానుసంధానముచేసి నేననెడు అంతర్యామి భగవత్తత్త్వమునే పొందగలవు.

"స ఆదినారాయణోఽహమేవ తస్మాన్మామేకం శరణం వ్రజ మద్భక్తినిష్ఠోభవ మదీయోపాసనాం కురు మామేవ ప్రాప్స్యసి మద్వ్యతిరిక్తం సర్వం బాధితమ్. మద్వ్యతిరిక్త మబాధితం న కించిదస్తి"

ఆ యాదినారాయణుడను నేనే. అందువలన నన్నొకనినే శరణొందుము. నాభక్తియందు నిల్చినవాడవుకమ్ము. నన్నుపాసింపుము. నన్నే పొంద

గలవు. నాకంటె వేఱైనదంతయు (కాలముచే) బాధింపబడునది. నాకంటె వేఱైనది కొంచెమైనను నిర్బాధకమైనదిలేదు.

(మహానారాయణోపనిషత్తు 8 అ)

ఇది శ్రీ మహాభారతము భీష్మపర్వములో రాజవిద్యారాజ గుహ్య యోగమను ముప్పదిమూడవ అధ్యాయము.

ఓం. తత్. సత్.

# శతపత్రము
# 103



## శ్రీ మహాభారతము భీష్మపర్వము 34 అధ్యాయము.

శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు:.

మూ॥ భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా॥ 1.

తా॥ అర్జునా! సంతుష్టచిత్తుడవగుచున్న నీకు మేలు చేయవలెనను కోరిక చేతనే మఱియు నేనేమి చెప్పబోవుచుంటినో అట్టి శ్రేష్ఠమైన నా మాట వినుము.

మూ॥ న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాంచ సర్వశః। 2.

తా॥ ప్రకృష్టమైన నా మొదటి యవతారముయొక్క యునికి సమస్త దేవతలెఱుగరు, మహర్షులెఱుగరు. దేవతలకు, మహర్షులకు సైతము సర్వ విధముల నేను మొదటివాడను కదా? (సర్వజీవులలో నేను నేనని వ్యవహ రింపబడు పరిశుద్ధాత్మ మొట్ట మొదటిదై యుండునని భావము.)

మూ॥ యో మామజమనాదించ వేత్తి లోకమహేశ్వరమ్।
అసంమూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే॥ 3.

తా॥ సర్వభూతములయందు నేనని వ్యవహరింపబడు పరిశుద్ధాత్మ చేతనే మానసేంద్రియములకు గోచరించు విశ్వమంతయు నియమింపబడు చున్నది. అట్టి పరిశుద్ధాత్మ యెప్పుడును జన్మించునది కాదు దానికంటె మొదటిది మఱేదియులేదు. ఆపరిశుద్ధాత్మను ఎవడైతే తెలిసికొనుచున్నాడో మానవులలో మిగుల వివేకశాలియైన ఆయోగీశ్వరుడు సమస్త పాపములచే విడువబడుచున్నాడు.

మూ॥ బుద్ధిర్జ్ఞానమసంమోహః క్షమా సత్యం దమశ్శమః।
సుఖం దుఃఖం భవోఽభావో భయంచాభయమేవచ॥ 4,
అహింసా సమతా తుష్టిస్తపో దానం యశోఽయశః।
భవంతిభావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః॥ 5.

తా॥ బుద్ధి, జ్ఞానము, వివేకము (మతిప్రకాశము), ఓర్పు, సత్యము, బాహ్యేంద్రియ నిగ్రహము, అంతరింద్రియ నిగ్రహము, సుఖదుఃఖములు, భవనాశములు, భయాభయములు, అహింస, సర్వసమత్వము, సంతుష్టి, తపస్సు, దానము. కీర్తి, అపకీర్తి అను వేఱు వేఱు భావములు జీవులకు అస్మత్పద లక్ష్యార్థమైన పరమాత్మ వలననే కలుగుచున్నవి. ఆత్మయున్నంత సేపు (శరీరాత్మలకు సంయోగమున్నంతసేపు) శరీరమునందు పృథగ్భావము లన్నియు వ్యక్తములగుచున్నవి. కనుక ఈభావములన్నియు ఆత్మవలననే కలిగినవని చెప్పబడినది. (ఐనను పరిశుద్ధాత్మయిందుకు కర్తకాదనియు, పరాప్రకృతియే కారణమనియు ఇదివఱకు చెప్పబడియుండెను)

మూ॥ మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవస్తథా।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః॥ 6.

తా॥ లోకము, ఈప్రజలు ఎవరివారో అట్టి మానసిక జన్మగాంచిన మహర్షు లేడువురు, పూర్వీకులు నలువురు, అదేవిధముగ మనువులు వీరంద ఱు అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వముయొక్క భావముకలవారు.

వివ॥ "పూర్వేచత్వారః" అనగా మొదటి నలువురు మనువులని కొందఱు సులభమైన అనువాదము చేసియున్నారు. ఒక్కొక్క కల్పము నందును పదునాలుగు మంది మనువులు గడచిపోయినారనియు, ఈకల్పము లోను ఇంతవఱకేడుగురు మనువులు కడచిపోయినారనియు, పౌరాణికుల వలన వినుచున్నారము. ఇంతకు పూర్వమెన్ని కల్పములు పోయినవో, ఎంద ఱెందఱు మనువులు పోయినారో చెప్పలేము. వీరిలో కొందఱు దేవభావము కలవారనియు కొందఱాభావము లేనివారనియు నిరూపించుటకు మన కధి కారములేదు. సర్వమనువులు దేవభావముకలవారే కావచ్చునేమో! ఇట్లుండ వీరిలో ఏనలువురో దేవభావము కలవారని సాహసించి చెప్పుదుమేని తక్కిన వారల కన్యాయము చేసిన వారలమగుదుము. కాబట్టి యీ యనువాదము సరికాదని కొందఱు విమర్శకు లాక్షేపింతురు.

సనకుడు, సనందుడు, సనాతనుడు, సనత్కుమారుడు అనునలుగురు బ్రహ్మమానసపుత్రులు. భృగుమరీచ్యాదులకంటె, నారదాదులకంటెముందు పుట్టినవారు. "పూర్వేచత్వారః" అని వీరిని చెప్పవచ్చునుకాని వీరు ప్రజలను పుట్టించు వ్యాపారము మానుకొని వాసుదేవపరాయణులై మోక్షధర్మము ననుష్ఠించిరని భాగవత 3స్క. 12అ 5శ్లోకములో జెప్పబడినందున "యేషాం లోక ఇమాఃప్రజాః" అను వాక్యమునకు జేరరని కొందఱు శాస్త్రజ్ఞాన వేదాంతస్వాములు నిషేధించుచున్నారు. అందువలన మోక్షసామ్రాట్టులైన ఊర్ధ్వరేతసులసైతము ప్రజలబుట్టింపని కారణముచేతనే భగవత్తత్త్వ భావములో జేర్చుకొనక మనముకూడ వదలివేయవలసి వచ్చుచున్నది.

మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, వసిష్ఠుడు, దక్షుడు, నారదుడు అను పదిమంది మానసపుత్రులే వీరిలో బాలమంది ప్రజలను పుట్టించినవారుకూడ అయితే వీరు సనకాదులకంటె వెనుకపుట్టినవారు. సంఖ్యలోను నాలుగుకంటె మించియున్నారు. వీరెంత గొప్పవారైనను "పూర్వేచత్వారః" అను సూత్రమునకు వ్యతిరిక్తమైనందున దేవభావములో జేరకపోవసివచ్చినది.

"సర్వభూతములయందు నివసించు పరిశుద్ధాత్మ వాసుదేవుడు సర్వశరీరములయందు ప్రాణవాయువుల సంచారమున కాధారమైన జీవతత్త్వము సంకర్షణుడు. ప్రళయకాలమున సమస్తభూతములు దేనియందు లయించుచున్నవో ఆట్టి సర్వభూతములయొక్క మనస్తత్త్వము ప్రద్యుమ్నుడు. ఆమనస్సువలనబుట్టి సర్వకార్యకారణకర్త తానైన అహంకార మనిరుద్ధుడు. వాసుదేవుడె సంకర్షణుడు. సంకర్షణునివలన బుట్టినవాడు ప్రద్యుమ్నుడు. ప్రద్యుమ్నునివలన బుట్టినవా డనిరుద్ధుడు. అనిరుద్ధునివలన బ్రహ్మపుట్టి సర్వజగత్తును సృజించెను.' (భారత శాంతి 340 అధ్యా)

ఇట్లు చెప్పుటవలన భూతములను పుట్టించినవారు, ఆదిపురుషులు వీరేయగుదురని కొందఱు పండితు లనువాదముసేసిరి. కాని వీఱునలుగురు పరమాత్మకంటె వేఱుకాదని శాంతి 340 అధ్యాయములోనె యింకొకచోట జెప్పబడినది. మఱియు:

"మహాపురుష ఆత్మాన చతుర్ధా కృత్వా త్రిపాదేన పరవ్యోమ్ని చాసీత్ ఇతరేణ చతుర్థే నానిరుద్ధ నారాయణెన విశ్వాన్యాసః"

మహాపురుషుడు (పరిశుద్ధాత్మ) స్వస్వరూపమును నాలుగుభాగములుగ విభజించి మూడుపాదములతో పరాకాశమున నున్నాడు. వేఱొకనాల్గవ భాగమైన అనిరుద్ధ నారాయణునితో విశ్వములను వ్యాపించియున్నాడు.

(ముద్గలోపనిషత్తు)

అనుటవలన పైజెప్పబడిన నలుగురుమూర్తులు పరమాత్మయే యగుచున్నారుకాని వేఱువేఱు భావములోజేరరు. అదిగాక 'మానసాజాతాః' అను సూత్రములోజేరరు కనుక ఈయనువాదమును కొందఱు విమర్శకులు ఒప్పుకొనరు.

ఏ మన్వంతరములో జూచినను మహర్షులసంఖ్య యేడే యుండినట్లు పురాణములు చెప్పుచున్నవి. ఇదివఱకెన్ని కల్పములు పోయినవో యెన్ని మన్వంతరములు పోయినవో అన్నిటియందును మహర్షుల సంఖ్య యేడు కంటె ఎక్కువగాని, తక్కువగాని, లేకపోవుట కేవలము చోద్యముగనున్నది ఒకగ్రేడులోనేచేరిన మహనీయులు అనేక సప్తకములుండ ఒకసప్తకమునే దేవభావములో జేర్చుకొనుటయు సమంజసముగ నుండదు పైగీతాశ్లోకములో మనువుల సంఖ్యను చూపక పోవుటచే మనకు గొంతశ్రమతగ్గిపోయినది.

విశే॥ "మహాంతః ఋషయః మహర్షయః బ్రహ్మవిద్యాపారంగతాః ఋ గతౌ" అశాశ్వతములైన దృశ్యవస్తువులయందలి ఆసక్తతవదలి శాశ్వతమైన పరిశుద్ధాత్మను పొందినవారు మహర్షులు అజ్ఞాన భూమికల నతిక్రమించి జ్ఞానభూమికాస్థానమును పొందినవారు మహర్షులు. సత్స్వరూప నిధానములైన జ్ఞానభూమికలు ఏడుండును. ఈసప్తభూమికలను పొందిన బ్రహ్మవిద్యా పారంగతులైన ఋషులు సంఖ్యయందెంతమంది యున్నను వీరికి సప్తఋషులనియే పేరు విశాలమైన ప్రపంచములో భూతభవిష్యద్వర్తమాన కాలములలో అజ్ఞానమును వదలి జన్మరాహిత్యమునుపొందిన మహాఋషులందఱు సప్తభూమికలద్వారా జ్ఞాన సిద్ధాంతులైన మహర్షులే కనుకనే పైశ్లోకములో "మహర్షయస్సప్త" అని చెప్పబడినది.

"పూర్వతీతి పూర్వః పూర్వ పూరణే" అను సూత్రమువలన బ్రహ్మానందరస పరిపూర్ణులైన పరతత్త్వనిధానులు పూర్వులు జ్ఞానదృష్టిచేత అగతానాగతములైన జన్మములన్నియు, అసత్యములై పోవుటవలన వీరేకాలము

వారైనను పూర్వులే. పూర్వకల్పములలో, పూర్వయుగములలో జీవించి పోయిన ప్రాకృతపురుషులకంటె ఈకాలములో మనచే జూడబడు పరిపూర్ణ జ్ఞాన సిద్ధాంతులు పూర్వులగుదురు. ఎందుకనగా వీరికి దేశకాలవస్తు పరిచ్ఛేదములులేవు. ఈపూర్వులు 1. బ్రహ్మవిదుడు, 2. బ్రహ్మవిద్వరుడు, 3. బ్రహ్మవిద్వరీయుడు, 4. బ్రహ్మవిద్వరిష్టుడు, అని నాలుగురకములుగ విభజింపబడియుండినట్లు వేదాంతగ్రంథములలో జెప్పబడినది. వీరు సంఖ్యలో ఎందఱున్నను నాలుగు రకములుగనే యెన్నబడుదురు. కాబట్టి 'పూర్వేచత్వారః' అను సూత్రమునకు జేరుదురని కొందఱు వేదాంతులందురు.

మఱియు బ్రహ్మనిష్ఠ ఆరంభించుటకు పూర్వము 1. నిత్యానిత్య వస్తు వివేకము, 2. ఇహాముత్రార్థఫలభోగ విరాగము, 3 శమాది షట్కసంపత్తి, 4 ముముక్షుత్వము, అను నాలుగు సాధనములు పొందినవారే పూర్వులు నలుగురని కొందఱందురు.

వీరు దేహేంద్రియ వృత్తులయందు స్పృహలేక సమస్తవిషయముల నెఱిగెడి యెఱుకతో గూడి జన్మించియుందురు. ఈయెఱుకమనోవృత్తిలో జేరినది కావున వీరికి "మానసాజాతాః" అనిపేరు వచ్చినది. మఱియు సమస్త భూతములయందలి చైతన్యమంతయు తానే యైనప్పుడు, తనకంటె వేఱైన వస్తువేదియు గానరానప్పుడు లోకములో సమస్తప్రజలు తనవారే యగుదురు. కాని మలమూత్రాది దుర్గంధభూయిష్ఠములైన భౌతికదేహములతో రమించుటచేతనే పుట్టివచ్చిన ప్రజలనుమాత్రము తమవారనుట జ్ఞానయోగ సిద్ధాంతుల పద్ధతి కాదు. పైగీతాశ్లోకములోసైత మీభావము చూపబడలేదు.

మూ॥ ఏతాం విభూతించ యోగంచ మమ యో వేత్తి తత్త్వతః।
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్రసంశయః॥ 7.

తా॥ అస్మత్పదలక్ష్యార్థమైన పరమాత్మతత్త్వమునకు సంబంధించిన ఈ యీశ్వరభావమును, మఱియు పవనేంద్రియములను, మనోవృత్తులను, గుణకర్మాదులను ఊర్ధ్వకుండలిస్థానమున భగవతత్త్వమునందు సంక్షేపము గావించువిధమును ఎవడైతే యథారీతిగ దెలిసికొనుచున్నాడో అట్టి యతీశ్వరుడు నిశ్చలమైన యోగముతో గూడినవాడగుచున్నాడు. ఇందు శంశయము లేదు.

మూ॥ అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః॥ 8.

తా॥ సర్వభూతములయందు నేనని పేర్కొనబడుచుండు పరిశుద్ధాత్మ యిట్టిదని తెలిసికొని ఆభావముతో లెస్సగ గూడియుండు జ్ఞానులు ఈ విశ్వ మంతయు నావలననే సంభవించినది, నావలననే ప్రవర్తించుచున్నది. అని యూహించి నేనని పేర్కొనబడు ఆపరిశుద్ధాత్మనే సేవించుచున్నారు.

మూ॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్।
కథయంతశ్చమాం నిత్యం తుష్యంతిచ రమంతిచ॥ 9.

తా॥ అంతర్వీధియందు నేననెడు పరిశుద్ధాత్మవలన నిల్చిన చిత్తము గలవారు, ఆపరిశుద్ధాత్మనే పొందిన ప్రాణములు కలవారు ఆపరిశుద్ధాత్మను గుఱించి ఒకరికొకరు బోధించుకొనుచున్నారు. (పద్యగద్యాది ప్రబంధముల తో) ప్రకటించుకొనుచున్నారు. నిరంతరము సంతృప్తిజెందుచున్నారు. క్రీడించుచున్నారు.

శ్లో॥ మచ్చింతనం మత్కథనమన్యోన్యం మత్ప్రభాషణమ్।
మదేకపరమో భూత్వా కాలం నయ మహామతే॥

గొప్ప బుద్ధిగలవాడా, నన్నుజింతించుచు, జర్చించుచు, నన్నుగుఱించి పరస్పరము భాషించుచు నేనొకడనే శ్రేష్ఠుడననెడు భావముకలిగి కాలము వెళ్లబుచ్చుము. (వరాహోపనిషత్తు 2అ. 46శ్లో)

శ్లో॥ శృణ్వన్ సుభద్రాణి రథాంగపాణే ర్జన్మాని కర్మాణిచ యాని లోకే।
గీతాని నామాని తదర్థకాని గాయన్ విలజ్జో విచరేదసంగః॥

విషయానురాగమును వదలిన యతీశ్వరుడు చక్రపాణియైన భగవంతునియొక్క క్షేమకరములైన జన్మములు, కర్మలు, గీతలు, నామములు, వాని ప్రయోజనములు లోకములో ఏవికలవో వానిని వినుచు పాడుచు లజ్జలేనివాడై చరించును. (ఆర్షభగీత 1అ. 39శ్లో.)

మూ॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతితే॥ 10.

తా॥ సర్వత్ర నేనై ప్రకాశించు పరిశుద్ధాత్మను ఆయతీశ్వరులు దేని చేత ప్రాపింతురో ఆట్టిజ్ఞానయోగమును అభ్యాసయోగ నిరతులై భజించు యతీశ్వరులకు అంతర్యామి తత్త్వమే యొసగుచున్నది (అభ్యాసయోగము ను పర్యాప్తముగ జేసినవారికి తత్త్వజ్ఞానము తనంతటతానె లభించునని యిందువలన తెలియదగియున్నది.)

మూ॥ తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥ 11.

తా॥ పూర్వోక్తరీతిగా అభ్యాసయోగముచేసి జ్ఞానయోగమును ప్రాపింపబోవు యతీశ్వరులను కరుణించుటకై వారి హృదయాకాశమున నేననెడు భావమున నిలిచి అంతర్యామియైన నేను అజ్ఞానజన్యమైన యంధకారము ను (గాఢతమమును) ప్రకాశమానమైన చిత్కళాస్వరూపమైన వెలుగుచేత పోగొట్టుచున్నాడను

అర్జునుడు చెప్పుచున్నాడు:

మూ॥ పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్।
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుమ్॥ 12.

ఆహుస్త్వామృషయస్సర్వే దేవర్షిర్నారదస్తథా।
అసితో దేవలో వ్యాసస్స్వయంచైవ బ్రవీషి మే॥ 13.

తా॥ నీవు (గురుభావము వహించినట్టియు, యుష్మత్పదలక్ష్యార్థమైనట్టియు పరిశుద్ధాత్మవు) పరబ్రహ్మ తత్త్వమవు. పరమపావనమైన పరతత్త్వ నిధానమవు ఇట్టి యంతర్యామి స్వరూపమైన నిన్ను స్థూలశరీరమునందలి యిరువదియైదు తత్త్వములలో అగ్రస్థానమును పొందయుండువాడవనియు, ఎటువంటిభావ వికారములులేక యెల్లప్పటికి ఒకటేరీతిగ నుండువాడవని యు, మఱియొకదానిచే వెలిగింపబడని స్వయంప్రకాశ స్వరూపుడవనియు, సర్వశరీరములయందు ప్రకాశించు ప్రత్యగాత్మ స్వరూపులలో మొదటివాడ వనియు, కర్మబద్ధమైన జన్మములేనివాడవనియు, గుణకర్మాదుల కతీతమైన విశేషభవము కలవాడవనియు, సమస్తఋషులు చెప్పుదురు. దేవర్షియైన

నారదుడు అట్లే చెప్పుచున్నాడు. మఱియు అసితుడు, దేవలుడు, కృష్ణద్వైపాయనుడు అట్లేచెప్పుదురు. నాకునీవే స్వయముగనైతము చెప్పుచున్నాడవు.

మూ॥ సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ
నహి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః॥

తా॥ సృష్టిస్థితిసంహార కర్తృత్వాభిమాన దేవతలకు నిధానమైన ఓ భగవంతా! నన్నుగుఱించి నీవేమి చెప్పుచున్నాడవో అదియంతయు సత్యమని తలచుచున్నాడ. (సత్యము, జ్ఞానము, ఆనందము, నిత్యము, నిర్మలము అను పంచలక్షణములతోగూడిన) నీస్వరూపమును బాహ్యేంద్రియములతో దేవతలు తెలిసికొనలేరు, దానవులు తెలిసికొనలేరు. ఇతరులంతకంటెను తెలిసికొనలేరని భావము.

మూ॥ స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ।
భూతభావన! భూతేశ! దేవదేవ! జగత్పతే!॥ 15.

తా॥ భూతములకు సత్త్వము కలుగజేయునట్టియు. సర్వభూతములకు ఈశ్వరుడవైనట్టియు, దేవతలకు దేవుడవైనట్టియు, జగములను పాలించునట్టియు, ఓపురుషోత్తమా! అంతర్యామియైన పరిశుద్ధాత్మను ఆత్మ చేత నీవు స్వయముగనే తెలిసికొనుచున్నాడవు. (సర్వమును పరిశుద్ధాత్మ చూచుచున్నది, తెలిసికొనుచున్నది. కాని దానిని చూచుచునది, తెలిసికొనునది మఱియొకటిలేదు.)

మూ॥ వక్తుమర్హస్యశేషేణ దివ్యాహ్యాత్మవిభూతయః
యాభిర్విభూతిభిర్లోకానిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి॥ 16.

తా॥ యుష్మత్పదలక్ష్యార్థమైన ఓ పరిశుద్ధాత్మా! నీవు ఏయైశ్వర్యములతో ఈలోకములను వ్యాపించియున్నాడవో అట్టి స్వకీయములైన నీయైశ్వర్యములు లోకాతీతములు కదా? కనుక ఆయైశ్వర్యములను కొదవలేకుండ చెప్పుటకు నీవే తగుదువు.

మూ॥ కథంవిద్యామహంయోగిన్ త్వాంసదాపరిచింతయన్
కేషుకేషుచ భావేషు చింత్యోఽసి భగవన్ మయా॥ 17

తా॥ ఆత్మానుసంధాన కర్తృస్వరూపమైన, యుష్మత్పద లక్ష్యార్థమైన ఓభగవంతా! నేను ఎల్లప్పుడును ధ్యానించుచు ఎటులైతే నిన్ను తెలిసి కొందును. ఏయేభావములయందు స్వరూపములయందు నీవు నాచే ధ్యానింపబడదగియున్నాడవు.

మూ॥ విస్తరేణాత్మనో యోగం విభూతించ జనార్దన
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్॥ 18

తా॥ ఓ జనార్దనా! ఆత్మానుసంధానముసేయు క్రియాసూత్రమును, ఈశ్వరభావమును మరల విపులముగ వర్ణించి చెప్పుము. జననమరణములకు అతీతమైన నీప్రబోధమును వినుచుండు నాకు ఇకజాలునన్నమాట యుండదుకదా?

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-

మూ॥ హంత తే కథయిష్యామి దివ్యాహ్యాత్మవిభూతయః
ప్రాధాన్యతఃకురుశ్రేష్ఠ! నాస్త్యంతోవిస్తరస్యమే॥ 19

తా॥ అటులైతే నీకొఱకు వర్ణించి చెప్పబోవుచున్నాడను. అర్జునా! అస్మత్పదలక్ష్యార్థమైన పరిశుద్ధాత్మకు స్వకీయములగు ఐశ్వర్యములు (ఈశ్వరభావములు) దివ్యములుకదా? సర్వత్ర విరివిగ వ్యాపించియుండు నేననెడు పరిశుద్ధాత్మకు అంతములేదు. (అందువలన) ముఖ్యభావములనుబట్టి చెప్పబోవుచున్నాడను.

ఈశ్వరభావములోజేరిన వస్తువుల నన్నిటిని ఒకదానినైన విడువకుండ చెప్పవలెననిన మనుష్యుని జీవితము చాలదు. కాలమంతయు వ్యర్థముగ గడచిపోవును. విఖ్యాతమైన కొన్నిటిని వర్ణించి చెప్పినమీదట అన్నిటిని ఊహించుకొనవచ్చును. అందువలన "ప్రాధాన్యతః" అని పైశ్లోకములో సూచింపబడినది.

మూ॥ అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః
అహమాదిశ్చ మధ్యంచ భూతానామంత ఏవ చ॥ 20.

తా॥ అర్జునా! సర్వభూతముల హృదయములయందు నేనుఅనెడు పరిశుద్ధాత్మయున్నది. జన్మప్రాప్తిగల వస్తువులకెల్ల ఆది, మధ్యము, అంతము కూడ ఈపరిశుద్ధాత్మయే.

శ్లో॥ మమాంతరాత్మా తవచ యేచాన్యే దేహసంజ్ఞితాః
సర్వేషాం సాక్షిభూతోఽసౌ నగ్రాహ్యః కేనచిత్ క్వచిత్।

అంతర్వీథియందు ప్రకాశించుపరమాత్మ నాకును, నీకును, మఱియు దేహముచే గుర్తింపదగిన యితరభూతము లేవికలవో వానికన్నిటికిని సాక్షియై యున్నది. ఆపరమాత్మ ఎవ్వనిచేతనైన ఎట్లును గ్రహింపబడునదికాదు. (నారాయణీయము 2-4)

శ్లో॥ జ్ఞ ఇత్యుక్తః సంయుక్తః ప్రాకృతైర్గుణైః
తైరేవతు వినిర్ముక్తః పరమాత్మేత్యుదాహృతః॥

స్థూలశరీరమునందు ఇరువదినాలుగు తత్త్వములకు విలక్షణమై సత్త్వాది ప్రకృతి గుణములతో గూడుకొని దేహేంద్రియ మనోవృత్తుల నెఱుగు ఆత్మ క్షేత్రజ్ఞుడనబడును. అట్టి సత్త్వాదిగుణములచే విడువబడినదే పరమాత్మ యని చెప్పబడినది. (భారత శాంతి. 187 అ. 23 శ్లో)

మూ॥ ఆదిత్యానామహంవిష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణా మహం శశీ॥ 21.

తా॥ ద్వాదశాదిత్యులలో విష్ణువు జ్యోతులలో అంశుమంతుడైన సూర్యుడు, మరుత్తులలో మరీచి, నక్షత్రములలో చంద్రుడు. ఇవన్నియు నేననెడు పరిశుద్ధాత్మయొక్క ఐశ్వర్యములు (ప్రతివర్గములోను ఒక్కొక్కదానిని ఈశ్వరభావమని చెప్పగా ఆవర్గములో జేరినవన్నియు ఈశ్వరభావములో జేరినవేయని తెలియవలయును.)

ఓం. తత్ సత్.

# శ త ప త్ర ము

# 104



మూ॥ వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా॥ 22

తా॥ వేదములలో సామవేదము, సమస్త దేవతలలో మహేంద్రుడు, ఏకాదశేంద్రియములలో మనస్సు, సమస్తభూతములలో కార్యాకార్యముల నెఱుగు బుద్ధి ఇవన్నియు నేనగుదును.

మూ॥ రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్।
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్॥ 23

తా॥ ఏకాదశరుద్రులలో శంకరుడు, యక్షరాక్షసులలో కుబేరుడు, అష్టవసువులలో అగ్నిహోత్రుడు, పర్వతములలో మేరుపర్వతము ఇవన్నియు నేనగుదును.

మూ॥ పురోధసాంచ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్।
సేనానీనామహంస్కందః సరసామస్మి సాగరః 24.

తా॥ అర్జునా! పురోహితులలో దేవ పురోహితుడైన బృహస్పతి నా యీశ్వరభావములో జేరినవాడని తెలిసికొనుము. సేనాపతులలో దేవసేనా నాయకుడైన కార్తికేయుడు, జలాశయములలో సముద్రము భగవత్తత్వ విభూతులని తెలిసికొనుము.

మూ॥ మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః 25.

తా॥ మహర్షులలో భృగువు, అర్థవంతములైన శబ్దములలో ఒకటేయక్షరమైన ఓంకారము, సమస్తయజ్ఞములలో జపయజ్ఞము, కదలనివస్తులలో హిమాలయపర్వతము, ఇవన్నియు నేనేయగుదును.

మూ॥ అశ్వత్థస్సర్వవృక్షాణాం దేవర్షీణాంచ నారదః।
గంధర్వాణాం చిత్రరథస్సిద్ధానాం కపిలో మునిః॥ 26.

తా॥ సర్వవృక్షములలో రావిచెట్టు, దేవర్షులలో నారదుడు, గంధర్వులలో చిత్రరథుడు, సిద్ధులలో కపిలమహాముని వీరందఱు ఈశ్వరభావములే.

మూ॥ ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్।
ఐరావతం గజేంద్రాణాం నరాణాంచ నరాధిపమ్॥ 27.

తా॥ గుఱ్ఱములలో అమృతముతో బుట్టిన ఉచ్చైశ్శ్రవస మనెడు గుఱ్ఱమును, శ్రేష్ఠములైన యేనుగులలో ఐరావతమనెడు యేనుగును, మనుష్యులలో ధర్మమును పరిపాలించు ప్రభువును నా ఈశ్వరభావములని తెలిసికొనుము.

మూ॥ ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్।
ప్రజనశ్చాస్మి కందర్పస్సర్పాణామస్మి వాసుకిః॥

తా॥ ఆయుధములలో దధీచాస్థి సంబంధమైన వజ్రాయుధము, ఆవులలో కోరిన వస్తువులనెల్ల బిదుకు కామధేనువు, (రూపవంతులలో) ప్రకృష్టమైన పుట్టువుగల మన్మథుడు, సర్పములలో వాసుకి, వీరందరు నాయీశ్వరభావములే.

మూ॥ అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్।
పితౄణామర్యమాచాస్మి యమస్సంయమతామహమ్॥ 29.

తా॥ నాగులలో నాశరహితుడైన ఆదిశేషుడు, జలమునందు సంచరింపగలజీవులలో వరుణుడు, పితృదేవతలలో అర్యముడు, సంయమవంతులలోయముడు, వీరందఱు అస్మత్పద లక్ష్యార్థమైన పరిశుద్ధాత్మయొక్క యీశ్వరభావములో జేరుదురు.

మూ॥ ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్।
మృగాణాంచమృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్॥ 30.

తా॥ దితిసంతతి ప్రజలలో ప్రహ్లాదుడు, జీవులను ఈలోకమునుండి ఆవలికి వెడలఁద్రోయు సత్త్వములలో కాలము, మృగములలో సింహము, పక్షులలో గరుత్మంతుఁడు వీరందఱు నా యీశ్వరభావములోఁజేరినవారు.

మూ॥ పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ॥ 31

తా॥ సంచారము గలిగినట్టియు, పవిత్రకరమైనట్టియు వస్తువులన్నిఁటిలో ప్రధానమైనవాయువు, ఆయుధమును ధరించినవారిలో ప్రధానుఁడు శ్రీరాముఁడు, హింసావ్యాపారముగలిగిన మత్స్యములలో మకరము, నదులలో శ్రేష్ఠమైన గంగానది వీరందఱు నాయీశ్వరభావములే.

మూ॥ సర్గాణామాదిరంతశ్చ మధ్యంచైవాహమర్జున।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్॥ 32.

తా॥ అర్జునా! భౌతికసృష్టి వ్యాపారములలో జీవులయొక్క శరీరాత్మల సంయోగమునకు ముందుండిన దశయు, శరీరాత్మల వియోగమునకు వెనుకటి దశయు, ఈ నడుమ జీవితకాలమునందలి మధ్యదశయు, నాయీశ్వరభావమే మఱియు సమస్త విద్యలలో నిత్యశుభ ప్రతిపాదకమైన అధ్యాత్మిక విద్య, లెస్సగ భాషించువారిలో భాషానైపుణ్యము ఇవన్నియు నా యీశ్వరభావములే.

మూ॥ అక్షరాణామకారోఽస్మి ద్వంద్వస్సామాసికస్య చ।
అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః॥ 33.

తా॥ అక్షరములలో మొట్టమొదటిదైన అకారము, సమాసములలో ద్వంద్వసమాసము, (మఱియు "కల్యతే సంఖ్యాయతే అనేనకాలః కల సంఖ్యానే" అను సూత్రమువలన) ఎన్నడును క్షీణింపని విచారణకర్త, సర్వత్ర ముఖములుగలిగి విశ్వమును ధరించు జగద్భర్త ఇవన్నియు నేనని పేర్కొనబడు పరిశుద్ధాత్మకంటె వేఱైనవికావు.

మూ॥ మృత్యుస్సర్వహరశ్చాహముద్భవశ్చ భవిష్యతాం।
కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా॥ 34.

తా॥ ప్రళయకాలమున సమస్తమును హరించు మృత్యువు, ఇకమీద కలుగబోవు జీవులయుత్పత్తి, మఱియు స్త్రీలలో కీర్తి, సేవాధర్మము, వాక్కు, తలపు, బుద్ధిబలము, ధైర్యము, ఓర్పు ఇవన్నియు అస్మత్పదలక్ష్యార్థమైన పరిశుద్ధాత్మయొక్క విభూతులే.

మూ॥ బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్।
మాసానాం మార్గశీర్షోహమృతూనాం కుసుమాకరః॥ 35.

తా॥ అదేవిధముగా పాపమును క్షీణింపజేయు వైదిక సూక్తములలో బృహత్సామము, ఆహ్లాదకరములైన యిరువదియారు ఛందస్సులలో ఆఱవదైన గాయత్రీ ఛందస్సు, పంద్రెండు మాసములలో మార్గశిర మాసము, ఋతువులలో వసంతఋతువు. ఇవన్నియు నావిభూతులే.

మూ॥ ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్॥ 36.

తా॥ ధూర్తులలో జూదము, తేజస్వులలో తేజస్సు, (జిగీషులలో) జయము, నిశ్చయజ్ఞానము, సత్త్వవంతులలో సత్త్వము ఇవన్నియు నా యీశ్వరభావములే.

మూ॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనం జయః।
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః॥ 37.

తా॥ వృష్ణివంశమున బుట్టిన ప్రజలలో వసుదేవకుమారుడైన శ్రీకృష్ణుడు, పాండుపుత్రులలో నానాదేశములమీద దండెత్తి ధనమును జయించితెచ్చిన విజయుడు, భగవత్తత్త్వమును మననముసేయు నియమవంతులలో వేదవ్యాసుడు, చతురవచన రచనావిశారదులైన కవీశ్వరులలో శుక్రుడు వీరందఱు అస్మత్పదలక్ష్యార్థమైన పరిశుద్ధాత్మయొక్క స్వరూపములే.

మూ॥ దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్।
మౌనంచైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్॥ 38.

తా॥ ప్రజలను శిక్షించి పాపములనుండి ఉపశమింపజేయు ప్రభువులలో శాసనబలము, జిగీషాపరులలో నీతి, భావరహస్యమును గాపాడుకొనువారిలో మౌనము, జ్ఞానులలో జ్ఞానము, ఇవన్నియు నావిభూతులే.

మూ॥ యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున।
న తదస్తి వినా యత్ స్యాన్మయా భూతం చరాచరమ్॥ 39.

తా॥ అర్జునా! సమస్త భూతములయుత్పత్తికి కారణమేదికలదో అది యు నేననెడు పరిశుద్ధాత్మభావమే. చరాచరరూపమైన యీ ప్రపంచమంత యు నేననెడు భావముతోనే పుట్టినది. నేనన్న భావమునకు వేఱుగ మఱేది యు కలుగలేదు.

మూ॥ నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప।
ఏషతూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా॥ 40.

తా॥ అర్జునా! దివ్యములైన నా యీశ్వరభావములకు తుదియన్న మాటలేదు. ఇట్టి పరమేశ్వర తత్త్వస్వరూపమైన విభూతియొక్క విస్తారము నాచేత ఉద్దేశపూర్వకముగ జెప్పబడినది.

మూ॥ యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా।
తత్తదేవావగచ్ఛత్వం మమతేజోఽంశసంభవమ్॥ 41.

తా॥ విశేషమైనభవము కలిగినట్టియు, సేవాధర్మముతోగూడి అతిశ యించి యుండునట్టియు వస్తువేదికలదో ఆయావస్తువంతయు నేననెడు పరి శుద్ధాత్మయొక్క తెజస్సులో ఒక భాగమునుండి పుట్టినదని తెలిసికొనుము.

శ్లో॥ బ్రహ్మాది కీటపర్యంతాః ప్రాణినో మయి కల్పితాః।
బుద్బుదాది వికారాంతాస్తరంగాస్సాగరే యథా॥

నీటి బుగ్గలు మొదలైన వికారములుగల అలలు సముద్రమునందెట్లు కల్పింపబడుచున్నవో అట్లే బ్రహ్మ మొదలుకొని కీటకముల పర్యంతము సమస్తజీవులు నేననెడు పరమాత్మయందు కల్పింపఁబడినవి.

(ఆత్మప్రబోధోపనిషత్తు 14శ్లో)

శ్లో॥ బ్రహ్మణస్సర్వ భూతాని జాయంతే పరమాత్మనః
తస్మాదేతాని బ్రహ్మైవ భవంతీతి విచింతయ॥

సమస్తభూతముల వృద్ధికిహేతువైన పరమాత్మవలన భూతములన్ని యు పుట్టుచున్నవి అందువలన ఆభూతములన్నియు పరమాత్మయే యగునని తలంపుము (యోగశిఖోపనిషత్తు 4అ, 5శ్లో)

శ్లో॥ బ్రహ్మైవ సర్వనామాని రూపాణి వివిధానిచ।
కర్మాణ్యపి సమగ్రాణి బిభర్తీతి విభావయ॥

సమస్తనామములను, వివిధములైన రూపములను, సమగ్రములైన కర్మలనుకూడ పరబ్రహ్మమే భరించుచున్నదని భావింపుము.

(యోగశిఖోపనిషత్తు 4 అ 6 శ్లో.)

శ్లో॥ సర్వాంతరః స్వయం జ్యోతిస్సర్వాధిపతిరస్మ్యహమ్।
సర్వభూతాధివాసోఽహం సర్వవ్యాపీ స్వరాడహమ్॥

సర్వభూతములలోపల నా యంతట నేను జ్యోతినై యున్నాడను. సర్వజగత్తునకు పరిపాలకుడనై యున్నాడను. సర్వభూతములయందు నివసించియున్నాడను. సర్వత్ర వ్యాపించియున్నాడను. మఱియొకదానిచే వెలిగింపబడక నాయంతట నేనే ప్రకాశించుచున్నాడను.

(బ్రహ్మవిద్యోపనిషత్తు 106 )

"ఏకో విష్ణురనేకేషు జంగమస్థావరేషు చ।
అనుస్యూతో వసత్యాత్మా భూతేష్వహమవస్థితః"

శ్రీ విష్ణు పరమాత్మ యొక్కడే జంగమస్థావర రూపములైన అనేక భూతములయందు కూర్పబడి నివసించుచున్నాడు. భూతములయందు నేననెడు భావముతోనున్నాడు. (వాసుదేవోపనిషత్తు )

"బ్రహ్మనారాయణః శివశ్చనారాయణః శక్రశ్చనారాయణః దిశశ్చనారాయణః విదిశశ్చనారాయణః కాలశ్చనారాయణః కర్మాఖిలంచ నారాయణః మూర్తామూర్తంచ నారాయణః కారణాత్మకం సర్వం కార్యాత్మకం సకలం నారాయణః తదుభయ విలక్షణో నారాయణః"

(మహానారాయణోపనిషత్తు 2 అ. టీకసులభము)

మ॥ గరిమన్ స్వర్ణమనేక భూషణములై కన్పట్టు చందంబునం
బరమాత్ముం డఖిల ప్రపంచ మయుడై భాసిల్లు నట్లౌటచే
సురసిద్ధోరగయక్షకిన్నరనరస్తోమాది శశ్వచ్చరా
చరరూపోజ్వల సర్వభూతములకుఁ సద్భక్తితో మ్రొక్కెదన్॥

(సీతారామాంజనేయసంవాదము. 1. అశ్వా. 14 పద్యం టీకసులభము)

భాగవతము 11 స్కం. 16 అధ్యాయములో విభూతియోగము ఇంచు మించుగ గీతాగ్రంథములో వలెనే వర్ణింపబడినది. మఱియు పెక్కుగ్రంథ ములలో విపులముగ వ్రాయబడినది, ఇవన్నియు వివరించి వ్రాయబూనిన యెడల గ్రంథము పెరిగిపోవును. పాఠకులకు విసుగుపుట్టునేమో!

మూ॥ అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేనస్థితో జగత్॥ 42.

తా॥ అర్జునా! అంతేకాక అధికముగా తెలిసికొనబడిన యీ సమా చారముతో నీకేమి గాని సమస్తమైన యీ జగత్తును నేననెడు పరిశుద్ధాత్మ స్వస్వరూపమునందలి ఒక్క భాగముతో వ్యాపించియున్నది.

(ఈ విషయము ముద్గలోపనిషత్తులో సూచింపబడినది.)

ఇది శ్రీ మహాభారము భీష్మపర్వములో విభూతియోగమనెడు ముప్ప దినాల్గవ అధ్యాయము.

ఓం. తత్. సత్.

# శత పత్రము

# 105

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 35 అధ్యాయము.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.

మూ॥ మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితమ్।
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ॥ 1

తా॥ నన్ననుగ్రహించుటకై శ్రేష్ఠమైనట్టియు, గోప్యమైనట్టియు, ఆత్మజ్ఞానముచే గుర్తింపఁదగినట్టియు ఏవాక్యము నీచేఁజెప్పబడినదో ఆవాక్యముతో ఇంతకుముందున్న నా మనోవైకల్యము పోఁగొట్టఁబడినది.

మూ॥ భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా।
త్వత్తః కమలపత్రాక్ష! మాహాత్మ్యమపిచావ్యయమ్॥

"కం సుఖం, అలం, పర్యాప్తం, పత్ గ్రగతౌ, అక్ష, వ్యాప్తౌ" శాస్త్రమైన దివ్యసుఖము ఏస్థానమున పర్యాప్తమగుచున్నదో అట్టి యూర్ధ్వకుండలిస్థానమైన సహస్రారకమలమును జేరఁబోవు హంసను వ్యాపించియుండు ఓ పరమాత్మా! యుష్మత్పదలక్ష్యార్థమైన భగవత్తత్త్వమువలన సమస్త భూతములయొక్క ఉత్పత్తి నాశములు విస్తారముగనాచే ఆలకింపఁబడినవి. మఱియు అక్షయమైన, పూజనీయమైన, స్వకీయమైన యీశ్వరభావము (విభూతి) కూడ ఆలకింపఁబడినది.

మూ॥ ఏవమేతద్యథాత్థ త్వమాత్మానం పరమేశ్వర
ద్రష్టుమిచ్ఛామితేరూప మైశ్వరం పురుషోత్తమ॥ 3

తా॥ ఈవిధముగ నాచే అలకింపఁబడిన ఆ యీశ్వరభావమట్టిదే కావచ్చును. ఓ పురుషోత్తమా! పరమేశ్వరా! స్వకీయమైన నీ యీశ్వర స్వరూపమును నీవెటుల చెప్పియుంటివో అటుల చూచుటకు నేనిష్టపడుచున్నాఁడను. (సర్వభూతములయందు పరమాత్మ యున్నది. పరమాత్మయందు సర్వభూతములున్నవి. కాఁబట్టి భూతములు పరమాత్మకంటె వేరైనవి కావని వినుటయేకాక ఆ విధముగఁజూచుటకును శిష్యుఁడు కోరినాఁడన్నమాట )

మూ॥ మన్యసేయది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మానమవ్యయమ్॥ 4

తా॥ ఆత్మానుసంధాన రూపమైన యోగవిద్యకు నియామకుఁడవైన ఓ ప్రభూ! పూర్వోక్తరీతిగా ఈశ్వరస్వరూపమును నేను చూచుటకిష్టపడినందువలన దానినిజూచుటకు నాకు శక్యమగునని తలఁతువేని నీవు అక్షయమైన నీస్వరూపమును నాకుఁజూపుము.

శ్రీ భగవానుఁడు చెప్పుచున్నాఁడు.

మూ॥ పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ॥ 5

తా॥ అర్జునా! నూర్లకొలఁది అంతేకాక వేలకొలఁది అధికసంఖ్యాకములైనట్టియు, పెక్కువిధములై యుండునట్టియు, క్రీడామాత్రములైయుండునట్టియు, వేఱువేఱువర్ణములు ఆకారములు కలిగినట్టియు నారూపములను చూడుము.

మూ॥ పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినౌ మరుతస్తథా।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత॥ 6

తా॥ అర్జునా! ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినులను, మరుత్తులను చూడుము. అట్లే యిదివఱకెన్నడునుజూడని ఆశ్చర్యముల ననేకములఁజూడుము. (తారకయోగులకు చిన్ముద్రయందు కనఁబడు లక్ష్యములు ఈశ్లోకములో వర్ణింపఁబడినవని కొందఱు వేదాంతులందురు.)

మూ॥ ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్।
మమదేహే గుడాకేశ! యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి॥ 7

తా॥ అర్జునా! చరాచరరూపమైన యీ సమస్త ప్రపంచమును (చూచుటకెంతోదూరము తిరుగవలసినపనిలేదు కాలవ్యవధితో నిమిత్తములేదు) ఒకచోటనేయున్నదానినిగా ఇప్పుడే యిచ్చటనే నాదేహమునందే చూడుము. ఇంతకంటేవేఱైన మఱిదేనిని చూడఁగోరెదవో దానినిసైతము చూడుము.

మూ॥ నతు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్॥. 8

తా॥ (పోఅంతకర్మణి) ఎప్పుడో యొకసారి అంతముకలిగిన యీ ప్రాకృతనేత్రముతోడనే అస్మత్పదలక్ష్యార్థమైన పరిశుద్ధాత్మను చూచుటకు నీకు శక్యముకాదు. (కాఁబట్టి) అప్రాకృతమైన జ్ఞానస్వరూపమైన నేత్రమును నీకిచ్చుచున్నాఁడను. ఆత్మానుసంధానరూపమైన నా యీశ్వరత్వమును చూడుము.

సంజయుడు చెప్పుచున్నాడు:—

మూ॥ ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః
దర్శయామాసపార్థాయ పరమం రూపమైశ్వరమ్॥ 9.

తా॥ ధృతరాష్ట్రమహారాజా! మహాయోగనియామకుఁడైనట్టియు, పాపములను శమింపజేయునట్టియు భగవంతుడు ఈ విధముగాజెప్పి అటుపైన ఈశ్వరసంబంధమైన శ్రేష్ఠమైన రూపమును అర్జునునకు జూపించెను.

వివ॥ శ్రీకృష్ణపరమాత్మచే జూపబడినట్లున్న విశ్వరూపములు భారత భాగవతములలో పదునాలుగుచోట్ల చూచియుంటిమి. పరస్పరభేదములుగనే వర్ణింపబడినవి. (83 పత్రములో చూడనగును) అదిగాక భాగవతము 2 స్కం. 1 అధ్యాయములోను, 8 స్కం. 20 అధ్యాయములోను, ప్రత్యేకముగ వర్ణింపబడినవి బృహదారణ్యకోపనిషత్తునందు అశ్వసంజ్ఞతో వర్ణింపబడినది. ఇక గొన్నియుపనిషత్తులలో మఱికొంత భేదముతో వర్ణింపబడినట్లు అందందుకనబడుచున్నది.

మూ॥ అనేక వక్త్రనయన మనేకాద్భుత దర్శనమ్।
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥ 10.

తా॥ అనేకములైన ముఖములు, నేత్రములు, కలిగినట్టియు అనేకములైన అద్భుతములు కనబడునట్టియు అనేకములైన దివ్యములైన ఆభరణములు కలిగినట్టియు ఉద్యమింపబడిన అనేక దివ్యాయుధములు కలిగినట్టియు ఈశ్వరస్వరూపమును భగవంతుడు అర్జునునకు జూపెను.

శ్లో॥ అనేకాకార ఖచితమనేక వదనాన్వితమ్
అనేక భుజ సంయుక్తమనేకాయుధ మండితమ్
నానావర్ణ ధరం దేవం శాంతముగ్రముదాయుధమ్
అనేక నయనాకీర్ణం సూర్యకోటి సమప్రభమ్
ధ్యాయతో యోగినః సర్వమనోవృత్తిర్వినశ్యతి
హృత్పుండరీకమధ్యస్థం చైతన్యజ్యోతిరవ్యయమ్॥

హృదయకమల మధ్యమున చైతన్యజ్యోతి స్వరూపమైనట్టియు కోటి సూర్యులతో సమానమైన వెలుగుగలిగినట్టియు అనేకములైన ఆకారములతో గూర్పబడి నట్టియు అనేకముఖములతో, భుజములతో గూడినట్టియు నానావర్ణముల ధరించినట్టియు అనేక నేత్రములతో నిండినట్టియు భయంకరమైనట్టియు ఉద్యమింపబడిన అనేకాయుధములతో అలంకృతమైనట్టియు దివ్యమైనట్టియు శాంతమైనట్టియు అక్షరపరబ్రహ్మ తత్త్వమును ధ్యానించు యోగీశ్వరుని మనోవృత్తి యంతయు నాశమగుచున్నది.

(త్రిశిఖి బ్రాహ్మణోపనిషత్తు 153 మొదలు.)

"అచక్షుర్విశ్వతశ్చక్షురకర్ణో విశ్వతః కర్ణ అపాదో విశ్వతః పాద అపాణిర్విశ్వతః పాణిరహమశిరా విశ్వతశ్శిరాః

నేను కన్నులు లేని వాడను, విశ్వమంతయు కన్నులుగగలవాడను, నేను చెవులు లేనివాడను, విశ్వమంతయు చెవులుగగలవాడను, నేను పాదములు లేనివాడను, విశ్వమంతయు పాదములుగగలవాడను, నేను హస్తములు లేనివాడను, విశ్వమంతయు హస్తములుగగలవాడను, నేను శిరస్సు లేనివాడను, విశ్వమంతయు శిరస్సులుగ గలవాడను.

(భస్మజాబాలోపనిషత్తు 2 అధ్యా.)

శ్లో॥ విశ్వమూర్ధా విశ్వభుజో విశ్వపాదాక్షినాశికః
ఏకశ్చరతి క్షేత్రేషు స్వైరచారీ యథా సుఖమ్॥

విశ్వమంతట శిరములుగలవాడు, విశ్వమంతట భుజములుగలవాడు, విశ్వమంతట పాదములు, నేత్రములు, నాసికలుగలవాడు. సమస్త శరీరములయందు ఒకడే పరమాత్మ స్వేచ్ఛా విహారియై సుఖము నతిక్రమింపక చరించుచున్నాడు. (నారాయణీయము 2. అ. 5 శ్లోకము.)

మూ॥ దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్
సర్వాశ్చర్యమయం దేవమనంతం విశ్వతోముఖమ్॥ 11.

తా॥ దివ్యములైన పుష్పహారములు, వస్త్రములు ధరించినట్టియు, దివ్యములైన పరిమళద్రవ్యముల పూతలు కలిగినట్టియు, సర్వము ఆశ్చర్యమేయైనట్టియు, లోకాతీతమైనట్టియు, అంతములేనట్టియు, సర్వత్ర ముఖములు గలిగినట్టియు, (విశ్వరూపమును జూపెను.)

మూ॥ దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా
యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః॥ 12.

తా॥ ఆకాశములో ఒకటేసారి వేయి సూర్యులకాంతి ఉత్పన్నమైనచో అట్టికాంతి ఆమహాత్ముని కాంతికి సాటికావచ్చును.

"మమ రూపా రవేస్తేజశ్చంద్ర నక్షత్ర గ్రహ తేజాంసిచ గగనో మమ త్రిశక్తి మాయా స్వరూపో నాన్యో మదస్తి"

సూర్యునియొక్క తేజస్సు నారూపము, చంద్రుని యొక్కయు, నక్షత్రములయొక్కయు, గ్రహములయొక్కయు తేజస్సులుకూడ నారూపమే ఆకాశము నాశక్తిత్రయముయొక్క మాయాస్వరూపము. నాకంటె వేఱైనది లేదు. (పాశుపత బ్రహ్మోపనిషత్తు)

మూ॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా
అపశ్యద్దేవదేవస్య శరీరేపాండవస్తదా॥

తా॥ అప్పుడాయర్జునుఁడు అనేకవిధముల (నామరూపాదులతో) లెస్సగవిభజింపఁబడియుండు సమస్త ప్రపంచమును (అందందు తిరిగిచూడవలసిన పనిలేకుండ) ఒకటేచోట అనఁగానచ్చటనే దేవదేవుఁడైన అపరమేశ్వరుని శరీరమునందేచూచెను.

" ఏకస్మిన్నవిద్యా పాదేఽనంతకోటి బ్రహ్మాండాని సావరణాని శ్రూయంతే తస్మిన్నేకస్మిన్నండే బహవోలోకాశ్చ బహవో వైకుంఠాశ్చానంత విభూతయశ్చ సంత్యేవ"

పరిశుద్ధాత్మయందు నాల్గవభాగమైన అవిద్యయనెడు ఒకపాదమునందు ఆవరణములతోఁగూడినట్టియు, అక్షయములైనట్టియు కోట్లకొలది బ్రహ్మండములు (ఉన్నవని) అలకింపఁబడుచున్నవి. అందులో ఒక్కొక్క బ్రహ్మండమునందే పెక్కులోకములు, పెక్కువైకుంఠములు, మఱియు అంతములేని యీశ్వరస్వరూపములు ఉన్నవి. (మహానారాయణోపనిషత్తు 8అధ్యా.)

మూ॥ తతస్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః।
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలిరభాషత॥ 14

తా॥ అటుపైన ఆ యర్జునుడు ఆశ్చర్యనిమగ్నుడై శరీరమున గగుర్పాటు కలిగినవాడై భగవంతునిగుఱించి శిరస్సుతో నమస్కరించి చేతులుజోడించుకొని (ఇట్లు) భాషించెను.

అర్జునుడు చెప్పుచున్నాడు.

మూ॥ పశ్యామి దేవాంస్తవ దేవ! దేహే సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్।
బ్రహ్మాణమీశం కమలాసనస్థం ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్

తా॥ ఓదేవా! నీశరీరమునందు సమస్తదేవతలను చూచుచున్నాడను. అదేవిధముగ స్థావరజంగమాది విశేషభూత సమూహములను చూచుచున్నాడను. మఱియు సమస్తభూతములకు నియామకుడైనట్టియు, నిత్యసుఖమును పర్యాప్తముచేయు సహస్రారకమల పీఠమున నివసించియుండునట్టియు పరబ్రహ్మమును, సమస్తఋషీశ్వరులను, దేవసంబంధమైన మహిమగల సర్పములను జూచుచున్నాడను, (సమస్తభూతములయందలి చైతన్యమంతయు, నేనేకాని వేఱులేదన్న తెలివి గురువు కలుగజేసినప్పుడు విశ్వమంతయు తానే యగుచున్నాడు. సర్వభూతములను తనయందే చూచుచున్నాడు.)

మఱియు ఉద్యోగపర్వము 130 అధ్యాయములోను, శాంతిపర్వము 340 అధ్యాయములోను విశ్వరూపసందర్శనము విపులముగ వర్ణింపబడినది.

మూ॥ అనేక బాహూదర వక్త్ర నేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనంత రూపమ్
నాంతం నమధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప॥16

తా॥ విశ్వమునకు నియామకుడవైనట్టియు, విశ్వమే రూపముగ గలిగినట్టియు ఓదేవా! అనేకములైన భుజములు కడుపులు, ముఖములు, కన్నులు గలిగినట్టియు, అంతములులేని రూపములు కలిగినట్టియు నిన్ను సర్వత్ర చూచుచున్నాడను. మఱియు విశ్వరూపుడవైన నీకుతుదియేదో! మధ్యమేదో! ఆదియేదో చూడజాలకున్నాడను.

సర్వభూతముల యందలి పరిశుద్ధాత్మ తానైనప్పుడు సర్వరూపములు తన రూపములే యగుచున్నవి. సర్వశరీరాంగములు తన శరిరాంగములే యగుచున్నవి. ఇట్టిభావముతో విశ్వమును జూచువాని స్వరూపమునకు తుది మొదలన్న మాటేయుండదు.

మూ॥ కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్।
పశ్యామి త్వాం దుర్నిరీక్షం సమంతా
ద్దీప్తానలార్క ద్యుతిమప్రమేయమ్॥ 17.

తా॥ కిరీటము, గద, చక్రము, కలిగినట్టియు, పుంజీభవించిన తేజస్సు కలిగినట్టియు, ఎల్లెడల ప్రకాశము కలిగినట్టియు, సుఖముగ వీక్షించుటకు శక్యముకానట్టియు, జ్వలించుచుండు సూర్యాగ్నులవలె కాంతికలిగినట్టియు, అంతదింతదియని నిరూపింపరానట్టియు యుష్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వమును అంతట జూచుచున్నాడను.

మూ॥ త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానమ్।
త్వమవ్యయశ్శాశ్వత ధర్మగోప్తా సనాతనస్త్వం పురుషో మతో మే॥ 18.

తా॥ జిజ్ఞాసువులచే దెలియబడదగిన అక్షరపరబ్రహ్మవు నీవు. ఈప్రపంచమునకు శ్రేష్ఠమైన నిధానము (ధరించువాడవు, పోషించువాడవు) నీవు. క్షీణము కానివాడవు శాశ్వతమైన ఆత్మధర్మమును కాపాడువాడవు నీవు. శాశ్వత పురుషుడవు నీవు. అని నాయభిప్రాయము.

శ్లో॥ స ఏవ కాలే భువనస్య గోప్తా
విశ్వాధిపస్సర్వ భూతేషు గూఢః
యస్మిన్ యుక్తా బ్రహ్మర్షయో దేవతాశ్చ
తమేవం జ్ఞాత్వా మృత్యుపాశాంశ్ఛినత్తి॥

ఆపరమాత్మ కాలము వచ్చినప్పుడు విశ్వమును గుప్తపఱచువాడు. విశ్వమును పాలించువాడు. సర్వభూతములయందు రహస్యముగనుండు వాడు. బ్రహ్మర్షులు, దేవతలు ఎవనియందు కూడియున్నారో అట్టిసర్వభూతాత్మయైన పరమాత్మను ఈవిధముగ తెలిసికొని (జ్ఞాని) మృత్యుపాశములను త్రెంపివేయుచున్నాడు. (శ్వేతాశ్వతరోపనిషత్తు 4 అధ్యా. 15 శ్లో.)

మూ॥ అనాది మధ్యాంత మనంత వీర్య
మనంతబాహుం శశిసూర్యనేత్రమ్
పశ్యామి త్వాం దీప్త హుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపంతమ్॥ 19.

తా॥ ఆది. మధ్యము, అంతము అనునవిలేనట్టియు. అంతములేని బలము కలిగినట్టియు అంతములేని భుజములు కలిగినట్టియు, చంద్రసూర్యులు నేత్రములుగగలిగినట్టియు, జ్వలించుచుండు అగ్నివంటి ముఖములు కలిగినట్టియు, స్వకీయమైన తేజస్సుచే ఈప్రపంచమును సంతాపింపజేయునట్టియు నిన్ను చూచుచున్నాడను

"సచానంత శీర్షా పురుష అనంతాక్షీ పాణి పాదో భవతి అనంత శ్రవణ స్సర్వమావృత్య తిష్ఠతి సర్వవ్యాపకో భవతి సగుణ నిర్గుణ స్వరూపో భవతి జ్ఞాన బలైశ్వర్య శక్తి తేజః స్వరూపో భవతి వివిధ విచిత్రానంత జగదాకారో భవతి"

ఆ పరమపురుషుడు అంతములేని శిరములు, కన్నులు, హస్తములు పాదములు కలిగియున్నాడు. అంతములేని చెవులు కలిగి సర్వము నావరించి యున్నాడు. సర్వప్రపంచమును వ్యాపించియున్నాడు. గుణములతో గూడినట్టియు, గుణములు లేనట్టియు, రూపములన్నియు దానేయైయున్నాడు జ్ఞానము, బలము, ఈశ్వరత్వము, శక్తి, తేజస్సు ఇవన్నియు తన స్వరూపముగగలిగియున్నాడు. నానావిధములైన చిత్రములతో అంతములేని ప్రపంచము ఆకారముగా గలిగియున్నాడు. (మహానారాయణోపనిషత్తు 2 అధ్యా.

మూ॥ ద్యావా పృధివ్యోరిదమంతరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః
దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥

తా॥ ఓమహాత్మా! ఆకాశమునకు, భూమికి నడుమనుండు బయలు సర్వదిక్కులు అంతయు నీయొక్కనిచేతనే వ్యాప్తమైయున్నదికదా? మఱియు ఆశ్చర్యకరమైన, భయంకరమైన యిట్టి నీరూపమునుజూచి మూడు లోకములు (స్థూల సూక్ష్మ కారణశరీరములు) భయముచే సంచలించినవి.

మూ॥ అమీహి త్వాం సురసంఘా విశంతి
కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి
స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః॥ 21.

తా॥ శుభమును ప్రకటించునట్టియు, గ్రహించునట్టియు, మఱియెవరికైనను కలుగజేయునట్టియు ఈదివ్యపురుషుల సంఘములెల్ల నిన్ను కలిసికొనుచున్నవిగదా? కొందఱు భయపడినవారు చేతులు జోడించుకొని పొగడుచున్నారు. మహర్షులయొక్కయు, సిద్ధులయొక్కయు, సంఘములు 'స్వస్తి' అని చెప్పుచు మిక్కుటములైన స్తుతివాక్యములతో నిన్ను స్తోత్రము చేయుచున్నవి.

మూ॥ రుద్రాదిత్యా వసవో యేచ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ
గంధర్వ యక్షాసుర సిద్ధ సంఘా
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే॥ 22

తా॥ రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినులు, మరుత్తులు, వేడిపదార్థములనుమాత్రము ఆహరించువారు, (పితృదేవతలు) సమూహములుగ జేరియుండు గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు వీరందఱు ఆశ్చర్యము నొందినవారై నిన్నే చూచుచున్నారు. (విశ్వాతీతమైన స్వస్వరూపమును జూడగలిగినప్పుడు సామాన్యపురుషులు ఆశ్చర్యముతోనే చూతురు.)

మూ॥ రూపం మహత్తే బహువక్త్ర నేత్రం
మహాబాహో బహు బాహూరుపాదమ్
బహూదరం బహుదంష్ట్రా కరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాహమ్॥ 23.

తా॥ ఓకృష్ణా! అనేక ముఖములు, నేత్రములు కలిగినట్టియు, అనేక భుజములు, తొడలు, పాదములుకలిగినట్టియు, అనేక కడుపులు కలిగినట్టియు, అనేక దంష్ట్రలచే వికృతము, భయంకరము నైనట్టియు గొప్పదైన నీ రూపమునుజూచి లోకులు భయపడి కంపించుచున్నారు. అట్లే నేను. (కంపించుచున్నాడను)

మూ॥ నభస్స్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననం దీప్త విశాల నేత్రమ్।
దృష్ట్వాహి త్వాం ప్రవ్యథితాంతరాత్మా ధృతిం నవిందామి శమంచవిష్ణో॥

తా॥ విశ్వమంతట వ్యాపించియుండు ఓ కృష్ణా! ఆకాశమును సోకునట్టియు, వెలుగుచుండునట్టియు, పెక్కువర్ణములు కలిగినట్టియు, విస్తృతములైన ముఖములు కలిగినట్టియు జ్వలించుచుండు విశాలమైన నేత్రములు కలిగినట్టియు నిన్నుజూచి సంచలిత స్వాంతుడ నైతిని. ధైర్యమును పొందలేకున్నవాడను. చిత్తోపశాంతియు పొందలేకున్నవాడకదా?

మూ॥ దంష్ట్రాకరాళానిచ తే ముఖాని దృష్ట్వైవ కాలానల సన్నిభాని
దిశో న జానే నలభేచ శర్మ ప్రసీద దేవేశ! జగన్నివాస! 25.

తా॥ జగములకు వెలుపల, లోపల అంతట వ్యాపించియుండునట్టియు దివ్యపురుషులకు నియామకుడ వైనట్టియు, ఓకృష్ణా! కోఱలచే వికృతములు, భయంకరములు నైనట్టియు, ప్రళయ కాలాగ్నితో సమానములైనట్టియు నీ ముఖములజూచి (ఆకారణముచేతనే) దిక్కులు తెలిసికొనలేకున్నాడను. సుఖమునుసైతము పొందలేకున్నాడను ప్రసన్నుడవుకమ్ము.

మూ॥ అమీచ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రా స్సర్వే సహైవావనిపాలసంఘైః
భీష్మో ద్రోణస్సూతపుత్రస్తథాసౌ సహాస్మదీయైరపి యోధముఖ్యైః॥ 26
వక్త్రాణి తే త్వరమాణా విశంతి దంష్ట్రాకరాళాని భయానకాని।
కేచిద్విలగ్నా దశనాంతరేషు సందృశ్యంతే చూర్ణితైరుత్తమాంగైః॥ 27

తా॥ ధృతరాష్ట్రుని కుమారులు, భీష్ముడు, ద్రోణుడు, అదేవిధముగా సూతపుత్రుడైన కర్ణుడు వీరందఱు సమస్త రాజ సమూహములతో, మనపక్షమువారైన ముఖ్యయోధులతోగూడ త్వరపడుచుండువారై నిన్నుజేరుచున్నారు. కోఱలచే వికృతములు, భయంకరములునైన నీనోళ్లయందు ప్రవేశించుచున్నారు. కొందఱు నీకోఱలనడుమ తగులుకొని పిండిచేయబడిన శిరస్సులతో చూడబడుచున్నారు.

వివ॥ కర్ణుడు యుద్ధమునకు రాలేదుకదా? ఇచట గనబడుట యెట్టులని కొందఱు ప్రశ్నింతురు. ఇందుకు సమాధానము:— విశ్వమయుడైన కాలపురుషునియందు లయింపని వస్తు వొక్కటియు నుండదు. కావున దూరముననున్న కర్ణుడుసైతము కాలముచే గ్రసింపబడునని యిందువల్ల వెల్లడింపబడినది.

మూ॥ యథా నదీనాం బహవోఽంబువేగాః సముద్రమేవాభిముఖాద్రవంతి।
తథాతవామీ నరలోకవీరా విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి॥ 28.

తా॥ జలముచే వేగమునొందిన నదీసమూహములు సముద్రమువైపుగా ఎట్లు పాఱిపోవుచున్నవో అదేవిధముగా మనుష్యలోకమునందలి యీ వీరులు మిక్కిలి జ్వలించుచుండు నీనోళ్లలో ప్రవేశించుచున్నారు.

ఓం. తత్. సత్.



# శతపత్రము

# 106

మూ॥ యథాప్రదీప్తం జ్వలనం పతంగా విశంతి నాశాయ సమృద్ధవేగాః।
తథైవ నాశాయ విశంతి లోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥ 29

తా॥ ఎక్కువ ప్రకాశముకలిగిన అగ్నియందు మిడుతలు మొదలైన కీటకములు తమనాశముకొఱకు మిక్కలి వేగముతో ఏలాగున ప్రవేశించుచున్నవో ఆలాగుననే ఇంద్రియగోచరములైన శరీరములతోగూడిన జీవులన్నియు తమస్వరూప నాశముకొఱకు నీనోళ్లయందుకూడ మిక్కలి వేగముతో ప్రవేశించుచున్నవి.

ప్రాకృతులు శరీరములనువదలి అవ్యక్తదశ పొందుచున్నారు. జ్ఞానులు పృథగ్భావములనువదలి సర్వము తానైన పరమాత్మస్వరూపమును పొందుచున్నారు. "ణశఅదర్శనే" అను సూత్రమువలన ఈ యిరుతెగలవారి విలయమునకు నాశమనిపేరు.

మూ॥ లేలిహ్యసే గ్రసమానస్సమంతా ల్లోకా సమగ్రా వదనైర్జ్వలద్భిః।
తేజోభిరాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో॥ 30

తా॥ సర్వవ్యాపివైన ఓ కృష్ణా! సర్వత్ర వెలుగుచుండు నోళ్లతో సమస్తలోకములను మ్రింగువాడవై పీల్చివేయుచున్నాడవు. రౌద్రములైన నీకాంతులు సమస్తమైన జగత్తును కిరణములచే అంతట పూర్తిగ వ్యాపించి మిగుల తపింపజేయుచున్నవి.

విశే॥ సర్వభూతాత్మయైన పరమాత్మయే నేననెడు జ్ఞానప్రకాశము కలిగినప్పుడు జగత్స్వరూపమైన స్థూల శరీరమునందలి యిరువదినాలుగు తత్త్వములను జ్ఞాన కిరణములు పూర్తిగ వ్యాపించి వెలిగించుచున్నవి. తపింపజేయుచున్నవి.

మూ॥ అఖ్యాహి మే కో భవానుగ్రరూపో నమోఽస్తు తే దేవవర ప్రసీద
విజ్ఞాతుమిచ్ఛామి భవంతమాద్యం నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥

తా॥ జగత్తునకు ఆదిపురుషుడవైన నిన్ను విశేషముగ దెలిసికొనుటకు గోరుచున్నాడను (కాని) నీప్రవర్తనమును లెస్సగ దెలిసికొనలేకున్నాడను. దివ్యపురుషులలో శ్రేష్టుడవైన ఓ కృష్ణా! నీకు నమస్కారమగుగాక. ప్రస న్నుడవుకమ్ము. భయంకరమైన రూపముగల నీవెవ్వడవో అదియంతయు నాకు జెప్పుము.

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు;-

మూ॥ కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః
ఋతేఽపి త్వాం నభవిష్యంతి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥

తా॥ నేను లోకక్షయము గావించుటకు వృద్ధినొందిన కాలపురుషుడను. లోకులను సంహరించుటకై యిచ్చట ప్రవర్తించుచున్నాడను (ఇట్టిలోకక్ష యకార్యమునందు) నిన్ను నియోగింపక వదలిపెట్టినప్పటికిని ఎదుటిసైన్య ములో (ఇప్పుడు) ఏయోధులు చేరియున్నారో వారందఱు ఇకమీదట ఉండ జాలరు.

శ్లో॥ న కాలస్య ప్రియః కశ్చిన్నద్వేష్యః కురుసత్తమ।
న మధ్యస్థః క్వచిత్కాలస్సర్వం కాలః ప్రకర్షతి
కాలః పచతి భూతాని కాలస్సంహరతే ప్రజాః
కాలః సుప్తేషు జాగర్తి కాలోహి దురతిక్రమః॥

ఓకురుశ్రేష్ఠా! కాలమున కెవ్వడును ప్రియుడులేడు, ద్వేషింపగిన వాడులేడు. ఎక్కడనైన కాలము ఇచ్ఛాద్వేషములకు మధ్యస్థముగనుండు నదికాదు. సర్వమును లాగుకొనిపోవుచున్నది. జీవులను పాకము దీర్చు చున్నది, ప్రజల సంహరించుచున్నది. సర్వభూతములు నిద్రించుచుండగా కాలము మేలుకొనియుండును. కాలము నతిక్రమించుటయనిన సులభమైన పనికాదు. (భార స్త్రీ 2అ. 23-24)

విశే॥ (కలసంఖ్యానే, కలకిలక్షేపే, లోకృదర్శనే) అస్మత్పదలక్ష్యార్థ మైన పరిశుద్ధాత్మ శాశ్వతమైనది, నిత్యశుభ స్వరూపమైనది అనియు; దాని కంటె వేరైన చరాచరరూపమైన దృశ్యవస్తు సముదాయమంతయు అశాశ్వత

మైనది. అమంగళకరమైనది అనియు విమర్శించు వివేకమునేను. బాహ్యాంతరముల గనబడు శబ్దరూపములు, జ్ఞానికి నిత్యశత్రువులైన కామక్రోధాదులు, వీనివలన సంభవించు సుఖదుఃఖాది ద్వంద్వములు, ఈద్వంద్వముల వలన గలుగు ఇచ్ఛాద్వేషములు అన్నియు నేను కానని తెలిసికొని నిషేధించు సాంఖ్య సూత్రమునేను. ద్రష్టృదర్శన దృశ్యములను విరామమొందించు సమాధి నిష్ఠాసూత్రము నేను.

మఱియు చూడబడుచున్న (జ్ఞాతచే లక్షింపబడుచున్న) చతుర్దశేంద్రియములను, పవనములను, పంచభూతములను లెస్సగ హరించుటకై (నాయందు విలయము గావించుటకై) జగత్స్వరూపమైన యీస్థూలశరీరమునందు వర్తించుచున్నాడ అనేకజన్మములలో జేయబడిన సుకృతఫలముకలిసి వచ్చుటచే గురుకటాక్షము కలుగుచున్నది. అట్టిగురుబలముచేతనే కామక్రోధాది శత్రువర్గము క్షీణింపక తప్పదు. పుంభావముతోగూడిన ప్రత్యగాత్మ ప్రయత్నపూర్వకముగ నిర్మూలింపకున్నను శత్రువర్గము నిలువజాలదు.

మూ॥ తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్॥ 33.

తా॥ అందువలన నీవులెమ్ము - కీర్తిని సంపాదించుకొనుము, శత్రువుల గెల్చి రాజ్యమును సంపూర్ణముగా అనుభవింపుము. వీరందఱు నింతకు పూర్వమే నాచేతనే నిహతులైనవారు. అర్జునా! (నీవిక) కారణమాత్రుడవు కమ్ము.

విశే॥ శిష్యులు అభ్యాసయోగముచేత ప్రయత్నపూర్వకముగ కామాదుల జయింపకున్నను గురువులవారి యనుగ్రహమును పొందినప్పుడే అట్టి శత్రుగుణముల వేగము అడగిపోవుచున్నది. ఐనను శిష్యులు యోగాభ్యాసము చేసి జయించుటే కీర్తికరము. ఇటుల జయించిన వారికే మోక్షసామ్రాజ్య సుఖము. పర్యాప్తముగ దక్కుచున్నది. ప్రయత్నము లేనివానికి పూర్వసుకృతముచే కామాదుల వేగము తక్కువకావచ్చునేమో కాని అంతమాత్రము చేతనే ఆత్మసాక్షాత్కారము కలుగునని చెప్పుటకు వీలుపడదు. కనుక శిష్యుడు నిమిత్తమాత్రుడై ప్రయత్నము చేయవలసినదే.

మూ॥ ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ కర్ణం తథాన్యానపి యోధవీరాన్
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్

తా॥ నాచేత చంపబడిన (దైవోపహతులైన) ద్రోణుని, భీష్ముని, సైంధవుని, కర్ణుని, అదేవిధముగా ఇతరులైన యుద్ధవీరులనుగూడ నీవు చంపుము. రణరంగమున శత్రువుల జయించు స్వభావముకలవాడవైయున్నాడవు. సంచలింపకుము - యుద్ధమొనర్పుము.

విశే॥ ఆచార్యుని యనుగ్రహ బలముచేతనే కొట్టువడియుండు కౌటిల్యమును, పైశున్యమును, కామమును, మాత్సర్యమును, ఇట్లే తక్కిన అంతశ్శత్రువులను శిష్యుడు నిమిత్తమాత్రుడై జయింపవలయునని భావము. "రణశబ్దే" అను సూత్రమును బట్టి రణమునందనగా ప్రణవశబ్ద ముత్పన్నమగు సహస్రారమునందని ఆధ్యాత్మికుల భావము. అటుల ప్రణవము శబ్దించు ఊర్ధ్వకుండలి స్థానమున కామలోభాదులైన శత్రువుల జయించుటకు సామర్థ్యము కలిగియున్నాడవు చలింపకుము. శత్రువుల సంహరింపుము. అనియిట్లు గురువు శిష్యుని ప్రేరేపించుచున్నాడు.

సంజయుడు చెప్పుచున్నాడు:-

మూ॥ ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాంజలిర్వేపమానః కిరీటీ
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య॥

తా॥ ఓధృతరాష్ట్ర మహారాజా! ఇటుల జెప్పబడిన శ్రీకృష్ణునిమాటవిని అర్జునుడు రెట్టింపుభయము, కంపముగలవాడై చేతులు జోడించుకొని వినమ్రుడై నమస్కారముచేసి తొట్రుపాటొందిన కంఠస్వరముతో శ్రీ కృష్ణుని గూర్చి మఱియు జెప్పుచున్నాడు.

అర్జునుడు చెప్పుచున్నాడు.

మూ॥ స్థానే హృషీకేశ! తవ ప్రకీర్త్యా జగత్ ప్రహృష్యత్యనురజ్యతే చ
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతిచ సిద్ధసంఘాః॥36

తా॥ (శత్రుక్షయకరమైన) నీయశస్సుచే జగత్తు సంతుష్టి పొందుచున్నది. అనురాగమునుకూడ పొందుచున్నది. రాక్షసులు భయముజెంది దిక్కులను గుఱించి పాఱిపోవుచున్నారు. తపోమహిమచేత అణిమాద్యష్ట విభూతు

లను గడించిన విశ్వావసు ప్రముఖులైన సిద్ధపురుషుల సంఘములన్నియు నమస్కరించుచున్నవి. చతుర్దశేంద్రియములకు నియామకుడవైన ఓభగవంతా! యిదియంతయు యుక్తమేయగును.

మూ॥ కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే
అనంత! దేవేశ! జగన్నివాస! త్వమక్షరం సదసత్తత్పరం యత్॥ 37

తా॥ అంతమన్నమాటే లేనట్టియు, దేవతలకు నియామకుడవైనట్టియు, జగమునందెల్లెడల|వ్యాపించియుండునట్టియు, ఓమహాత్మా! సద్వస్తువు, అసద్వస్తువు, ఈరెండు వస్తువులకంటె వేఱైన మఱియొకవస్తువు అంతయు తానైనది యేదికలదో అట్టి నాశరహితమైన పరమాత్మ తత్త్వమేనీవు సృష్టికర్తయైన సగుణబ్రహ్మకంటెనైతము గొప్పవాడవైనట్టియు, మొట్టమొదటి కర్తవైనట్టియు, నీకు (పూర్వోక్త శ్లోకరీతిగ సిద్ధాదులు) ఎందుకు నమస్కరింపరు?

మూ॥ త్వమాదిదేవః పురుషః పురాణ స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్।
వేత్తాసి వేద్యంచ పరంచ ధామ త్వయా తతం విశ్వమనంతరూప॥38

తా॥ అంతములేని స్వరూపముగల ఓకృష్ణా! నీవు దివ్యపురుషులలో మొదటివాడవు సర్వశరీరములయందు ఇరువదియైదు తత్త్వములలో అగ్రస్థానమును పొందియుండు ప్రత్యగాత్మవు పృథివియందు పుట్టి పెరుగు జీవులన్నిటిలో పూర్వికుడవు. ఈ ప్రపంచమునకు నీవు శ్రేష్ఠమైన యునికిపట్టు వగుదువు. సమస్తమును తెలిసికొనువాడవై యున్నాడవు. తెలియబడునది కూడ నీవేయైయున్నాడవు. (బ్రహ్మనిష్ఠాపరులు పొందదగిన) మోక్షపదము నైతము అయియున్నాడవు ప్రపంచమంతయు నీచేవ్యాప్తమైయున్నది.

మూ॥ వాయుర్యమోఽగ్నిర్వరుణ శ్శశాంకః ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమోనమస్తే॥ 39

తా॥ నీవు వాయుదేవుడవు, అగ్నివి, వరుణదేవుడవు, చంద్రుడవు, ప్రజలను సృజించి పాలించు విధాతవు. ప్రపంచమునకు తాతయైన బ్రహ్మకు తండ్రివికూడ. (అగుదువు) నీకు నమస్కారమగుగాక. మఱియు నమస్కారము. ఇకను నమస్కారము. మాటిమాటికి పెక్కుసారులు నమస్కారము.

విశే॥ స్థూలశరీరమునందు త్వగింద్రియమునకు అధిదైవతమువాయువు, పాయురింద్రియమునకు అధిదైవతము మృత్యువు, (యమునిరూపాంతరము.) వాగింద్రియమునకు అధిదైవతమగ్ని, జిహ్వేంద్రియమున కధిదైవతము వరుణుడు, మనస్సున కధిదైవతము చంద్రుడు, గుహ్యేంద్రియమున కధిదైవతము ప్రజాపతి, పాదేంద్రియమున కధిదైవతము విష్ణువు.

మూ॥ నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ
అనంతవీర్యామిత విక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః

తా॥ సమస్తరూపములు నీస్వరూపమే యైనట్టియు, అంతములేని ప్రభావము కలిగినట్టియు ఓకృష్ణా! ("వీర్యంబలే ప్రభావేచ" అమర నానా) నీకు ముందువైపున నమస్కారము. అటులే వెనుకవైపున అన్నివైపులయందును నీకే నమస్కార మగుగాక. నీవు అమితమైన విక్రమము గలవాడవు. సర్వమును లెస్సగ ప్రాపించియున్నాడవు. అందువలన సర్వము నీవైయున్నాడవు.

విశే॥ భౌతికదృష్టితో జూడక తత్త్వదృష్టితో జూచినప్పుడు సర్వమును తానే వ్యాపించియుండును. సర్వము తానైయుండును.

మూ॥ సఖేతిమత్వా ప్రసభం యదుక్తం హేకృష్ణ హేయాదవ హేసఖేతి।
అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదాత్ప్రణయేన వాపి॥41

తా॥ ఖ్యాతియందు నీవుకూడ నాయంతవాడవేయని తలచి యిటువంటి నీమహిమను తెలిసికొనలేని నాచేత "ఓకృష్ణా! ఓయాదవా! ఓ మిత్రమా!" అని బలవంతముగ నుడువబడిన (అవజ్ఞ) యేదికలదో అది స్వాభావికమైన యేమఱుపాటువల్లను, నీయందు నాకు గల చనవుచేతనుకూడ (కలిగియుండును )

మూ॥ యచ్చావహాసార్థ మసత్కృతోఽసి విహారశయ్యాసనభోజనేషు।
ఏకోఽథవాప్యచ్యుత! తత్సమక్షం తత్క్షామయే త్వా మహమప్రమేయమ్॥

తా॥ స్థానభ్రంశముజెందని ఓకృష్ణా! విహరించుచోట, శయనించుచోట కూర్చుండినచోట, భుజించుచోట ఒంటరిగ నుండునప్పుడు, అదిగాక (జన) సమక్షములోగూడ పరిహాసముకొఱకు (పూర్వశ్లోకరీతి నాచేత) అసత్కారము చేయబడితివి (దేవా! నీమహిమకుదగిన సత్కారము చేయబడలేదు.) అట్టి యపకృతి యేదేది కలదో దానినంతటిని క్షమింపనై యెంతవాడవో యెఱుగరాని నిన్ను నేను అర్థించుచున్నాడను.

మూ॥ పితాసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్।
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమప్రభావ॥

తా॥ సాటిలేని ప్రభావముగల ఓకృష్ణా! స్థావరజంగమాదులతో గూడిన యీ ప్రపంచమునకెల్ల ( ఇంద్రియగోచరమైన వస్తుసముదాయమునకెల్ల ) నీవు తండ్రివి. (పుట్టించువాడవు, రక్షించువాడవు,) పూజనీయుడవు, మిగుల గొప్పవాడవు, (గురుడవు)నైయున్నాడవు. మూడు లోకములయందు సైతము నీకు సమానుడు లేడు. నీకంటె గొప్పవాడింకొకడు మరెక్కడనుండును?

విశే॥ ఎంతదూరము పరిశీలించినను ఈశ్వరత్వమొకటేకాని యింకొకటి యుండునని యేశాస్త్రములోను జెప్పబడియుండలేదు. కాబట్టి దీనికి సమానమైనదికాని, దీనికంటె గొప్పదికాని స్థూల సూక్ష్మ కారణ శరీరముల యందును, జాగ్రత్స్వప్న సుషుప్తులయందును, బాహ్యాంతరమధ్య లక్ష్యములయందును ఎచ్చటనైన మఱియొకటియుండదు.

మూ॥ తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్॥ 44.

తా॥ అందువలన నేను శరీరమును లెస్సగ విధించి నమస్కరించి నియామకుడవైన, స్తుతిపాత్రుడవైన నిన్ను ప్రసన్నుని జేసికొను చున్నాడను. కుమారుని యపరాధమును తండ్రి సహించినటుల, స్నేహితుని యపరాధమును స్నేహితుడు సహించినటుల ప్రియుడనైన నాకొఱకు ఓదేవా! ప్రియుడవైన నీవు సహింపదగిన వాడవు.

మూ॥ అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేనచ ప్రవ్యథితం మనో మే
తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస॥ 45.

తా॥ అదృష్టపూర్వకమైన (పూర్వము చూడబడని) నీవిశ్వరూపమును జూచి నేను సంతుష్టుడనైతిని. భయముచేత నామనస్సు మిగుల వ్యథజెంది

నది. ఓదేవా! అదివఱకుండిన (సౌమ్యమైన) రూపమునే నాకు జూపుము. దేవతల కీశ్వరుడవైనట్టియు, విశ్వవ్యాపివైనట్టియు ఓ కృష్ణా! ప్రసన్నుడవు కమ్ము.

విశే॥ "అదృష్టపూర్వం" అనగా ఇంతకుపూర్వ మెన్నడును, ఎవ్వరి చేతను చూడబడినది కాదని కొందఱు పండితులు అనువాదము చేసియున్నారు. భాగవత త్రివిక్రమావతార ఘట్టములో భగవంతుని విశ్వరూపమును మూడులోకముల ప్రజలు చూచినారని పౌరాణికులు చెప్పుచున్నారు. శ్రీకృష్ణుని జీవితములోసైతము అవతారము మొదలుకొని భగవద్గీతాఘట్టము వఱకు అనడుమ నందందు పండ్రెండుసారులు విశ్వరూపము చూపబడియుండెననియు, అనేకులు చూచియుండిరనియు 83 పత్రములో విశదముగ వ్రాయబడినది పాఠకులు చదివియుందురు. ఇట్లుండ నింతకుపూర్వమెన్నడును, ఎవ్వరిచేతను చూడబడినదికాదని యనువదించుట తృప్తికరముగనుండదు. అర్జునిచేతమాత్ర మిదివఱకిట్టి రూపమెన్నడును చూడబడియుండదని యొప్పుకొనుట న్యాయ్యమే యగును.

పూర్వజన్మ సుకృతఫలమును అదృష్టమందురు. అర్జునునకట్టి యదృష్టము కల్గినమీదటనే భగవంతుని యనుగ్రహము కలిగినది. అందుచేతనే విశ్వరూపమును దర్శింపగలిగినాడు. ఇందు తొలుతకలిగినది అదృష్టమే కనుక "అదృష్టపూర్వం" అనగా అదృష్టమే పూర్వముగగల భగవత్స్వరూప దర్శనమని యొప్పుకొనవచ్చును. మఱియు భగవత్తత్త్వమునకంటె పూర్వవస్తువేదియు జూడబడియుండనందున నట్టి పరబ్రహ్మ స్వరూపమే యదృష్టపూర్వమని యొప్పుకొనవచ్చును.

మూ॥ కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో! భవ విశ్వమూర్తే!॥ 46.

తా॥ అనేకబాహువులు కలిగినట్టియు, ప్రపంచమంతయు నీయాకారమే యైనట్టియు, ఓ కృష్ణా! నిన్ను కిరీటము, గద కలవానినిగాను, చక్రాయుధమును చేత బట్టుకొనినవానినిగాను చూచుటకు నేనిష్టపడుచున్నాడను అప్రకారముగానే అట్టి చతుర్భుజాకారము కలవాడవుకమ్ము.

వివ॥ శ్రీకృష్ణుడు తన జీవితకాలములో నిరంతరము చతుర్భుజాకార ముతోనే వర్తించినట్లు పురాణములలో ఋజువులేదు. అప్పుడప్పుడు భక్తుల కట్టి రూపమును కనబఱచినట్లుమాత్రము తెలియుచున్నది. అర్జునుడు కూడ అంతకు పూర్వమట్టి రూపమును చూచియుండును. అది కేవలము భయానకమైయుండక సౌమ్యముగను, మనోహరముగను నుండుటచే ఇప్పు డట్టి సౌమ్యరూపమునే చూచుట కిష్టపడి యుండవచ్చును.

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-

మూ॥ మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శితమాత్మయోగాత్।
తేజోమయం విశ్వమనంతమాద్యం యన్మే త్వదన్యేన నదృష్టపూర్వమ్

తా॥ అర్జునా! ప్రసన్నుడనైన నాచేత నీకొఱకునై స్వకీయమైన యోగ బలమువలన చూపబడిన శ్రేష్ఠమైనట్టియు, అంతములేనట్టియు, ప్రభావ పూర్ణమైనట్టియు, ప్రపంచరూపమైనట్టియు, మొట్టమొదటిదైనట్టియు, రూప మేడికలదో అది నీకంటె నితరునిచేత ఇంతకుముందు చూడబడినది కాదు.

ఇదివఱకు కొన్ని విశ్వరూపములు అందందుజూడ బడినను ఇచ్చట జూడబడినది కాలాత్మకమగుటవలన అదృష్టపూర్వమని పేర్కొనబడి యుండవచ్చును.

మూ॥ నవేదయజ్ఞాధ్యయనైర్నదానైర్నచ క్రియాభిర్నతపోభిరుగ్రైః
ఏవం రూపశ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర॥ 48

తా॥ అర్జునా! ఇటువంటి విశ్వరూపముగల నేను నరలోకములో నీకంటె ఇతరునిచేత వేదములచేతను, యజ్ఞముల చేతను, అధ్యయనముచేతను దానములచేతను, శ్రౌత స్మార్తాది కర్మలచేతను, భయంకరములైన తపము లచేతను, చూచుటకు శక్యముకానివాడను, (భక్తిజ్ఞాన వైరాగ్యములచేగాక యితరక్రియలచే భగవత్తత్త్వము ప్రసన్నముకాదని భావము.)

మూ॥ మా తే వ్యథా మాచ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య॥ 49

తా॥ ఇటువంటి భయంకరమైన నా యీ విశ్వరూపమును జూచి నీకు సంచలనము వలదు. మూఢత్వముకూడ వలదు. నీవు భయమువదలి సంతుష్టాంతరంగుడవై మరల తొల్లిటి (సౌమ్యమైన) నారూపమునే యిదిగో లెస్సగ జూడుము.

సంజయుడు చెప్పుచున్నాడు:-

మూ॥ ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా స్వకం రూపం దర్శయామాస భూయః।
ఆశ్వాసయామాసచ భీతమేనం భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా॥ 50.

తా॥ అని యాప్రకారముగా సర్వవ్యాపియైన భగవంతుడు అర్జునుని గుఱించి చెప్పి స్వకీయమైన (తొల్లిటిసౌమ్య) రూపమును మరలచూపెను. మహాత్ముడైన శ్రీకృష్ణుడు సౌమ్యమైన దేహముగలవాడై భయవిహ్వలుడగు అర్జునుని మఱియును ఊరార్చెను.

అర్జునుడు చెప్పుచున్నాడు;-

మూ॥ దృష్ట్వేమం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన।
ఇదానీమస్మి సంవృత్తస్సచేతాః ప్రకృతిం గతః॥ 51.

తా॥ ఓ కృష్ణా! మనుష్య సంబంధమైనట్టియు, సౌమ్యమైనట్టియు నీయీ రూపమును జూచి యిప్పుడు స్వస్థతజెందితిని. నాచిత్తము నాతోగూడుకొనినది. (మునుపటిరీతి) నాభావము నేను పొందితిని.

విశే॥ సర్వముతానైన విశ్వరూపమును జూచుటచాలించి జీవస్వరూపమైన మనుష్యరూపమును జూడగా ఆజీవుని సత్త్వాదిగుణములు చుట్టుకొనుచున్నవి. చలనహేతువైన చిత్తము పొడగట్టుచున్నది. సమస్తకర్మలకు కారణమైన మాయతో జీవుడు అపరింపబడుచున్నాడు. ఐనను విశ్వవ్యాపియైన పరమాత్మస్వరూపమునుజూచిన జ్ఞప్తి నిల్చియుండుటచే మాయను తరించుటకు, పరమాత్మను జేరుటకు తీవ్రమైన ప్రయత్నము జేయుచున్నాడు.

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు -

మూ॥ సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః॥ 52.

తా॥ నీవు ఏరూపమునుజూచియున్నాడవో అట్టి కాలాత్మకమైన విశ్వరూపము సుఖముగజూచుటకు శక్యమైనదికాదు. ఇటువంటి నాయీశ్వర స్వరూప సందర్శనమును దేవతలుసైతము నిరంతరము కాంక్షించుచున్నారు.

మూ॥ నాహం వేదైర్నతపసా నదానేన నచేజ్యయా
శక్య ఏవం విధోద్రష్టుం దృష్టవానసి మాం యథా॥ 53

తా॥ (నీవిపుడు) ఏప్రకారముగా నన్ను చూచియున్నాడవో అదే ప్రకారముగా జూచుటకు వేదములచేతను, తపస్సుచేతను, దానముచేతను, యజ్ఞముచేతనుసైతము శక్యముకానివాడను. (అంతరంగికమైన సమదృష్టితో జూచినప్పుడు స్వస్వరూపము తెలియబడునేకాని భౌతికములైన వైదికకర్మలతో ఎన్నటికిని తెలియబడదని భావము.)

మూ॥ భక్త్యాత్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప॥ 54

తా॥ కామక్రోధాదులను శత్రువులను తపింపజేయు అర్జునా! తనకంటె వేఱైన చైతన్యవస్తు వింకొకటి లేదన్న నిశ్చయముకలిగి తనలోదాను స్వస్వరూపమును భజించుటచేత ఈవిధముగా నేను ఉన్నదున్నట్టు తెలిసికొనుటకు, చూచుటకు, ప్రవేశించుటకు శక్యమగుదును.

మూ॥ మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః।
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ॥ 55.

తా॥ అర్జునా! ఎవడైతే భౌతిక విషయవాంఛను మానుకొనుచున్నాడో; సర్వభూతములయందు వైరములేనివాడగుచున్నాడో, అస్మత్పద లక్ష్యార్థమైన పరిశుద్ధాత్మకు సంబంధించిన ఆధ్యాత్మిక కర్మచేయుచున్నాడో, ఆపరమాత్మనే శ్రేష్ఠముగ భావించుచున్నాడో, స్వస్వరూపమునే భజించుచున్నాడో అట్టి యోగీశ్వరుడు నేనని పేర్కొనబడు పరిశుద్ధాత్మను పొందును.

ఇది శ్రీమహాభారతము భీష్మపర్వములో విశ్వరూపసందర్శన యోగమనెడు ముప్పదియైదవ అధ్యాయము.

ఓం. తత్. సత్.

# శత పత్రము

# 107

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 36 అధ్యాయము.

అర్జునుడు చెప్పుచున్నాడు:-

మూ॥ ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే।
యేచాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥

తా॥ ఈప్రకారము (పూర్వోక్తరీతి) నిరంతరము యోగులై (విశ్వరూపాది సాకారబ్రహ్మవు, ఆత్మధర్మప్రవక్తవు. ప్రత్యక్షగురుదేవుడవునైన) నిన్ను ఏభక్తులు లెస్సగ ఉపాసించుచున్నారో, మఱియు అవ్యయమైన నిరాకార పరబ్రహ్మ తత్త్వము నెవరుపాసించుచున్నారో అట్టి యుపాసకులందరిలో ఎక్కువగ యోగము నెఱిగినవారెవరు? (సగుణోపాసకులలోను, నిర్గుణోపాసకులలోను, ఎవరు మేలురకము? అని శిష్యుడడుగుచున్నాడు.

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-

మూ॥ మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః॥ 2.

తా॥ నా యందు ప్రవేశపెట్టబడిన మనస్సుగలవారై నిరంతరము యోగులై మంచిశ్రద్ధతో గూడుకొని ఎవరైతే (సగుణబ్రహ్మనైన) నన్ను ఉపాసించుచున్నారో అట్టివారు ఉత్తమయోగులని నాయభిప్రాయము.

మూ॥ యేత్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగమచింత్యంచ కూటస్థమచలం ధ్రువమ్ 3.

సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః॥ 4

తా॥ ఎవరైతే యింద్రియ సముదాయమును బాగుగ నిగ్రహించి యెల్లెడల (సర్వద్వంద్వములయందు. విషయభోగాదులయందు, చరాచరాది సర్వభూతములయందు) సమమైన భావము కలిగి (అందువల్లనే) సర్వభూతములకు శుభముకలుగవలయు ననెడు ఆసక్తికలవారై అట్టిదిట్టిది, అంతదింతది అని నిరూపింపరానట్టియు, ఇంద్రియములకు గోచరముకానట్టియు, విశ్వమంతట వ్యాపించియుండునట్టియు, చింతించుటకు వీలుకానట్టియు, సమస్త కర్మలు దహింపబడు సుషుమ్నాగ్ర స్థానమున నిలిచియుండునట్టియు, చాంచల్యములేనట్టియు, సనాతనమైనట్టియు, అక్షరపరబ్రహ్మ తత్త్వము నుపాసించుచున్నారో అట్టి (పరిపూర్ణజ్ఞాన సిద్ధాంతులైన) వారు అస్మత్పద లక్ష్యార్థమైన పరిశుద్ధాత్మనే పొందుచున్నారు.

మూ॥ క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తాసక్తచేతసామ్
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే॥ 5

తా॥ ఇంద్రియముల కతీతమైన నిరాకార తత్త్వమునందు ఆసక్తిజెందిన చిత్తముగల అనిర్గుణోపాసకులకు శ్రమయెక్కువ. (అదెట్లనిన) కంటికి కనబడనితోవ దేహధారులైన జనులచే సుఖముగ ప్రాపింపబడదుకదా?

కంటికి కనబడనిబాట మనస్సుచే ప్రాపించుట సులభము కావచ్చునేమోకాని దేహముతో ప్రాపించుట సులభముకాదు. అందువల్ల దేహధారులకు సుఖముగ పొందరానిదని చెప్పబడినది.

మూ॥ యేతు సర్వాణి కర్మాణి మయి సంన్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే॥ 6.
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్।
భవామి నచిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్॥ 7.

తా॥ ఆత్మరక్షణోపాయమునుగుఱించి యాచించు ఓయర్జునా! భౌతికములు, ఆధ్యాత్మికములునైన సమస్త కర్మలను అస్మత్పద లక్ష్యార్థమైన పరమాత్మయందు సంక్షిప్తము గావించి, ఆపరమాత్మయే శ్రేష్ఠమైనదను భావము గలవారై, తమయందు వెలుగొందు అంతర్యామి తత్త్వమునకంటె అన్యమైన మఱిదేనితోను సంయోగములేనివారై, నేననిపేర్కొనబడు ఆభగవత్తత్త్వమునుధ్యానించుచు ఏవరైతే ఉపాసించుచున్నారో! (సర్వభూతాత్మ) నాయందు

ప్రవేశపెట్టబడిన చిత్తముగల ఆయోగీశ్వరులకు నేను మృత్యుసహితమైన సంసృతి సాగరమునుండి త్వరగా పైకి లేవదీయువాడనై యున్నాడను.

మూ॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః॥ 8.

తా॥ నేనని పేర్కొనబడు (విశ్వవ్యాపియైన) పరమాత్మయందే మనస్సును లెస్సగ నిలుపుము. బుద్ధిని అచ్చటనే (నాయందే) ప్రవేశపెట్టుము. అటుపైన (నీవెచ్చటనున్నను) అస్మత్పద లక్ష్యార్థమైన పరిశుద్ధాత్మయందే నివసించినవాడవగుదువు. సంశయములేదు.

సర్వమును తానుగజూచినప్పుడు ఎందున్నను తనయందుండినట్లే భావము.

మూ॥ అథ చిత్తం సమాధాతుం నశక్నోషి మయి స్థిరమ్।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ॥ 9.

తా॥ ఓయర్జునా! ఇకను (బుద్ధియోగముచేత) నాయందు మనస్సును నిశ్చలముగ స్థాపించుటకు నీవు శక్తిలేనివాడవగుదువేని (యమనియమాది పూర్వాంగములతోగూడిన) అభ్యాసయోగముచే (మనస్సును నిగ్రహించి) ఆపిమ్మట నన్ను ప్రాపించుటకు దలపుము.

అభ్యాసయోగముచేత వాసనాక్షయము, చిత్తోపశమము కలుగుచున్నవి. బుద్ధిస్థిరపడుచున్నది. అందువల్ల భగవత్తత్త్వమును ప్రాపింపవచ్చును. ఇది సులభమైనపద్ధతి.

మూ॥ అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి॥ 10.

తా॥ అభ్యాసయోగము చేయుటకైనను అసమర్థుడ వగుదువేని నేనని పేర్కొనబడు అంతర్యామి తత్త్వమునకు ఏకర్మ సమ్మతమైయుండునో ఆకర్మయే శ్రేష్ఠమైనదని విశ్వసింపుము. అట్టిభగవత్తత్త్వముకొఱకు కర్మలు చేయుచునైనను లాభముపొందగలవు.

సర్వభూతములయందలి అంతరాత్మకు సమ్మతమైన కర్మ శుభప్రదముగనే యుండునుగాని దుష్ప్రాప్తికరముగ నుండదు. ఇట్లు కొన్నిజన్మములలో జేయబడిన సత్కర్మఫలము కూడిరాగా అందువలన గురుకటాక్షము

కలుగుచున్నది. అభ్యాసయోగముచేయుటకు సామర్థ్యము కలుగుచున్నది. పిమ్మట నిత్యశుభము లభించుచున్నది అని యుపనిషత్తులలో అందందు జెప్పబడినది.

మూ॥ అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥ 11.

తా॥ ఇకను అట్టి భగవత్పరమైన కర్మనైన చేయుటకు నీకు శక్తిచాలదేని సర్వత్ర నైయుండు పరమాత్మతత్త్వము ననుసంధానముచేయు ఒక దివ్యపురుషు నాశ్రయింపుము. భగవత్కైంకర్యము చేయుటకంటె భాగవత కైంకర్యముచేయుట సులభము కనుక మనస్సును అన్యాయత్తము కానీయక స్వాయత్తము గావించుకొని తరువాత "శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనమ్। అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్" అను భాగవత శ్లోకరీతిగా నివాయనయెడ గావించుకైంకర్యరూపమైన పుణ్యకర్మలకు భౌతికమైన ప్రతిఫలముకోరక దైవార్పణబుద్ధితో జేయుము.

వివ॥ "మద్యోగమాశ్రితః" అను పదమునకు నాయోగము నాశ్రయించిన వాడవై అని కొందఱు పండితులనువదించియున్నారు. జ్ఞానయోగరీతిగ భగవతత్త్వమునందు చిత్తమును స్థిరముగ నిలుపుటకును, అభ్యాసయోగము చేయుటకును, భగవత్ప్రీతికరములైన కర్మల నాచరించుటకును, చేతగాకపోయినప్పుడు నాయోగము నాశ్రయించుటయెట్లో, నియతాత్ముడగుట యెట్లో యని కొందఱడుగుదురు. మఱియు యజమానుని కార్యమునందు నియుక్తుడైన కూలివాడు ఈకార్యము నాది కాదు యజమానునికొఱకు చేయుచుంటి నను భావముతో జేసినయెడల దాని ఫలితమును యజమానునకే యొప్పగించుచున్నాడు. కాని కార్యమేవరిదో ముందు గుర్తింపక చేసినచో ఫలితము యజమానులకు సమర్పించు బుద్ధి కలుగుట దుర్లభము అనియు ప్రశ్నించుచున్నారు. అందువలన "మద్యోగం" అనగా ఆత్మానుసంధానము గల పురుషుని అని చెప్పవలసియున్నది.

నకారాంత పుల్లింగముగనుండు యోగిశబ్దము అకారాంతముగ ప్రయోగింపబడుట యెటులని కొందఱడుగుదురు.

ఇందుకు సమాధానము:— వ్రతీ = వ్రతముకలవాడు (నకారాంత పుల్లింగము.) ప్రియవ్రతః = ప్రియమైన వ్రతముకలవాడు. (అకారాంత పుల్లింగము.) ఇందు వ్యస్తపదముగ నున్నప్పుడు వ్రతీ = అని నకారాంతముగ వచ్చిన శబ్దము సమాసములో ఉత్తరపదముగ వచ్చినప్పుడు "ప్రియవ్రతః" అని అకారాంతముగ వచ్చినది. ఇట్లే యోగిశబ్దము కూడ సమాసమునందు ఉత్తరపదమై " మద్యోగః " అని అకారాంతముగ ప్రయోగింపబడును. "రాజరాజః భక్తసంత్రాణశీలః, తామ్రచూడః, నిర్గుణః, నిరస్తక్రోధః, విశాలోద్యోగః," మొదలైన శబ్దములవలెనని తెలియవలయును.

శ్లో॥ శ్రేయోహి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగాచ్ఛాంతి రనంతరమ్॥ 12.

తా॥ బాహ్యేంద్రియములతో జేయబడు యమనియమాసన ప్రాణాయామములతో జేరిన అభ్యాసయోగమునకంటె పరమాత్మ యిట్టిదని బుద్ధిచే విచారించి తెలిసికొనుట మంచిది. ఇట్లు తెలిసికొనిన పరిశుద్ధాత్మను అనన్యభావముతో జింతించుట యింకనుబాగు. ఈవిధముగ జింతించుటేకాక యీ కాయికవాచిక మానసికములైన సమస్తకర్మల ఫలములను ఆ పరమాత్మయందు సంన్యస్తము గావించుట అంతకంటెను మేలు. అటుపిమ్మట చిత్తోపశమము జెంది నిశ్చలుడైయుండుట అన్నిటికంటెను మేలు.

మూ॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ
నిర్మమో నిరహంకారస్సమదుఃఖసుఖః క్షమీ 13.

సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పిత మనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః॥ 14.

తా॥ ఎవడైతే అంతర్వీధియందు నేనని పేర్కొనబడు భగవత్తత్త్వమునందు మనస్సును బుద్ధిని సన్న్యస్తముగావించి ఆస్వస్వరూపమునుభజించుచున్నాడో, సర్వభూతములయందలి పరమాత్మ తనకంటె వేఱైనదికాదనెడు భావముతో ఆభూతములను ద్వేషింపక మిత్రభావము, దయ కలిగియున్నాడో, అహంకార మమకారములు లేనివాడై సుఖదుఃఖములను, (ద్వంద్వములను) సమముగజూచి కాయక్లేశములను, మనఃక్లేశములను, సహించుకొనుచున్నాడో, ఏవేళకేది లభించినను, లభింపకున్నను తనలోదాను నిత్యతృప్తుడై చిత్తోపశమము కలిగి దృఢమైన నిశ్చయముతో ఆత్మానుసంధానము చేయుచున్నాడో అట్టివాడు నాకు ప్రియమైనవాడు.

శ్లో॥ అప్రాప్తం హి పరిత్యజ్య సంప్రాప్తే సమతాంగతః
అదృష్టఖేదాఖేదో యస్సంతుష్ట ఇతి కథ్యతే॥

ఎవడైతే తనకు లభింపని విషయభోగాదులను వాంచింపక లభించిన దానియందు ప్రియాప్రియములను పాటింపక సమత్వమును పొందియున్నాడో, ఎవనికి ఖేదాఖేదములు కనబడకుండునో అట్టివాడు సంతుష్టుడని చెప్పబడును. (మహోపనిషత్తు 4 అ. 36. శ్లో.)

శ్లో॥ ప్రియాప్రియే పరిత్యజ్య ప్రశాంతాత్మా భవిష్యతి
యదానకురుతే భావం సర్వభూతేషు పాపకమ్॥

ప్రియము, అప్రియము అన్నమాట వదలిపెట్టి సర్వభూతములయందు ఎప్పుడైతే చెడుభావములేనివాడగుచున్నాడో అప్పుడు చిత్తోపశమముకలవాడు కాబోవుచున్నాడు. (పింగళాగీత 55 శ్లో)

శ్లో॥ నచక్షుషా నమనసా నవాచా దూషయేదపి
నప్రత్యక్షం పరోక్షం వా దూషణం వ్యాహరేత్ క్వచిత్॥

కంటిచేనైన, మనస్సుచేనైన, వాక్కుచేనైన (పరులను) దూషింపరాదు. ప్రత్యక్షముగానే, పరోక్షముగానో ఒకానొకచోటనైనను దూషణవాక్యము పలుకరాదు. (హరీతగీత 4 శ్లో)

మూ॥ యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతేచ యః।
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్సచ మే ప్రియః 15.

తా॥ యెవనివలన లోకము భయపడదో లోకమువలన సైతము ఎవడైతే భయపడడో! సంతోషముచేతను, కోపముచేతను, భయముచేతను, ఆత్రముచేతను ఎవడు విడువబడుచున్నాడో అట్టివాడు నాకు ప్రియుమైనవాడు. (ఈశ్లోకము వరాహోపనిషత్తు 4 అధ్యాయములో కొంచెము వర్ణభేదముతోఁ జదివినట్టు జ్ఞాపకము)

శ్లో॥ పరేన్నైవాత్మనశ్చాపి పరస్యైవాత్మనా తథా
అభయం సమవాప్నోతి స పరివ్రాడితి స్మృతిః॥

ఇతరునిచేత తనకును, అదేవిధముగా తనచేత ఇతరునకును లెస్సగ అభయము పొందియుండువాడు సన్న్యాసియని శాస్త్రము.

(నారదపరివ్రాజకోపనిషత్తు 3 ఉపదేశః 1శ్లో.)

శ్లో॥ నోద్విజేత జనాద్ధీరో జనం చోద్వేజయేన్నతు
అతివాదాంస్తితిక్షేత నావమన్యేత కంచన॥

జ్ఞానియైనవాడు ప్రజలవలన భయము లేకుండవలయును. ప్రజలకు భయము కలిగింపరాదు. నిందలను సహించుకొనవలయును. ఎవనినైన అవ మానింపరాదు. (భాగవత 11 స్కం 18 అధ్యా 31.)

శ్లో॥ అభయం సర్వభూతేభ్యః సర్వేషామభయం యతః
సర్వభూతాత్మభూతో యస్తం దేవా బ్రాహ్మణం విదుః॥

ఎవనివలన సర్వభూతములకు భయము కలుగదో, సర్వభూతముల వలన ఎవనికి భయము కలుగదో, ఎవడైతే సర్వభూతములయందలి ఆత్మను పొందియున్నాడో అట్టివాడే బ్రాహ్మణుడని దివ్యపురుషు లెఱుగుదురు.
(భార. శాం 269అ. 33)

శ్లో॥ యదా చాయం నబిభేతి యదాచాస్మాన్నబిభ్యతి।
యదా నేచ్ఛతి నద్వేష్టి బ్రహ్మ సంపద్యతే తదా॥

ఎప్పుడైతే తాను (ఇతరభూతములవలన) భయపడడో, ఎప్పుడైతే అతనివలన (మఱియొకప్రాణి) భయపెట్టబడడో, ఎప్పుడైతే ప్రియమైనదాని యందు ఇచ్ఛలేకుండునో, అప్రియమైనదానియందు ద్వేషము పెట్టుకొన కుండునో అప్పుడే అచలపరిపూర్ణ బ్రహ్మతత్త్వము పొందుచున్నాడు (ఈశ్లోక ము భారత. శాంతి. 26 అధ్యాయములోను, 251 అధ్యాయములోను, 327 అధ్యాయములోను కొంచెము వర్ణభేదముతో జదివినట్టుజ్ఞాపకము.)

శ్లో॥ నబిభేతి యదాచాయం యదా చాస్మాన్నబిభ్యతి
కామద్వేషౌచ జయతి తదాత్మానం ప్రపశ్యతి॥

ఎప్పుడైతే తాను ఇతరజీవివలన భయపడవలసిన పని యుండదో, తన వలన ఇతరజీవి యెప్పుడైతే భయపెట్టబడదో; కామమును, ద్వేషమును ఎప్పుడు జయించుచున్నాడో అప్పుడే పరమాత్మ తత్త్వమును గాంచగలడు.
*(భార శాంతి. 21అ. 4)*

శ్లో॥ అభయం సర్వభూతేభ్యో దత్త్వాయః ప్రవ్రజేద్ద్విజః
లోకాస్తేజోమయాస్తస్య ప్రేత్యచానన్త్య మశ్నుతే॥

సమస్తభూతములకు అభయమునొసగి సన్న్యాసియై యెవడు వెడలి పోవుచున్నాడో అట్టి బ్రహ్మనిష్ఠునకు లోకములన్నియు తేజోమయములగును. అతడు దేహము వదలిపోయినపిమ్మటనైన అంతములేని భావమును (మోక్షమును) పొందుచున్నాడు. (ఈశ్లోకమును భారత. శాంతి. 244 అధ్యాయలోను, హరీతగీతలోను కొంచెము వర్ణభేదముతో జదివినట్టు జ్ఞాపకము.)

శ్లో॥ అభయం సర్వభూతేభ్యో భూతానామభయం యతః।
తస్యమోహాద్విముక్తస్య భయంనాస్తి కుతశ్చ న॥

సమస్తభూతములవలన ఎవనికి భయములేదో, ఎవనివలన ఇతర భూతములకు భయములేదో అట్టి వివేకశాలికి ఏవిధముగనైన భయములేదు.
(భార. శాం. 245అధ్యా. 17.)

శ్లో॥ యస్మాన్న ద్విజతేభూతం జాతు కించిత్కథంచన।
సోఽభయం సర్వభూతేభ్యః సంప్రాప్నోతి మహామునే॥

ఓ మునీంద్రా! ఎవనివలననైతే (ఇతర) భూతము ఒకప్పుడును ఏవిధముగనైనను కొంచెమైనను భయపడదో అట్టివాడు సమస్త భూతముల వలన అభయము పొందుచున్నాడు. (భారత. శాంతి 262 అధ్యా. 31.)

శ్లో॥ అభయం సర్వభూతేభ్యో దత్వా యశ్చరతే మునిః।
న తస్య సర్వభూతేభ్యో భయముత్పద్యతే క్వచిత్॥

ఏ మునీశ్వరుడు సర్వభూతములకు అభయదాన మొసగి చరించుచున్నాడో అతనికి సర్వభూతములవలన ఎందును భయము కలుగదు. (ఈ శ్లోకము భారత శాంతి 192 అధ్యాయములోను, నారద పరివ్రాజకోపనిషత్తు 5 ఉపదేశములోను కొంచెము వర్ణభేదముతో జదివినట్టు జ్ఞాపకము)

శ్లో॥ అభయం యస్య భూతేభ్యః సర్వేషామభయం యతః
నమస్య స్సర్వభూతానాం దాంతో భవతి బుద్ధిమాన్॥

ఎవనివలన సమస్తభూతములకు భయము కలుగదో, భూతములవలన ఎవనికిభయము కలుగదో సమస్తభూతములకు వందనీయుఁడైన అబుద్ధిమంతుఁడు ఇంద్రియనిగ్రహము గలవాఁడగును.
(భారత. శాంతి 220అధ్యా 15)

శ్లో॥ ప్రాప్నోత్యభయదానస్య యద్యత్ఫలమిహాశ్నుతే।
లోకే యస్సర్వభూతేభ్యో దదాత్యభయదక్షిణామ్॥

లోకములో ఎవ్వఁడైతే సమస్తజీవులకు అభయదానమనెడు దక్షిణ యి చ్చుచున్నాఁడో అట్టిపురుషుఁడు ఆ యభయ దానముయొక్క ఫలము ఏమేమి కలదో దానినిపొందుచున్నాఁడు ఈలోకములోనె అనుభవించుచున్నాఁడు. (భారత. శాంతి. 262అధ్యా. 29)

శ్లో॥ సర్వభూతేషు యో విద్వాన్ దదాత్యభయదక్షిణామ్।
దాతా భవతి లోకే స ప్రాణానాం నాత్ర సంశయః॥

ఏపండితుఁడు సమస్తభూతములయందు అభయమనెడు దక్షిణ యిచ్చు చున్నాఁడో అట్టివాఁడు లోకములో ప్రాణములను దానముచేయువాఁడగు చున్నాడు. ఇందుసంశయములేదు. (భారత. అనుశాసన. 115అ. 20.)

శ్లో॥ అభయం సర్వభూతేభ్యో యో దదాతి దయాపరః।
అభయం సర్వభూతాని దదతీత్యనుశుశ్రుమ॥

ఎవఁడైతే దయాగుణమును శ్రేష్ఠముగ విశ్వసించి సర్వభూతములకు అభయమునొసఁగు చున్నాఁడో అతనికిసమస్తభూతములు అభయమునొసఁగు నని వినుచున్నారము. (భారత. అనుశాసన. 116అ 23.)

శ్లో॥ నహింస్యాత్సర్వభూతాని మైత్రాయణగతశ్చరేత్॥
నేదం జీవితమాసాద్య వైరం కుర్వీత కేనచిత॥

సమస్తభూతములను హింసింపరాదు మిత్రభావముతో వర్తింపవలయు ను. ఇటువంటిజీవనమునుపొంది యేయొక జీవితోనైనను వైరము కలుగఁజేసి కొనక యుండవలయును. (హరీతగీత. 5)

శ్లో॥ యత్క్రోధనో యజతి యద్దదాతి, యద్వా తపస్తప్యతి యజ్జుహోతి।
వైవస్వతస్తద్ధరతేఽస్య సర్వం మోఘః శ్రమోభవతి క్రోధనస్య॥

క్రోధముగలవాఁడు ఏపూజచేయుచున్నాఁడో, ఏదానముచేయుచున్నాఁడో, ఏతపస్సు చేయుచున్నాఁడో, అగ్నిహోత్రములో ఏమివేల్చుచున్నాఁడో దాని నంతటినికాలయముఁడు అపహరించుకొని పోవుచున్నాఁడు. వాఁడుచేసిన సు కృతకర్మయంతయు వ్యర్థమగుచున్నవి. వానికిశ్రమమాత్రము మిగులుచు న్నది. (హంసగీత. 27.)

మూ॥ అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః॥ 16

తా॥ ఐహికాముష్మికములైన విషయ భోగాదులను వాంఛింపక అట్టి భౌతికసుఖములకు హేతువులైన సమస్త కామ్యకర్మలయందు ప్రయత్నము సాగింపక, శారీర మానసిక శుద్ధికలిగి, సుఖదుఃఖాదులవలన గలుగు ఇచ్ఛాద్వేషములకు తటస్థుడై, భయ సంచలనములనువదలి, బ్రహ్మనిష్ఠయందు ఎటువంటి యుపద్రవములకును, లోనుగాక స్వధర్మమును గాపాడుకొను నైపుణ్యముకలిగి, అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వమును ఎవడైతే భజియించుచున్నాడో వాడు నాకు ప్రియమైనవాడు.

"నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శనమ్ అనుప్రజామ్యహం నిత్యం"

సర్వవిషయములయందు కాంక్షలేక, భగవత్తత్త్వమును మననము చేయుచు, శాంతచిత్తుడై, సమస్తభూతములయందు వైరములేక, సర్వభూతములను తనతోసమముగ జూచుచుండు భక్తుని నేను నిరంతరము వెంబడించుచున్నాడను. (భాగవత. 11స్కం 14అధ్యా. 16 )

మూ॥ యో నహృష్యతి నద్వేష్టి నశోచతి నకాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః॥ 17.

తా॥ ఎవడైతే ఇష్టవస్తు ప్రాప్తికి హర్షింపడో, అనిష్టప్రాప్తికి ద్వేషము వహింపడో, ప్రియవస్తునాశమునకు శోకింపడో, అసంప్రాప్తములైన భోగభాగ్యములను వాంఛింపడో, శుభాశుభ కర్మఫలములను త్యజించుచున్నాడో, అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వమునందు అవిచ్ఛిన్నమైన భక్తికలిగియున్నాడో అట్టివాడు నాకు ప్రియమైనవాడు.

శ్లో॥ ననిందంతి నచస్తౌతి నహృష్యతి నకుప్యతి।
నదదాతి నగృహ్ణాతి ముక్తస్సర్వత్ర నిరసః॥

జన్మకారణమైన సంసృతిబంధమునుండి విడువఁబడిన పురుషుఁడు (ఎవరినైన) నిందించుటలేదు, స్తుతిసేయుటలేదు, హర్షించుటలేదు, కోపించుటలేదు, ఇచ్చుటలేదు, తీసికొనుటలేదు, ఎల్లెడల అనురాగశూన్యుఁడై యుండును. (అష్టావక్రగీత. 17 13 )

శ్లో॥ ప్రశాంతసర్వసంకల్పం విగతాఖిలకౌతుకమ్।
విగతాశేషసంరంభం చిదాత్మానం సమాశ్రయ।
ఏవం పూర్ణధియో ధీరాః సమా నీరాగచేతసః।
ననందంతి ననిందంతి జీవితం మరణం తథా॥

సమస్తసంకల్పములు శాంతించినట్టియు, అపూర్వవిషయభోగాభిలాష వదలినట్టియు, ప్రాకృతకార్య ప్రయత్నముననుమానుకొనినట్టియు జ్ఞానస్వరూపుని ఆశ్రయింపుము. ఈవిధముగ పరిపూర్ణజ్ఞానులైనపండితులు సమస్తభూతములయందు సమభావము గలవారుగాను, అనురాగశూన్యమైన చిత్తముగలవారుగానుఉందురు వీరుజీవితమును గుఱించిఆనందింపరు, మరణమును గుఱించినిందింపరు. (అన్నపూర్ణోపనిషత్తు. 5అ. 23. 24.)

శ్లో॥ జాయాభ్రాతృసుతాదీనాం బంధూనాం శుభాశుభమ్।
శ్రుత్వా దృష్ట్వా నకంపేత శోకహర్షౌ త్యజేద్యతిః॥

భార్యలు, సోదరులు, పుత్రులు మొదలైన బంధుజనులయొక్క శుభాశుభములనువినియు, చూచియు యతీశ్వరుఁడు చలింపరాదు. శోకమును, సంతోషమును విడిచిపెట్టవలయును.

(నారదపరివ్రాజకోపనిషత్తు 4ఉపదేశం 9 10)

మూ॥ సమశ్శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః।
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః॥ 18.
తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్।
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్ మే ప్రియో నరః॥ 19.

తా॥ శత్రువునందును, మిత్రునియందును, అదేవిధముగామానావమానములయందును, శీతోష్ణములయందును, సుఖదుఃఖములయందును సమభావముగలవాఁడు. భౌతికవిషయములయందు తగులాటములేనివాడు. పరులు నిందించిననుస్తోత్రముచేసినను సమదృష్టితోఁజూచువాఁడు. ఎంతలభించినదో అంతటితో సంతుష్టిఁజెందియుండువాఁడు స్థిరమైన నివాసస్థానములేనివాఁడు. స్థిరపడినబుద్ధికలవాఁడు నాకు ప్రియమైనవాఁడు.

"పరమహంసాః... వృక్షమూలే శూన్యగృహే స్మశానవాసినోవా సాంబరావా దిగంబరావా నతేషాం ధర్మాధర్మౌ లాభాలాభౌ శుద్ధాశుద్ధౌ ద్వైతవర్జితా

స్సమలోష్టాశ్మకాంచనాః సర్వవర్ణేషు భైక్షాచరణం కృత్వా సర్వత్రాత్మైవేతి పశ్యంతి''

పరమహంసలు చెట్టుక్రిందనో, పాడుపడిన గృహములోనో, స్మశానము లోనో, (ఇట్టిస్థలములలో) నివసింతురు. వస్త్రములుధరించికాని, దిగంబరు లుగాగాని యుందురు. వారికి ధర్మాధర్మములు, లాభాలాభములు, శుద్ధాశుద్ధ ములులేవు. సుఖదుఃఖాది ద్వంద్వములుండవు. మంటిపెళ్ల, రాయి, బంగారు వారికి సమానములు. అన్నికులములవారియొద్ద భిక్షసేయుదురు. ఎల్లెడల పరమాత్మయే యున్నదని చూతురు. (భిక్షుకోపనిషత్తు)

శ్లో॥ సాధుభిః పూజ్యమానేఽస్మిన్ పీడ్యమానేఽపి దుర్జనైః
సమభావో భవేద్యస్య సజీవన్ముక్త ఇష్యతే॥

సాధుజనులచేత పూజింపబడునప్పుడు, దుర్జనులచేత పీడింపబడు నప్పుడుకూడ ఎవనికైతే సమభావముకలిగియుండునో అతడు జీవన్ముక్తుడని తలపబడును. (అధ్యాత్మోపనిషత్ 47.)

శ్లో॥ మధ్యస్థ ఏవ తిష్ఠేత ప్రశంసానిందయోస్సమః
ఏతత్పవిత్రం పరమం పరివ్రాజక ఆశ్రమే॥

సన్న్యాసాశ్రమమున జరించువాడు పొగడ్తకును, నిందకును మధ్యస్థుడు గనే యుండవలయును. సర్వసముడుగనే యుండవలయును. ఈస్థితి పవిత్ర మైనది. శ్రేష్ఠమైనది (హరీతగీత 18)

శ్లో॥ నాత్యర్థం సుఖదుఃఖాభ్యాం శరీరముపతాపయేత్।
స్తూయమానో నతుష్యేత నిందితో న శపేత్పరాన్॥

సుఖదుఃఖములవలన శరీరమును మిగుల తపింపఁజేయరాదు. పరు లచే స్తుతిసేయఁబడి సంతోషింపరాదు. నిందింపఁబడి పరులను శపింప రాదు. (కఠరుద్రోపనిషత్తు 4 .)

శ్లో॥ భృత్యైః పుత్రైః కళత్రైశ్చ దౌహిత్రైశ్చాపి గోత్రజైః।
విహస్య ధిక్కృతో యోగీ నయాతి వికృతిం మనాక్॥

భృత్యులచేతను, పుత్రులచేతను, భార్యలచేతను, దౌహిత్రులచేతను, మఱియు జ్ఞాతులచేతను వెక్కిరింపఁబడియు, ధిక్కరింపఁబడియు యోగీశ్వ రుఁడు ఇంచుకేనియు మార్పుఁజెందదు. (అష్టావక్రగీత 18ప్ర॥ 55)

మూ॥ యేతు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః॥ 20

తా॥ ధర్మమునకు సంబంధించినట్టియు, మోక్షస్వరూపమైనట్టియు ఈ జ్ఞానమును ఇందాఁకఁ జెప్పఁబడినట్లు ఎవరైతే ఉపాసించు చున్నారో ఆ పుణ్యాత్ములు శ్రద్ధావంతులు, అస్మత్పదలక్ష్యార్థమైన పరిశుద్ధాత్మయొకటే సర్వోత్కృష్టమైనదను నిశ్చయముగలవారు నాకు మిక్కిలి ప్రియమైనవారు.

శ్లో॥ న సాధయతి మాం ధర్మో న సాంఖ్యం యోగ ఉద్ధవ।
న స్వాధ్యాయస్తపస్త్యాగో యథా భక్తిర్మమోర్జితా॥

ఓయీ ఉద్ధవా! నాయందు దృఢముగా పాదుకొనినభక్తి యేప్రకారముగా నన్ను సాధింపగిలిగియున్నదో ఆప్రకారముగా సాధించుటకు ధర్మము చాలదు. విచారణజ్ఞానము చాలదు. యోగముచాలదు. స్వాధ్యాయము, తపస్సు సర్వసంగపరిత్యాగము చాలవు. (భాగవత 11స్కం 14అధ్యా. 20శ్లో. మఱియు సప్తమస్కంధము 7అధ్యా. 53-54 శ్లోకములలో యీ విషయము విపులముగ వర్ణింపబడినది.)

"భక్తవత్సలస్స్వయమేవ సర్వేభ్యో మోక్షవిఘ్నేభ్యో భక్తినిష్ఠాన్ సర్వాన్ పరిపాలయతి సర్వాభీష్టాన్ ప్రయచ్ఛతి మోక్షం దాపయతి చతుర్ముఖాదీనాం సర్వేషామపి వినా విష్ణుభక్త్యా కల్పకోటిభిర్మోక్షో న విద్యతే కారణేన వినా కార్యం నోదేతి భక్త్యా వినా బ్రహ్మజ్ఞానం కదాపి న జాయతే తస్మాత్త్వమపి సర్వోపాయాన్ పరిత్యజ్య భక్తిమాశ్రయ భక్తినిష్ఠో భవ భక్తినిష్ఠో భవ"

భక్తులయందు ప్రేమగల పరమేశ్వరుడు ముక్తికి గలుగబోవు సర్వవిఘ్నములనుండి భక్తినిష్ఠాపరుల నెల్లరను తానే కాపాడుచున్నాడు. భక్తులకిష్టమైన సర్వప్రయోజనములను సమకూర్చుచున్నాడు. మోక్షము నిప్పించుచున్నాడు. బ్రహ్మ మొదలుగాగల సమస్త భూతములకుసైతము విష్ణుభక్తిచేగాకున్న కోటికల్పములకైనను మోక్షములేదు. కారణముచేగాకున్న కార్యము పుట్టదు భక్తిచేగాకున్న బ్రహ్మజ్ఞానమెప్పుడును కలుగదు. అందువలన నీవు కూడ సర్వోపాయములను వదలివేసి భక్తినాశ్రయింపుము. భక్తినిష్ఠుడవు కమ్ము. భక్తినిష్ఠుఁడవుకమ్ము. (మహానారాయణోపనిషత్తు 8అధ్యా)

ఇది శ్రీమహాభారతము భీష్మపర్వములో భక్తియోగమను ముప్పదియాఱవ అధ్యాయము. ఓం. తత్. సత్.

# శతపత్రము

# 108

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 37 అధ్యాయము.

మూ॥ ప్రకృతిం పురుషంచైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవచ
ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయంచ కేశవ॥

తా॥ ఓ కృష్ణా! ప్రకృతియనగానేమో, పురుషుడనగానేమో, క్షేత్రమనగానేమో, క్షేత్రజ్ఞుడనగానేమో, జ్ఞానమననేమో, జ్ఞేయమననేమో దీనిని తెలిసికొనుటకు ఇష్టపడుచున్నాడను (ఈశ్లోకము కొన్నిప్రతులలోలేదు. అందువలన ప్రక్షిప్తముగ భావింపబడినది )

మూ॥ ఇదం శరీరం కౌంతేయ! క్షేత్రమిత్యభిధీయతే।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥ 1.

తా॥ అర్జునా! ఈశరీరము క్షేత్రమని పేర్కొనబడుచున్నది. ఈక్షేత్రము నెవడు తెలిసికొనుచున్నాడో వాడు క్షేత్రజ్ఞుడు అని తత్త్వవేత్తలు చెప్పుదురు.

శ్లో॥ క్షేత్రాణిహి శరీరాణి బీజంచాపి శుభాశుభమ్।
తాని వేత్తి స యోగాత్మా తతః క్షేత్రజ్ఞ ఉచ్యతే॥

శరీరములు క్షేత్రములనబడును. ఇవికలుగుటకు హేతువు శుభాశుభరూపమైన కర్మఫలము. ఆక్షేత్రములను, కర్మఫలములను అన్నిటిని యోగపురుషుడు తెలిసికొనుచున్నాడు. అందువలన అతడు క్షేత్రజ్ఞుడనబడును.
(నారాయణీయము 2అ 6.)

మూ॥ క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ॥ 2.

తా॥ అర్జునా! క్షేత్రజ్ఞుడనగా సమస్త శరీరములయందు "నేనునే"నని పేర్కొనబడు పరిశుద్ధాత్మ (ఇరువది యైదవతత్త్వము) అని తెలిసికొనుము. క్షేత్రమును, క్షేత్రజ్ఞుని (శరీరాత్మలను) ఈరెంటిని విమర్శించి తెలిసికొను తెలివి యేదికలదో అది జ్ఞానమని నాయభిప్రాయము.

మూ॥ తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చయత్।
సచ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు॥ 3

తా॥ అర్జునా! అక్షేత్రమనునది యేమిటిదో, యేలాటిదో, యెటువంటి మార్పులు కలిగియున్నదో, దేనివలన ఎటులేర్పడినదో మఱియును అక్షేత్రజ్ఞుడనువాడెవడో, యెట్టిప్రభావము గలవాడో అను సమస్యను సంక్షేపముగ జెప్పబోవుచున్నాడ. నామాటవినుము.

మూ॥ ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః॥ 4.

తా॥ (ఈక్షేత్రక్షేత్రజ్ఞుల విషయము) సకారణముగా నిశ్చయింపబడిన వేదవేదాంగములైన వివిధములైన ఉపనిషత్తులచేతను, బ్రహ్మసూత్ర పదములచేతను (ఇంతకుపూర్వమే) ఋషీశ్వరులచే వేఱువేఱుగ పెక్కువిధములుగ వర్ణింపబడియే యున్నది (భగవద్గీతాగ్రంథమునకు పూర్వమే ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు లోకములో వాడుకయందుండినట్లు ఈశ్లోకమువలన ఋజువు చేయబడుచున్నది )

మూ॥ మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవచ
ఇంద్రియాణి దశైకంచ పంచచేంద్రియగోచరాః॥ 5.

ఇచ్ఛాద్వేషస్సుఖందుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః
ఏతత్క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్॥ 6.

తా॥ భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అనెడు మహాభూతములైదు, దేహమె నేననుకొనెడు అజ్ఞానము, బుద్ధి, ఇంద్రియాతీత త్రిగుణాత్మకయైన పరాప్రకృతి; జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, మనస్సు, ఇంద్రియగోచరములైన శబ్దస్పర్శరూపరసగంధము లైదు. అనురాగము, ద్వేషము, సుఖము, దుఃఖము, సంఘాతము, (ప్రాణాది వాయువుల యొక్కయు, వానిచే సమకూర్పబడిన సప్తధాతువులయొక్కయు, చేరిక

పిండరూపమని కొందఱందురు. శరీరావయవముల సంధులని యికగొంద ఱందురు.) ఇంద్రియములద్వారా శబ్దాదుల నెఱిగెడి యెఱుక, ధారణఅనెడి యీతత్త్వములతో గూడినది క్షేత్రము అని దీనియందు గలుగు వికారము లతోసహ మునుపటి ఋషులచే జెప్పబడినది.

(ఈశరీరమును గుఱించి మఱియు గర్భోపనిషత్తులోను, మైత్రాయ ణ్యుపనిషత్తు 2 ప్రపాఠకములోను, సర్వసారోపనిషత్తులోను, పైంగలోపని షత్తులోను, శారీరకోపనిషత్తులోను, వరాహోపనిషత్తులోను ఇంచుమించుగ నిట్లే వర్ణింపబడినది. భారత భాగవతాద్యనేక గ్రంథములలోను ఈ విధము గనే చెప్పబడినది )

మూ॥ అమానిత్వమదంభిత్వమహింసా క్షాంతిరార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః॥ 7.

తా॥ తన్నుతానే సన్మానించుకొనుచు పరులను ఏవగించుకొను చిత్త వృత్తిలేకుండుట తనయందు గొప్పతనము లేకున్నను ఇతరులు చూచుటకు గొప్పగా కనబడవలెనని తగని వేషములువేయు బడాయిగుణము లేకుండు ట. మనోవాక్కాయములచే ఏకాలములో నైనను ఏభూతమునకైనను నొప్పి కలిగింపక, తాను నొప్పి జెందకయుండుట, (యోగశాస్త్రములో "అహింస" చాల ముఖ్యము కనుక ఏబదిరెండవ పత్రము మొదలుకొని నాలుగు పత్రములలోను, నూటయేడవ పత్రములోను, కొంతసూచింపబడినది.)

శరీరముచేతను, మనస్సుచేతను, వాక్కులచేతను, ఇతరభూతముల వలన పూజింపబడియు, పీడింపబడియు, తన బుద్ధిని సంచలనము జెందనీయక సుస్థిరముగ నిలుపుకొనియుండుట, భార్యాపుత్రులయెడగాని, మిత్రులయెడగాని, శత్రువులయెడగాని, తన విషయములోగాని మనస్సు చేతను, వాక్కుచేతను, శరీరముచేతను ఒకటేరీతిగ వర్తించుట, గురువును సేవించుట, మృజ్జలాదులచే దేహమును కడిగినంతనే పరిశుద్ధుడనైతి నను కొనక జ్ఞానవైరాగ్యములచే విషయవాసనలను కడిగివేసి అంతఃకరణమును కూడ శుద్ధిచేయుట, ప్రకృతి సంభవములైన ఉత్పత్తిస్థితి నాశములవలన శరీరమునందెన్ని మార్పులు కలిగినను తనయందెట్టి మార్పులును లేక సర్వదా యేకరీతినుండుట. అంతఃకరణమును విచ్చలవిడిగా పాఱాడిపోనీక నిగ్రహించి తన వశములో నిలుపుకొనుట (ఇవి జ్ఞానిలక్షణములు)

మూ॥ ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవచ
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్॥ 8.

తా॥ ఇంద్రియములకు ప్రయోజనము లైన శబ్దరూపాదులయందు ఆహారపానీయాదులయందు వస్త్రభూషణ శయనాసనాదులయందు దేహావసరమునకు గావలసినంత వాడుకొనుచుండియు ఆవిషయములయందు ఆసక్తిలేకుండుట. భుజించుట, పానముసేయుట, నడచుట, భాషించుట, ఊపిరిపీల్చుట విడుచుట కన్నులుమూయుట తెఱచుటమొదలైన శారీరకర్మలు దేహేంద్రియములచేఁజేయబడుచుండ ఈకర్మలకు నేనుకర్తనని భ్రమింపకుండుట; జననమునందును, మరణమునందును, వృద్ధత్వమునందును, రోగపీడలయందును దుఃఖమునకు లోఁబడుటలో నెంత దోషమున్నదో దానిని గుర్తింపఁగలుగుట. (ఇవియు జ్ఞానిలక్షణములే.)

మూ॥ అసక్తిరనభిష్వంగః పుత్రదార గృహాదిషు
నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు॥ 9.

తా॥ భౌతిక వ్యవహారమునందు మక్కువ జెందకుండుట; పుత్రులు, భార్యలు, గృహములు మొదలైనవానియందు మిక్కుటమైన ప్రేమాలింగనము లేకుండుట; భావవికారములులేక నియతుడైయుండుట; ఇష్టప్రాప్తియందు సంతసింపక అనిష్టప్రాప్తియందు ద్వేషింపక అన్నిటియందును సమచిత్తము కలిగియుండుట.

మూ॥ మయిచానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ
వివిక్తదేశసేవిత్వమరతిర్జనసంసది॥ 10.

తా॥ అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్వమునందేతప్ప వేఱు మార్గమున జరింపని వేఱు వస్తువుతో సంయోగములేని నిశ్చలమైన భక్తి కలిగియుండుట. ఏకాంతప్రదేశమున స్వస్వరూపమును భజించుచుండుట. ప్రజ లెక్కువగనుండుచోట క్రీడింపకుండుట.

శ్లో॥ జనసంబాధరహితశుద్ధదేశనిషేవణమ్।
ప్రాకృతైర్జనసంఘైశ్చ హ్యరతిస్సర్వదా భవేత్॥

జనసమ్మర్దములేని పరిశుద్ధస్థలమున భజించుచుండవలయును. ఎల్లప్పుడును ప్రాకృత జనసమూహములతో కలయిక లేకుండవలయును.
(అధ్యా. అరణ్య 4-36)

శ్లో॥ ఏకమేవాద్వితీయం యద్గురో ర్వాక్యేన నిశ్చితమ్।
ఏతదేకాంతమిత్యుక్తం నమఠో నవనాంతరమ్॥

పవనములు, పంచభూతములు, చతుర్దశేంద్రియములు, శీతోష్ణాది ద్వంద్వములు, గుణకర్మాదులు అన్నియు శమించిపోయినమీదట తనకంటె వేఱైన రెండవవస్తువేదియు జూడబడని అస్మత్పద లక్ష్యార్థమైన పరమాత్మ యొకటిమాత్రమే యుండునని గురువాక్యముచే నిశ్చయింపబడిన స్థలమేది, కలదో అట్టి యంతర్లక్ష్యమే యేకాంతమని చెప్పబడును మ ఠ ము కా దు. వనాంతరముకాదు. (మైత్రేయోపనిషత్తు 2అ 15) ఇట్లు చెప్పుటచేత బాహ్యాంతరములయందును ఏకాంతసేవి కావలయును.

మూ॥ అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్।
ఏతజ్జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా॥ 11.

తా॥ కించిజ్జ్ఞత్వాది లక్షణములతోగూడిన ప్రత్యగాత్మ స్వరూపమును తెలిసికొనుటయందు నియతుడైయుండుట, సర్వజ్ఞత్వాది లక్షణములతోగూడిన సర్వభూతాత్మయైన పరిశుద్ధాత్మ తత్త్వమును తెలిసికొనుటలోగల ప్రయోజనమును (అనుభవములో) చూచుట. ఇది (ఇందాక అయిదుశ్లోకములలో వర్ణింపబడినది.) జ్ఞానమని చెప్పబడినది. ఇంతకంటె వేఱైనదేదికలదో అది యజ్ఞానము.

మూ॥ జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వామృతమశ్నుతే।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే॥ 12.

తా॥ ఏది తెలియదగినదో, దేనిని తెలిసికొని మానవుడు ఇకమీద మరణములేని మోక్షపదమును పొందుచున్నాడో దానిని చెప్పబోవుచున్నాడ. అది యస్మత్పద లక్ష్యార్థమైన పరబ్రహ్మ తత్త్వము. దానికి ఆదియన్నమాటలేదు. (మఱియు) ఇంద్రియగోచరములైన భౌతికవస్తువులవలె దీనిని ఉన్నవస్తువని కాని, లేనివస్తువనికాని చెప్పుటకు వీలుపడదు.

వివ॥ ఈపరమాత్మకు రూపములేదు. నామములేదు క్రియలేదు. గుణములేదు. పరిమాణములేదు. మఱి యేవృత్తియు లేదు. అందువలన లోకములోనుండు ఇతరవస్తువులవలె ఇదియు నుండువస్తువేయని చెప్పరాదు.

పరమాత్మచే వ్యాప్తముగాకున్న ఏవస్తువైనను నిలువదు ప్రకాశింపదు. రమ్యముకానేరదు. ఆత్మసాన్నిధ్యము లేకపోయినప్పుడు దేహేంద్రియాదులు ఏకార్యమునందును పరిభ్రమింపజాలవు. అందువలన ఈపరమాత్మను గగన కుసుమమువలె, వంధ్యాపుత్రునివలె, మరీచికా జలమువలె, రజ్జు సర్పము వలె శశవిశానమువలె లేనివస్తువనియు జెప్పరాదు. సద్వస్తువులకును, అస ద్వస్తువులకును అతీతమైనదని చెప్పవలయును.

మూ॥ సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥ 13.

తా॥ (సమస్తభూతములయందు నేనునేనని పేర్కొనబడు చైతన్య మంతయు వేఱువేఱు నేనులుకాదు ఒకటేనేనని యపరోక్షజ్ఞానముచే తెలిసికొనినప్పుడు బ్రహ్మాండమంతయు తనశరీరమేయగును. సమస్తభూతముల శరీరాంగములు తనశరీరాంగములేయగును ) ఎల్లెడల హస్తములు పాదములు కలిగినట్టియు, ఎల్లెడల కన్నులు, శిరములు, ముఖములు కలిగినట్టియు, ఎల్లెడల చెవులు కలిగినట్టియు, ఆపరమాత్మ విశ్వమంతయు వ్యాపించి స్థిరముగ నిలిచియున్నది. (ఈశ్లోకము శ్వేతాశ్వతరోపనిషత్తు 3 అధ్యాయములోను, భారత శాంతి 313 అధ్యాయములోను, 239 అధ్యాయములోను చూచినట్లు జ్ఞాపకము, మఱియు అనుగీత 4 అధ్యాయములోను, శాంతిప, 303 అధ్యాయములోను కొంచెము వర్ణభేదముతో జదివినట్లుజ్ఞాపకము.

మూ॥ సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితం
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ॥ 14.

తా॥ ఆపరబ్రహ్మతత్త్వము అంతఃకరణముద్వారా ఇంద్రియముల యందు వ్యాపించుటవలన ఇంద్రియములు వాని వ్యాపారములయందు పరిభ్రమించు చున్నవి కనుక సకలేంద్రియములయొక్క అభ్యాసములయందు అంతట ప్రకాశించియుండినట్లే తోచునది. రూపనామక్రియలకు అతీత మగుటచేత సర్వేంద్రియములచే తగులుకొనబడక వేఱైయుండునది. ప్రపంచములో ఏవస్తువునందును అనురాగము జెందనిది. సమస్త ప్రపంచమును భరించియేయుండునది. త్రిగుణాత్మకమైన పరాప్రకృతికి అతీతమగుటచేత గుణములు లేనిది. శాంత శమదమాది సమస్త గుణములను పాలించునదియు. (శ్వేతాశ్వతరోపనిషత్తు 3 అధ్యాయములో ఇట్టిపోలికగల శ్లోకమున్నది)

**మూ॥ బహిరంతశ్చ భూతానా మచరం చరమేవచ**
**సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికేచ తత్॥ 15.**

**తా॥** భూతములయొక్క శరీరములకు వెలుపల, లోపలసైతము ఉండు నది. సర్వము తానగుటచేత ఒకచోటనుండి యింకొకచోటికి పోనిది, సర్వత్ర వ్యాపించియుండుటచేత చరించునదియేయైయున్నది. సూక్ష్మరూపమగుట వలన మిక్కిలిగతెలియరానిది. మఱియు అపరబ్రహ్మతత్త్వము దూరమున నుండునదియు, సమీపమున నుండునదియు (దేశకాలవస్తుపరిచ్ఛేదములు లేనిది కనుక దూరముగ జూచువారికి దూరముగాను, సమీపముగ జూచువారికి సమీపముగాను, సూక్ష్మముగ జూచువారికి సూక్ష్మముగాను, స్థూలముగ జూచువారికి స్థూలముగాను ఎవరికిదగినట్లు వారికిదోచుచుండునని భావము.)

మూ॥ అవిభక్తంచ భూతేషు విభక్తమివచ స్థితమ్
భూతభర్తృచ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ॥ 16.

తా॥ అపరబ్రహ్మతత్త్వము తనకంటె అన్యములేని యఖండస్వరూపమగుటచే మఱి దేనిచేతను విభజింపబడనిది. భూతములయందు దేహాద్యావరణములచే విభజింపబడినదానివలె నుండునది. భూతములను పుట్టించునది, భరించునది, తనలోనే లయింపజేయునదియునని తెలియదగినది.

మూ॥ జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమసః పరముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్। 17.

**తా॥ అపరబ్రహ్మతత్త్వము** సూర్యచంద్రాది జ్యోతులన్నిటిలోను జ్యోతియైయున్నది **అజ్ఞానాంధకారము**నకంటె వేఱైనది. జ్ఞానస్వరూపమైనది తెలిసికొన దగినది. జ్ఞానముచేతనే పొందదగినది. సమస్తభూతముల మానసమునందు స్థిరపడియుండునది. అనియు చెప్పబడుచున్నది.

శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమఃపారే ప్రతిష్ఠితమ్॥
భావాభావవినిర్ముక్తం భావనామాత్రగోచరమ్

అపరమాత్మ తత్త్వము సూర్యచంద్రాది జ్యోతులకెల్ల జ్యోతియైనది. అజ్ఞానాంధకారమనెడు మహాసాగరముయొక్క అవలితీరమున ప్రతిష్ఠజెంది యున్నది. ఉన్నది, లేదు అనెడు రెండు సమస్యలకు అతీతమైనది. భావన చేతనే తెలియబడునది. (యోగశిఖోపనిషత్తు 3 అధ్యా 22 శ్లో)

ఓం. తత్. సత్.

# శతపత్రము

# 109



మూ॥ ఇతిక్షేత్రం తథాజ్ఞానం జ్ఞేయంచోక్తం సమాసతః
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే॥ 18.

తా॥ అనియిట్లు పంచకోశాత్మకమైన క్షేత్రము, అదేప్రకారముగా అమానిత్వాది లక్షణములతో గూడిన జ్ఞానము, జ్ఞానముచే దెలియదగిన పరబ్రహ్మ తత్త్వము సంక్షేపముగ జెప్పబడినది. నేననెడు సర్వాంతర్యామి తత్త్వమును భజించుభక్తుడు ఇదంతయు దెలిసికొని నిత్యశుభప్రాప్తికరమైన స్వస్వరూపానుభవము కొఱకు (పైజెప్పబడిన జ్ఞానమును) పొందుచున్నాడు.

మూ॥ ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్॥ 19.

తా॥ త్రిగుణాత్మకయైన పరాప్రకృతి, ప్రకృతికి అధిష్ఠానమైన పురుషుడు ఈరెండుసైతము ఆదియన్నమాట లేనివేయని తెలిసికొనుము.

"షడ్భావవికారా అస్తి జాయతే వర్ధతే పరిణమతే ఉపక్షీయతే వినశ్యతీతి"

ఉండుట, పుట్టుట, పెరుగుట, మాఱుపోవుట తఱిగిపోవుట, అదృశ్యమైపోవుట అని యాఱువిధముల భావవికారములు. (గర్భోపనిషత్తు) మఱియు సత్త్వరజస్తమోగుణములు ఈసత్త్వాదుల సాంకర్యమువలన గలిగిన శమదమాది సంపద్గుణములు. కామక్రోధాది శత్రుగుణములు అన్నియు ప్రకృతి వల్లనే కలిగినవని తెలిసికొనుము.

మూ॥ కార్యకరణ కర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥ 20.

తా॥ ప్రకృతి పురుషుల సంయోగమువలన జగద్వ్యాపమైన క్షేత్రము కలిగినదని తెలియును. ఇందు మనస్సు, వాక్కు, శరీరము అను మూడింటిచేతనే సమస్త కార్యములు చేయబడుచున్నవి. ఇట్లు కార్యసాధనము లగుటచేతనే వీనికి త్రికరణములని పేరువచ్చినది. ఈ త్రికరణములకును, కరణములచే జేయబడుచున్న లౌకిక వైదిక కార్యములకును, కర్తృత్వము వహించుటలో హేతువు ప్రకృతియని చెప్పబడుచున్నది. అకార్యములవలన గలుగబోవు ఫలములను, సుఖదుఃఖములను అనుభవించుటయందు హేతువు జీవస్వరూపుడైన పురుషుడని చెప్పబడుచున్నది.

మూ॥ పురుషః ప్రకృతిస్థోహి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్।
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు॥ 21.

తా॥ ప్రకృతియందుండు పురుషుడు శ్రేష్ఠమైనట్టియు, నీచమైనట్టియు, ఉత్పత్తిస్థానములయందు జన్మముల గాంచునప్పుడు ఆయాజన్మములకు దగినట్లు ప్రకృతివలన సంభవించిన సుగుణదుర్గుణములను (అభ్యాసములను) పాలించుకొనుచున్నాడు. (అనుభవించుచున్నాడు.) కదా? వానికి ఆయభ్యాసములయందు చిత్తము తగులుకొనుటయే యిందుకు కారణము.

శ్లో॥ విషయాశీవిషాసంగ పరిజర్జర చేతసామ్
అప్రౌఢాత్మవివేకానామాయురాయాసకారణమ్॥

విషయములనెడు సర్పముల విషము పూర్తిగ అంటుకొనుటచే మిక్కిలి శిథిలమైన చిత్తముగలవారికి, దిట్టమైన ఆత్మజ్ఞానము లేనివారికి ఆయుస్సు ఆయాసమునకే కారణమగుచున్నది. (జ్ఞానము లేకపోయినప్పుడు ఆయువు దీర్ఘమైనకొలది దుష్కర్మ పెరిగిపోవుచున్నది. దానిఫలము ఆయాసమునకే కారణమగుచున్నది. (మహోపనిషత్తు 3అ. 10)

మహోపనిషత్తు 5 అధ్యా:- జీవుడు సంకల్పములు, విషయవాసనలు అను త్రాళ్లచే చుట్టబడి పెక్కువిధములైన దుఃఖములచే ఆవరింపబడి క్రమక్రమముగా నీచుడైపోవుచున్నాడు. పసిడికాయపురుగు తనకుదానే బంధమును కల్పించుకొనినట్లు జీవుడు తనంతటతానే బంధమున దగుల్కొనుచున్నాడు. స్వయముగ కల్పింపబడిన యింద్రియసముదాయమనెడు వలలో దగులుకొని శృంఖలాబద్ధమైన సింహమువలె వివశుడగుచున్నాడు.
(మహోపనిషత్తు 5అ. 127 శ్లో మొ)

మూ॥ ఉపద్రష్టానుమంతాచ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతిచాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః॥ 22.

తా॥ పూర్వశ్లోకములో జెప్పబడిన ప్రాకృత పురుషునకంటె వేఱైన పురుషుడు (గుణసంగవర్జితుడు) ఈదేహమునందు సాక్షి, సమ్మతుడు, భర్త, పాలకుడు, గొప్పనియామకుడు, పరమాత్మ అనియు జెప్పబడును.

మూ॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతించ గుణైస్సహ
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే॥ 23.

తా॥ ఈప్రకారముగా పురుషుని, ప్రకృతిని, ప్రకృతిసంభవములైన గుణములతోసహ ఎవడైతే తెలిసికొనుచున్నాడో అట్టివాడు (దేహేంద్రియముల ద్వారా పానీయము ద్రావుట, భుజించుట, నడచుట, భాషించుట, నిద్రించుట, మేలుకొనుట మొదలైన (ప్రారబ్ధకర్మలయందు) అన్నివిధముల వర్తించు చుండువాడయ్యును మరల జన్మింపడు.

వివ॥ కొందఱుస్వాములిట్టి శ్లోకము లాధారముచేసికొని చెప్పరాని దుష్ప థముల వర్తించుచున్నారు. ధనమునందును, స్త్రీలయందును, శిశువులయం దును ఆశలేనివారు, విషయభోగాదులయందు కాంక్షలేనివారు, మనోవృత్తులు నశించినవారు; తత్త్వదృష్టిచేత సర్వమును పరమాత్మమయముగ జూచువారు దుష్పథమున వర్తింపవలసిన కారణముండదు, నిజమెఱుగని వేషధారి స్వా ములకు విషయవాసనలు క్షీణింపవు మనస్సు శాంతింపదు తత్త్వప్రసన్నత కలుగదు. వీరు ముక్తులు కాజాలరు. అని నమ్మవలయును.

మూ॥ ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేనచాపరే॥ 24.

తా॥ కొందఱు యోగీశ్వరులు తమభావముచేతనే బుద్ధినిలిపి చింతిం చుచు ధ్యానయోగముచేత స్వస్వరూపమునుతమలోదామే చూచుచున్నారు. ("ఆత్మనా" అనుటచేత బోధకులు లేకపోయినను వీరు స్వప్రయత్నముతో సాధింపగలవారని భావము) మఱికొందఱు శరీరమిట్టిదనియు, ఆత్మయిట్టి దనియు విమర్శించి పవనములను, పంచభూతములను, చతుర్దశేంద్రియ ములను, విషయములను, గుణకర్మాదులను అన్నిటిని "నేనుకాను, నేను కాను" అని నిషేధించి అవి యన్నియుబోగా మిగిలియుండునది ఆత్మయని

చర్చించి తెలిసికొని చూచుచున్నారు. వేఱొకకొందఱు యమనియమాసన ప్రాణాయామాది యోగాంగముల నభ్యసించి మనోవృత్తులను నశింపజేసి కొని తత్త్వదర్శనము చేయుచున్నారు.

మూ॥ అన్యేత్వేవమజానంతశ్శ్రుత్వాన్యేభ్య ఉపాసతే।
తేఽపిచాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥ 25.

తా॥ పూర్వశ్లోకములో జెప్పబడిన ప్రకారముగా (తమకుదామే) తెలిసి కొనజాలని యితర భక్తులు మఱి యితరులచే విని యుపాసించుచున్నారు. (తత్త్వజ్ఞులైన గురువులయొద్దజేరి చతుర్విధ శుశ్రూషలుచేసి వారి యనుగ్రహ మువడసి బోధింపబడి విని అప్రకారము సాధించుచున్నారు. ఇప్పటిభక్తుల లో జాలమంది యీవిధముగ సాధించినవారే కనబడుచున్నారు) గురువాక్య శ్రవణమే ఉత్తమగతిగ గలిగిన యీభక్తులుకూడ మృత్యువును అతిక్ర మించుచునేయున్నారు. (జనన మరణములకు అతీతమైన మోక్షస్థానమును. ప్రాపించుచున్నారు.)

మూ॥ యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజంగమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ॥ 26

తా॥ ఓయర్జునా! సంచారశక్తి కలిగినట్టియు, లేనట్టియు జగద్రూప మైన వస్తుసముదాయమునందు ఏదైన నొకింతవస్తువు ఎంతవఱకు పుట్టుచు న్నదో అంతవఱకు క్షేత్ర క్షేత్రజ్ఞుల కూడికవల్లనే యదిపుట్టుచున్నదని తెలిసి కొనుము. (జననమరణములనఁగా క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగ వియోగములే యని యిందువలనతెలియుచున్నది.)

మూ॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్।
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి సపశ్యతి॥

తా॥ (భౌతికభావముతోఁ జూచినప్పుడు శరీరభేదములవలన. సమస్త భూతములు వేఱువేఱుగఁ గనఁబడును. ఆత్మయుఅనేకములుగఁ గనఁబడును రూప పరిమాణములయందును శరీరములవలెనే ఆత్మలుపెద్దవి, చిన్నవి యున్నట్లు భేదములుగఁ గనఁబడును. శరీరములు అదృశ్యములైపోవుచుండ గా ఆత్మలు పోయినట్లే కనఁబడును.) అధ్యాత్మిక భావముతోఁ జూచినప్పుడు

సమస్త భూతములయందలి ఆత్మ యొకటేయనియు. ఎక్కువ తక్కువలు లేక సమముగనున్నదనియు, శరీరములు నశించుచుండ ఆత్మనశింపదనియుఁ దేఁచును ఈభావముతో ఎవఁడు చూచుచున్నాఁడో వాఁడుమాత్రమే పరిశుద్ధాత్మను జూడఁగలిగియున్నాఁడు.

" ఏకో దేవస్సర్వ భూతేషు గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా"

సర్వభూతములయందు నిగూఢముగనుండునట్టియు, సర్వత్రవ్యాపించి యుండునట్టియు, సర్వభూతములయొక్క అంతరాత్మయైయుండునట్టియు పరమాత్మ యొక్కఁడే. (ఈశ్లోకముగోపాలోత్తర తాపిన్యుపనిషత్తులోను, బ్రహ్మోపనిషత్తులోను, శ్వేతాశ్వతరోపనిషత్తు6 అధ్యాయములోను, శివగీత 12 అధ్యాయములోను చదివినట్లుజ్ఞాపకము.)

శ్లో॥ ఏకఏవహి సర్వేషు భూతేషు వ్యాప్య తిష్ఠతి।
నశ్యత్సు సర్వభూతేషు పరాత్మా నవినశ్యతి॥

సమస్త భూతములయందు వ్యాపించియుండు పరమాత్మయొక్కఁడేకదా? సర్వభూతములు నశించుచుండఁగా పరమాత్మనశింపదు. (విశ్వగీత. 106 )

మూ॥ సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్।
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాంగతిమ్॥ 28.

తా॥ సమస్త భూతములయందుండు పరమేశ్వరతత్త్వమంతయు ఒకటేయనియు, ఎక్కువ తక్కువలులేక సర్వత్రసమముగ సంపూర్ణముగ నిండి యున్నదనియు అపరోక్షజ్ఞానముచేఁ దెలిసికొనినప్పుడు ఎవఁడు ఏభూతమును హింసించినను తన్నుఁదానే హింసించుకొనినట్లగును. కావున అట్టి యపరోక్షజ్ఞాని యేభూతమునైనను హింసింపఁడు. (తిరస్కరింపఁడు. అవమానింపఁడు. మఱెట్టిహానియుఁ జేయదు అతనిచరిత్రములో ఏఘట్టములోను అపచారమన్న మాటేయుండదు.) అందువలనకదా ఉత్తమగతి పొందుచున్నాఁడు.

మూ॥ ప్రకృత్యైవచ కర్మాణి క్రియమాణాని సర్వశః।
యః పశ్యతి తథాత్మానమకర్తారం సపశ్యతి॥

తా॥ త్రిగుణాత్మకరమైన పరా ప్రకృతివలన కార్యసాధనములైన దేహేంద్రియములు పుట్టినవి అందుచేతనే కుడుచుట, నడచుట, భాషించుట మొ

దలైన ప్రారబ్ధ కర్మలన్నియుఁ జేయఁబడుచున్నవి. ఈప్రకారముగా సర్వవిధ ములఁజేయఁబడు కర్మలు ప్రకృతిచేతనేచేయఁబడుచున్నవని కర్తృత్వమును ప్రకృతియందే యెవ్వఁడు చూచుచున్నాఁడో, అవిధముగనే ఆత్మను క్రియా రహితముఁగా ఎవఁడు చూచుచున్నాడో వాఁడుమాత్రము పరమాత్మ తత్త్వ మును జూచుచున్నాఁడు.

శ్లో॥ నకర్తా నైవభోక్తాచ నచ బోజయితా తథా।
కేవలం చిత్సదానంద బ్రహ్మైవాహం జనార్దనః॥

నేనుకర్మచేయు వాఁడనుకాను, దానిఫలమును అనుభవించు వాఁడను కాను, అవిధముగానే మఱియొకరిని అనుభవింపఁజేయు వాఁడను కాను. కేవలము జ్ఞానానంద స్వరూపమైన జనార్దన పరబ్రహ్మమేనేను.
(వరాహోపనిషత్తు 3అ. 19 శ్లో.)

మూ॥ యదా భూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి
తత ఏవచ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా॥ 30.

తా॥ భౌతికదృష్టికి వేఱువేఱు భావములుగ గనబడుచున్న యీభూత ములన్నియు ఒకపరమాత్మ తత్త్వమునందే కూర్పబడి యున్నవని ఆధ్యా త్మిక దృష్టితో ఎప్పుడు చూచుచున్నాడో అందువల్లనే భగవద్విభూతి విస్తార మునుసైతము ఎప్పుడు చూడగలిగియున్నాడో అప్పుడే పరబ్రహ్మ తత్త్వ మును లెస్సగ పొందుచున్నాడు.

మూ॥ అనాదిత్వాన్నిర్గుణత్వా త్పరమాత్మాయ మవ్యయః
శరీరస్థోఽపి కౌంతేయ! నకరోతి నలిప్యతే॥ 31.

తా॥ అర్జునా! అపరమాత్మ (నామరూపములు లేనిది కనుక) ఆదిలేని దగుటవల్లను, గుణరహితమగుటవల్లను (ఎన్నడును) క్షీణింపక యేకరీతి నుండునది. తాను శరీరమునందుండియు, కర్మజేయుటలేదు. కర్మచే అంటు కొనబడుటలేదు.

మూ॥ యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే।
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే॥ 32

తా॥ సూక్ష్మభావమువలన సమస్తభూతములయందు వ్యాపించియుండు ఆకాశము దేనిచేతను అంటబడక యెటులున్నదో అటులే యాపరిశుద్ధా

త్మయు శరీరమునందంతట వ్యాపించియుండియు దేహధర్మములైన గుణ కర్మాదులచే అంటబడుటలేదు.

శ్లో॥ యథా నభస్సర్వగతం నలిప్యతే తథా భవాన్ దేహగతోఽపి సూక్ష్మకః॥
దేహేంద్రియ ప్రాణశరీర సంగత స్త్వాత్మేతి బుద్ధ్వాఖిలబంధభాగ్భవేత్॥

ఆకాశము సర్వత్ర వ్యాపించియుండియు దేనికి అంటక యెట్లున్నదో అట్లే నీవు దేహముతో కూడియుండియు సూక్ష్మరూపుడ వగుటచేత అంట కున్నాడవు. ఆత్మ దేహేంద్రియాదుల నంటియుండునని తలచి (మానవుడు) సమస్తబంధముల దగుల్కొనుచున్నాడు. (అధ్యా. సుం. 4స. 18)

శ్లో॥ ఆకాశవత్త్వం సర్వత్ర బహిరంతర్గతోఽమలః
అసంగోహ్యచలో నిత్యః శుద్ధో బుద్ధః సదవ్యయః॥

నీవు ఆకాశమువలె ఎల్లెడల వెలుపల, లోపల వ్యాపించి నిర్మలుడవు, అసంగుడవు, నిశ్చలుడవు, నిత్యుడవు, పరిశుద్ధుడవు, జ్ఞాన స్వరూపుడవు, సత్స్వరూపుడవు, అవ్యయుడవునై యున్నాడవు (అధ్యా. బాల 5స. 56)

మూ॥ యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత॥ 33.

తా॥ అర్జునా! ఒక్క సూర్యుడు ఈసమస్త ప్రపంచమును ఏటుల వెలి గించుచున్నాడో అట్లే సర్వభూతాత్మయైన పరమాత్మ యీశరీరము నంతటిని ప్రకాశింపజేయుచున్నాడు.

మూ॥ క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమంతరం జ్ఞానచక్షుషా
భూతప్రకృతిమోక్షంచ యే విదుర్యాంతి తేపరమ్॥ 34.

తా॥ ఇందాక జెప్పబడినప్రకారము క్షేత్రక్షేత్రజ్ఞులకుగల తారతమ్య మిట్టిదనియు, నేను జన్మించువాడ ననుకొను స్వభావమును పురుషుడు వద లుకొను సూత్రమిట్టిదనియు జ్ఞానదృష్టితో ఎవరైతే తెలిసికొనుచున్నారో వారు మోక్షమును పొందుచున్నారు.

ఇది శ్రీ మహాభారతము భీష్మపర్వములో క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగ మను ముప్పదియేడవ అధ్యాయము.

ఓం. తత్. సత్.

# శత పత్రము

# 110

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 38 అధ్యాయము.

శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు.

మూ॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్।
యజ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః॥ 1.

తా॥ మునీశ్వరులెల్లరు దేనిని తెలిసికొని యిందువలన మోక్షరూపమైన లాభమును పొందియున్నారో శ్రేష్ఠమైనట్టియు, జ్ఞానములలో మేలైనట్టియు ఆ జ్ఞానమును చెప్పబోవుచున్నాడను.

మూ॥ ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః
సర్గేఽపి నోపజాయంతే ప్రళయే నవ్యథంతి చ॥ 2.

తా॥ ఈచెప్పబోవు జ్ఞానము నాశ్రయించి అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వ భావమునుపొందిన యోగీశ్వరులు సృష్టిసమయములో సైతము పుట్టరు. ప్రళయకాలమునందును సంచలింపరు.

మూ॥ మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్।
సంభవస్సర్వభూతానాం తతో భవతి భారత॥

తా॥ అస్మత్పదలక్ష్యార్థమైన భగవత్తత్త్వమునకు స్వకీయమైన ప్రజననీయమైన బృహత్తత్త్వము సమస్త భూతోత్పత్తికి కారణమైయున్నది. (సర్వమును వృద్ధిసేయువృత్తి దీనియందుండుటచేత దీనికి బ్రహ్మయని పేరుకలిగినది.) దానియందు నాయంశమైన ప్రత్యగాత్మను ధరింపజేయుచున్నాడ. (ఈప్రత్యగాత్మ జీవభావమును పొంది శబ్దాదివిషయములను, సుఖ దుఃఖాదులను గ్రహించు వృత్తి కలిగియుండుటచేత "గృ నిగరణే" అనుసూత్రము

వలన దీనికి గర్భమని పేరువచ్చినది.) అర్జునా! అటులభగవత్కళ బృహత్తత్త్వమున వ్యాపించుటవలన (పృథివ్యాది) సమస్తభూతములయొక్క **ఉత్పత్తి**యగుచున్నది.

మూ॥ సర్వయోనిషు కౌంతేయ! మూర్తయ స్సంభవంతి యాః
తాసాం బ్రహ్మ మహద్యోనిరహం బీజప్రదః పితా॥ 4.

**తా॥ భౌతికదృష్టి**యందు శరీర భేదములబట్టి (యుత్పత్తిస్థానము లనేకములుగ గనబడుచుండును.) ఓ యర్జునా! ఆ **యుత్పత్తిస్థానము**లన్నిటియందును ఏస్వరూపములు **ఉత్పత్తి** యగుచున్నవో అస్వరూపములకు ప్రధానమైన యుత్పత్తిస్థానము బృహత్తత్త్వమే. **ఉత్పత్తి**కి గారణమును కల్పించునది, **కాపాడునది అస్మత్పద** లక్ష్యార్థమైన భగవత్తత్త్వము.

మూ॥ సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః
నిబధ్నంతి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్॥ 5

తా॥ ఓయర్జునా! సత్త్వము, రజస్సు, తమస్సు అనిప్రకృతివలన సంభవించిన అభ్యాసములు నిత్యుఁడైన పురుషుని దేహమునందు మిక్కిలిగబంధించుచున్నవి.

మూ॥ తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్॥
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ॥

తా॥ పాపరహితుడవైన ఓ యర్జునా! అందులో సత్త్వగుణము నిర్మలత్వమువలన మతిప్రకాశమును, ఆరోగ్యమును గలిగించుచు సుఖాసక్తిచేతను, జ్ఞానాసక్తిచేతను పురుషుని బంధించుచున్నది.

(ఇచ్చట లౌకికజ్ఞానమని భావము)

**వివ॥** ("సతోభావస్సత్త్వం, పాఅంతకర్మణి") పాపములను నశింపఁజేయు **అభ్యాసము**నకు సత్త్వగుణమనిపేరు. పాపములుక్షీణింపఁగా రోగబాధలు తగ్గిపోవును సుఖవంతుఁడగును. అందువలన మఱియు అధికములైన సుఖములు కలుగవలయునని యాసక్తి పుట్టుచున్నది. ఎక్కడెక్కడి సమాచారములు తెలిసికొనవలెననియు అసక్తిపుట్టుచున్నది. ఈయాసక్తిచే పురుషుఁడు బద్ధుఁడగుచున్నాఁడు.

మూ॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్।
తన్నిబధ్నాతి కౌంతేయ! కర్మసంగేన దేహినమ్॥

తా॥ అర్జునా! విషయభోగాదులయందు అనురాగమును బుట్టించు గుణమునకు "రజస్సు" అనిపేరు. పురుషుఁడు ఆశయందుఁ దగులుకొనుట వలన ఈగుణము పుట్టుచున్నది. ఇది కామ్యకర్మలయందు ఆసక్తిని పుట్టించి ఆట్టి తగులాటముచేతనే దేహాభిమానియైన పురుషుని బద్ధుని జేయుచున్నది. (తుట్టతుదకు దీనిఫలితము దుఃఖమే.)

మూ॥ తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్।
ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత॥ 8.

తా॥ అర్జునా! "తమస్సు" అన్నదో అజ్ఞానమువలనపుట్టినదని తెలిసికొనుము. దేహమును పరమార్థముగ నమ్మికొనిన పురుషులకు చిత్తవైకల్యము కలిగించును. మిక్కుట మైనమదముచేతను, మాంద్యముచేతను, నిద్రచేతను ఆతమోగుణము పురుషుని బంధించుచున్నది.

మూ॥ సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత!
జ్ఞానమావృత్యతు తమః ప్రమాదే సంజయత్యుత॥

తా॥ అర్జునా! (పూర్వశ్లోకముల రీతిగా) పురుషుఁడు సుఖమునసుభవించునప్పుడు సత్త్వగుణము లెస్సగజయించి లోఁబఱుచుకొనుచున్నది. కర్మల నాచరించునప్పుడు రజోగుణము (ఫలాసక్తికలుగఁజేసి) జయించి బద్ధుని జేయుచున్నది కార్యాకార్యముల నెఱుఁగక మత్తుఁడైయుండు నప్పుడు తమోగుణము జ్ఞానము నావరించి జయించి యధోగతిపాలు చేయుచున్నది.

మూ॥ రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత।
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా॥

తా॥ అర్జునా! రజోగుణమును, తమోగుణమును పరిభవించి సత్త్వగుణము అతిశయించుచున్నది. రజోగుణమును, సత్త్వగుణమును పరిభవించి తమోగుణము అతిశయించుచున్నది. అదేవిధముగా తమోగుణమును, సత్త్వగుణమును పరిభవించి రజోగుణము అతిశయించుచున్నది.

వివ॥ ఈమూఁడు గుణములలో దేనికవకాశము చిక్కినప్పుడది ప్రకాశించుచున్నది. ఇవన్నియు పురుషునకు బంధకారణములే.

మూ॥ సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత॥ 11.

తా॥ ఈదేహమునందు సర్వేంద్రియములద్వారా చిత్స్వరూపమైన మతి ప్రకాశము ఎప్పుడు కలుగుచున్నదో అప్పుడు సత్త్వగుణము వృద్ధిఁబొందినదని తెలిసికొనవలయును.

శ్లో॥ ప్రహర్షః ప్రీతిరానందః సుఖం సంశాంతచిత్తతా।
అకుతశ్చిత్కుతశ్చిద్వా చిత్తతస్సాత్త్వికోగుణః॥

మిగుల హర్షము, తృప్తి, ఆనందము, సుఖము, చిత్తశాంతి యనునవి మనస్సువలన తఱుచుగాగాని, అరుదుగాగాని కలిగియుండుట సాత్త్వికగుణము. (భారత. శాంతి 219అ· 27శ్లో)

శ్లో॥ అత్ర యత్ప్రీతిసంయుక్తం కాయే మనసివా భవేత్।
వర్తతే సాత్త్వికో భావ ఇత్యపేక్షేత తత్తథా॥

ఈశరీరమునందుగాని, మనస్సునందుగాని సంతృప్తితోగూడిన యేభావము కలుగుచున్నదో ఆప్రకారము కలిగినదానిని సాత్త్వికభావము వర్తించుచున్నదని గుర్తింపవలయును. (భార. శాం. 219-30)

మూ॥ లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా।
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ॥ 12

తా॥ ఓయర్జునా! తనకున్నదానితో దృప్తిఁబొందఁజాలక యికనేమో కావలయునని యాత్రపడుచుండుట, జన్మకారణమైన సంసృతియందు వర్తించుట, కామ్యకర్మలకు ప్రయత్నించుట, అంతరింద్రియ నిగ్రహము లేకపోవుట, భౌతికములైన విషయభోగాదులను కాంక్షించుట అను నిట్టి లక్షణములు రజోగుణము పెంపొందునప్పుడు కలుగుచున్నవి.

శ్లో॥ అతుష్టిః పరితాపశ్చ శోకో మోహస్తథా క్షమా!
లింగాని రజసస్తాని దృశ్యంతే హేత్వహేతుతః॥

అసంతుష్టి, పరితాపము, శోకము, మోహము, అదేప్రకారము ఓర్పు లేకుండుట యిట్టివి రజోగుణలక్షణములు. సకారణముగాను, నిష్కారణముగాను కనబడుచుండును. (భారత. శాంతి. 219అ. 28)

శ్లో॥ యత్త్వసంతోషసంయుక్తమప్రీతి కరమాత్మనః
ప్రవృత్తం రజ ఇత్యేవ తతస్తదపి చింతయేత్॥

సంతోషరహితమైనట్టియు, తనకు ప్రీతికరము కానట్టియు ఏభావము ప్రవర్తిల్లుచున్నదో అందువలన దానినిసైతము రజోగుణమనియే తలపవలయును. (భారత. శాంతి. 219అ 31)

మూ॥ అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవచ।
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన౹ 13.

తా॥ అర్జునా! బుద్ధివికాసము లేకుండుట, అర్థమైన ప్రవర్తనము లేకుండుట, కార్యాకార్యము లెఱుగని మత్తత, చిత్తవైకల్యము అనునవియన్నియు తమోగుణము పెంపొందినప్పుడు కలుగుచుండును.

శ్లో॥ అవివేకస్తథా మోహః ప్రమాదస్స్వప్నతంద్రతాః
కథంచిదపి వర్తంతే వివిధాస్తామసా గుణాః॥

అవివేకము, అదేవిధముగా మోహము, మత్తత, స్వప్నము, అజాగ్రత్త ఇట్టివిపెక్కురీతుల తామసగుణములు ఏదోయొకవిధముగ ప్రవర్తిల్లుచుండును. (భారత. శాంతి. 219అ. 29శ్లో)

శ్లో॥ అథ యన్మోహసంయుక్తం కాయే మనసివా భవేత్।
అప్రతర్క్యమవిజ్ఞేయం తమస్తదుపధారయేత్॥

ఇఁకను శరీరమునందుఁగాని, మనస్సునందుఁగాని మనోవైకల్యముతోఁగూడినట్టియు, యుక్తాయుక్తవిచారము లేనట్టియు, తెలియఁదగినదానిని దెలియకుండునట్టియు వృత్తి యేదికలుగుచున్నదో దానిని తమోగుణమని తెలిసికొనవలయును. (భారత. శాంతి. 219అ 32శ్లో)

మూ॥ యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయం యాతి దేహభృత్।
తదోత్తమ విదాం లోకానమలాన్ ప్రతిపద్యతే॥ 14

తా॥ ఎప్పుడైతే పురుషుఁడు సత్త్వగుణము వృద్ధియగుచుండగా దేహమును విడిచి పోవుచున్నాఁడో అప్పుడు ఉత్తమజ్ఞానులు పొందఁదగిన నిర్మలమైన లోకములను ప్రాపించుచున్నాఁడు.

"సాత్త్వికాదేవ లోకాయ గచ్ఛంతి సుఖభాగినః"

సత్త్వగుణోపేతులై సుఖము ననుభవింపఁదగిన పురుషులు దేవలోకము నకుఁ బోవుచున్నారు. (భార. శాం. 303అ. 47శ్లో.)

మూ॥ రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే।
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే॥ 15

తా॥ రజోగుణము వికసించియుండు కాలములో దేహత్యాగము చేసినవాడు కర్మాసక్తులైన ప్రజలయందు పుట్టుచున్నాడు. అదేవిధముగా తమోగుణము వికసించియుండు కాలములో దేహమును వదలిపోయినవాడు మూఢజంతువుల గర్భములయందు పుట్టుచున్నాడు. ("మూఢయోనిషు" అనగా శునకసూకరాది నీచజంతువులయందని కొందఱు చెప్పుదురు. మూఢత్వముచే అజంతువులతో బోల్పదగిన మనుష్యులయందే పుట్టుదురని కొందఱందురు. వేఱొకజన్మమే లేదని యికగొందఱందురు.)

"తామసా నిరయం యాంతి రాజసా మానుషానథ"

తమోగుణముతో సంబంధించినవారు నరకమును పొందుచున్నారు. రజోగుణముతో సంబంధము కలిగినవారు ఇకను మనుష్యభావములను పొందుచున్నారు. (భారత. శాంతి, 303అ 47.)

మూ॥ కర్మణస్సుకృతస్యాహుస్సాత్త్వికం నిర్మలం ఫలమ్।
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్॥ 16.

తా॥ (సత్త్వగుణము ప్రధానముగగలవారు సుకృతకర్మనే చేయుదురు) సుకృతకర్మయొక్క ఫలము సత్త్వగుణమునకు సంబంధించినది. పరిశుద్ధమైనదిగ నుండును. రజోగుణమువలన జేయుబడు కర్మ కామ క్రోధాదులతో గూడుకొనియుండును. గనుక దానిఫలము దుఃఖము తమోగుణమువలన జేయబడు కర్మకు ఫలము అజ్ఞానము. (అని పండితులు) చెప్పుదురు.

మూ॥ సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవచ॥ 17.

తా॥ సత్త్వగుణము వలన జ్ఞానము లెస్సగఁగలుగు చున్నది. రజోగుణము వలన కలుగునది లోభమే. కార్యాకార్యములను విమర్శింపనోపని మత్తత, మనోవైకల్యము ఈరెండు తమోగుణము వలన కలుగుచున్నవి. అజ్ఞానము సైతము తమోగుణము వల్లనే కలుగుచున్నది.

మూ॥ ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః। 18.
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః॥

తా॥ (అవసాన సమయమున) సత్త్వగుణమున నుండినవారు ఉత్తమ గతికిఁబోదురు రజోగుణమున నుండినవారు మధ్యగతియందు నిలుచుచున్నారు. నీచమైన తమోగుణమున నుండువారు అధోగతికిఁబోదురు.

"ఊర్ధ్వే సాత్త్వికో మధ్యే రాజసోఽధస్తామస ఇతి"

సాత్త్వికపురుషుఁడు ఊర్ధ్వగతిపొందును, రాజసపురుషుఁడు మధ్యగతిపొందును. తామసపురుషుఁడు అధోగతిపొందును. (శారీరకోపనిషత్తు)

శ్లో॥ నిష్కైవల్యేన పాపేన తిర్యగ్యోనిమవాప్నుయాత్।
పుణ్యపాపేన మానుష్యం పుణ్యేనైకేన దేవతా॥

మోక్షమునకు వ్యతిరిక్తమైన పాపముచేత తిర్యగ్జంతు జన్మముపొందుచున్నాఁడు, పుణ్యపాపముల సమ్మేళనముచేత మనుష్య జన్మముపొందుచున్నాఁడు. కేవలము పుణ్యమే చేసినవారుదివ్య పురుషులగుచున్నారు.

మూ॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥ 19

తా॥ కార్యకరణ కర్తృత్వములకు సాక్షియైన పురుషుడు ఉత్పత్తి నాశములకును, దైహిక మానసిక వృత్తులకును త్రిగుణములకంటె వేఱేదియు కర్తకాదని యెప్పుడు చూచుచున్నాడో, గుణములకంటెను వేఱైన నిర్గుణ స్వరూపము నెప్పుడు తెలిసికొనుచున్నాడో అప్పుడతఁడు అస్మత్పద లక్ష్యార్థమైన పరమాత్మ స్వరూపమును పొందుచున్నాడు.

మూ॥ గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్।

జన్మ మృత్యు జరా దుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే॥ 20.

తా। దేహమునందు సంభవించిన "సత్త్వము, రజస్సు తమస్సు" అనెడి యీమూడు గుణములను అతిక్రమించి (దాటి) పురుషుడు జనన మరణములచేతను వృద్ధత్వముచేతను, దుఃఖములచేతను విడువబడినవాడై మోక్షపదమును అనుభవించుచున్నాడు.

అర్జునుడు చెప్పుచున్నాడు.

మూ॥ కైర్లింగైస్త్రీన్ గుణానేతా నతీతో భవతి ప్రభో।

కిమాచారః కథంచైతాంస్త్రీన్ గుణానతివర్తతే॥ 21

తా॥ ఓకృష్ణా! ఈమూడుగుణములను అతిక్రమించిన పురుషుడు ఎట్టి లక్షణములతో నుండును? ఏయాచారము కలిగియుండును. ఆత్రిగుణముల నేవిధముగా అతిక్రమించుచున్నాడు.

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు.

మూ॥ ప్రకాశంచ ప్రవృత్తించ। మోహమేవచ పాండవ।

నద్వేష్టి సంప్రవృత్తాని ననివృత్తాని కాంక్షతి॥ 22.

తా॥ ఓయర్జునా! సత్త్వగుణమువలన కలుగు బుద్ధివికాసము, రజోగుణమువలనకలుగు కామ్యకర్మానువర్తనము, తమోగుణమువలన కలుగు మనోవైకల్యము- వీనిలో ఏవేళకేవి ప్రాపించుచుచున్నవో వానిని నిరాకరింపడు. ప్రాపింపకపోయినవానిని వాంఛింపడు. అట్టివాడు త్రిగుణాతీతుడు.

శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ భూతానాం యో నబుధ్యతే।

తస్య స్తంభో భవేద్బాల్యాన్నాస్తి స్తంభోఽను పశ్యతః॥

శిశుస్వభావము (మూఢత్వము) వలన ఎవడైతే భూతములయొక్క ప్రవృత్తి నివృత్తులను తెలిసికొనడో వానికి బంధమేర్పడుచున్నది. (యథార్థమును) కనుగొనువానికి బంధములేదు. (భారత. శాం 222అ. 14)

శ్లో॥ అనిష్టస్యహి నివృత్తిరనివృత్తిః ప్రియస్యచ।

లక్ష్యతే యతమానానాం పురుషార్థస్తతః కుతః॥

(సత్త్వాదిగుణములవలన కలుగబోవు ఫలములలో) ఇష్టములేనిది కలుగగూడదనియు, ఇష్టమైనది కలుగవలయుననియు గుఱుతుగ నిరీక్షింపబడుచున్నది. ఇటుల ప్రయత్నించువారికి తాము కావలయునన్నదే యెక్కడ కలుగుచున్నది? (భార శాం. 222-19)

శ్లో॥ అనిష్టస్యాభి నిర్వృత్తిమిష్ట సంవృత్తిమేవచ।
అప్రయత్నేన పశ్యామః కేషాంచిత్ తత్స్వభావతః॥

ఒకానొక కొందఱకు ఇష్టములేనిది కలుగకపోవుటయు, ఇష్టమైనది కలుగుటయు చూచుచున్నాము అది స్వభావము వలన కలుగుచున్నది (కాని) ప్రయత్నముచేత కలుగుటలేదు. (భార శాం. 222 20,)

శ్లో॥ స్వభావాల్లభతే ప్రజ్ఞాం శాంతిమేతి స్వభావతః।
స్వభావాదేవ తత్సర్వం యత్కించిదనుపశ్యసి॥

స్వభావమువలన బుద్ధిబలమును పొందుచున్నాఁడు. చిత్తోప శమమును స్వభావము వల్లనే పొందుచున్నాఁడు. నీవుఏయొక్కంత చూచుచున్నావో అదియంతయు స్వభావము వల్లనే కలుగుచున్నది.

(భారత. శాంతి. 222అధ్యా. 45శ్లో.)

మూ॥ ఉదాసీనవ దాసీనో గుణైర్యో నవిచాల్యతే
గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే॥ 23

తా॥ ఇష్టానిష్టములు రెండును కాఁబట్టనివాఁడుగా ఎవఁడుండునో, ఎవఁడు గుణములచే కదలింపఁబడఁడో. (ఆహారాదికములైన శారీరకర్మల యందు) గుణములు వర్తించుచున్నవేకాని నేనుకర్తనుకానని భావించి యెవడైతేకదలక నిలిచియున్నాఁడో (అట్టివాఁడు త్రిగుణాతీతుఁడు.)

శ్లో॥ అతశ్చాత్మని కర్తృత్వ మకర్తృత్వంచ వై మునే।
నిరిచ్ఛత్వాదకర్తాసౌ కర్తాఽన్నిధిమాత్రతః
తే ద్వే బ్రహ్మణి విందేతి కర్తృతా కర్తృతామునే
యత్రైవైష చమత్కార స్తమాశ్రిత్య స్థిరో భవ॥

ఓమునీంద్రా! కర్తృత్వము అకర్తృత్యము అనునవి ఆత్మయందేయున్నవి. కర్మయందు ఇచ్ఛలేకపోవుటవలనకర్తకాకుండపోవుచున్నాడు. ఇచ్ఛను కర్మ

యుందు నిలుపుటవలనే కర్తయగుచున్నాడు. ఇందువలన ఓమునీంద్రా! అట్టి కర్తృత్వా కర్తృత్వములు రెండును పరబ్రహ్మ తత్త్వమునందే యున్నవి. ఈచమత్కార మంతయు దేనియందున్నదో ఆపరమాత్మనే యాశ్రయించి సుస్థిరుడవుకమ్ము. (మహోపనిషత్తు 4అ 14-15)

మూ॥ సమదుఃఖసుఖస్స్వస్థః సమలోష్టాశ్మకాంచనః
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః 24.

మానావమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారంభ పరిత్యాగీ గుణాతీతస్సఉచ్యతే॥ 25.

తా॥ సుఖదుఃఖములు, ప్రియాప్రియములు, నిందాస్తుతులు, మానావమానములు, మిత్రశత్రుపక్షములు (ఇవన్నియు గుణసాంకర్యమువల్లనే కలుగుచున్నవి. నిర్గుణుడైనప్పు డివి యుండవు) ఇట్టి ద్వంద్వములను ఎవడైతే సమదృష్టితో జూచుచున్నాడో అట్టివాడు గుణాతీతుడని చెప్పబడుచున్నాడు. మంటిపెల్ల, ఱాయి, బంగారు ఈమూడు పృథివీ వికారములే. భౌతికదృష్టితో జూచినప్పుడు రూపమునందును, విలువయందును, ప్రయోజనమునందును బేదములు కనబడునుగాని ఆధ్యాత్మిక దృష్టియందన్నియు సమముగానే కనబడును. ఇట్లు సమముగ జూచువాడు గుణాతీతుడని చెప్పబడుచున్నాడు. స్వరూపధ్యానమునసుండువాడు. ఆత్మవిద్యాపండితుడు, భౌతికములైన సర్వకర్మలయందు ప్రయత్నము మానుకొనినవాడు గుణాతీతుడని చెప్పబడును. (ఆహారాదికములు, ఉచ్ఛ్వాస నిశ్వాసాదులు శారీర కర్మలు తనప్రయత్నము లేకయే సాగుచుండును )

శ్లో॥ యతాహారో జితక్రోధో జితసంగో జితేంద్రియః
నిర్ద్వంద్వో నిరహంకారో నిరాశిరపరిగ్రహః

నియతమైన ఆహారము కలవాడు, క్రోధమును జయించినవాడు, విషయాసక్తి లేనివాడు, ఇంద్రియ నిగ్రహము గలవాడు, సుఖదుఃఖాది ద్వంద్వములు లేనివాడు, అహంకారములేనివాడు ఆశలేనివాడు, ద్రవ్యము సమకూర్పవలెనను చింతలేనివాడు. (తేజోబిందూపనిషత్తు 1అ. 3)

శ్లో॥ కస్తవాయం జడో మూకో దేహో మాంసమయోఽశుచిః
యదర్థం సుఖదుఃఖాభ్యామవశః పరిభూయసే॥

నీవు దేనికొఱకు వివశుడవై సుఖదుఃఖములవలన పరిభవింపబడు చున్నాడవో అట్టిచైతన్య రహితమైన, వచనశూన్యమైన, మాంస భూయిష్ఠమైన అపరిశుద్ధమైన శరీరము నీకేమగును. (ఇచ్చట దేహాభిమానము నిరసింప బడుటవలన గుణాతీతుడగుచున్నాడు. మహోపనిషత్తు 4అ. 131)

శ్లో॥ యస్యచేచ్ఛా తథానిచ్ఛా జ్ఞస్య కర్మణి తిష్ఠతః।
నతస్య లిప్యతే ప్రజ్ఞా పద్మపత్రమివాంబుభిః॥

కర్మయందు అనుష్ఠానము గలయేజ్ఞానికైతే ఇష్టానిష్టములు సమముగ నుండునో అతనిబుద్ధి కర్మచే అంటఁబడక జలముచే అంటఁబడని తామరాకు వలె నిర్మలముగ నుండును. (మహోపనిషత్తు. 5అ. 173శ్లో)

శ్లో॥ అర్థసిద్ధి మనర్థంచ జీవితం మరణం తథా।
సుఖదుఃఖఫలంచైవ నద్వేష్మి నచకామయే॥

ద్రవ్యలాభమును, నష్టమును, జీవితమును, మరణమును, అదేవిధముగా సుఖదుఃఖములకు కారణమైన కర్మఫలమును నేను ద్వేషింపను, కోరను.
(భారత. శాంతి. 224అ. 13శ్లో)

శ్లో॥ నహృష్యత్యర్థలాభేషు నాలాభేషు వ్యథత్యపి
స్థిరబుద్ధి రసక్తాత్మా తస్మాత్సర్వత్ర పూజితః॥

లాభము వచ్చినప్పుడు సంతోషింపక నష్టము వచ్చినప్పుడు భీతిల్లక దేనియందును ఆసక్తిఁజెందక స్థిరమైనబుద్ధి కలిగియుండువాఁడు అందు వల్లనే యెల్లెడల పూజింపఁబడు చున్నాఁడు. (భార. శాం. 230 23.)

శ్లో॥ తుల్యప్రియా ప్రియోధీర స్తుల్యానిందాత్మ సంస్తుతిః।
అస్పృహస్సర్వకామేభ్యో బ్రహ్మచర్యదృఢవ్రతః

ప్రియా ప్రియములను, నిందాస్తుతులను సమముగఁ జూచువాఁడు. కోరఁదగిన సమస్త భౌతిక విషయములయందు ఆశలేనివాఁడు దృఢమైన బ్రహ్మచర్య వ్రతము కలవాఁడు ఆత్మవిద్యా పండితుఁడు.
(భారత. శాంతి. 236అ. 40)

శ్లో॥ సుఖంచ దుఃఖంచ భవాభవౌచ లాభాలాభౌ మరణం జీవితంచ
పర్యాయత స్సర్వమవా ప్నువంతి తస్మాద్ధీరో నైవహృష్యే న్నశోచేత్॥

సుఖదుఃఖములు, కలిమిలేములు, లాభాలాభములు, చావుబ్రతుకులు అవివరుసగా సర్వమును ప్రాపించుచునేయున్నవి అందువలన జ్ఞాని సంతోషింపరాదు శోకింపరాదు (భారత. శాంతి. 25అధ్యా. 31.)

శ్లో॥ అరోషమోహ స్సమలోష్ట కాంచనః ప్రహీణ కోశోగత సంధివిగ్రహః।
అపేత నిందాస్తుతి రప్రియా ప్రియ శ్చరన్నుదాసీన వదేషభిక్షుకః॥

రోషమోహములు లేనివాడుగాను, మంటిపెల్లను బంగారమును సమముగఁజూచు వాఁడుగాను, పంచకోశములకు అతీతుఁడుగాను, సంధివిగ్రహశూన్యుఁడుగాను, నిందాస్తుతులను పాటింపని వాఁడుగాను, ప్రియా ప్రియములు లేనివాడుగాను సంచరించుచు ఆసన్న్యాసి యేదియు అంటనివాడుగ నుండును.

మూ॥ మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేనసేవతే
సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మ భూయాయకల్పతే॥ 26

తా॥ సమస్తభూతములయందు నేను నేనని పేర్కొనబడు పరిశుద్ధాత్మకంటె వేఱొకటి యెందునులేదని తెలిసికొని ఈభావమునుండి తానొకప్పుడును ప్రక్కకుబోక భక్తియోగముచేత ఆ పరమాత్మ నే యెవడు భజించుచున్నాడో అట్టిభక్తుడు ఆగుణముల నతిక్రమించి పరమాత్మ తత్త్వమును పొందుటకు సమర్థుడగుచున్నాడు.

మూ॥ బ్రహ్మణోహి ప్రతిష్ఠాహ మమృత స్యావ్యయస్యచ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్యచ॥ 27.

తా॥ భూతోత్పత్తికి కారణమైన బృహత్తత్త్వమున కాశ్రయము అస్మత్పద లక్ష్యార్థమైన పరమాత్మయేకదా? (అందువలన) ఎన్నటికైన క్షీణింపని మోక్షపదమునకును, శాశ్వతమైన అర్షధర్మమునకును, రూపనామక్రియలు మనోవృత్తులు అడగిపోగా నిర్వికల్ప సమాధియందు ప్రత్యగాత్మయొక్కటి మిగిలియుండునపుడు కలుగు అతిశయమైన సుఖమునకును ఆశ్రయమాపరమాత్మయే కదా? (కాబట్టి పరమాత్మను భజించువాడు గుణాతీతుడు కావచ్చును)

ఇది శ్రీమహాభారతము భీష్మపర్వములో గుణత్రయ విభాగయోగ మనెడు ముప్పది యెనిమిదవ అధ్యాయము.

ఓం. తత్. సత్.

# శతపత్రము

# 111

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 39 అధ్యాయము.

మూ॥ ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్॥ 1.

తా॥ దేనికైతే ఛందస్సులు పర్ణములుగ నున్నవో (దానిని) పైవైపునకు మూలములు. క్రిందివైపునకు శాఖలుగల తఱిగిపోని యశ్వత్థమని చెప్పుదురు. అట్టి యశ్వత్థము నెవడు తెలిసికొనునో వాడు తత్త్వజ్ఞుడు.

వివ॥ ఈయశ్వత్థమునుగుఱించి 38-39 పత్రములలో కొంతచదివినట్లు పాఠకులకు జ్ఞాపకముండవచ్చును. ఈదిగువ మఱికొంత వ్రాయబడినది.

1 శ్లో॥ ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషోఽశ్వత్థస్సనాతనః
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే॥

పైవైపునకు మూలము, క్రిందివైపునకు శాఖలు కలిగినది సనాతనమైన అశ్వత్థము. అదేతేజస్సు, అదేబ్రహ్మ, అదేమోక్షము అని చెప్పబడుచున్నది. (కఠోపనిషత్తు 6 వల్లి 1)

2. "బ్రహ్మైవేద మమృతం పురస్తాద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ, దక్షిణత శ్చోత్తరేణ అధశ్చోర్ధ్వంచ ప్రసృతం బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్"

మోక్షమనునది బ్రహ్మయే. ముందు, వెనుక, కుడి యెడమల, క్రింద పైన అన్నివైపుల ప్రసరించి యుండునది బ్రహ్మయే. గొప్పదైన యీవిశ్వము బ్రహ్మయే. (ముండకోపనిషత్తు 2ముం. 2ఖం. 11శ్లో.)

3. సుషుమ్నానాడికి ఎడమవైపున ఇడానాడియు, కుడివైపున పింగళా నాడియు ఉన్నవి. ఆరెంటికినడుమ (సుషుమ్నానాడియందు) పరమపదము న్నది. దానినెవడు తెలిసికొనుచున్నాడో వాడు తత్త్వజ్ఞుడు" (క్షురికోపని

షత్తు 16-17) "ఈనాడి శుభాశుభములైన భావములతో కూడినదని భావింప వలయును. ఇట్లు భావించినవారు జన్మరాహిత్యమును పొందుదురు"
(క్షురికోపనిషత్తు 20)

4 "మూలాధారమునుండి కూటస్థానమువఱకు సుషుమ్నానాడి బ్రహ్మ నాడియని తలపబడినది. దీనికి ఇరుపార్శ్వములయందును ఇడా పింగళా నాడులు నాసికాంతమువఱకు వ్యాపించియున్నవి. గాంధారి హస్తిజిహ్వయనెడు రెండునాడులు నేత్రాంతములవఱకు వ్యాపించియున్నవి. పూషా, అలంబుసా యనెడు రెండుచెవులయందు వ్యాపించియున్నవి. శూరయను గొప్పనాడి భ్రూమధ్యము నాశ్రయించియున్నది. విశ్వోదరియను నాడి చతుర్విధాహార ములను పచనముచేయుచున్నది. సరస్వతీనాడి జిహ్వాగ్రమున వ్యాపించి యున్నది. రాకా అనునాడి జలమును పీల్చుకొని తుమ్ములను పుట్టించుచు న్నది. ముక్కురంధ్రములలో కఫమును పెరుగొనునట్లు చేయుచున్నది శంఖినియనునాడి కంఠస్థానమున అధోముఖముగనుండి అన్నరసమును శిర మునకు జేర్చుచున్నది. మూడునాడులు అధోముఖముగా వ్యాపించినవి వాని లో కుహూనాడి మలవిసర్జనము చేయించుచున్నది. వారుణీనాడి మూత్రము ను వెడలించుచున్నది. చిత్రా నామాంతరముగల "సీవినీ" నాడి రేతస్సును వర్షించుచున్నది. ఇది నాడీచక్రమని చెప్పబడినది."
(యోగశిఖోపనిషత్తు 5అ. 17శ్లో. మొదలు.)

శ్లో॥ ఏకోత్తరం నాడిశతం తాసాం మధ్యే పరాస్మృతా।
సుషుమ్నాతు పరేలీనా విరజా బ్రహ్మరూపిణీ॥
ఇడా తిష్ఠతి వామేన పింగళా దక్షిణేన తు।
తయోర్మధ్యే పరం స్థానం యస్తద్వేద స వేదవిత్

నాడులు నూట యొకటియున్నవి. అనాడు లన్నిటిలో నడుమనుండు సుషుమ్నానాడి శ్రేష్ఠముగాఁ దలఁపఁబడినది, రజోగుణములేనిది బ్రహ్మస్వ రూపమైనది, పరమాత్మయందు లయించునది. ఎడమవైపున ఇడానాడి యున్నది. కుడివైపున పింగళా నాడియున్నది. ఆరెంటికినడుమ (సుషుమ్నా నాడియందు) పరమ పదమున్నది. దానినెవఁడు తెలిసి కొనుచున్నాఁడో వాఁడు తత్త్వజ్ఞుఁడు. (యోగశిఖోపనిషత్తు 6అ 5-6.)

" ఇడా పింగళా నాడులనడుమ సూర్యరూపిణియైన సుషుమ్నానాడి యున్నది. సూర్యచంద్రులు, అగ్ని, పరమేశ్వరుఁడు, భూతసంఘములు. దిక్కులు, క్షేత్రములు, సముద్రములు, పర్వతములు, శిలలు, ద్వీపములు, నదులు, వేదములు, శాస్త్రములు, విద్యలు, కలలు, అక్షరములు, స్వరయుక్తములైన మంత్రములు, పురాణములు, సర్వవిధములైన గుణములు, కారణకారణాత్మకములు, క్షేత్రజ్ఞుఁడు సర్వప్రపంచము సుషుమ్నానాడి యందే ప్రతిష్ఠింపఁబడి యున్నవి'' (యోగశిఖో పనిషత్తు 6అ. 9 శ్లో మొదలు.)

శ్లో॥ ఊర్ధ్వమూల మధశ్శాఖం వాయుమార్గేణ సర్వగమ్।
ద్విసప్తతి సహస్రాణి నాడ్యః స్యుర్వాయుగోచరాః॥
సర్వమార్గేణ సుషిరాస్తిర్యఞ్చ సుషిరా మతాః
అధశ్చోర్ధ్వంచ కుండల్యాః సర్వద్వారనిరోధనాత్।

పైవైపునకు మూలము, క్రిందివైపునకు శాఖలుకలిగి వాయుమార్గముచే సర్వమును పొందియుండు సుషుమ్నానాడియు, డెబ్బదిరెండువేల నాడులును వాయువుచే గోచరములగును. శరీరమునందు ఇంద్రియ వ్యాపారము జరుగు ద్వారములన్నియు అపివేయబడుటవలన కుండలికి క్రింద, పైన వ్యాపించియుండు నాళములు, అన్నిరీతుల ప్రక్కలకు వ్యాపించియుండు నాడులు తెలియబడుచున్నవి. (యోగశిఖోపనిషత్తు 6అ. 14, 15.)

శ్లో॥ సుషుమ్నైవ పరంతీర్థం సుషుమ్నైవ పరోజపః
సుషుమ్నైవ పరం ధ్యానం సుషుమ్నైవ పరా గతిః॥

సుషుమ్నయే శ్రేష్ఠమైన తీర్థము. సుషుమ్నయే శ్రేష్ఠమైనజపము. సుషుమ్నయే శ్రేష్ఠమైన ధ్యానము. సుషుమ్నయే ఉత్తమగతి.

(యోగశిఖోపనిషత్తు 6అధ్యా 45)

5. ''హృదయకమల మధ్యమున ఊర్ధ్వముగా అణుమాత్రమైన అగ్నిజ్వాల యున్నది. అది నీలమేఘమునందలి తీగ మెఱుపువంటి వెలుతురు గలదై వరిధాన్యపు ముల్లువలె సన్నమైయుండును. ఆయగ్నిజ్వాలనడుమ పరమాత్మ యున్నది.'' (అని వాసుదేవోపనిషత్తులోను, నారాయణోపనిషత్తులోను, మహోపనిషత్తు 1అ లోను చదివినట్టు జ్ఞాపకము )

6. "వైష్ణవీ, బ్రహ్మనాడీ" అని చెప్పబడిన సుషుమ్నానాడి కంద మధ్యమునుండి ఊర్ధ్వముగా బ్రహ్మరంధ్ర ముండినంతవఱకు మెఱుపువంటి కాంతితో పద్మనాళమువలె చక్కగా వ్యాపించియున్నది. మోక్షప్రాప్తికి ఈ నాడియే మార్గము ఈసుషుమ్నానాడికి ఎడమప్రైపున ఇడానాడి యెడమ నా సాంతమువఱకు వ్యాపించియున్నది. పింగళానాడి కుడివైపు నాసాంతము వఱకు వ్యాపించియున్నది. గాంధారీ, హస్తిజిహ్వ అను రెండునాడులు ఎడమ కుడినేత్రముల వ్యాపించియున్నవి. పూషా, యశస్వినీనాడులు రెండును ఎడమ కుడికర్ణముల వ్యాపించియున్నవి. అలంబుసానాడి పాయుమూలము నుండి క్రిందికి వ్యాపించియున్నది. శుభానాడి మేఢ్రాంతముపఱకు నిడుపుగ వ్యాపించియున్నది. కౌశికీనాడి కందమునుండి క్రిందివైపునకు పాదాంగుష్ఠము వఱకు వ్యాపించియున్నది. ఈపదిరకముల నాడులు కందమధ్యమున బుట్టి నవి వీనివలన మఱికొన్ని స్థూలనాడులు పుట్టినవి. ఆస్థూలనాడులవలన వేఱొక కొన్నిసూక్ష్మనాడులు పుట్టినవి. ఇట్లు డెబ్బదిరెండువేలనాడులు పుట్టి నవి. ఈస్థూల సూక్ష్మనాడులను వేఱువేఱుగా లెక్కించుటకు సాధ్యము కాదు. రావియాకునందు స్థూల సూక్ష్మనాడులన్నియు నెట్లు వ్యాపించి యు న్నవో అట్లే యీశరీరమునందలి నాడులు వ్యాపించియున్నవి.

(త్రిశిఖి బ్రాహ్మణోపనిషత్తు 67శ్లో. మొదలు.)

7. "కుండలి నాశ్రయించి పదునాలుగు నాడులున్నవి అందు సుషు మ్నానాడి విశ్వమును ధరించియున్నది మోక్షమునకు మార్గమైయున్నది. గుదస్థానమునకు వెనుకప్రక్క మూర్ధపర్యంతము వీణావండము నాశ్రయిం చి బ్రహ్మరంధ్రమున సూక్ష్మముగ వ్యక్తమగుచున్నది. (ఇందు పదునాలుగు నాడులు కొద్దిపాటి భేదములతో పై యుపనిషత్తులలోవలెనే వర్ణింపబడినవి.) ఈనాడులవలన మఱికొన్ని పుట్టినవి. వానివలన వేఱొకకొన్నిపుట్టి శాఖోపశాఖ లుగా వ్యాపించియున్నవి.

"యథాశ్వత్థాది పత్రం శిరాభిర్వ్యాప్తమేవం శరీరం నాడీభిర్వ్యాప్తమ్"

రావి మొదలైన చెట్ల ఆకు శిరలచే (సూక్ష్మనాళములచే) ఎట్లు వ్యాప్త మైయున్నదో అట్లే శరీరము నాడులచేత అల్లుకొనబడియున్నది.

(శాండిల్యోపనిషత్తు 1అ)

8 శ్లో॥ ఏకాయనోఽసౌ ద్విఫలస్త్రిమూల శ్చతూరసః పంచవిధష్షడాత్మా।
సప్తత్వగష్టవిటపో నవాక్షో దశచ్ఛదో ద్విఖగోహ్యాదివృక్షః॥

ఆయాదివృక్షము (మాయయనెడు) ఒకపాది, (సుఖదుఃఖములనెడు) రెండుఫలములు, (సత్త్వరజస్తమో గుణములనెడు) మూడువేళ్లు, (ధర్మార్థ కామ మోక్షములనెడు) నాలుగు రసములు, (ఇంద్రియములనెడు) ఐదు ఊడలు, (ఆకలి దప్పులు, శోకమోహమును, జరామరణములు ననెడు) ఆఱు స్వభావములు, (మేదోమాంసాది సప్తధాతువులనెడు) ఏడు త్వక్కులు (పంచభూతములు, మనోబుద్ధ్యహంకారములనెడు) ఎనిమిది కొమ్మలు, (శరీరమునందలి నవరంధ్రములనెడు) తొమ్మిది కోటరములు, (ప్రాణవాయువులు, ఉపవాయువులు ననెడు) పది పత్రములు, (జీవేశ్వరులనెడు) రెండుపక్షులు కలిగినదికదా? (భాగవత 10స్కం. 2అ. 29. శ్రీధరవ్యాఖ్య.)

శ్లో॥ యస్మిన్నిదం ప్రోతమశేషమోతం పటోయథా తంతు వితాన సంస్థః।
య ఏష సంసారతరుః పురాణః కర్మాత్మకః పుష్పఫలే ప్రసూతే॥

ఈవిశ్వమంతయు తంతుసముదాయము నందలి వస్త్రమువలె దేనియందు కూర్పఁబడినదో, నేయఁబడినదో, ఏదైతేసనాతన మైయున్నదో, కర్మ చేయుస్వభావము కలదైకర్మఫలములను కలిగించుచున్నదో అదిసంసారవృక్షము. (భాగవ. 11స్కం. 12అ. 21శ్లో. శ్రీధరవ్యాఖ్య )

శ్లో॥ ద్వే అస్యబీజే శతమూలస్త్రినాళః। పంచస్కంధః పంచరసప్రసూతిః।
దశైకశాఖో ద్విసుపర్ణనీడ స్త్రివల్కలో ద్విఫలోఽర్కప్రవిష్టః॥

ఆసంసారవృక్షమునకు పుణ్యాపాపములనెడు రెండువిత్తనములు, అధిక సంఖ్యాకములైన విషయవాసనలనెడు మూలములు, సత్త్వరజస్తమోగుణములనెడు మూఁడు ప్రకాండములు, పంచభూతములనెడు ఐదుస్కంధములు, శబ్దాది విషయములనెడు ఐదురసముల యుత్పత్తి, మానసేంద్రియములనెడు పదునొకండు శాఖలు, జీవాత్మ పరమాత్మలనెడు రెండుపక్షుల నివాసము, వాతపిత్తశ్లేష్మము లనెడుమూఁడు త్వక్కులు, సుఖదుః ఖములనెడు రెండుఫలములు, దహరాకాశమున చిద్భానుమండలమున విలయముకలవు.
(భాగవ. 11స్కం. 12అధ్యా. 22శ్లో శ్రీధరవ్యాఖ్య.)

1. "అనాది పరబ్రహ్మవలన స్వయంజ్యోతి స్వరూపమైన పరాశక్తి కలిగినది. శక్తియుతమైన ఆత్మవలన ఆకాశము కలిగినది. ఆకాశమువలన వాయువుకలిగినది. వాయువు వలన అగ్ని కలిగినది. అగ్నివలన జలము కలిగినది. జలమువలన పృథివి కలిగినది. ఈపంచభూతములను పాలించుటకు బ్రహ్మాదులుకలిగిరి బ్రహ్మవలన సమస్తలోకములు, దేవమనుష్యతిర్యగ్జంతువులు, చరాచరములుకలిగెను. అందుమనుష్యాదుల శరీరములు పంచభూతమయము లైయున్నవి. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, శబ్దాది విషయములు, ప్రాణాదివాయు పంచకము, మనస్సు బుద్ధి ఇవియన్నియు స్థూలరూపమున స్థూలశరీరమనియు సూక్ష్మరూపమున సూక్ష్మశరీరమనియు చెప్పఁబడును. త్రిగుణము లతోఁగూడినది కారణ శరీరమనఁబడును" (యోగచూడామణ్యుపనిషత్తు 72.) ఇందుసర్వోత్కృష్టమైన పరబ్రహ్మతత్త్వము మూలమగుచున్నది. నికృష్టములైనసర్వభూతములు శాఖలగుచున్నవి.

10. "పరబ్రహ్మవలన మూలకారణావ్యక్తశక్తి కలిగినది. అవ్యక్తము వలన మూలావిద్యాశక్తి కలిగినది. అందువల్లనే సచ్ఛబ్దవాచ్యమైన బ్రహ్మ అవిద్యాశబలమగుచున్నది. దానివలన మహత్తు, మహత్తువలన అహంకారము అహంకారమువలన పంచతన్మాత్రలు, పంచతన్మాత్రలవలన పంచమహాభూతములు. పంచమహాభూతములవలన బ్రహ్మైకపాదవ్యాప్తమైన అవిద్యాండము కలిగినది." (మహానారాయణోపనిషత్తు 2అ)

11. "అవ్యక్తమువలన మహత్తత్త్వము కలిగినది. దానివలన అహంకారము కలిగినది. అహంకారమువలన ఆకాశము, ఆకాశమువలనజలము, జలమువలన అగ్నివాయువులు. అగ్నివాయువుల సంయోగమువలన పృథివి, అటుపైన సర్వభూతములు పుట్టినవి" (భారత. శాంతి. 182అ.) మఱికొన్ని గ్రంథములలోను ఇంచుక భేదములతో నిట్లే వ్రాయబడినది.

ప్రపంచ సృష్టిక్రమమును విచారించినను, ఒక్కొక్క శరీరమును పరిశీలించినను, శరీరమునందలి నాడీచక్రమును విమర్శించినను, అందలి చిత్తలను దిలకించినను, చిత్కళయందలి నిష్కళాస్వరూపమును గాంచినను అన్నిటియందును మనము తెలిసికొనదగినది ఒకటే సూత్రము మూలము పైపైపున నున్నది. శాఖలు క్రిందిపైపున నున్నవి. నాడీచక్రమునందు సుషుమ్నానాడి మూలమగుచున్నది. తక్కినవాడులు శాఖలగుచున్నవి. ఇందు

నివసించు పురుషుడు విషయవాసనతో గూడినప్పుడు ఇదిసంసార వృక్షమగు చున్నది. వాసనలు క్షీణించినప్పుడు వేదవృక్షమగుచున్నది. ఎట్లయినను దీనిని దెలిసికొనుట లెస్స. ఇకను,

శ్లో॥ వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా।
ఘటత్వేన యథాపృథ్వీ జలత్వేన మరీచికా॥
గృహత్వేన హి కాష్ఠాని ఖడ్గత్వేనైవ లోహతా
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥

మట్టి (భూమి) కడవ రూపముగా ఎట్లు నిర్ణయింపబడినదో, మృగతృష్ణ జలరూపముగా ఎట్లు నిర్ణయింపబడినదో, కొయ్యలు గృహరూపముగా ఎట్లు నిర్ణయింపబడినవో, ఇనుము ఖడ్గరూపముగా ఎట్లు నిర్ణయింపబడినదో అట్లే పరమాత్మభావము మూఢమానవునిచేత దేహరూపముగా నిర్ణయింపబడినదికదా? మానవుడు అజ్ఞానముతో గూడుటవలన పరమాత్మయందు అప్రకారముగా దేహభావమును జూచుచున్నాడు (యోగశిఖోపనిషత్తు 4అ 23-24)

శ్లో॥ మృణ్మయం భాండరూపాది యత్తత్సర్వం మృదేవహి
తథా దేహత్వమాపన్నం బ్రహ్మ బ్రహ్మైవ కేవలం॥

మంటితో ఏర్పడిన కడవమొదలైన యేరూపములుకలవో అవియన్నియు మట్టియే కదా? అదేవిధముగా దేహరూపమును పొందియున్న బ్రహ్మము కేవలము బ్రహ్మమే యగును (విశ్వగీత. 107)

శ్లో॥ బ్రహ్మణః సర్వభూతాని జాయంతే పరమాత్మనః।
తస్మాదేతాని బ్రహ్మైవ భవంతీతి విచింతయ॥
బ్రహ్మైవ సర్వనామాని రూపాణి వివిధాని చ
కర్మాణ్యపి సమగ్రాణి బిభర్తీతి విభావయ॥
సువర్ణాజ్జాయమానస్య సువర్ణత్వంచ శాశ్వతమ్।
బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వంచ తథా భవేత్॥

పరమాత్మయైన బ్రహ్మమువలన సమస్తభూతములు కగుగుచున్నవి. అందువలన ఈభూతములన్నియు బ్రహ్మయేయగునని తలఁపుము సమస్తనామములను, వివిధరూపములను, సమగ్రమైన కర్మలను సైతము బ్రహ్మమే

ఖరించుచున్నదని భావింపుము. బంగారము వలనఏర్పడిన వస్తువునకు బంగారమనెడు భావమే శాశ్వతముగ కలుగుచున్నది. అప్రకారముగానే బ్రహ్మమువలన జనించిన సమస్తభూత సముదాయమునకు బ్రహ్మభావమే కలుగవలయును. (యోగశిఖోపనిషత్తు4 అధ్యా, 5-6-7శ్లో) ఇట్టిప్రమాణ వాక్యములను బట్టిచూడదేహమును దెలిసికొన్నను, విశ్వమును దెలిసికొన్నను బ్రహ్మమును దెలిసికొన్నట్లేయనిభావము.

"దశభిర్వాయుభి ర్వ్యాప్తందశేంద్రియ పరిచ్ఛదమ్" దశవిధ వాయువులచే వ్యాప్తమైనది. దశేంద్రియములచే అచ్ఛాదింపఁబడినది.

(యోగశిఖో పనిషత్తు 5అ. 2శ్లో)

ఆకులు వృక్షముల నాచ్ఛాదించియుండి వెలినుండి సూర్యకిరణములను, ప్రాణవాయువును లోఁగొని వృక్షముల కందఁజేయునట్లు దశేంద్రియములు నాడిచక్రము నాచ్ఛాదించియుండి శబ్దాదివిషయములను పురుషునకు అందఁజేయు చున్నవి కనుక ఈవేదవృక్షమునకు ఇంద్రియములే పర్ణములని చెప్పబడును. మఱియు "ఛదిఆహ్లాదనే" అను సూత్రమువలన విషయా దులచే దేహికి అహ్లాదము కలిగించుచున్నవి కావున కొందఱు వీనినిఛందస్సులని చెప్పుదురు.

"హృదాకాశే చిదాదిత్య స్సదా భాసతి భాసతి నాస్తమేతి నచోదేతి"

సుషుమ్నాంతర్గతమైన దహరాకాశమునందు జ్ఞానసంబంధమైన సూర్యమండలము సర్వదా వెలుఁగుచున్నది. అస్తమించుటలేదు, ఉదయించుటలేదు. (మైత్రేయ్యుపనిషత్తు 2-14) ఇందువలన ఈబ్రహ్మవృక్షమునందు రాత్రిందివములులేవు. సంవత్సరమాసతిథివార నక్షత్రములులేవు. సాయంప్రాతస్సంధ్యలులేవు కాలపరివర్తనములేదు. భౌతికవస్తువుల యందువలె దీని యందు "శ్వః (ఱేపు)" అనుసమస్య యెంధునులేదు. కాఁబట్టిదీనికి "అశ్వత్థ" మనిపేరు వచ్చినది. మఱియు ఈవృక్షమెన్నఁడును తఱిగి పోవునదికాదు అందుచే అవ్యయమనియుఁ జెప్పుదురు. ఇట్టియశ్వత్థమనెడు బ్రహ్మవృక్షము నెవఁడు తెలిసి కొనుచున్నాఁడో వాఁడు తత్త్వజ్ఞుఁడు.

మూ॥ అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా।
గుణప్రవృద్ధా విషయప్రవాళాః।

అధశ్చ మూలాన్యను సంతతాని।
కర్మానుబంధీని మనుష్యలోకే॥ 2

తా॥ పుణ్యపాప సంకలితమైన రజోగుణము వలన కలిగినది మనుష్య సృష్టి. కాఁబట్టి మనుష్యులయందు అయశ్వత్థ వృక్షముయొక్క శాఖలు శబ్దాది విషయములచే చిగిరించుచున్నవి. రాగాడిగుణములచే పెరిగిపోవుచున్నవి. క్రిందికి, పైకిని వ్యాపించుచున్నవి. (సత్కర్మాభిలాషచే ఉన్నతదశ ప్రాపించుచున్నవి. దుష్కర్మాభిలాషచే నీచదశ ప్రాపించుచున్నవి) మూలములు (రాగాత్మకములైన మనుష్య శరీరములయందలి ప్రత్యగాత్మలు) కర్మబంధములచే లాగఁబడి అధోమార్గమునకును మిక్కిలిగ వ్యాపించున్నవి. (ఈశ్లోకములో అశ్వత్థము సగుణముగా వర్ణింపఁబడుటవలన సంసార వృక్షమగుచున్నది.)

శ్లో॥ స బాహ్యాభ్యంతరే దేహే హ్యధఊర్ధ్వంచ దిక్షుచ।
ఇతఆత్మా తతోఽప్యాత్మా నాస్త్యనాత్మమయం జగత్॥

శరీరమునందు వెలుపల, లోపల, క్రిందివైపున, పైవైవున, దిక్కులయందును ఇటు జూచినను పరమాత్మయే అటు జూచినను పరమాత్మయే. పరమాత్మకంటె వేఱుగ జగత్తు అనేది మఱియొకటిలేదు. (మహోపనిషత్తు 6అ. 10శ్లో.) ఇచట త్రిగుణాతీతమైన అశ్వత్థము వర్ణింపబడినది.

మూ॥ న రూపమస్యేహ తథోపలభ్యతే। నాంతో నచాదిర్నచ పంప్రతిష్ఠా।
అశ్వత్థమేనం సువిరూఢమూల మసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా॥3.
తతః పదం తత్పరిమార్గితవ్యమ్ యస్మిన్ గతా ననివర్తంతి భూయః
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥

తా॥ ఈలోకములో ఆసంసారవృక్షముయొక్క రూపము అగోచరమైనది. అదేప్రకారముగా అంతము, ఆది, స్థిరమైన అధారము అన్నియు నగోచరములే. మూలము మాత్రము గట్టిగ పాదుకొనియుండును.

సుషుమ్నానాడి యొకటి నివృత్తిలో చేరుచున్నది. ఇతరనాడులన్నియు (శాఖలు) ప్రవృత్తి వ్యాపారములో జెరుచున్నవి. రజోగుణాత్మకమైన విషయానురాగమువలన ఈశాఖలు బలియుచున్నవి. దృఢమైన వైరాగ్యము కలిగినప్పుడు విషయవ్యాపారము ఆగిపోవుచున్నది. ప్రవృత్తిలో జెరిన నాడు

లన్నియు ఉడిగిపోవుచున్నవి. సుషుమ్నానాడి (మూలము) మిగులుచున్నది. అపిమ్మట సుషుమ్నాగ్రమున సూక్ష్మమైన దహరాకాశమున ప్రకాశించు స్వయంజ్యోతియందు నిష్కళారూపమైయున్న ఆపరమాత్మను ఆదిపురుషుని ప్రాపించుచున్నాను. (అని నిశ్చయించి) పురాతనమైన ప్రవృత్తి దేనినుండి వ్యాపించినదో, దేనియందు కలిసిపోయినవారు మరల ప్రవృత్తికి తిరిగిరారో ఆపరమపదమును వెదకవలయును. (మూడవశ్లోకములో ప్రథమపాదము పంద్రెండవ ఛందస్సులో జేరినది. తక్కినపాదములు పదునొకండవ ఛందస్సులో జేరినవి. దీనిని విమర్శించుట మనపనికాదు )

1 డెబ్బదిరెండువేలనాడులలో ప్రతినాడియందును కార్యకరణశక్తి యున్నది. సుషుమ్నానాడితప్ప తక్కిన నాడులన్నియు ధ్యానయోగముచే ఖండింపబడును జ్ఞానిఅనేకములైన నాడులను తనప్రభావమువలన ఈజన్మమునందే ఖండింపవలయును.

వలను త్రెంపుకొని నిస్సంశయముగా ఆకాశమునకు హంస యెట్లు లేచిపోవునో అట్లే జీవుడు బంధములను త్రెంపుకొని సంసృతి దాటిపోవుచున్నాడు ప్రాణాయామముచేతను, వైరాగ్యముచేతను బంధములను ఖండించినయోగి బద్ధుడుకాడు. కోరికలను, ఆశలను ఎప్పుడు మానుకొనునో అప్పుడే బంధమును త్రెంపుకొని మోక్షమును పొందుచున్నాడు" (క్షురికోపనిషత్తు)

2. "అసంఖ్యాకములైన అంకురములు, శాఖలు ఫలములు, పల్లవములుగలిగిన ఆసంసార వృక్షమునకు మనస్సు కారణమైయున్నది. మనస్సు పెంపొందగా జ్ఞానము నశించుచున్నది. మనస్సు నశింపగా జ్ఞానము పెంపొందుచున్నది. వాసనాత్రయమును త్యజించుటచేతను, వాయుచలనమును నిరోధించుటచేతను మనస్సును జయింపవచ్చును అన్నివాసనలకంటె ముందు విషయవాసనను త్యజింపవలయును. ఈవిషయవాసన వలన పురుషుడు బద్ధుడగుచున్నాడు. వాసన క్షీణింపగా మోక్షమును పొందుచున్నాడు.

వాసనాక్షయము, తత్త్వజ్ఞానము, మనోనాశము ఈమూడు ఒకటేసారి బహుకాలము అభ్యాసము చేయుటవలన ఫలించుచున్నవి ఒక్కొక్కదానిని వేఱువేఱుగా ఎంతకాలము అభ్యాసము చేసినను లాభములేదు. పెక్కుజన్మములనుండి అలవాటుపడియున్న అసత్యమైన ఆసంసారవాసన చాలకాలము

అభ్యాసయోగము చేసిననేకాని మఱియొకవిధముగా క్షీణింపదు"

(ముక్తికోపనిషత్తు 2అధ్యా.)

3. " విషయవాసన, అగ్ని, ఋణము, వ్యాధి, శత్రువు, స్నేహము, వైరము, విషాణము ఇవికొంచెము మిగిలియున్నను బాధించును, విషయ వాసనయొక్క విత్తనమునే దహించి వేసి సత్తామాత్రుడైయున్న యోగీశ్వరుఁడు దేహముతో నున్నవాఁడైనను, దేహమును వదలిన వాఁడైనను మరలదుఃఖము ననుభవింపఁడు ఆశ నిరాశకావలయును. భావము అభావము కాలయును. మనస్సు అమనస్కము కావలయును. అప్పుడు పురుషుఁడు సంగవర్జితుఁడగు చున్నాఁడు.

చిత్తముయొక్క సంకోచ వ్యాకోచములవలన సంసారమునకు ప్రళయోదయములు కలుగుచున్నవి. వాసనను, ప్రాణవాయువును నిరోధించి మనోవ్యాకోచమును మాన్పుము. ప్రాణవాయువుల యొక్క సంకోచ వ్యాకోచముల వలన సంసృతికి ప్రళయోదయములు కలుగుచున్నవి అభ్యాసయోగముచేత, ప్రయత్నముచేత దానివ్యాకోచమును మాన్పుము పౌర్ఖ్యముయొక్క సంకోచ వ్యాకోచములవలన కర్మలకు ప్రళయోదయములు కలుగుచున్నవి. గురువులను, శాస్త్రార్థములను కూడుకొని అట్టివ్యాకోచమును మాన్పుము"

(అన్నపూర్ణోపనిషత్తు 5అధ్యా)

4. " కాష్ఠములు లేకపోయినప్పుడు అగ్నితనంతటతానే యెట్లునశించుచున్నదో అట్లే ఆశారహితుఁడై విషయార్థములను గ్రహింపని యోగీశ్వరుని యందలి మనోవాయువులు తమకుఁదామే శమించి పోవుచున్నవి. అతఁడు నిశ్చయ జ్ఞానసంపన్నుఁడగు చున్నాఁడు. సముద్రజలమునుండి యుత్పన్నమైన ఉప్పుగడ్డ జలములోనే కలిసిపోయినట్లు శుద్ధసత్త్వ స్వరూపమైన పరమాత్మనుండి ప్రత్యేకింపఁబడిన జీవుఁడు మరల ఆసత్త్వమునందే కలిసిపోవుచున్నాఁడు" (త్రిశిఖిబ్రాహ్మణో పనిషత్తు. 162 163)

5 శ్లో॥ భోగైకవాసనాం త్యక్త్వా త్యజ త్వం భేదవాసనామ్।
భావాభావౌ తతస్త్యక్త్వా నిర్వికల్పః సుఖీభవ॥

భోగములయందలి వాసన మానుకొనుము. భేదవాసనయు మానుకొనుము భావాభావములను వదలి వికల్పములు లేనివాఁడవై సుఖవంతుడవుకమ్ము.

(మహోపనిషత్తు 4 109.)

6. శ్లో॥ వాసనా ఏవ సంసార ఇతి సర్వా విముంచతాః॥
తత్త్యాగో వాసనాత్యాగాత్ స్థితిరద్యయథా తథా॥

విషయ వాసనలే సంసారమనియెంచి ఆవాసనలనన్నింటిని వదలివేయుము. వాసనలను త్యజించుటే సంసారమును త్యజించుట యగును. అప్పుడెట్టిస్థితి కలుగవలయునో అట్టిస్థితియే కలుగుచున్నది. (అష్టావక్రగీత. 9ప్ర. 8.)

శ్లో। విహాయ వైరిణం కామమర్థం చానర్థసంకులమ్
ధర్మమప్యేతయోర్హేతుం సర్వత్రానాదరం కురు॥

జ్ఞానికిశత్రువైన కామమును, అనర్థముల పుట్టయని చెప్పఁదగిన అర్థమును, ఈరెంటికిని కారణమైన ప్రవృత్తి ధర్మమునుకూడ వదలిపెట్టి అన్నింటియందును నిరాదర భావము కలిగియుండుము. (అష్టావక్రగీత. 10ప్ర 1)

శ్లో॥ యత్రయత్ర భవేత్తృష్ణా సంసారంవిద్ధితత్రవై।
ప్రౌఢవైరాగ్య మాశ్రిత్య వీతతృష్ణస్సుఖీభవ॥

ఎచ్చటెచ్చట ఆసక్తి కలుగుచున్నదో అచ్చట సంసారమున్నదని తెలిసికొనుము. దృఢమైన వైరాగ్యము నాశ్రయించి ఆసక్తివదలి సుఖవంతుఁడవు కమ్ము. (అష్టావక్రగీత, 10 ప్ర. 3శ్లో.)

శ్లో॥ తదా బంధో యదా చిత్తం సక్తం కాస్వపి దృష్టిషు
తదా మోక్షో యదా చిత్తమసక్తం సర్వదృష్టిషు॥

మనుష్యుడుచూచు చూపులలో వేనియందైన చిత్తము ఎప్పుడాసక్తి జెందుచున్నదో అప్పుడు బంధమగుచున్నది. ఆచూపులయం దెల్లెడల చిత్తము ఎప్పుడైతే ఆసక్తి లేకయుండునో అప్పుడు మోక్షమగుచున్నది.
(అష్టావక్రగీత 8ప్ర. 3.)

7 "ఓకామమా! ఈలోకములో లోభము ననుసరించుచుండు మీయందు నాకు ప్రీతిలేదు. అందువలన నేను కోరికలను విసర్జించి సత్యమునే (భగవత్తత్త్వమునే) ఆశ్రయించుచున్నాడను సమస్తభూతములను నాదేహమునందు మనస్సునందే చూచుచు గురువులవలన విని తెలిసికొనిన యోగమునందు బుద్ధిని, పరబ్రహ్మ తత్త్వమునందు మనస్సును నిలిపి ఇకమీద ఎటులనైతే నీవు నన్ను మరల ఇటువంటి దుఃఖములయందు నిలుపరింపజాలవో అటుల విషయాసక్తి లేనివాడనై రోగపీడలులేక సుఖవంతుడనై లోకముల విహరింప బోవుచున్నాడను. (మంకిగీత 30-31-32)

8. "ఆశా బలవతీ రాజన్ నైరాశ్యం పరమం సుఖమ్"

ఓరాజా! ఆశకు గొప్పబలమున్నది. (దేహాభిమానముగల సర్వజీవులను దుఃఖమున ముంచివేయగలిగి యున్నది) ఆయాశను వదలిపెట్టుటలో మంచి సుఖమున్నది. (బోధ్యగీత. 8)

9. శ్లో॥ ధర్మాదౌ మోక్షపర్యంతం నిరీహా సర్వదా వయమ్
కథం రాగవిరాగైశ్చ కల్పయంతి విపశ్చితః॥

ధర్మముమొదలుకొని మోక్షముదాక (చతుర్విధ పురుషార్థములను పూర్తిగ సాధించువఱకు) ఎల్లప్పుడును మనము కోరికలులేనివారముగ ఉన్నారము. (ఇట్టిమమ్ము) రాగవిరాగములతో గూడినవారినిగా జ్ఞానులు ఎట్లు కల్పింపగలరు? (అవధూతగీత 7అ 14)

మూ॥ నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్త కామాః
ద్వంద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్॥ 5.

తా॥ దేహాభిమానము, మనోవైకల్యము లేనివారు, ధనదారసుతాది సంగమువలన గలుగు దోషములను జయింపగలిగినవారు, ఆత్మ విద్యాభ్యాసమునందు నియతులైనవారు, కోరికలను మరలించుకొన గలిగినవారు. (ప్రత్యాహార సిద్ధాంతులు) సుఖదుఃఖాది ద్వంద్వములచే విడువబడినవారు నగు వివేకవంతులు అక్షయమైన మోక్షపదమును పొందుచున్నారు.

మూ॥ నతద్భాసయతే సూర్యో నశశాంకో నపావకః
యద్గత్వా ననివర్తంతే తద్ధామ పరమం మమ॥ 6.

తా॥ ఏస్థానమును పొందినవారు మరల ప్రవృత్తికి తిరిగిరారో ఆస్థానము అస్మత్పద లక్ష్యార్థమైన పరబ్రహ్మ తత్త్వమునకు ఉత్తమమైన నిలయము. దానిని సూర్యుడు వెలిగింపజాలడు. చంద్రుడు, అగ్నియు వెలిగింపజాలరు.

శ్లో॥ న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః॥

తమేవ భాంతమనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదంవిభాతి॥

ఆపరమాత్మస్థానమున సూర్యుడు వెలుగుటలేదు. చంద్రుడు, నక్షత్రములు వెలుగుటలేదు. ఈప్రవృత్తితోసంబంధించినమెఱుపులు మెఱయుటలేదు అయగ్నిమాత్ర మెక్కడవెలుఁగును? స్వయం ప్రకాశమానమైన ఆస్థానము ననుసరించియే సూర్యచంద్రాది సమస్తజ్యోతిర్గణము వెలుఁగుచున్నది. దాని ప్రకాశముచేతనే సమస్తప్రపంచము వెలుఁగుచున్నది. (ఈశ్లోకము కఠోపనిషత్తు 5 వల్లిలోను, శ్వేతాశ్వతరో పనిషత్తు 6అధ్యాయములోను చూచినట్టుజ్ఞాపకము )

మూ॥ మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః।
మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి॥ 7

తా॥ అస్మత్పద లక్ష్యార్థమైన సనాతనమైన పరబ్రహ్మతత్త్వమునందలి యంశమే (గుణసాంకర్యమువలన) జీవభావమును పొందుచున్నది. (అందువలన) అపరాప్రకృతి యందుండెడు జ్ఞానేంద్రియములను, మనస్సును ఈయాఱింటిని గ్రహించుచున్నది.

" జీవుఁడే శివుఁడు. శివుఁడేజీవుఁడు" పొట్టుతో ఆవరింపఁబడియుండునప్పుడు వరిగింజయని చెప్పఁబడినదే పొట్టువదలిపోయినతరువాత బియ్యపుగింజయని చెప్పఁబడుచున్నది. ఆప్రకారముగానే కర్మచే బద్ధుఁడైనప్పుడు జీవుఁడైనవాఁడు కర్మనశించినప్పుడు సదాశివుఁడగుచున్నాఁడు అప్పుడు దేహమే దేవాలయమగుచున్నది. జీవుఁడే దేవుఁడగుచున్నాఁడు. (కాఁబట్టి) అజ్ఞానరూపమైన మాలిన్యమును వదలివేసి ఆ పరమాత్మ నాకంటె అన్యముకాదన్న భావముతో పూజింపవలయును (స్కాందోపనిషత్తు)

మూ॥ శరీరం యదవాప్నోతి యచ్చాప్యు త్క్రామతీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధా నివాశయాత్॥ 8

తా॥ వాయువు తానాశ్రయించి యుండిన (చందనము, పుష్పము, అగరు, కర్పూరము, అత్తరు, పన్నీరు, పునుగు, జవ్వాది, కస్తూరి మొదలైన) పరిమళ వస్తువులనుండి అవలఁబోవునప్పుడు ఆవస్తువులను విడిచిపెట్టి అందలి పరి

మళములను మాత్రము తీసికొనిపోయినట్లు పురుషుఁడు ఏశరీరమును పొంది యున్నాఁడో ఏశరీరమును విడిచిపెట్టి అవల లేచిపోవుచున్నాడో దానినుండి మానసేంద్రియములను బాగుగ గ్రహించుకొని పోవుచున్నాఁడు.

మూ॥ శ్రోత్రం చక్షుః స్పర్శనంచ రసనం ఘ్రాణమేవ చ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే॥

తా॥ అపురుషుఁడు శ్రోత్రమును, నేత్రమును, త్వగింద్రియమును, జిహ్వాఘ్రాణములను, మనస్సును ఆధారము చేసికొనియే విషయముల ననుభవించుచున్నాఁడు.

మూ॥ ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్।
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః॥ 10

తా॥ దేహమువదలి వెళ్లిపోవుచుండు వానినిగాని, దేహమునందేయుండు వానినిగాని, గుణములతోఁ గూడుకొని విషయ భోగాదుల ననుభవించుచుండు వానినిగాని అవివేకులు చూడఁజాలరు. జ్ఞానసంబంధమైన దృష్టిగల యోగీశ్వరులు చూచుచున్నారు.

మూ॥ యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్।
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః॥ 11

తా॥ అష్టాంగయోగములను సాధించి వాసనాక్షయము, చిత్తోపశమము, జ్ఞానోదయము గాంచిన యతీశ్వరులు తమలోపలనేయుండు పరిశుద్ధాత్మను ప్రయత్నపూర్వకముగఁ జూచుచున్నారు. (యోగాభ్యాసము చేయకపోవుటచే) ఆత్మసంస్కారము లేనివారు, మనస్సును స్వాధీనములో నిలుపుకొనలేనివారు ప్రయత్నముచేసియు అపరమాత్మను చూడలేరు.

మూ॥ యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్।
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్॥

తా॥ సూర్యునియందు పొందుకొని యేతేజస్సు సమస్త ప్రపంచమును ప్రకాశింపఁజేయు చున్నదో, చంద్రునియందును, అగ్నియందును ఏతేజస్సు కలదో అదియంతయు నాదేయని తెలిసికొనుము.

వివ॥ తారక యోగులకు దహరాకాశమునందు సూర్యమండలములు. చంద్రమండలములు, అగ్నిమండలములు, మెఱుపులు, నక్షత్రములు కనబడు చుండును. ఆమండలముల యందలి తేజస్సు జగద్రూపమైన శరీరత్రయ మును ప్రకాశింపఁజేయు చున్నది. అది యెక్కడిదోయను కొన రా దు. సర్వాంతర్యామియైన భగవత్తత్త్వమునకు సంభంధించినదేయని తెలిసికొనవలయును.

మూ॥ గామావిశ్యచ భూతాని ధారయామ్యహమోజసా।
పుష్ణామిచౌషధీస్సర్వాస్సోమో భూత్వా రసాత్మకః॥ 13

తా॥ నేను భూమినికూడ ఆవేసించి బలముచే భూతజాలమును ధరింపఁజేయుచున్నాఁడ. ద్రవించు స్వభావముగల చంద్రుఁడనై సమస్తమైన పైరులను పోషించు చున్నాఁడను.

విశే॥ శాశ్వతమైన బ్రహ్మానందమును అనుభవించుటకై యోగీశ్వరులు ఏపదమును పొందుదురో అట్టి యూర్ధ్వకుండలి స్థానమునకు "గౌః" అని పేరు. శరీరములయందు నేననిపేర్కొనఁబడు పరిశుద్ధాత్మ అస్థానము నావేసించియుండి పాంచభౌతికములైన శరీరములను ధరింపఁజేయుచున్నది. మఱియు "ఉష దాహే" అను సూత్రమువలన తాపత్రముచే గలిగినదాహమును ధరించు స్వభావముగల జీవులే ఓషధులని అధ్యాత్మికభావము. "అవ రక్షణే" అను సూత్రమువలన రక్షణశక్తితోఁ గూడుకొనియుండువాఁడు (పరమేశ్వఁరుడు) సోముడనబడును. అట్టి రక్షణశక్తితోగూడుకొనిన పరమాత్మయే తాపత్రయముచే దహ్యమానులగు జీవులను పోషించు చున్నాడు.

మూ॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥ 14

తా॥ నేననెడు అంతర్యామి భగవత్తత్త్వము అగ్నియై ప్రాణవాయువుతోను, అపానవాయువుతోను గూడుకొని జీవులశరీరముల నాశ్రయించి భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యము అను నాలుగువిధములైన ఆహారపదార్థములను జీర్ణముచేయు చున్నధి.

"వాయునా పాలితో వహ్నిరపానేన శనైర్దేహమధ్యే జ్వలతి। జ్వలనో జ్వాలాభిః ప్రాణేన కోష్ఠమధ్యగతం జలమ త్యుష్ణమకరోత్। జలోపరి సమర్పిత వ్యంజన సంయుక్త మన్నం వహ్నిసంయుక్తవారిణా పక్వమకరోత్॥"

వాయువుచేత పాలింపబడుచున్న అగ్ని దేహమధ్యమున అపానముచేత మెల్లగ జ్వలించుచున్నది. ఆయగ్నిజ్వాలలచేత కడుపులోపలి జలమును ప్రాణవాయువుతో మిక్కిలి ఉడికించుచున్నది. ఆజలముమీద వేయబడియుండు కూరలతోడి యన్నము ఆయుష్ణోదకముచే పచనముచేయుచున్నది. (అర్థసౌలభ్యముకొఱకు క్రియాపదములు వర్తమానకాలములో అనువదింపబడినవి.) శాండిల్యోపనిషత్తు. 1అ.

మూ॥ సర్వస్య చాహం హృది సంనివిష్టో మత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహమ్॥

తా॥ అమృతప్రద లక్ష్యార్థమైన పరమాత్మ సమస్తభూతముల మానసమునందు లెస్సగ ప్రవేశించియున్నది. సర్వత్రనేనైయున్న ఆపరమాత్మ వలననే జ్ఞాపకము, తెలివి తద్విపరీతభావము అన్నియుకలుగుచున్నవి. అటుల నేనని చెప్పబడు భగవత్తత్త్వమే సమస్తవేదములచేత తెలియబడుచున్నది. వేదాతీతమైన స్వరూప జ్ఞానమును కలిగించుచున్నది. స్వస్వరూపమును ఎఱుగునదికూడ తానేయైయున్నది.

" వేదైరనేకైరహమేవ వేద్యో వేదాంతకృద్వేద విదేవచాహమ్"

(కైవల్యోపనిషత్తు 2 ఖం. 22.)

మూ॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥ 16

తా॥ ఇంద్రియ గోచరమై జగద్రూపమైన స్థూలశరీరమునందు క్షరపురుషుఁడు, అక్షరపురుషుఁడు అనియిట్లు పురుషులు రెండు విధములుగనున్నారు. తాను సనాతనుఁడనన్నమాటమఱచి శరీరప్రాప్తి కలిగినప్పుడు పుట్టితిననియు శరీరము నశించుచుండగా నేను చచ్చుచున్నాడనని యు నమ్ముకొను జీవులకు భూతములనిపేరు. అట్టిభూతముల తరగతిలోఁ జేరినవాఁడు క్షరపురుషుఁడు.

ఉత్పత్తిస్థితి నాశములు శరీరమునకే కాని నాకులేవనియు, ఈశరీరమున కంటెను, శరీరాభిమానముగల యితరజీవులకంటెను నేనువేఱైనవాఁడనని యుఁ దెలిసికొని జరామరణాది కాయక్లేశములంటని యున్నత పదమును బ్రాపించినవాఁడు అక్షరపురుషుఁడు. అనిచెప్పఁబడు చున్నాఁడు.

మూ॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥ 17

తా॥ (పూర్వశ్లోకములోఁ జెప్పఁబడిన క్షరాక్షర పురుషు లియవురును శరీరముచే ఆవరింపఁబడినవారే ఈశరీరమున కావల నుండునదేదియు నేను కానని తలచువారు కనుక వీరు ప్రత్యగాత్మ స్వరూపులు ) అట్టిక్షరాక్షర పురుషులకంటె వేఱైనఉత్తమ పురుషుఁడొకఁడు పరమాత్మ యనిచెప్పఁబడు చున్నాడు. ఆయన యెవఁడందువా? మూఁడు లోకములను (స్థూల సూక్ష్మ కారణ శరీరములను. స్వర్గమర్త్య పాతాళములను, ఊర్ధ్వమధ్యాధో దృష్టియందలి బాహ్యాంతర లక్ష్యస్థానములను) ఆవేశించి భరించుచున్నవాఁడు సర్వభూతముల యందలి చైతన్యము తానైయెందున క్షీణింపనివాఁడు. సర్వభూతనియామకుఁడు.

మూ॥ యస్మాత్క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః।
అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః॥ 18.

తా॥ అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వము ఏకారణము వలన క్షరము నతిక్రమించినదో, అక్షరమునకంటె సైతము ఎందువలన శ్రేష్ఠమైనదో ఆకారణమువలన లోకము లోను, వేదములోను పురుషోత్తముఁడని పెర్కొనఁబడినది.

శ్లో॥ అహం సర్వమిదం విశ్వం పరమాత్మాహ మచ్యుతః
నాన్యదస్తీతి సంవిత్త్యా పరమా సాహ్యహంకృతిః॥

ఈ విశ్వమంతయు నేనే. నేను పతనములేని పరమాత్మను నాకంటె వేఱైనదిలేదు. అను జ్ఞానముతోగూడిన అయహంకారము ఉత్తమమైనది.

(మహోపనిషత్తు 5అ. 89)

శ్లో॥ సర్వస్మాద్వ్యతిరిక్తోఽహం వాలాగ్రాదప్యహం తనుః
ఇతి యా సంవిదో బ్రహ్మన్ ద్వితీయాహంకృతిశ్శుభా॥

ఓ బ్రాహ్మణా! నేను సర్వప్రపంచమునకంటె అతీతమైనవాడను. వెండ్రుకమొనకంటె సైతము నేను సూక్ష్మమైనవాడను. అను తెలివివలన ఏది కలిగినదో శుభస్వరూపమైన అయహంకారము రెండవరకములో జేరినది.

(మహోపనిషత్తు 5అ. 90.)

శ్లో॥ పాణిపాదాది మాత్రోఽయ మహమిత్యేష నిశ్చయః
అహంకారస్తృతీయోఽసౌ లౌకికస్తుచ్ఛ ఏవ సః॥

చేతులు, పాదములు మొదలైన కర్మేంద్రియములతో గూడిన యీశరీరముమాత్రమే నేవనెడు నిశ్చయముగల యీయహంకారము మూడవరకములో బేరినది లోకసామాన్యమైనది, తుచ్ఛమైనది యిదే.

(మహోపనిషత్తు 5అ. 92.)

శ్లో॥ ద్వే బ్రహ్మణీ వేదితవ్యే పరంచాపరమేవ చ।
అపరం బ్రహ్మ జీవస్తు క్షరాక్షర విభేదవాన్॥
క్షరస్తు సర్వభూతం స్యాత్ కూటస్థోహ్యక్షరః స్మృతః
పరం బ్రహ్మ తు సర్వాత్మా పరమాత్మా ప్రకీర్తితః॥
బిభర్తి సర్వలోకాంశ్చ ప్రవిశ్యాంతర్నియచ్ఛతి
ఈశ్వరో యోఽవ్యయో నిత్యః స ఏవ పురుషోత్తమః॥
అతీతః క్షరమత్యర్థ మక్షరంచ పరః పుమాన్।
యస్మాత్తస్మాత్తు విఖ్యాతో లోకేఽసౌ పురుషోత్తమః॥
ఇతి యో వేత్తి పురుష మసమ్మోహః పరార్థవిత్॥

"పరం, అపరం" అని బ్రహ్మ రెండువిధములు. అపరం అనగా జీవాత్మ. ఇది "క్షరము, అక్షరము" అని రెండువిధములు.

దేహమే నేననుకొనుచు భవనాశములకు లొంగిపోవు జీవ సముదాయము క్షరము. దేహభ్రాంతివదలినమీదట త్రిగుణాత్మకమైన మాయను దాటువఱకు మధ్యస్థితియందలి జీవరూపము అక్షరము అని తలపబడును. "పరంబ్రహ్మ" అనగా సర్వము తానైనవాడు, పరమాత్మయని పేర్కొనబడినవాడు.

ఎవడైతే సర్వాంతర్యామియై సర్వలోకములను భరించుచు శాసించుచు ఉన్నాడో అట్టి అవ్యయుడు, నిత్యుడు పురుషోత్తముడు.

అపరమపురుషుడు ఎందువలన క్షరాక్షరములకు రెంటికి కేవలము అతీతుడైయున్నాడో అందువలననే లోకములో పురుషోత్తముడని పేర్కొనబడినాడు.

ఇటుల మూడువిధముల పురుషస్వరూపమును ఎవడు తెలిసికొనుచున్నాడో అట్టివాడు మూఢత్వములేనివాడు, పరమార్థము నెఱిగినవాడు.

(వరాహపురాణం. పూర్వ 60అ.)

శ్లో॥ జీవాత్మనః పరస్యాపి యద్యేవముభయోరపి।
అహమేవ పరబ్రహ్మ బ్రహ్మాహమితి సంస్థితిః॥
సమాధిః సతు విజ్ఞేయః సర్వవృత్తి వివర్జితః।
బ్రహ్మ సంపద్యతే యోగీ నభూయః సంసృతిం వ్రజేత్॥

సమస్తవృత్తులను విసర్జించి జీవాత్మకును, పరాత్మకును (సాక్షినైన) నేనే పరబ్రహ్మము. బ్రహ్మమేనేను. అని యీవిధమైన స్థితికలిగెనేని అది సమాధియని తెలియఁదగును. ఇట్టియోగీశ్వరుడు బ్రహ్మమును పొందుచున్నాడు. మరల సంసృతి పొందఁడు. (త్రిశిఖి బ్రాహ్మణోపనిషత్తు 160 161 )

తనకంటె అన్యమైనది యేదోయొకటి యున్నదను భావముగల క్షరాక్షర పురుషులకంటె సర్వము తానైన పురుషుఁడు ఉత్తముఁడు కాఁబట్టి పురుషోత్తముఁడని యిందలిభావము.

శ్లో॥ బ్రహ్మమాత్రమిదం సర్వం బ్రహ్మణోఽన్య న్నకించన।
తదేవాహం సదానందం బ్రహ్మైవాహం సనాతనమ్॥

ఈ (ప్రపంచము) సర్వము పరబ్రహ్మమాత్రమైయున్నవి బ్రహ్మకంటె వేఱైనది కొంచెమైననులేదు. సర్వముతానైన ఆబ్రహ్మమేనేను. శాశ్వత మైనట్టియు, సర్వదా ఆనంద స్వరూపమైనట్టియు పరబ్రహ్మతత్త్వమే నేను.

(తేజోబిందూపనిత్తు 3అ, 32.)

మూ॥ యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత॥ 19.

తా॥ ఓయర్జునా! ఈప్రకారము పురుషోత్తమ విఖ్యాతమైన అస్మత్పదలక్ష్యార్థమును (నేననెడు సర్వభూతాత్మను) ఎవఁడు తెలిసి కొనుచున్నాఁడో అట్టివివేకశాలి సర్వజ్ఞుఁడై సర్వము నేనేయను భావముతో స్వస్వరూపమును భజించుచున్నాఁడు.

మూ॥ ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయానఘ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత॥ 20

తా॥ పాపరహితుఁడవైన ఓయర్జునా! ఇటుల అతిరహస్యమైన యీ యోగ శాస్త్రము నాచేఁజెప్పఁబడినది. మానవుఁడు దీనినిదెలిసికొని జ్ఞానియగుచున్నాఁడు. కర్తవ్యమును నెఱవేర్చిన వాఁడుకూడ అగుచున్నాఁడు. (ఇందువలన జ్ఞానయోగము, అభ్యాసయోగము రెండును,పర్యాప్తమగు చున్నవి.)

ఇది శ్రీ మహాభారతము. భీష్మపర్వములో పురుషోత్తమయోగమనెడు ముప్పదితొమ్మిదవ అధ్యాయము.

ఓం. తత్. సత్.

# శతపత్రము

# 112

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 40 అధ్యాయము.

శ్రీ భగవానుఁడు చెప్పుచున్నాఁడు,

మూ॥ అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగ వ్యవస్థితిః।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్॥ 1

అహింసా సత్యమక్రోధ స్త్యాగశ్శాంతి రపైశునమ్
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్॥ 2

తేజః క్షమా ధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా।
భవంతి సంపదం దైవీమభిజాతస్య భారత॥ 3

తా॥ ఓయర్జునా! తాపత్రయము చేతఁగాని, జరామరణాదుల చేతఁగాని భయముఁజెందకుండుట; రజస్తమోగుణముల సాంకర్యము నొందని పరిశుద్ధమైన సత్త్వగుణ ప్రాప్తి కలిగియుండుట; జ్ఞానయోగమునందు నిలుకడ కలిగియుండుట; భౌతికమైన ద్రవ్యదానము చేయుటే కాక లోకములో ఏప్రాణికైన నిత్యశుభ ప్రతిపాదకమైన విజ్ఞానదానము చేయఁగలిగియుండుట; బాహ్యేంద్రియములను దుర్విషయములకుఁ బోనీక స్వవశము గావించుకొను పాటవము కలిగియుండుట; సర్వాంతర్యామియైన భగవత్తత్త్వమును తనలో దాను పూజించుట; జన్మరాహిత్యమునకు కారణమైన చదువును చదువుట; సద్వ్రతానుష్ఠానముచే దేహేంద్రియములను తపింపఁజేయుట; మనోవాక్కాయములచేత ఋజువర్తనము కలిగియుండుట, మనోవాక్కాయముల చేత తనకుగాని యితరభూతములకుగాని వేదనగలుగు కార్యము చేయకుండుట, తనకును, లోకమునకును క్షేమకరమైన సత్యవాక్యములను భాషించుట; సర్వభూతములయందు తన్ను, తనయందు సర్వభూతములను

జూచుచు తనకంటెవేఱైనది లేదని నిశ్చయించుటవలన లోకములో విభూత మునైనను కోపింపని సమరసత్వము కలిగియుండుట; పెద్దలచేతను, శాస్త్రముచేతను, తనబుద్ధిబలముచేతను నిశ్చయింపబడిన సత్కర్మజేయుచు దాని ఫలమును వాంఛింపకుడుంట; నిషిద్ధవ్యాపారములకు గంతులు వేయకుండ అంతఃకరణమును నిలువరించుట; చాడీలు చెప్పుట మొదలైన నీచ గుణములు లేకుండుట; జీవకోటియందు నైష్ప్రాకికమైన కరుణగలిగి యుండుట; అనర్థకరములైన విషయభోగాదులయందు పరిభ్రమింపకుండుట; క్రూరస్వభావముజెందక మృదుభావము కలిగియుండుట; దుష్ప్రచారము నందు లజ్జపడుట; స్వస్వరూపధ్యానమునందు సుస్థిరుడైయుండుట; ఆత్మ బలము, ఓర్పు, ధైర్యము కలిగియుండుట; బాహ్యాంతరములయందు పరిశుద్ధుడైయుండుటః మనస్సుచేతనైనను, మాటలచేత నైనను, శరీరము చేతనైనను తనకుగాని, యితరభూతములకుగాని కీడు దెచ్చిపెట్టు కార్యము చేయకుండుట; భౌతికదృష్టియందు ఘనముగా గనబడు శరీరముపై దురభిమానము జెందకుండుట (ఈలక్షణములన్నియు) దైవసంపద ననుసరించి జన్మించినవానికి కలుగుచున్నవి.

మూ॥ దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవచ
అజ్ఞానంచాభిజాతస్య పార్థ! సంపదమాసురీమ్॥ 4.

తా॥ ఓయర్జునా! దంభము, దర్పము, గర్వము, క్రోధము, కాఠిన్యము మూఢత్వము, (ఈలక్షణములన్నియు) అసురసంపద ననుసరించి జన్మించిన వానికే కలుగుచున్నవి.

మూ॥ దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా।
మాశుచస్సంపదం దైవీమభిజాతోఽసి పాండవ॥ 5.

తా॥ ఓ యర్జునా! దైవసంబంధమైన సంపద మోక్షమునకు (అనుకూలమైనది.) అసురసంబంధమైన సంపద బంధమునకు (కారణమైనది) అని తలపబడినది. నీవు దైవసంపద ననుసరించి జన్మించియున్నవాడవు. (అందువలన మోక్షముజెందుట కవకాశమున్నది.) శోకింపకుము.

మూ॥ ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ అసుర ఏవ చ।
దైవో విస్తరశః ప్రోక్త అసురం పార్థ! మే శృణు॥ 6.

తా॥ ఓయర్జునా! ఈలోకములో దైవసర్గమనియు, అసుర సర్గమనియు భూతసృష్టి రెండువిధములుగ నున్నది. అందు దైవసర్గము విస్తారముగా జెప్పబడి యున్నది. ఇక అసురసృష్టిని గుఱించియు చెప్పుచున్నాడను నామాట వినుము.

మూ॥ ప్రవృత్తించ నివృత్తించ జనా నవిదురాసురాః
నశౌచం నాపిచాచారో నసత్యం తేషు విద్యతే॥ 7.

తా॥ బాహ్యవిషయ వ్యాపారములయందు ప్రవర్తించుట, విరమించు కొనుట, అను సమస్యలను గురించిన బాగోగులను అసురసర్గములో జేరిన జనులు తెలిసికొనరు. అట్టివారియందు శుచిత్వముండదు. సదాచారముండదు. సత్యము సైతము ఉండదు. (ఈశ్లోకమును బట్టిచూడ దైవసర్గములో జేరినవారు ఈకాలపు వేదాంతస్వాములలో ఎందఱుందురో సరిగచెప్పలేము)

మూ॥ అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్।
అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకమ్॥ 8.

తా॥ (అసురవర్గములో జేరిన జనులవాదము చెప్పబడుచున్నది.) ఈ భూతములన్నియు ఒకదానినుండి యింకొకటి పుట్టుటేతప్ప వేఱొక విధముగా పుట్టినది యేమైననున్నదా? ఈయుత్పత్తికి కామమే కారణమైయున్నది. అంతేకాని ఈజగత్తు ఈశ్వరునిచే నియమింపబడినదికాదు. సత్యమైనది కాదు. మఱేవిధమైన ప్రతిష్ఠయు కలిగినదికాదు. అనివారు చెప్పుదురు.

మూ॥ ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః
ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః॥ 9.

తా॥ (దేవుడే లేడనెడు) ఈ యజ్ఞాన దృష్టిని ఊతకోలగ ధరించి క్రూరకార్యము లొనర్చుచు ఆత్మబలమును చెడగొట్టుకొని బుద్ధిహీనులై పోయినవారు (అసురజనులు) లోకవినాశము కొఱకు శత్రువులుగా పుట్టుచున్నారు.

మూ॥ కామమాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వితాః।
మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః॥ 10.

తా॥ (అజనులు) సుఖముగ పూరించుటకు శక్యముకాని కామము నాశ్రయించి మనోవైకల్యమువలన అనర్థములైన దుర్విషయములను గ్రహించి దంభముతోను, గర్వముతోను, మదముతోను గూడినవారై పరిశుద్ధమైన వ్రతానుష్ఠానము లేనివారై (సంసృతియందే ప్రవర్తించుచున్నారు.

మూ॥ చింతామపరిమేయాంచ ప్రళయాంతాముపాశ్రితాః।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః॥ 11.

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధ పరాయణాః।
ఈహంతే కామభోగార్థమన్యాయేనార్థసంచయాన్॥ 12.

తా॥ (పూర్వోక్తనాస్తికవాదులు) అంతది యింతది యని లెక్కింపరానట్టియు, మరణపర్యంతము తీరిపోనట్టియు అతిదీర్ఘమైన చింతను అవలంబించుచున్నారు. కోరిన భోగములనెల్ల అనుభవించుటే లెస్సయనుకొనుచున్నారు. పురుషార్థమన్నది యింతమాత్రమేయని వీరి నిశ్చయము, (అంతే కాదు) అనేకములైన ఆశాపాశములచేత బంధింపబడుచున్నారు కామక్రోధములు ఉత్తమపద్ధతిలో జేరినవని నమ్ముచున్నారు. తాము వాంఛించిన భోగములకొఱకు ద్రవ్యమును అన్యాయపద్ధతితో సమకూర్చుటకు ఇష్టపడుచున్నారు.

మూ॥ ఇదమద్య మయా లబ్ధమిమం ప్రాప్స్యే మనోరథమ్।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్॥ 13.

అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యేచాపరానపి
ఈశ్వరోఽహ మహంభోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ॥ 14

ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన విమోహితాః॥ 15.

అనేకచిత్తవిభ్రాంతా మోహజాల సమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ॥ 16.

తా॥ (పురాకృత కర్మవిశేషమువల్లనే యేదైనను లభించుచున్నదని యెఱుగకపోయినందున) ఇప్పుడిప్పుడే యీయర్థము నాచే సంపాదింపబడి

నది. (ఇదిగో) ఈలాటి వాంఛితమును పొందబోవుచున్నాను. నాకు ఈ ధన మున్నది. ఇంకను ఈ ధనముసైతము కలుగబోవుచున్నది. (కాలముచేతనే సర్వము గ్రసింపబడుచున్నదని యెఱుగక) ఈ శత్రువు నాచే వధింపబడి నాడు. ఇంకను తదితర శత్రువులసైతము వధింపబోవుచున్నాను. నేనే యీ శ్వరుడను. నేనే భోగములు కలవాడను. నేనే సిద్ధుడను. నేనే బలవంతు డను. సుఖవంతుడను. నేను సర్వసంపదలు కలవాడను. మంచికులము కలవాడను. నాతో సాటివచ్చువాడు మఱియెవడైన నున్నాడా? నేను యజ్ఞ ములు చేయగలను. దానములు చేయగలను. అని (యిట్టిభావములు పెంచు కొని) అజ్ఞానముచేత మోహబద్ధులగుచున్నారు పెక్కువిధముల చిత్తసంచల నము పొందుచున్నారు. మోహమనెడు వలచే నిరోధింపబడుచున్నారు ఇష్ట భోగములయందు అసక్తులగుచున్నారు. అపవిత్రమైన నరకములో పడిపోవు చున్నారు. (ఈయాసురజనుల స్వభావలక్షణములు భాగవ. 11స్కం. 5అ. పదునెనిమిది శ్లోకములతో విపులముగా వర్ణింపబడినవి)

మూ॥ ఆత్మసంభావితాస్తబ్ధా ధనమాన మదాన్వితాః।
యజంతే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్॥ 17.

తా॥ ఆయజ్ఞానులు సంకుచితచిత్తులై తమ్ముదామే సంభావించుకొను చున్నారు. ధనమువలన గలిగిన అహంకారముచేతను, మదముచేతను కూడుకొని నామమాత్రములైన (ఫలశూన్యములైన) యజ్ఞములచేత శాస్త్ర విధానమునకు విరుద్ధముగా దేవపూజాదులను దంభముతో జేయుచున్నారు.

మూ॥ అహంకారం బలం దర్పం కామం క్రోధంచ సంశ్రితాః।
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః॥ 18

తా॥ అహంకారమును, (భౌతికమైన) బలమును, దర్పమును, కామ మును, క్రోధమును ఆశ్రయించుచున్నారు. తమ శరీరమునందును, ఇత రములైన సమస్తభూతముల శరీరములయందును అఖండమై యేకమై ప్ర కాశించు అస్మత్పద లక్ష్యార్థమైన పరబ్రహ్మతత్త్వమును అసూయాపరులై ద్వేషించుచున్నారు.

మూ॥ తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్।
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు॥ 19.

తా॥ ద్వేషబుద్ధులు, క్రూరస్వభావులునైన అనీచమానవులను శుభప్రాప్తికి అనర్హులైన ఆజనులను నేను ఎల్లప్పుడును అసురప్రజల జన్మములకు కారణములైన సంసృతికూపములయందె పడవేయుచున్నాను. (నేను అనగా సర్వభూతాత్మయని భావము.)

మూ॥ ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని।
మామప్రాప్యైవ కౌంతేయ! తతో యాంత్యధమాం గతిమ్॥ 20.

తా॥ ఓ యర్జునా! అసురసంబంధమైన (మోక్షమునకు వ్యతిరిక్తమైన) ఉత్పత్తిస్థానమునందు పూర్తిగాపడిపోయిన అవివేకులు అస్మత్పద లక్ష్యార్థమైన పరబ్రహ్మతత్త్వమును పొందజాలక అందువల్లనే ప్రతిజన్మము నందును అధోగతికి బోవుచున్నారు.

మూ॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః।
కామః క్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్॥ 21.

తా॥ ఆత్మకు నష్టమొనర్చు నరకద్వారము మూడువిధములుగా నున్నది. (మూడువిధములనగా) కామము, క్రోధము, అదేవిధముగా లోభము అనునవి. అందువలన ఈమూడుగుణములను పురుషుడు వదలివేయవల యును. (యీశ్లోకము భారత. ఉద్యోగ. 32 అధ్యాయములోను చూచినట్లు జ్ఞాపకము.)

మూ॥ ఏతైర్విముక్తః కౌంతేయ! తమోద్వారైస్త్రిభిర్నరః।
ఆచరత్యాత్మనశ్శ్రేయస్తతో యాతి పరాంగతిమ్॥ 22.

తా॥ ఓయర్జునా! నరకమనెడు చీకటికొట్టునకు ద్వారములైన కామ క్రోధ లోభములనెడు ఈమూడుగుణములచేత విడువబడిన మానవుడు తనకు శ్రేయస్కరమైన విధమున నడచుచున్నాడు. అందువలన ఉత్తమ గతికి బోవుచున్నాడు.

మూ॥ యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధిమవాప్నోతి నసుఖం నపరాం గతిమ్॥ 23.

తా॥ ఏవడైతే శాస్త్రములో జెప్పబడిన నియమమును విడిచిపెట్టి కామ్యభోగాదులయందు ఇష్టానుసారము వర్తించుచున్నాడో వాడు లాభమును సుఖమును పొందడు. ఉత్తమగతిని పొందజాలడు.

మూ॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి॥ 24.

తా॥ అందువలన లోకములో ఇది చేయదగినది, ఇది చేయరానిది. అని నిర్ణయించు సందర్భములో నీకు శాస్త్రము ప్రమాణము. ఇటుల శాస్త్ర నియమము ననుసరించి చెప్పబడిన కర్మను (అభ్యాసయోగమును) తెలిసికొని చేయుటకు నీవు తగినవాడవు.

వివ। కామక్రోధాదులను జయించుట, మనస్సును నిగ్రహించుట, జ్ఞానోపలబ్ధిచే ఉత్తమగతిపొందుట ఇట్టివిషయములే యోగగ్రంథములో మాటిమాటికి ఉగ్గడింపబడుచున్నవి. కనుక శాస్త్రమనగా యోగశాస్త్రమనియు, కర్మయనగా బ్రహ్మనిష్ఠలో ఒకభాగమైన అభ్యాసయోగమనియు అర్థము చేసికొనవలయును.

శ్లో॥ యావన్నలభతే శాస్త్రం తావద్గాం పర్యటేద్యతిః॥
యదా సంలభ్యతే శాస్త్రం తదా సిద్ధిః కరే స్థితా॥

ఎందాక శాస్త్రజ్ఞానము లభింపకుండునో అందాక యతీశ్వరుడు లౌకిక మర్యాదయందు చరింపవచ్చును. ఎప్పుడు శాస్త్రజ్ఞానము కలుగుచున్నదో అప్పుడు సిద్ధి తన పిడికిటిలోనే యున్నది. (యోగకుండల్యుపనిషత్తు 2-11)

శ్లో॥ నిర్వేదాదాత్మ సంబోధః సంబోధా చ్ఛాస్త్రదర్శనమ్।
శాస్త్రార్థదర్శనా ద్రాజంస్తప ఏవానుపశ్యతి॥

ఓరాజా! వైరాగ్యమువలన ఆత్మసంబోధము కలుగుచున్నది. సంబోధమువలన శాస్త్రజ్ఞానము కలుగుచున్నది. శాస్త్రమునందలి ప్రయోజనమును తెలిసికొనుటవలన పురుషుడు తపోనియమములను కనుగొనుచున్నాడు. (పరాశరగీత 6అ 12)

శ్లో॥ సుఖితో దుఃఖితో వాపి నరో లోభం పరిత్యజేత్
అవేక్ష్య మనసా శాస్త్రం బుద్ధ్యా చ నృపసత్తమ॥

ఓ రాజేంద్రా! మానవుడు సుఖవంతు డగుటవలనగాని, దుఃఖవంతు డగుటవలనగాని, మనస్సుచేతను, బుద్ధిచేతను శాస్త్రమును చూచుకొని లోభగుణమును విడిచిపెట్టవలయును. (పరాశరగీత 6-24)

శ్లో॥ సుఖేతు వర్తమానో వై దుఃఖేవాపి నరోత్తమ।
స్వవృత్తాద్యో నచలతే శాస్త్రచక్షుః స మానవః॥

ఓ రాజోత్తమా! సుఖములో వర్తించువాడుగాని, దుఃఖములో వర్తించు వాడుగాని ఎవడైతే తన వృత్తమునుండి చలింపడో ఆమానవుడు శాస్త్రము నెఱిగినవాడు. (పరాశరగీత 6-31)

ఇది శ్రీమహాభారతము భీష్మపర్వములో దైవాసుర సంపద్విభాగ యోగ మనెడు నలుదవ అధ్యాయము.

ఓం. తత్. సత్.

# శతపత్రము

# 113

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 41 అధ్యాయము.

అర్జునుడు చెప్పుచున్నాడు.

మూ॥ యే శాస్త్రవిధిముత్సృజ్య యజంతేశ్రద్ధయాన్వితాః
తేషాం నిష్ఠాతుకాకృష్ణ! సత్త్వమాహో రజస్తమః॥ 1.

తా॥ ఓ కృష్ణా! శాస్త్రనియమములను వదలివేసి దేవుడున్నాడను విశ్వాసముమాత్రము పెట్టుకొని వారివారికి దోచినట్లు స్వేచ్ఛానుసారము ఎవరైతే దేవపూజాదులను అనుష్ఠించుచున్నారో వారి యనుష్ఠానమెట్టిది? సాత్త్వికమా? అటుగాకున్న రాజసమా? తామసమా? ఏరకములో జెరుచున్నది.

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు.

మూ॥ త్రివిధాభవతిశ్రద్ధా దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీచైవ తామసీచేతి తాం శృణు॥ 2.

తా॥ శరీరధారులకు శాస్త్రాది సంస్కారములచేగాక ప్రకృతిసిద్ధముగ గలిగిన అభగవద్విశ్వాసము సాత్త్వికియనియు, రాజసియనియు, తామసియనియు మూడురకములుగానేయున్నది. దానినివినుము.

మూ॥ సత్త్వానురూపా సర్వస్యశ్రద్ధా భవతిభారత।
శ్రద్ధామయోఽయం పురుషోయోయచ్ఛ్రద్ధ స్సఏవసః॥ 3.

తా॥ ఓ యర్జునా! సమస్త జీవకోటియొక్క విశ్వాసము ఆయాజీవుల స్వభావమునకు దగినట్లు వానివానికుండును. ఆపురుషుడు విశ్వాసమే స్వభావముగా గలిగియున్నాడు. సాత్త్విక విశ్వాసము గలవాడు సాత్త్వికపురుష

డగుచున్నాడు. రాజసవిశ్వాసముగలవాడు రాజసపురుషుడగుచున్నాడు. తామస విశ్వాసముగలవాడు తామసపురుష డగుచున్నాడు. ఇట్లే యే విశ్వాసము గలవాడు ఆపురుషుడే యగుచున్నాడు.

మూ॥ యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః॥ 4॥

తా॥ సాత్త్వికపురుషులు దేవతలను పూజించుచున్నారు. రాజస పురుషులు యక్షులను, రక్షస్సులను పూజించుచున్నారు. ఇతరులైన తామసజనులు ప్రేతములను, భూతసమూహములను పూజించుచున్నారు.

మూ॥ అశాస్త్ర విహితం ఘోరం తప్యంతే యే తపో జనాః।
దంభాహంకార సంయుక్తాః కామరాగ బలాన్వితాః॥ 5
కర్శయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః।
మాం చైవాంత శ్శరీరస్థం తాన్ విద్ధ్యాసుర నిశ్చయాన్॥ 6

తా॥ శాస్త్రనియమముల ననుసరింపక తమకు దోచినట్లెల్ల తపస్సు చేయునెడల దంభము, అహంకారము వదలవు. కామము, విషయాను రాగము కూడ అట్టివారిని గట్టిగా దగులుకొనియుండును. అందువలన చిత్తము వశపడదు. పద్ధతులు తబ్బిబ్బులైనందున రోగములు సంభవింపవచ్చును. సద్యోమరణములు సైతము కలుగవచ్చును. ఇట్టి భయంకరమైన తపస్సు శాస్త్రవిరుద్ధములైన పద్ధతులతో ఏయవివేకులు చేయుచున్నారో వారు శరీరమునందలి పృథివ్యాది మహాభూత సముదాయమును, అంతశ్శరీరమునందు అస్మత్పద లక్ష్యార్థమైన పరమాత్మ తత్త్వమును శ్రమపెట్టుచున్నారు. ఇటువంటి తపోనిశ్చయము గలవారలు అసురజనులని తెలిసికొనుము

మూ॥ ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।
యజ్ఞస్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు॥ 7.

తా॥ వీరికెల్లరకు ప్రియమైన ఆహారముకూడ మూడువిధములై యున్నది. అదే ప్రకారముగా యజ్ఞము, తపస్సు, దానము సైతము మూడువిధములుగానే యున్నవి. అట్టి యాహారాదికములకుగలభేదము ఇదిగోవినుము.

మూ॥ ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః।
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః॥ 8.

తా॥ ఆయుస్సును, సత్త్వమును, బలమును, ఆరోగ్యమును, సుఖమును, సంతోషమును వర్ధిల్లజేయు ఆహారపదార్థములు సాత్త్విక పురుషులకు ప్రియమైయుండును. అవి నోటితో పీల్చుకొన దగిన ద్రవపదార్థములుగ (పాలు, నెయ్యి మొదలైనవి) కొన్నియుండును. చిక్కనైన పదార్థములు (పాయసము మొదలైనవి) కొన్నియుండును శరీరమున చాలకాలము దాఁక బలమును నిలుపదగిన ఘనపదార్థములు (పిష్టాదులు) కొన్నియుండును. మనస్సునకింపైన మృదుమధుర పదార్థములు కొన్నియుండును. ఇట్లు నాలుగువిధముల పదార్థములు సాత్త్వికులకు ప్రియమైన భోజనపదార్థములగును.

మూ॥ కట్వమ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః।
ఆహారా రాజసస్యేష్టా దుఃఖ శోకామయప్రదాః॥ 9

తా॥ కారము, పులుసు, ఉప్పు ఎక్కువగా వేయబడిన ఆహారపదార్థములు రజోగుణ ప్రధానుడైన వానికి ప్రియముగ నుండును. మితముగ వేయబడినవి తినుట కిష్టపడడు. నోరు, చేయి కాలిపోవునంత వేడిపదార్థములు కావలయునని కోరును. సులభముగ జీర్ణింపనట్టియు, కాకపుట్టించి శరీరాత్మలను హింసించునట్టియు కటుకుపదార్థములను వాంఛించును. కటము లదరిపోవునట్లు పటుక్కున పగుల గొఱకి తినదగిన కఠినపదార్థములు సమ్మతములైయుండును. శరీరమునకు దాహము గలిగించు ఉష్ణవృత్తులయందు ప్రీతియెక్కువ ఇట్టివస్తువులన్నియు సుఖమును జెడగొట్టుచున్నవి. శోకమును కలిగించుచున్నవి. రోగములను పుట్టించుచున్నవి.

మూ॥ యాతయామం గతరసం పూతిపర్యుషితంచ యత్।
ఉచ్ఛిష్టమపిచామేధ్యం భోజనం తామసప్రియమ్॥ 10.

తా॥ జాములు దాటిపోవుటచే చలిదిపడిపోయిన పదార్థము, చెమ్మలేకుండపోయిన శుష్కపదార్థము, (నీరసము,) చెడువాసనగల పదార్థము, మిక్కిలి వేగింపబడిన (మాడిపోయిన) పదార్థము, ఏదికలదో అది యంతయు తామస జనులకు ప్రియమైయుండును. మానవుల భుక్తిగొఱకు సమ

కూర్పబడిన సొమ్ములో అవసరమునకు మించి మిగులుగ నెంతయుండునో దానికి ఉచ్ఛిష్టమని పేరు. ఇట్టి పదార్థము (మానవులకొఱకు నిర్దేశింపబడిన దానినుండి మిగులువస్తువుగ భావింపబడినందున) దేవపూజాకార్యముల యందు వినియోగించుటకు అర్హమైయుండదు. అట్టి యపవిత్ర పదార్థము సైతము తామసజనులకు ప్రియమగును.

మూ॥ అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే।
యష్టవ్యమేవేతి మనస్సమాధాయ స సాత్త్వికః॥ 11

తా॥ తీవ్రవైరాగ్యముగల పురుషులు ఇహపరములయందు ఎట్టి ఫలమును గాంక్షింపరు. ఇది చేయదగినకార్యమేకదా యని మనస్సును సమాధానపెట్టుకొని (స్వాత్మనిరీక్షణ రూపమైన) దేవపూజాది కార్యము లొనర్చుచుందురు. ఇట్టి వైరాగ్యపురుషులచే ఏపూజాకార్యము చేయబడుచున్నదో అది సాత్త్వికయజ్ఞమనబడును.

మూ॥ అభిసంధాయతు ఫలం దంభార్థమపి చైవ యత్
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్॥ 12.

తా॥ ఓ యర్జునా! తమకెదే ఫలము కలుగవలయునని మనస్సులో గట్టి యుద్దేశము పెట్టుకొన్నవారిచే బడాయికొఱకే చేయబడు పూజాకార్యమేదో అది రాజసయజ్ఞమని తెలిసికొనుము.

మూ॥ విధిహీన మసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥ 13.

తా॥ ("దైవందిష్టం భాగధేయం భాగ్యం స్త్రీ నియతిర్విధిః" దైవము, దిష్టము, భాగధేయము, భాగ్యము, నియతి, విధి అను నీయాఱు పురాకృత కర్మఫలమునకు నామములు. "అదభక్షణే" అను సూత్రమువలన చతుర్ధశేంద్రియములలో దేనిచేత ఏవిషయము గ్రసింపబడుచున్నదో ఆవిషయమునకు అన్నమనిపేరు. అన్నమును విడుచుటయనగా విషయతృష్ణ విడుచుట యని ఆధ్యాత్మికభావము. మననమును కాపాడుట మంత్రమనబడును. కార్యసాధనమునందు గొప్పనేర్పుకలిగియుండుట దక్షిణయనబడును.) పురాకృత కర్మఫలమును ప్రాపింపక, విషయతృష్ణను మానుకొనక, చిత్తోపశమము

పొందక, కార్యనైపుణ్యములేక, భగవత్తత్త్వమునందు విశ్వాసములేక శాస్త్రవిరుద్ధముగజేయు పూజాకార్యము తామసయజ్ఞ మనబడును.

మూ॥ దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్।
బ్రహ్మచర్యమహింసాచ శారీరం తప ఉచ్యతే॥ 14.

తా॥ దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను పూజించుట; శుచిత్వము కలిగియుండుట, ఋజువర్తనము కలిగియుండుట, దుర్విషయములయందు పరిభ్రమింపకుండుట, హింసచేయకుండుట. ఇట్టిది శరీరసంబంధమైన తపస్సుఅని చెప్పబడుచున్నది,

మూ॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచ యత్।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥ 15.

తా॥ భయంకరముకాకుండ సత్యముగను, ప్రియముగను, హితముగను పలుకబడు వాక్యమేదో అదియు, స్వస్వరూపము నెఱుగు చదువునభ్యాసము చేయుటయు అను నిట్టిదే వాగ్రూపమైన తపస్సు అని చెప్పబడుచున్నది.

మూ॥ మనఃప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే॥ 16.

తా॥ చిత్తము ప్రసన్నమైయుండుట, మంచితనము కలిగియుండుట, స్వాత్మ నిరీక్షణముతప్ప వేఱొక్క ప్రసంగము లేకుండుట, ప్రత్యాహార సిద్ధాంతియైయుండుట, నిర్మలమైన భావము కలిగియుండుట ఇట్టిది మనస్సుకు సంబధించిన తపస్సని చెప్పబడుచున్నది.

మూ॥ శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః
అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే॥ 17.

తా॥ ఫలాభిలాషలేక అభ్యాసయోగముతో గూడియుండు నియతాత్ములచే మంచి విశ్వాసముతో జేయబడుచుండు ఆమూడువిధముల తపస్సు సత్త్వగుణమునకు సంబంధించినదని చెప్పుదురు.

మూ॥ సత్కారమానపూజార్థం తపో దంభేన చైవయత్।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్॥ 18.

లోకులందఱు నన్ను సాధుపురుషుడని కొనియాడవలయును, గౌర వింపవలయును, పూజింపవలయును. అని బడాయిగుణముచేతనే యేతప స్సు చేయబడుచున్నదో లోకములో నిలుకడలేనిదియు, అశాశ్వతమైనదియు నైన అతపస్సు రజోగుణమునకు సంబంధించినదని చెప్పబడుచున్నది.

మూ॥ మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః॥
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్॥ 19.

తా॥ శత్రువునకు కీడు కలుగుటకై మూర్ఖపుపట్టుదలతో మనఃక్లేశము తో ఏతపస్సు చేయబడుచున్నదో అతపస్సు తమోగుణమునకు సంబంధించి నదని చెప్పబడినది.

మూ॥ దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే।
దేశే కాలేచ పాత్రేచ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥ 20.

తా॥ ఏస్థలములో, ఏసమయములో, ఎటువంటివానికి దానముచేయు ట యుక్తమో తెలిసికొని తన కెప్పుడును ఉపకారముచేయని వానికైనను పా త్రునకు దానముచేయుటే కర్తవ్యమని భావించి యిచ్చినదాన మేది కలదో అది సాత్త్వికదానమని తలపబడినది.

వివ॥ "సాత్త్వికం దానమ్" అనగా సత్పురుషులుచేయు దానమని కొందఱందురు. సత్పురుషులకు చేయబడినదానమని మఱికొందఱందురు. సద్వస్తువును దానముచేయుటయని యికగొందఱందురు. దానము చేయబడి నది సద్వస్తువైనప్పుడు దానినిచ్చువాడు తొలుత సత్పురుషుడుగ నుండియే సంపాదించియుండును పాత్రతను పరీక్షించియే యిచ్చును. కాబట్టి యిచ్చు వాడు, తీసికొనువాడు, ఈయబడువస్తువు అన్నియు సాత్త్వికములేయగును. అని వేఱొకకొందఱు చెప్పుదురు. ఇదంతయు నిజమే "షో అంతకర్మణి" అనుసూత్రమువలన సంసృతి బంధమును నశింపజేసి జన్మభయమునుబాపు భగవత్తత్త్వము సద్వస్తువని చెప్పబడును. దానిని దానమిచ్చువాడు తత్త్వ స్వరూపుడే కావలయును. దానము తీసికొనుటకు సాధనచతుష్టయ సంప న్నుడు, గురుసేవాపరుడు, విశ్వసనీయుడునగు ఉత్తమాధికారియే కావలయు ను. ఈవిధముగ తత్త్వజ్ఞానమును దానముచేయుట సాత్త్వికదానమనబడు ను. గురువు పరిపూర్ణుడగుటచేత శిష్యునివలన ఎటువంటి ప్రత్యుపకారము నపేక్షింపడు.

మూ॥ యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః
దీయతేచ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్॥ 21.

తా॥ వీనికేమైన నిచ్చినయెడల నాకు మరల ఉపకారముచేయగలడు ఈదానమువలన ఈవిధమైన ప్రయోజనము కలుగబోవుచున్నది. అని నిశ్చయించి ప్రత్యుపకారముకొఱకు ఉద్దేశించి యిచ్చుదానమేదో అతిప్రయాస పూర్వకమైన ఆదానము రజోగుణముతో గూడినదని తలపబడినది.

విశే॥ శిష్యులవలన డబ్బు లాగవచ్చుననియు, అన్నవస్త్రములు లభించుననియు, గౌరవప్రతిష్ఠలు గలుగుననియు ఉద్దేశించి విశేషమైన ఆరాటముతో జేబడు తత్త్వోపదేశము రజోగుణమునకు సంబంధించినది.

మూ॥ అదేశకాలే యద్దానమపాత్రేభ్యశ్చ దీయతే
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్॥ 22.

తా॥ అనర్హమైన స్థలములో, అనర్హమైన సమయములో, అనర్హులైన వారికి తిరస్కరించుచు, అవమానించుచు ఇచ్చెడు దానమేదికలదో అది తామసదానమని చెప్పబడినది.

విశే॥ జ్ఞానప్రచారమునకు విరుద్ధమైన దురాక్రాంతస్థలములో, శిష్యులకు పురాకృతఫలము కలిసిరాని సమయములో దుర్గుణావలంబులైన అసురజనులకు ఇచ్చునట్టియు, జన్మకర్మను క్షీణము జేయజాలనట్టియు, తెలివిని కలిగింపనట్టియు, ఉపదేశమేదికలదో అది తామసమని చెప్పబడినది.

మూ॥ ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః॥
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥ 23ః

తా॥ "ఓం, తత్, సత్" అని పూర్వము బ్రహ్మయొక్క నిర్దేశము మూడువిధములుగా దలపబడినది. ఆనిర్దేశముచేత బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు నియోగింపబడెను.

మూ॥ తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదాన తపః క్రియాః।
ప్రవర్తంతే విధానోక్తాస్సతతం బ్రహ్మవాదినామ్॥ 24.

తా॥ అందువలన పరబ్రహ్మ తత్త్వము నెఱిగి వచించుయతీశ్వరులో నర్చు యజ్ఞములు, దానములు, తపస్సు ఇట్టివన్నియు నిరంతరము శాస్త్ర

నియమాను సారముగా "ఓమ్" అని యుచ్చరింపబడి ఆచరింపబడుచున్న వి. ("అవరక్షణే" అను సూత్రమువలన "ఓమ్" అనగా జీవరక్షణ ప్రశస్త మైన శబ్దబ్రహ్మ.)

మూ॥ తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః।
నక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః॥ 25

తా॥ మోక్షము పొందగోరిన యతీశ్వరులచే జేయబడు పెక్కువిధము లైన యజ్ఞదాన తపఃక్రియలు ప్రతిఫలాపేక్షలేక "తత్" అని చేయబడు చున్నవి.

వివ॥ "తత్" అను పదము సర్వనామము. భగవత్తత్త్వమునకు పర్యా యముగా ఉచ్చరింపబడుచున్నది. పరమాత్మయందు చిత్తమునిల్పి చేయు కర్మలన్నియు ఈశ్వరార్పితములగుచున్నవి. అందువలన పురుషుడు కర్మచే బద్ధుడుకాడు. కాబట్టి ముముక్షువులు కర్మచేయునప్పుడు "తత్" అని పర మాత్మ చింతనముచేయుచున్నారు.

మూ॥ సద్భావె సాధుభావేచ సదిత్యేతత్ప్రయుజ్యతే।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే॥ 26.

తా॥ ఓ యర్జునా! దుఃఖభాజనమైన అజ్ఞానమును తుదముట్టించు భగవ త్తత్త్వమునందును, ఆభగవత్తత్త్వము నాశ్రయించి నిత్యశుభమును (మోక్ష మును) బొందగలిగిన యోగీశ్వరుని స్వభావమునందును "సత్" అనెడు ఆ పదము ప్రయోగింపబడుచున్నది. కొనియాడదగిన ఉత్తమకర్మయందును అదేవిధముగా "సత్" అను శబ్దము ప్రయోగింపబడుచున్నది (సత్యేసాధౌ విద్యమానే ప్రశస్తేఽభ్యర్హితేచ సత్ "అమర, నానార్థ" 84 శ్లోకము)

మూ॥ యజ్ఞే తపసి దానేచ స్థితిస్సదితిచోచ్యతే।
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే॥

తా॥ (విజ్ఞానమయమైన) యజ్ఞమునందును, దానమునందును, తప స్సునందును ప్రవర్తించువాని నిష్ఠ "సత్" అని చెప్పబడుచున్నది. సత్పద వాచ్యమైన అబ్రహ్మనిష్ఠను అర్థించువాని క్రియాసముదాయముకూడ "సత్" అనియే చెప్పబడుచున్నది.

మూ॥ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతంచ యత్
అసదిత్యుచ్యతే పార్థ! నచ తత్ప్రేత్య నో ఇహ॥ 28.

తా॥ ఓ యర్జునా! అవిశ్వాసముతో జేయబడిన యజ్ఞము, దానము తపస్సు ఇంక నేమికలదో అదియంతయు "అసత్" అని చెప్పబడుచున్నది. అట్టి యసత్కర్మ యీలోకములోను పరలోకములోను,ప్రయోజనకారి కాదు.

ఇది శ్రీమహాభారతము. భీష్మపర్వములో శ్రద్ధాత్రయ విభాగయోగమనెడు నలువదియొకటవ అధ్యాయము.

ఓం. తత్. సత్.

# శత పత్రము

# 114

## శ్రీ మహాభారతము భీష్మపర్వము 42 అధ్యాయము.

అర్జునుడు చెప్పుచున్నాడు:-

మూ॥ సన్న్యాసస్య మహాబాహో! తత్త్వమిచ్ఛామి వేదితుమ్।
త్యాగస్యచ హృషీకేశ! పృథక్కేశినిషూదన!॥ 1.

(''బాహతేప్రయత్నం కరోతియేన యోగేన పురుష శ్శుభప్రాప్త్యై స బుద్ధియోగో బాహుః, బాహ్వప్రయత్నే'' పురుషుడు ఏ యోగముచేత నిత్య శుభప్రాప్తికై ప్రయత్నము చేయుచున్నాడో అట్టి బుద్ధియోగము బాహువన బడును ''హృషికేశ'' డనగా విషయేంద్రియములకు నియామకుడని ఇది వఱకు తెలుపబడినది. ''కై శబ్దే'' అను సూత్రమువలన ''కమ్'' అనగా శబ్దబ్రహ్మకు పేరగును. ''శీఙ్ స్వప్నే'' అను సూత్రమువలన శబ్దబ్రహ్మ మునందలి వృత్తి జ్ఞానమును కేశమనవచ్చును. ఇట్టి భావముగల జీవుడు కేశియనబడును. ''షూదక్షరణే'' అను సూత్రమువలన ఈ జీవతత్త్వము ను శుభాత్మకమైన పరిశుద్ధ తత్త్వముగ పాకముదీర్చు భగవత్తత్త్వమునకు ''కేశినిషూదనః'' అని పేరు)

తా॥ మహత్తరమైన బుద్ధియోగము గలిగినట్టియు, విషయేంద్రియ ములకు నియామకుడవైనట్టియు, శబ్దబ్రహ్మమునందు వర్తించు జీవతత్త్వము ను శుభాత్మకముగ దీర్చునట్టియు ఓ కృష్ణా! సన్న్యాసముయొక్కయు, త్యాగముయొక్కయు తత్త్వమును వేఱువేఱుగ తెలిసికొనుటకు ఇష్టపడు చున్నాడను.

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు: -

మూ॥ కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః। 2.

తా॥ కామప్రేరితములైన కర్మలను చేయక విడిచిపెట్టుట సన్న్యాస మని కవీశ్వరు లెఱుదురు. (ఏకర్మయు జేయకపోవుట సన్న్యాసముకాదు) తానొనర్చు కర్మలకు నేనెకర్తనని యహంకరింపక దానివలన గలుగు ప్రతి ఫలము నాదెయని మమకారము బెట్టుకొనక అట్టివాని నపెక్షింపక (ఈశ్వ రార్పణ బుద్ధితో వదలివేయుట త్యాగమని జ్ఞానులు చెప్పుదురు.

శ్లో॥ సంత్యజేత్కామ్యకర్మాణి సంత్యజేత్కర్మణాం ఫలమ్।
సంత్యజేత్పౌతికం ధర్మం గురోర్వాక్యం న సంత్యజేత్।

కామ్యకర్మలను విడిచిపెట్టవలయును. కర్మలయొక్క పలములను విడిచిపెట్టవలయును. భౌతికధర్మమును విడిచిపెట్టవలయును గురుదేవుడు చెప్పిన వాక్యమును విడువరాదు. (విశ్వగీత 77)

మూ॥ త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః।
యజ్ఞదానతపఃకర్మ నత్యాజ్యమితిచాపరే॥ 3.

తా॥ నిత్యశుభ ప్రతిపాదకమైన బ్రహ్మనిష్ఠయందు "చిత్తనిరోధకార ణమైన అభ్యాసయోగము కర్మ, స్వస్వరూపానుభవ హేతువైన జ్ఞానయోగ ము బుద్ధి" అను విషయమిదివఱకు చెలిసినదే అందు కర్మయోగము ప్రయాసలబ్ధమైయుండును. ఇందు పొరపడినవారు ఘోరమైన అపాయము లకు సైతము గుఱియగుచున్నారు ఇది దోషయుక్తమైనది. దీనినిచేయరాదు వదలివేయవలసినదే యని ఒక్కింతమంది జ్ఞానయోగులు చెప్పుచున్నారు. (ఆత్మపూజారూపమైన) యజ్ఞము, (శిష్యులకు జ్ఞానధనమును) దానము సే యుట. వాసనాక్షయము కొఱకు దేహేంద్రియములను తపింపజేయుట మొ దలైన యిటువంటికర్మ విడువదగినదికాదు. అనియు ఇతరులు చెప్పుదురు.

మూ॥ నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ।
త్యాగోహి పురుషవ్యాఘ్ర త్రివిధస్సంప్రకీర్తితః॥ 4.

తా॥ ఓయర్జునా! త్యాగము మూడువిధములని లెస్సగ వర్ణింపబడినది కదా? అత్యాగమునందు నా నిశ్చయము వినుము.

మూ॥ యజ్ఞదానతపఃకర్మ నత్యాజ్యం కార్యమేవ తత్।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణాం॥ 5.

తా॥ జ్ఞానయోగులకు సైతము యజ్ఞము, దానము, తపస్సు పవిత్ర మైనవే. అట్టి యజ్ఞ దాన తపః కర్మ విడువదగినది కాదు. చేయదగినదే.

వివ॥ యోగశాస్త్రములో విధింపబడిన పద్ధతుల ననుసరింపక, మనో బుద్ధీంద్రియములను భగవత్తత్త్వమునందు నిలుపక, రాగాది గుణములను వదలక, అహంకార మమకారములను విడువక అభ్యాసయోగము జేయ బూనినవారు పెక్కు చిక్కులకు గురియగుదురు. అట్టివారికి కర్మయోగము దోషయుక్తము కావచ్చును కాని అహంకార మమకారములను, ఇచ్ఛా ద్వేషములను వదలి శాస్త్రానుసారముగా ఈశ్వరార్పణ బుద్ధితో జేయు జ్ఞాన యోగులకు పైజెప్పబడిన కర్మయోగము సైతము పవిత్రమైనదేయగును.

మూ॥ ఏతాన్యపితు కర్మాణి సంగం త్యక్త్వా ఫలానిచ।
కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మతముత్తమమ్॥ 6.

తా॥ ఓ యర్జునా! అట్టి సత్కర్మలైనను అనురాగబద్ధుడుగాక, ఫలాపేక్షలేక చేయవలయునని నానిశ్చయము ఇది యుత్తమమని తలపబడినది (ఈగీతాశాస్త్రములో అద్యంతమిదే యభిప్రాయము వచ్చుచున్నది.)

మూ॥ నియతస్యతు సన్న్యాసః కర్మణో నోపపద్యతే।
మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః॥ 7.

తా॥ నియమబద్ధమైన కర్మకు సన్న్యాసమన్నమాటే పొసగదు. (దాని వలన లాభముండదు) అవివేకమువలన కర్మ వదలినను అట్టిత్యాగము తామసత్యాగ మనబడును.

వివ॥ లౌకికకర్మగాని, వైదికకర్మగాని, ఆధ్యాత్మికకర్మమైన అభ్యాస యోగముగాని ఆదర్శపురుషులు లోకసంగ్రహార్థము చేయవలసినదే. ఇచ్ఛా ద్వేషములు లేకపోవుటచే బద్ధులుకారు. ఉచ్ఛ్వాస నిశ్శ్వాసాది శారీరకర్మ జ్ఞానులైనను, అజ్ఞానులైనను మానుకొనుటకే వీలుపడదు. అట్టిదానిని మాను కొనజూచుట తామసపురుషుల లక్షణము.

మూ॥ దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్॥ 8,

తా॥ కర్మయోగము చేయునప్పుడు దుఃఖమున్నది, దేహాయాసమున్నది. (ప్రాణాయామములో పొరపడుటవలన ఘోరమైన అపాయమున్నది. ఈపీడమనకెందులకు?) అని భయమువలన ఎవడైతే దానిని వదలి వేయుచున్నాడో వాడు రజోగుణ సంబంధమైన త్యాగముచేసి (అంతమాత్రము చేతనే) త్యాగఫలమును పొందనేరడు.

మూ॥ కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున।
సంగం త్యక్త్వా ఫలంచైవ స త్యాగస్సాత్త్వికో మతః॥ 9.

తా॥ అర్జునా! విషయాసక్తిని మానుకొని ఫలాపేక్షను వదలివేసి (వైరాగ్యముతో గూడుకొని) ఈ కర్మ శాస్త్రముద్వారా నియమింపబడినది కాబట్టి చేయవలసినదే యని ఏ కర్మ చేయబడుచున్నదో అట్టికర్మఫలముయొక్క త్యాగము సాత్త్వికమేయని తలపబడినది.

మూ॥ నద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః॥ 10.

తా॥ కర్మఫలమును త్యజించి, సంశయములనెల్ల ఖండించి, సత్త్వగుణముతో లెస్సగ నిండిపోయిన జ్ఞానయోగి అశుభప్రదమైన కర్మను ద్వేషింపడు. శుభప్రదమైన కర్మయందు ఆసక్తుడుకాడు. (శుభాశుభములను సమముగా జూచును.)

శ్లో॥ నాధర్మేణ నధర్మేణ బధ్యంతే ఛిన్నసంశయాః।
ప్రళయోత్పత్తితత్త్వజ్ఞా సర్వజ్ఞాస్సర్వదర్శినః॥

జననమరణముల మర్మమెఱిగినవారు, సర్వముతెలిసినవారు, సర్వము చూడగలిగినవారు. సంశయములనెల్ల ఖండించినవారునైన జ్ఞానయోగులు అధర్మముచేతను, ధర్మముచేతను బద్ధులుకారు.

(భారతము అనుశాసన 144 అధ్యా. 6 శ్లోక.)

"తుల్యాద్వేష్యప్రియా దాంతా ముచ్యంతే కర్మబంధనైః"

ఇంద్రియనిగ్రహము కలిగి ప్రియాప్రియములను సమముగజూచువారు (జ్ఞానయోగులు) కర్మబంధములచే విడువబడుచున్నారు.

(భారతము అనుశాసన. 144 అధ్యా. 9 శ్లో.)

శ్లో॥ నశోచన్నప్రహృష్యంశ్చ తుల్యానిందాత్మసంస్తుతిః।
నిరాశీర్నిర్మమో భూత్వా నిర్ద్వంద్వో నిష్పరిగ్రహః॥

సుఖదుఃఖాది ద్వంద్వములులేక, పరిగ్రహములేక, ఆశా మమకారము లులేక నిందాస్తుతులను సమముగజూచుచు, శోకింపక, సంతోషింపక యుండువాడు. (కర్మబంధములచే విడువబడును. (భారత శాంతి. 9అ. 14 )

శ్లో॥ రాగద్వేషౌ సుఖందుఃఖం ధర్మాధర్మౌ ఫలాఫలే।
యః కరోత్యనపేక్ష్యైవ స జీవన్ముక్త ఉచ్యతే॥

రాగద్వేషములను, సుఖదుఃఖములను, ధర్మాధర్మములను, ఫలాఫలములను అపేక్షింపకయే యెవడైతే (కర్మయోగము) చేయుచున్నాడో అతడు జీవన్ముక్తుడని చెప్పబడుచున్నాడు. (మహోపనిషత్తు 2 అ. 49 శ్లో.)

శ్లో॥ స్వభావప్రేరితాస్సర్వే నివిశంతే గుణా యదా।
శుభాశుభాస్తదా తత్ర కస్య కిం మానకారణమ్॥

ప్రకృతిచే ప్రేరేపింపబడిన సమస్తగుణములు (అభ్యాసములు) ఎప్పుడు ప్రవేశించుచున్నవో అప్పుడు శుభాశుభములు కలుగుచున్నవి. అందు గర్వింపదగిన కారణము ఎవనికేమున్నది? (భారత శాంతి. 222అ. 22 శ్లో )

మూ॥ నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే॥ 11..

తా॥ కర్మలను నిశ్శేషముగా వదలివేయుటకు శరీరధారియైన వానికి శక్యముకాదుకదా? కర్మవలన కలుగబోవు ఫలమును మాత్రము అభిమానించుకొనక ఎవడైతే వదలివేయుచున్నాడో వాడు త్యాగియని చెప్పబడుచున్నాడు. (27 అ. 5 శ్లోకములోను ఈభావము సూచింపబడినది.)

వివ॥ స్థూలశరీరము ఇరువదియైదు తత్త్వములలో కరచరణాది కర్మేంద్రియములచే కర్మచేయక బిగబట్టుకొని కూర్చుండుటకు కొంతసేపువఱకు సాధ్యముకావచ్చును. శ్రోత్రాది జ్ఞానేంద్రియములచే కర్మచేయకుండుటకు సామాన్యజనులకు నిద్రించునప్పుడే సాధ్యము. యోగీశ్వరులకు మెలకువలోనైనను కొంతసేపు సాధ్యము కావచ్చును. అంతఃకరణమును ఒకక్షణము బంధింపవలెనన్నను దుస్సాధ్యమేయని భావించుచున్నారు. శ్వాసకోశము

నందును, రక్తకోశమునందును, అంత్రకోశమునందును పవనములచే ప్రేరే పింపబడి పనిచేయుచుండు స్వతంత్ర నాడుల నాపుట కెట్టి యోగీశ్వరుల కైనను సాధ్యమగునో, లేదో చెప్పలేము. కాబట్టి శరీరముండునంత వఱకు కర్మమానుటకు వీలుండదు, ఫలాసక్తిని మానుకొనుటకే వీలుండును.

మూ॥ అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్।
భవత్యత్యాగినాం ప్రేత్య నతు సన్న్యాసినాం క్వచిత్॥ 12.

తా॥ కర్మవలన గలుగు ఫలము మానవులకు అసమ్మతమైనదికొంత, సమ్మతమైనదికొంత, మిశ్రఫలముకొంత యిట్లు మూడువిధములుగ నుండును. త్యాగులు కానివారికి జన్మాంతరమున సైతము ఈకర్మఫలము అంటుకొనియుండును. దానియందాసక్తి లేనివారికెందును అంటదు.

వివ॥ అధ్యాత్మికకర్మయైన అభ్యాసయోగమువలన కలుగు ఫలములు- దేహాయాసము, కృశత్వము, ఇవి యసమ్మతమైనవి. అణిమాద్యష్టసిద్ధులు ఇవి సమ్మతమైనవి. లోకులవలన గలుగు గౌరవ పూజా తిరస్కారములు ఇవి యిష్టానిష్టములు కనుక మిశ్రమమని చెప్పబడినది. వైరాగ్యము లేని వారికివి యంటును. విరాగులకేదియునంటదు.

మూ॥ పంచైతాని మహాబాహో! కారణాని నిబోధ మే।
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్॥ 13.

తా॥ ఓయర్జునా! అభ్యాసయోగముయొక్క పర్యవసానమే సాంఖ్యయోగము (జ్ఞానయోగము) అని యిదివఱకు తెలియును. అట్టిజ్ఞానయోగమునందు లాభము గాంచుటకై చేయబడు సమస్తకర్మలకును ఈయైదు కారణములు చెప్పబడినవి ఇదిగో చెప్పుచున్నాడ. తెలిసికొనుము.

మూ॥ అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధమ్।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవంచైవాత్ర పంచమమ్॥ 14.

తా॥ పూర్వశ్లోకములో జెప్పబడిన కారణములు- అందులో (1) కార్యస్థానము (అధ్యాత్మికకర్మలకు కార్యస్థానము శరీరము) (2) చేయువాడు (శరీరాభిమానియైన జీవుడు) (3) వివిధములైన పరికరములు, సామగ్రి (మనోబుద్ధీంద్రియములు) (4) వివిధములైనక్రియలు (దశవిధవాయువులచే

ప్రేరేపింపబడి డెబ్బదిరెండువేల నాడులుచేయు ప్రచారము) (5) పురాకృత కర్మఫలము. (ఈశ్లోకము భారత శాంతి 348 అధ్యాయములో కొంచెము వర్ణభేదముతో జదివినట్లు జ్ఞాపకము.)

మూ॥ శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః
న్యాయ్యంవా విపరీతంవా పంచైతే తస్య హేతవః॥ 15.

తా॥ పురుషుడు మనోవాక్కాయములచేత ఏకర్మ ప్రారంభించుచున్నాడో ఆకర్మ న్యాయ్యముకాని, అన్యాయ్యముకాని ఏదైననుసరే దానికి పూర్వోక్తములైన అధిష్ఠానాదులైదును కారణములగుచున్నవి.

మూ॥ తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః॥ 16.

తా॥ ఈప్రకారము ఆకర్మయందు (ఐదుకారణములు) ఉండగా సాంఖ్యయోగమునందు అనుభవము లేకపోవుటవలన కేవలము ఆత్మయొక్కడే చేయుచున్నాడని యెవడు చూచుచున్నాడో అట్టిచెడుబుద్ధిగలవాడు (స్వస్వరూపమును) చూడజాలడు.

మూ॥ యస్యనాహంకృతో భావో బుద్ధిర్యస్య నలిప్యతే
హత్వాపి స ఇమాఀ లోకాఀ నహంతి ననిబధ్యతే॥ 17.

జడాత్మకమైన శరీరమే నేననియు, దేహేంద్రియాదులతో చేయబడు కర్మకు నేనే కర్తననియు బావించు అజ్ఞాన మెవనికిలేదో, ఎవనిబుద్ధి (కర్మఫలముచే) అంటుకొనబడదో అట్టిజ్ఞానయోగి దృశ్యములైన యీదేహేంద్రియాదులను పొందియు పొందనివాడేయగును. కేవలము బద్ధుడుకాడు. (ఈశ్లోకము వేదాంతపంచదశి 14 ప్రకరణములోనున్నది.)

శ్లో॥ యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య నలిప్యతే
కుర్వతోఽకుర్వతోవాపి స జీవన్ముక్త ఉచ్యతే॥

ఎవనికి అహంకారములేదో, ఎవనిబుద్ధి కర్మఫలాసక్తి జెందదో అట్టివాడు కర్మచేసినను, చేయకపోయినను జీవన్ముక్తుడని చెప్పబడును.

(వరాహోపనిషత్తు 4అ. 25శ్లో.)

వివ॥ "హనహింసాగత్యోః" అనుసూత్రమువలన "హత్వా" అను పదమునకు "హింసించి" అనియు, "పొంది" అనియు రెండర్థములు పాత కులిదివఱకు చదివియున్నారు. "లోకృదర్శనే" అనుసూత్రమువలన "లోకాన్" అనగా కనబడుచుండు మనుష్యులనియు, శరీరతత్త్వములనియు తలపబడును. "ఇమాఀల్లోకాన్ హత్వా" అనగా ఈప్రజలను చంపియనియు దృశ్యమానములైన యీశరీరతత్త్వములను పొంది అనియు అర్థము వచ్చుచున్నది. మనకిచ్చట శరీరతత్త్వములను పొంది అను భావమును తీసికొనుటయే యుక్తముగా కనబడినందున ఇట్లనువదించితిని.

(37 అధ్యా. 31-32 శ్లోకములలో ఈభావమున్నది.)

శ్లో॥ దేహస్థోఽపి నదేహస్థో విద్వాఀ స్వప్నాద్యథోత్థితః।
అదేహస్థోఽపి దేహస్థః కుమతిస్స్వప్నదృగ్యథా॥

స్వప్నమునుండి మేలుకొన్నవాడు స్వప్నదృశ్యమును యెటులపొందడో అటులే జ్ఞానియగువాడు దేహమునందుండియు దేహకర్మచే బద్ధుడుకాడు. కనుక దేహమునందు లేనివాడేయగును. స్వప్నమును గాంచువాడు స్వప్నకర్మచే ఎట్లు పీడింపబడుచున్నాడో అట్లే మూఢుడగువాడు దేహమునందు లేకపోయినను దేహకర్మచే బద్ధుడగుచున్నాడు.

(భాగవతము 11 స్కం. 11 అ. 8 శ్లోకము)

శ్లో॥ అశరీరశ్శరీరేషు సర్వేషు నివసత్యసౌ।
వసన్నపి శరీరేషు న సలిప్యతి కర్మభిః॥

శరీరత్రయమునకు విలక్షణమైన ఆపరమాత్మ సర్వశరీరములయందు నివసించుచున్నాడు. శరీరములయందు వసించుచుండియు అతడు కర్మలచే ముట్టబడడు. (నారాయణీయము 2-3)

మూ॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః 18.

తా॥ తెలివియనియు, తెలియదగినదనియు, తెలిసికొనువాడు అనియు కర్మప్రేరణము మూడువిధములు. పరికర సామగ్రి ( ఇంద్రియములు ) అనియు, చేయదగిన క్రియ (అభ్యాసయోగాదిసాధనము) అనియు, చేయువాడు అనియు కర్మసంగ్రహము మూడువిధములు.

మూ॥ జ్ఞానం కర్మచ కర్తాచ త్రిధైవ గుణభేదతః।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి॥ 19.

తా॥ గుణములబట్టి చర్చింపగా జ్ఞానమనియు, కర్మయనియు, కర్త యనియు గుణభేదములవలన మూడు విధములుగానే చెప్పబడుచున్నది. వానిని సైతము ఉన్నదున్నట్టు (చెప్పబోవుచున్నాడ) వినుము.

మూ॥ సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥ 20.

తా॥ సమస్తభూతములయందుండు పరమాత్మ ఒక్కడేకాని అంతకెక్కువలేదు శరీరభేదములచేత భూతములు విభజింపబడుచుండగా పరమాత్మ విభజింపబడడు భూతములు క్షీణించుచుండగా ఆపరమాత్మ క్షీణింపడు. అను భావమును పురుషుడు ఏజ్ఞానముచేత చూచుచున్నాడో ఆ జ్ఞానము సాత్త్వికమని తెలిసికొనుము.

మూ॥ పృథక్త్వేనతు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్।
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్॥ 21.

తా॥ శరీరభేదములచేత సమస్తభూతములు వేఱువేఱు విధములుగ, వేఱువేఱు భావములుగలవిగ నుండ అభూతములయందు వ్యాపించిన పరమాత్మ సైతము ఇట్లే వేఱువేఱుగ నుండునని వేఱుభావముచేత తెలిసికొను జ్ఞానమేదికలదో ఆజ్ఞానము రజోగుణమునకుసంబంధించినదనితెలిసికొనుము

మూ॥ యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్।
అతత్త్వార్థవదల్పంచ తత్తామసముదాహృతమ్॥ 22.

తా॥ (క్రియారూపమైన అభ్యాసయోగము, నిష్క్రియారూపమైన జ్ఞానయోగము ఈ రెండుచేరి నిత్యశుభ ప్రతిపాదకమైన బ్రహ్మనిష్ఠ పర్యాప్తమగుచున్నది.) ఒకశారీరక సాధనమునందే అంతయు సంపూర్ణమై పోయినట్లుగా ఏజ్ఞానము సక్తమైయున్నదో; మూలములేక, తత్త్వప్రాప్తి గాంచజాలక అల్పమైయున్నదో అట్టి జ్ఞానము తమోగుణ సంబంధమని చెప్పబడినది.

మూ॥ నియతం సంగరహితమరాగద్వేషతః కృతమ్
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే॥ 23.

తా॥ రాగద్వేషములు లేకపోవుటవలన ఫలకాంక్షలేనివానిచే జేయబడి నట్టియు, నిత్యమైనట్టియు, విషయాభిలాష లేనట్టియు కర్మ (అభ్యాసయోగము) ఏదికలదో అట్టిది సాత్త్వికకర్మయని చెప్పబడుచున్నది.

మూ॥ యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణవా పునః
క్రియతే బహుళాయాసం తద్రాజసముదాహృతమ్॥ 24.

తా॥ మఱియు శరీరమే నేననియు, దేహేంద్రియములచే జేయబడు కర్మకు నేను కర్తననియు భావించి కామాభిలాష జెందిన పురుషునిచేత ఏ కర్మ (అభ్యాసయోగము) చేయబడుచున్నదో అధికప్రయాసముతోగూడిన ఆ కర్మ రాజసకర్మయని చెప్పబడినది.

మూ॥ అనుబంధం క్షయం హింసామనవేక్ష్యచ పౌరుషమ్।
మోహాదారభ్యతే కర్మ తత్తామసముదాహృతమ్॥ 25.

తా॥ తానొనర్చు కర్మవలన గలుగబోవు దోషోత్పాదనమును, నాశమును, క్లేశమును, మఱియు పురుషునియందుండదగిన స్వభావమును ఉపలక్షింపక మూఢత్వముతో ప్రారంభింపబడిన ఆ కర్మ (అభ్యాసయోగము) తామసమని చెప్పబడినది.

మూ॥ ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే॥ 26.

తా॥ విషయాసక్తిని మానుకొని దేహమే నేననెడువాదమును విడిచిపెట్టి ధైర్యముతోను, ఉత్సాహముతోను గూడుకొని లాభాలాభములయందు వికారమును జెందకయుండు కర్త (అభ్యాసయోగి) సాత్త్వికపురుషుడని చెప్పబడును.

మూ॥ రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః॥ 27.

తా॥ విషయాదులయందు అనురాగముగలవాడు. చేసినకర్మకు ఫలము కావలయుననికోరువాడు. పరులసొమ్ము తనకు రావలయుననియు, తన కున్నదిపోగూడదనియు దురూహపెట్టుకొనువాడు. ఇతరజీవులను పీడించు స్వభావముగలవాడు. శుచిత్వము లేనివాడు. ఇష్టప్రాప్తివలన సంతోషమును, అనిష్టప్రాప్తివలన శోకమును పొందువాడు. ఇట్టి లక్షణములుగలవాడు రాజసకర్తయని చెప్పబడినవాడు.

మూ॥ అయుక్తః ప్రాకృతస్తబ్ధశ్శఠో నైష్కృతికోఽలసః
విషాదీ దీర్ఘసూత్రీచ కర్తా తామస ఉచ్యతే॥ 28.

తా॥ ఆత్మానుసంధానము చేయనివాడు. మాయాజాలమునందు భ్రమించువాడు. సంకోచము, మోటుతనముగలవాడు. ఉత్సాతోపాయములచే పరులను వంచించువాడు. తాజేయవలసిన కర్మ ఉచితరీతి జేయనివాడు. మతి ప్రకాశము లేనివాడు. మనోవేదనకులొంగి పోవువాడు. సమయోచితమైన ప్రజ్ఞ లేకపోవుటచే కార్యభంగము జేసికొనువాడు ఇట్టివాడు తామస కర్తయని చెప్పబడును.

ఓం. తత్. సత్.



# శతపత్రము

# 115

మూ॥ బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు।
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ॥ 29.

తా॥ ఓ యర్జునా! బుద్ధియొక్కయు, ధారణముయొక్కయు భేదము సైతము సత్త్వరజస్తమో గుణములబట్టి మూడువిధములుగానే (చెప్పబడినది.) ప్రత్యేకముగా, సంపూర్ణముగా చెప్పుడుచున్న (మూడువిధముల) భేదమును వినుము.

మూ॥ ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే।
బంధం మోక్షంచ యా వేత్తి బుద్ధిస్సా పార్థ! సాత్త్వికీ॥ 30.

తా॥ ఓయర్జునా! ప్రవృత్తి నివృత్తి మార్గములను, కార్యాకార్యములను, భయాభయములను, బంధమోక్షములను ఏబుద్ధి తెలిసికొనుచున్నదో అట్టిది సత్త్వగుణమునకు సంబంధించిన బుద్ధి.

మూ॥ యయా ధర్మమధర్మంచ కార్యం చాకార్యమేవ చ।
అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ! రాజసీ॥ 31.

తా॥ ఓ యర్జునా! (పురుషుడు) ఏబుద్ధిచేత ధర్మమును, అధర్మమును, చేయదగిన కార్యమును, చేయరాని కార్యమును, యథార్థముగ తెలిసికొనలేడో అట్టిది రజోగుణమునకు సంబంధించిన బుద్ధి.

మూ॥ అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ! తామసీ॥ 32.

తా॥ ఓ యర్జునా! ఏబుద్ధియైతే అజ్ఞానముచే నిరోధింపబడి ధర్మమును అధర్మమని తలచుచున్నదో సమస్త విషయములను విపరీతముగా ఏబుద్ధి భావించుచున్నదో అట్టిది తమోగుణమునకు సంబంధించినబుద్ధి.

మూ॥ ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః
యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ సాత్త్వికీ॥ 33.

తా॥ యర్జునా! యోగముచే (ఆత్మానుసంధానముచే) మానసము యొక్కయు, దశవిధ వాయువులయొక్కయు, దశేంద్రియముల యొక్కయు, కర్మలను పురుషుడు అస్మత్ప్రద లక్ష్యార్థమైన పరమాత్మకంటె వేఱుగ జరింపని యేధారణముతో ధరింపజేయుచున్నాడో అట్టిది సత్త్వగుణమునకు సంబంధించిన ధారణము.

వివ॥ ఇంద్రియములచే బాహ్యకర్మలు చేయబడుచున్నవి. ప్రాణవాయువులచే స్వతంత్రనాడుల ద్వారా అంతరకర్మలు చేయబడుచున్నవి. మనస్సుచే బాహ్యాంతర కర్మలన్నియు జేయబడుచున్నవి. వీని నన్నిటిని పరమాత్మయందు అనన్యభావముతో నిలుపుట సాత్త్వికధారణమని చెప్పబడును.

మూ॥ యయాతు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున।
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిస్సా పార్థ రాజసీ॥ 34.

తా॥ ఓ పార్థ! అర్జునా! కర్మలకు ప్రతిఫలము కావలయునని కోరుకొను పురుషుడు ఏధారణముచే (పునర్భవకారణములైన) ధర్మార్థకామములను ఆసక్తితో ధరింపజేయుచున్నాడో అట్టిది రజోగుణమునకు సంబంధించిన ధారణము.

మూ॥ యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవచ।
నవిముంచతి దుర్మేధా ధృతిస్సా పార్థ! తామసీ॥ 35.

తా॥ ఓ అర్జునా! చెడుబుద్ధిగల మనుష్యుడు ఏధారణముచే స్వప్నమును, భయమును, శోకమును, విషాదమును, మదమును విడువకున్నాడో అట్టిది తమోగుణమునకు సంబంధించిన ధారణము.

మూ॥ సుఖంత్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతంచ నిగచ్ఛతి॥ 36.

తా॥ ఓయర్జునా! (పురుషుడు) దేనియందు అభ్యాసమువలన క్రీడించుచున్నాడో, దుఃఖముయొక్క పర్యవసానమును సైతము దేనియందు ప్రాపించు

చున్నాడో అట్టి సుఖము మూడువిధములుగ నున్నది. ఇప్పుడు (దానిని చెప్పబోవుచున్నాను) నా మాట వినుము.

మూ॥ యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్॥ 37.

తా॥ ఏదైతే ఆరంభమున విషమువలె అసహ్యముగనుండి పరిణామ దశయందు అమృతమువలె ప్రియముగ నుండునో, తనబుద్ధి ప్రసన్నమగు టచే కలుగుచున్నదో అట్టిది సాత్త్వికసుఖమని చెప్పబడినది.

వివ॥ "సుష్ఠు ఖనతి అశుభమితి సుఖం, ఖను అవదారణే" అను సూత్రమువలన సుఖమనగా అశుభమును త్రవ్వివేయు సత్కర్మఫలమని యర్థము. "అస్తీతిసత్ అసభువి" అను సూత్రమువలన ఎన్నడును నశింపక స్థిరముగనుండు భగవత్తత్త్వము "సత" అనబడును. అట్టితత్త్వమునకు సంబంధించిన సుఖము సాత్త్వికసుఖ మనబడును. బ్రహ్మనిష్ఠయందు తొలుత కర్మయోగ మారంభింపగా బహుళాయాస సంగతమై విషమువలె గనబడు చుండును. కర్మయోగ పరిణామమనగా బుద్ధియొక్క నిర్మలస్థితి. దీనిని బుద్ధియోగమనియు జెప్పుదురు. దీనియందుగలుగు సుఖము అమృతము వలె ప్రియమైయుండును. ఇట్టిదే సాత్త్విక సుఖమని చెప్పబడును.

మూ॥ విషయేంద్రియ సంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥ 38.

తా। శబ్దాది విషయములు శ్రోత్రాదులైన యింద్రియములతో జేరుట వలన ఏసుఖము కలుగుచున్నదో అది తొలుత అమృతమువలె ప్రియముగ నుండును. కొంతదూరము అనుభవించినపిమ్మట దేహేంద్రియములు మార్పు జెందుచుండగా అసుఖమే విషమువలె వెగటుగ గనబడును. అట్టిసుఖము రజోగుణమునకు సంబంధించినదని తలపబడినది.

మూ॥ యదగ్రేచానుబంధేచ సుఖం మోహనమాత్మనః
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్॥ 39.

తా॥ ఏసుఖమైతే అద్యంతము తన్ను మోహింపజేయుచున్నదో; నిద్ర, సోమరితనము, ఏమఱుపాటు అనువానిచే ఉద్భవించుచున్నదో అట్టిది తమో గుణమునకు సంబంధించిన సుఖమని చెప్పబడినది.

మూ॥ న తదస్తి పృథివ్యాంవా దివి దేవేషు వా పునః
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిః స్యాత్త్రిభిర్గుణైః॥ 40.

తా॥ పరాప్రకృతివలన బుట్టిన యీ త్రిగుణములచే విడువబడినజీవి యేదియుండునో అట్టిది భూమియందుగాని, మఱియు దివమున దేవతల యందుగాని లేదు. (స్వర్గమర్త్యాది లోకములలో జన్మించిన జీవులన్నియు త్రిగుణములతో గూడియున్నవని భావము)

మూ॥ బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచ పరంతప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః॥ 41.

తా॥ ఓయర్జునా! బ్రాహ్మణులయొక్కయు, క్షత్రియుల యొక్కయు, వైశ్యులయొక్కయు, శూద్రులయొక్కయు కర్మలు ప్రకృతివలన గలిగిన అభ్యాసములచే లెస్సగ విభజింపఁబడినవి

వి వ॥ నిర్గుణము, నిరాకారమునైన పరతత్త్వముతో త్రిగుణాత్మకయైన పరాప్రకృతి చేరుటవలన రాగాది గుణసంకలితమై భూతసృష్టికి కారణమగు చున్నది అప్పుడు "బృహవృద్ధౌ" అనుసూత్రమువలన దానికి బ్రహ్మమని పేరు కలుగుచున్నది. దీనిని బృహత్తత్త్వమనియు జెప్పవచ్చును. ఈబృహత్తత్త్వము నాశ్రయించి జ్ఞానాభివృద్ధి గాంచినవారు, దీనితోనే సంబంధము కలిగి యుండువారు బ్రాహ్మణులు. కామక్రోధాదులైన శత్రుగుణములవలన అంతఃకరణమునకు క్షతము కలుగ కుండునట్లు, స్వాత్మనిరీక్షణ సామ్రాజ్యమునకు ప్రమాదము రాకుండునట్లు కాపాడఁగల కర్మవీరులు క్షత్రియులు. శిష్యుల హృదయ తాపములను హరించుటకు, వారికి జ్ఞానసామగ్రి నొసగుటకు శిష్యుల హృదయ రంగమనెడు ఆపణమున (అంగడిలో) ప్రవేశించువారు, కర్మబంధముల ద్రెంపుకొనివచ్చు శిష్యులకు దమయందు ప్రవేశము నొసగువారు వైశ్యులు. అప్రగల్భులైన శిష్యుల హృదయ సదనములయందలి మాలిన్యమును తుడిచివేసి శుద్ధిసేయుటకు పరిచారకులై అందు వలనగలుగు పెక్కు క్లేశముల సహించువారు శూద్రులు.

"బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాస్త్రయో వర్ణా ద్విజాతయః"

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు ఈమూఁడు వర్ణములవారు ద్విజులు.
(పరాశరగీత 7 అ. 25 .)

శ్లో॥ వక్త్రాద్భుజాభ్యా మూరుభ్యాం పద్భ్యాంచైవాథ జజ్ఞిరే।
సృజతః ప్రజాపతేర్లోకా నితిధర్మవిదో విదుః
ముఖజా బ్రాహ్మణాస్తాత బాహుజాః క్షత్రియాః స్మృతాః
ఊరుజా ధనినో రాజన్ పాదజాః పరిచారకాః॥

లోకులను సృజించుచుండు బ్రహ్మయొక్క ముఖమునుండియు,భుజములనుండియు, ఊరువులనుండియు, పదములనుండియు (ప్రజలు) జన్మించిరని ధర్మజ్ఞు లెఱుఁగుదురు.

నాయనా! ముఖమునుండి పుట్టినవారు బ్రాహ్మణులు. బాహువులనుండి పుట్టినవారు క్షత్రియులు. ఊరువులనుండి పుట్టినవారు వైశ్యులు. ఓరాజా! పాదములనుండి పుట్టినవారు శూద్రులుఅని తలపఁబడిరి.

(పరాశరగీత 7అ. 5-6)

భౌతిక శరీరముల యుత్పత్తి మనము చూచినంత దూరములో పై శ్లోకముల రీతిగ ఎచ్చటను కనబడలేదు. మఱియు "ఇంద్రో వై బ్రహ్మణః పుత్రః క్షత్రియ కర్మణాభవత్" బ్రహ్మపుత్రుడైన యింద్రుడు కర్మచే క్షత్రియుడాయెను. (శాంతి. 22 అధ్యా. 11 శ్లో.)

ఇకను వివస్వత్ప్రముఖులైన బ్రహ్మపుత్రులు కొందఱు క్షత్రియులైరి. చంద్రుడును అట్టివాడే. హిరణ్యకశిపుడు, రావణుడు, మఱికొందఱు దైత్య దానవులు, కాలకేయులు మున్నగువారందఱు బ్రహ్మపుత్రులే. క్షత్రియకులోద్భవులైన విశ్వామిత్రాదులు, ఋషభపుత్రులు, వేఱొక కొందఱు నిమ్న జాతులకు బుట్టినవారు, మృగములకు బుట్టినవారు, కలశములయందు బుట్టినవారు, గడ్డి, గాదములయందు, ఇతర జడపదార్థములయందు బుట్టినవారు పెక్కుమంది బ్రాహ్మణులైరని పౌరాణికస్వాములు చెప్పుదురు.

శ్లో॥ వర్ణాశ్రమాచారయుతా విమూఢాః కర్మానుసారేణ ఫలంలభంతే।
వర్ణాదిధర్మం హి పరిత్యజంతః స్వానందతృప్తాః పురుషా భవంతి॥

వర్ణాశ్రమాచారములతో గూడియుండు మూఢులు వారివారి కర్మానుసారముగా ఫలముపొందుచున్నారు వర్ణాది ధర్మమును వదలిన పురుషులు కదా స్వరూపానందముచే సంతృప్తులగుచున్నారు.

(మైత్రేయ్యుపనిషత్తు 1 అ. 13 శ్లో)

శ్లో॥ యస్య వర్ణాశ్రమాచారో గళితః స్వాత్మదర్శనాత్।
స వర్ణానాశ్రమాన్ సర్వానతీత్య స్వాత్మని స్థితః॥

స్వస్వరూప దర్శనమువలన ఎవని వర్ణాశ్రమాచారము వదలివేయ బడినదో అతడు సర్వవర్ణములను, ఆశ్రమములను అతిక్రమించి పరమాత్మ యందే యున్నవాడగును.

(నారదపరివ్రాజకోపనిషత్తు 6 ఉపదేశము 12 శ్లోకము)

శ్లో॥ న విశేషోఽస్తి వర్ణానాం సర్వం బ్రాహ్మమిదం జగత్।
బ్రహ్మణా పూర్వసృష్టంహి కర్మభిర్వర్ణతాం గతమ్॥

సమస్తమైన యీజగత్తు పూర్వము బ్రహ్మచేసృజింపబడినది. బ్రహ్మ భావము కలిగినది. కర్మలచే వర్ణభావము పొందినది. (అందువలన) వర్ణ ములలో విశేషములేదుకదా? (భారత శాంతి. 188 అ. 10 శ్లో.)

ఇందువలన సృష్టియంతయు బ్రహ్మమయమే యనియు, గుణకర్మా దుల వలన వర్ణభేదములు కలిగినవనియు నమ్మవలసియుండగా పైపరాశర గీతాశ్లోకముల రీతిగా ప్రజాపతియను వాడొకడుండెననియు, అతని శరీరము నందు వేఱువేఱు భాగములనుండి వేఱువేఱు వర్ణములవారు పుట్టిరనియు, సర్వభూతోత్పత్తికి కారణమైన యోనిద్వారము ఆకాలములో ఉపయోగపడి యుండలేదు కాబోలు ననియు జెప్పిన యెడల ఈకాలములో లౌకికవాదుల దృష్టికి వినోదముగ గనబడవచ్చును. భూతోత్పత్తికి కారణమైన బృహత్తత్వ ము భౌతిక వ్యక్తికాదు కావున పైశ్లోకములయందలి వర్ణనమంతయు భౌతి కముకాదని నమ్మవలయును.

మూ॥ శమో దమస్తపశ్శౌచం క్షాంతి రార్జవమేవ చ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్॥ 42.

తా॥ అంతరింద్రియ నిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము, తపస్సు, శౌచము, ఓర్పు, ఋజుత్వము, శాస్త్రజ్ఞానము, విశేషజ్ఞానము, భగవద్విశ్వాస ము, ఇదంతయు బ్రహ్మత్వమునకు సంబంధించిన స్వాభావికకర్మ.

శ్లో॥ ధర్మశ్చ సత్యంచ తపో దమశ్చ హ్యమాత్సర్యం హ్రీస్తితిక్షానసూయా।
ధ్యానం శ్రుతంచైవ ధృతిః క్షమాచ మహావ్రతా ద్వాదశ బ్రాహ్మణస్య॥

ధర్మము, సత్యము, తపస్సు, దమము, మత్సరము లేకుండుట, బిడియము, తితిక్ష, అసూయలేకుండుట, తత్త్వచింతనము, వైదికజ్ఞానము, ధైర్యము, ఓర్పు ఈ పండ్రెండు బ్రాహ్మణుని వ్రతములు.

(సనత్సుజాతీయము 4 అ. 5 శ్లోకము)

"ప్రతిగ్రహో యాజనంచ తథైవాధ్యాపనం నృప। విశేషధర్మా విప్రాణామ్"

ఓ రాజా! దానముగ్రహించుట, దేవపూజాదులు చేయించుట, అదేవిధముగా చదివించుట ఇవి విప్రులకు విశేషధర్మములు.

(పరాశరగీత 7 అ. 20 శ్లోకము)

శ్లో॥ వాచోవేగం మనసః క్రోధవేగం విధిత్సావేగముదరోపస్థవేగమ్।
ఏతాన్ వేగాన్ యో విషహేదుదీర్ణాన్ తం మన్యేఽహం బ్రాహ్మణం వై మునించ

పలుకులయందలి తొట్రుపాటును, మనోవేగమును, క్రోధవేగమును, కార్యములయందు మితిమీఱినయుత్కంఠ, కడుపునందు, గుహ్యేంద్రియమునందును బుట్టు ఆత్రమును ఇట్టి యతిశయమైన వేగములనెల్ల ఎవడు సహించుకొనుచున్నాడో వానిని బ్రాహ్మణునిగను, మునిశ్వరుడనియు దలతును (హంసగీత 14 శ్లోకము)

శ్లో॥ యేన సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ
తత్సూత్రం ధారయేద్యోగీ యోగవిద్బ్రాహ్మణో యతిః॥

సూత్రమునందు రత్నములు కూర్పబడినట్లు ఈ సర్వప్రపంచము దేనిచే కూర్పబడియున్నదో ఆపరమాత్మ సూత్రమును యోగీశ్వరుడు ధరింపవలయును. (ఇట్లుధరించినవాడే) యోగము నెఱిగినవాడు, బ్రాహ్మణుడు, యతి (పరబ్రహ్మోపనిషత్తు 4.)

"సాటిలేనట్టియు, జాతిగుణక్రియలు లేనట్టియు, షడూర్మి షడ్భావవికారాది సమస్తదోషములు లేనట్టియు, సత్యజ్ఞానానందములు స్వరూపముగ గలిగినట్టియు, వికల్పములు లేనట్టియు, సమస్తకల్పములకు ఆధారమైనట్టియు సర్వభూతములయందు అంతర్యామి భావమున వర్తించునట్టియు, బాహ్యాంతరములయందంతట ఆకాశమువలె కూర్పబడి యుండునట్టియు ఎడతెగని యానందము స్వభావముగ గలిగినట్టియు, ఆట్టిదిట్టిదని చెప్పరానట్టియు అనుభవముచేతనే తెలియదగినట్టియు. ప్రత్యక్షముగా బ్రకాసించు

నట్టియు, పరమాత్మ తత్త్వమును తనంతటతాను హస్తమునందలి ఉసిరిక కాయవలె సాక్షాత్తుగా ప్రత్యక్షము గావించుకొని కృతార్థుడనైతినన్న భావముతో ఎవడైతే శమదమాది సంపద్గుణభాసితుడై, కామరాగాది దోషములు లేక, భావమాత్సర్య తృష్ణాశామోహాది గుణములు లేక, దంభాహంకారాదులను చిత్తమునకు అంటనీక వర్తించుచున్నాడో అట్టివాడే బ్రాహ్మణుడు.''
(వజ్రసూచికోపనిషత్తు.)

శ్లో॥ బ్రాహ్మణ్యం కులగోత్రేచ నామసౌందర్య జాతయః॥
స్థూలదేహగతా ఏతే స్థూలాద్భిన్నస్య మే నహి॥

బ్రాహ్మణుడనన్నభావము, కులగోత్రములు, నామము, సౌందర్యము జాతి ఇవియన్నియు స్థూలశరీరమును పొందియుండునవి. స్థూలశరీరమునకంటె వేఱైయుండు నాకులేవుకదా? (ఆత్మప్రబోధోపనిషత్తు 22 శ్లోకము)

ఇట్లు చెప్పుటచే బ్రాహ్మణత్వమనునది గుణకర్మాదులవలన కలిగినదే కాని జాతివల్లను యజ్ఞోపవీతాది లాంఛనములవల్లను, కలిగినదికాదని తెలియుచున్నది.

మూ॥ శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాజనమ్।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావయమ్॥ 43.

తా॥ (అంతఃశత్రువులైన కామక్రోధాదుల జయించు వఱకు బాహ్యశత్రువుల నెందఱ జయించినను శౌర్యము పర్యాప్తముకాదు. కాబట్టి కామక్రోధాదుల జయించినవాడే నిజమైన శూరుడు. శూరుని స్వభావమే శౌర్యము ) శౌర్యము, తేజస్సు, ధారణము, నైపుణ్యము, శత్రుప్రహరణ కార్యమున వెనుదియకుండుట. దానము, నియంతృత్వము ఇట్టిదంతయు స్వాభావికమైన క్షత్రియకర్మ.

మూ॥ కృషి గౌరక్ష్య వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥ 44.

తా॥ వ్యవసాయము, గోరక్షణము, వ్యాపారము ఇట్టిది స్వాభావికమైన వైశ్యకర్మ. పరిచర్యా స్వరూపమైనది స్వాభావికమైన శూద్రకర్మ. (ఆధ్యాత్మిక గ్రంథములో కర్మయనగా ఆధ్యాత్మిక కర్మయని తెలియవలయును.

మూ॥ స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః।
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు॥ 45.

తా॥ "షో అంతకర్మణి" అను సూత్రముచేత అశుభ దాయకమైన జన్మబంధమును నశింపజేయు అభ్యాసయోగరూపమైన ఆధ్యాత్మిక కర్మ స్వకర్మ యనబడును. ఏశిష్యునకు ఏపద్ధతి కర్మ గురువులచే బోధింపబడి యుండునో ఆశిష్యుడు ఆపద్ధతి కర్మయందు మిక్కిలిగ క్రీడించుచుండిన యెడల మానసేంద్రియములు, పవనములు అన్నియు వశపడుచున్నవి. "నృనయే" అను సూత్రమువలన సర్వము వశపఱచుకొన్నవాడు నరుడన బడును. అట్టివానికి బుద్ధి స్థిరపడుచున్నది. అందువలన నిత్యశుభమనెడు మంచిలాభము పొందుచున్నాడు. తన కర్మయందు తాను క్రీడించునరుడు లాభమునెట్లు పొందుచున్నాడో దానిని చెప్పెద వినుము.

మూ॥ యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః॥

తా॥ భూతముల యుత్పత్తిస్థితి లయములకు హేతువైన మాయాపరిణము దేనివలన గలిగినదో, చరాచరరూపమైన సమస్తప్రపంచము దేనిచే వ్యాపింపబడియున్నదో అట్టి సర్వాంతర్యామియైన భగవత్తత్త్వమును మానవుడు తనకు నియతమైయున్న అభ్యాసయోగ పద్ధతిచే అర్చించి శుభప్రాప్తిని పొందుచున్నాడు.

"కరణత్రయసంభూతం బాహ్యం కర్మ పరిత్యజన్।
అంతరం కర్మ కురుతే యత్రారంభస్స ఉచ్యతే"॥

ఎచ్చటనైతే (పురుషుడు) మనోవాక్కాయములవలన కలుగు బాహ్య కర్మను వదలివేసి (స్వాత్మనిరీక్షణరూపమైన) అంతరంగిక కర్మ చేయుచు న్నాడో అది యారంభమని చెప్పబడును (వరాహోపనిషత్తు ౨-అ. 72-73)

శ్లో॥ స్వాత్మనీశార్చనం కర్మ స్వకర్మేతి సమీరితమ్।
తదన్యదఖిలం కర్మ జరామరణదూషితమ్॥

తనలోపలనే పరమేశ్వర తత్త్వమును పూజించుచుండుట స్వకర్మ యని చెప్పబడినది. దానికంటె వేఱైన కర్మయంతయు జరామరణములకు హేతువగుటవలన దూషింపబడినది. (విశ్వగీత 104)

మూ॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ 47.

తా॥ (ఇందు సగముశ్లోకము 27అ. 35 శ్లోకములో చదువబడినది.) కేవలపరిశుద్ధాత్మయైన తనకుజెందని ప్రవృత్తి ధర్మమును లెస్సగ అనుష్ఠించుటకంటె గుణరహితమైన తన (స్వానుభవరూపమైన) ధర్మము మేలు. (స్వంభావం స్వభావమ్ = తానే తానైయుండుట స్వభావము) అస్మత్పద లక్ష్యార్థమైన తనభావముతో నియమింపబడు (స్వాత్మనిరీక్షణరూప) కర్మను చేయుచుండువాడు పాపము పొందడు.

శ్లో॥ స్వాత్మధర్మం పరిత్యజ్య యోన్యధర్మం సమాచరేత్।
మృష్టశాల్యోదనం హిత్వా తుషంతు భక్షయేన్నరః॥

అంతరాత్మయందు ఆత్మచే ధరింపబడిన భవసంహారకమైన ధర్మమును విడిచిపెట్టి దానికంటె ఇతరమైన ప్రవృత్తి ధర్మము నెవ్వడు లెస్సగ ఆచరించుచున్నాడో అట్టినరుడు పరిశుద్ధమైన వరియన్నమును విడిచిపెట్టి ధాన్యముమీదిపొట్టును భక్షించువాడగును. (విశ్వగీత 57)

శ్లో॥ స్వాత్మనిరీక్షణో నామ స్వధర్మ ఇతి కథ్యతే।
అన్యే ధర్మాః ప్రణశ్యంతి స్వధర్మో న వినశ్యతి॥

స్వాత్మనిరీక్షణమని పేరుగాంచినదే స్వధర్మమని చెప్పబడుచున్నది. తక్కిన ధర్మములు నశించుచున్నవి. స్వధర్మము నశింపదు.

(విశ్వగీత 103)

శ్లో॥ వత్సరాద్బ్రహ్మ విద్వాన్ స్యాత్తస్మాన్నిత్యం సమభ్యసేత్।
యోగాభ్యాసరతో నిత్యం స్వధర్మనిరతశ్చ యః॥

తా॥ (స్వాత్మనిరీక్షణ రూపమైన) స్వధర్మమును బూని యెవడైతే యోగాభ్యాసము ఆసక్తితో జేయుచున్నాడో అతడు సంవత్సరమునకు బ్రహ్మవిదుడగును. అందువలన నిరంతరము అభ్యాసముచేయవలసినదే

(జాబాలదర్శనోపనిషత్తు 6 ఖం. 11 శ్లోకము)

ఇట్టిగ్రంథ ప్రమాణములవలన స్వకర్మయనగా ఆధ్యాత్మిక కర్మయనియు, స్వధర్మమనగా ఆధ్యాత్మిక ధర్మమనియు ఋజువగుచున్నది.

మూ॥ సహజం కర్మ కౌంతేయ! సదోషమపి న త్యజేత్॥
సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః॥ 48.

తా॥ ఓ యర్జునా! అగ్ని పొగచే ఆవరింపబడి యుండినట్లు మన ముప క్రమింపబోవు కార్యములన్నియు దోషముచే చుట్టుకొనబడి యున్నవికదా? జన్మముతో గూడి వచ్చిన కర్మ దోషయుక్తమైనను దానిని వదలివేయరాదు.

వివ॥ శిలాకాష్ఠాదులయందగ్ని అవ్యక్తముగ నుండినప్పుడు దానియందు పొగయున్నదో లేదో మనము చూడలేదు. అగ్ని వ్యక్తమైనప్పుడు పొగయు వ్యక్తమగుచున్నది. తొలుత లేనిదేదియు క్రొత్తగ పుట్టిరాదు. కనుక ఆయగ్నికి పొగ సహజమని చెప్పుచున్నాము. అట్లే నిర్గుణము, నిరాకారమునైన ఆత్మ అవ్యక్తముగ నుండినప్పుడెట్టి వైకృత్యము కనబడదు. రాగాది గుణసాంకర్యముచే జీవభావమునుపొంది వ్యక్తమగునప్పుడు వైకృత్యము కనబడుచున్నవి. జన్మించిన వెంటనే శిశువు మాతృస్తన్యమునకై నోరు మెదల్చుచున్నాడు.

ఇట్లు దేహసంరక్షణాది క్రియలన్నియు తనకు జన్మముతోనే కలుగుచున్నవి. తొలుతదేహము కలుగుటలోనే వైకృత్యముండ దేహేంద్రియములచే ఆరంభింపబడు కర్మలయందు వైకృత్యమున్నదని వేఱుగ జెప్పవలయునా? ఐనను జన్మముతోవచ్చిన కర్మయందు వైకృత్యమున్నదని మానరాదు. మానవలెననుకొన్నను మానజాలము.

ఆత్మరక్షాసూత్రములోజేరిన జ్ఞాననిష్ఠయందు శరీరకార్శ్యాది వైకృత్యము కొంతయున్నను దానిని మానరాదు.

మూ॥ అసక్తబుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి॥ 49.

తా॥ సమస్తకర్మలయందు తగులాటము జెందని బుద్ధిగలవాడు, చిత్తోపశమముగలవాడు, భౌతిక విషయములయందును, స్వర్గాది భోగములయందును ఆశమానినవాడు, కర్మరాహిత్యమువలన గలిగెడు ఉత్తమమైన లాభమును (మోక్షమును) సన్న్యాసముచే లెస్సగ పొందుచున్నాడు.

వివ॥ కర్మచేయుచుండియు దానియందు బుద్ధి తగులుకొనక పోయినప్పుడు కర్మచే బద్ధుడుకాడు. అందువల్లనే నైష్కర్మ్యసిద్ధి కలుగుచున్నది.

శ్లో॥ వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థా స్సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః॥
తే బ్రహ్మలోకేషు పరాంతకాలే పరామృతాః పరిముచ్యంతి సర్వే॥

వేదాంతశాస్త్ర విచారణచే గలిగిన విజ్ఞానమువలన లెస్సగ నిశ్చయింపబడిన ప్రయోజనమును పొందినట్టియు, శుద్ధమైన సత్త్వగుణము గలిగినట్టియు, ఉత్తమమైన అమృతమును పొందియుండునట్టియు ఆయతీశ్వరులెల్లరు శ్రేష్ఠమైన అంతకాలమున బ్రహ్మత్వముతో గూడిన దృక్పథముల యందు సన్న్యాసయోగమువలన ముక్తులగుచున్నారు.(ఈశ్లోకము కైవల్యోపనిషత్తులోను, ముండకోపనిషత్తు 3 ముం. 2 ఖండములోను, కొంచెము వర్ణభేదముతో జదివినట్టు జ్ఞాపకము )

శో॥ అంతస్సంసక్తినిర్ముక్తో జీవో మధురవృత్తిమాన్।
బహిఃకుర్వన్ నకుర్వన్ వా కర్తా భోక్తా నహి క్వచిత్।

అంతర్యమున ఆసక్తిలేక హితమైన ప్రవర్తనముగల పురుషుడు బాహ్యేంద్రియములచే కర్మ చేయుచుండువాడుకాని, చేయకుండువాడుకాని ఎందేనియు కర్తకాడు. భోక్తకాడు (అన్నపూర్ణోపనిషత్తు 1అ 57)

మూ॥ సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధమే।
సమాసేనైవ కౌంతేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా॥ 50.

తా॥ ఓయర్జునా! అభ్యాసయోగమువలన గలుగులాభము అనగా వాసనాక్షయము, చిత్తోపశమము ఈలాభమెట్లు కలుగుచున్నదో ఆత్మసాక్షాత్కారముకూడ అట్లే కలుగుచున్నది. (దానికొఱకు వేఱొకప్రయత్నము చేయవలసిన నిమిత్తములేదు. ఈయుభిప్రాయము ముక్తికోపనిషత్తు రెండవ అధ్యాయములో లెస్సగ నిరూపింపబడినది ) ఇందుకై చేయదగిన ఉత్తమమైన ఆ జ్ఞాననిష్ఠ యేదో దానిని సంక్షేపముగ జెప్పుచున్నాడ. బాగుగ దెలిసికొనుము.

మూ॥ బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ
శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ॥ 51.
వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః।
ధ్యానయోగపరోనిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥ 52.
అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్।
విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే॥ 53.

తా॥ సుఖదుఃఖములకు కారణమైన శబ్దాదివిషయ సముదాయమును నిషేధించి (అభిలాషజెందక) అట్టి సుఖములయందుగలుగు ఇచ్ఛాద్వేషములను సైతము వదలివేసి ధారణాయోగాభ్యాసముచేత తన్ను తానే నియమించుకొని పరిశుద్ధమైన బుద్ధియోగముతో కూడియుండువాడు; అనుపయోగకరమైన ప్రజాసముదాయమునుండి వేఱుసేయబడిన పవిత్రస్థలమును దనకు నివాసస్థానముగ ఉపయోగించుకొని మితముగ భుజించుచు (అభ్యాసయోగముచేత) మనోవాక్కాయములను స్వాధీనములో నిలుపుకొని నియతమైన వైరాగ్యము లెస్సగ నాశ్రయించి ధ్యానయోగమును ముఖ్యముగ అవలంభించియుండువాడు; అహంకారమును, బలమును, దర్పమును, కామమును, క్రోధమును, అక్కఱకు మించిన భోగ్యవస్తుసంపాదనమును విడిచిపెట్టి మమకారమును జెందక నిశ్చలాంతఃకరణము కలిగియుండువాడు బ్రహ్మభావమును పొందుటకు సమర్థుడగుచున్నాడు. (ఇందు అభ్యాసయోగము, జ్ఞానయోగము అవసరమని తెలియుచున్నది. కాని భౌతికయుద్ధమవసరమని బుజువులేదు.)

ఓం. తత్. సత్.

# శతపత్రము

# 116

మూ॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాంక్షతి।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥ 54.

తా॥ బ్రహ్మత్వమును పొంది ఆత్మప్రసన్నత గాంచిన యతీశ్వరుడు అశుభమును గుఱించి శోకింపడు. శుభమును గుఱించి అపేక్షింపడు. సమస్త భూతములయందు సమభావము కలవాడై అస్మత్పదలక్ష్యార్థమైన భగవత్తత్త్వమునందు ఉత్తమమైన భక్తిని ప్రాపించుచున్నాడు.

శ్లో॥ సర్వాతీతపదాలంబీ పరిపూర్ణైకచిన్మయః।
నోద్వేగీ నచతుష్టాత్మా సంసారే నావసీదతి॥
ప్రాప్తకర్మకరో నిత్యం శత్రుమిత్ర సమానదృక్।
ఈహితానీహితైర్ముక్తో నశోచతి నకాంక్షతి॥

విశ్వాతీతమైన పరమపదము నాశ్రయించి పరిపూర్ణజ్ఞానమే తానై ఒకప్పుడు దిగులుపడక ఒకప్పుడు సంతోషపడక తనకు సంప్రాప్తమైన నియత కర్మ చేయుచు శత్రువులను, మిత్రులను సమదృష్టితో జూచుచు విషయ భోగాదులలో సామాన్య ప్రజాసముదాయమున కిష్టమైనవానిని, ఇష్టముకాని వానిని అన్నిటిని వదలివేసియుండు పురుషుడు (ఎట్టిసందర్భమునందైన) శోకింపడు, కాంక్షింపడు. (అట్టివాడు) సంసృతియందు పతితుడుకాడు.

(మహోపనిషత్తు 6 అ. 63-64)

మూ॥ భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్॥ 55.

సర్వభూతములయందు ''నేను నే''నని పేర్కొనబడునది యేది? ఏలాటిది? అను రహస్యమును యతీశ్వరుడు పూర్వశ్లోకములో జెప్పబడిన

భక్తిచే ఉన్నదున్నటుల లెస్సగ దెలిసికొనుచున్నాడు. అటుల యథార్థముగ దెలిసికొని అందువల్లనే యటుపిమ్మట అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వ మును ప్రవేశించుచున్నాడు. (స్వస్వరూపమును జెందుచున్నాడు.)

మూ॥ సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్॥ 56.

తా॥ అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వము నాశ్రయించిన పురుషుడు శ్రౌత స్మార్త లౌకికాది విహితకర్మలను, ఆధ్యాత్మిక కర్మయైన అభ్యాసయోగ మును సమస్తకర్మలను ఎల్లప్పుడుచేయుచుండువాడైనను ఆశ్రయభూతమైన ఆభగవత్తత్త్వముయొక్క ప్రసాదమువలన శాశ్వతము అవ్యయమునైన పద మును పొందుచున్నాడు.

మూ॥ చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ॥ 57.

తా॥ సర్వభూతములయందు నేనని పేర్కొనబడు పరిశుద్ధాత్మయే శ్రేష్ఠ మని భావించి సమస్తకర్మలను ఆపరిశుద్ధాత్మయందు మనస్సుచే సంకేపించి జ్ఞానయోగము నాశ్రయించి యెల్లప్పుడును ఆపరిశుద్ధాత్మయందు చిత్తము నిలిపి యుండుము. (ఇందువలన యమ నియమాద్యష్టాంగ యోగములు ముఖ్యమని తెలియుచున్నది )

శ్లో॥ త్వయి దత్తమనోబుద్ధిర్యః సంతుష్టః సదా భవేత్।
త్వయి సంత్యక్త కర్మా యస్తన్మనస్తే శుభంగృహమ్॥

ఎవడైతే తన మనస్సును, బుద్ధిని నీయందు సమర్పించుచున్నాడో; ఎవ డైతే సమస్తకర్మలను నీయందు వదలివేయుచున్నాడో; ఎల్లప్పుడును సంతు ష్టుడగుచున్నాడో; అట్టివాని మనస్సు నీకు శుభమైన గృహము.
(అధ్యా. అయో. 6-58 )

మూ॥ మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి।
అథ చేత్త్వమహంకారాన్నశ్రోష్యసి వినంక్ష్యసి॥ 58.

తా॥ పూర్వశ్లోకరీతిగా పరిశుద్ధాత్మయందు చిత్తమునిల్పినవాడవై దుస్త రములైన భవసాగరములను పరమాత్మ ప్రసన్నతవలన తరింపగలవు. ఇక ను అహంకారమువలన నీవు నామాట విన వేని నశింతువు.

మూ॥ యద్యహంకారమాశ్రిత్య నయోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి॥ 59.

తా॥ అహంకారము నాశ్రయించి యుద్ధముచేయనని తలతువేని ఈ నీ నిశ్చయము వ్యర్థము. ప్రకృతియే నిన్ను (యుద్ధమునకు) నియోగింపగలదు.

వివ॥ శరీరమే నేనను కొనినవాడు శారీరకర్మకు నేను కర్తననుచున్నాడు. కర్మఫలములకు భోక్తననుచున్నాడు. విషయసుఖమే పరమసుఖమని తలచుచున్నాడు. ఈసుఖములను సమకూర్చు కామాదిగుణములను చుట్టములని నమ్ముచున్నాడు. ప్రేమించుచున్నాడు ఆధ్యాత్మికయుద్ధములో జేరిన అభ్యాసయోగముచే కామాదులు పడగొట్టబడగా తనకు ప్రియమైన విషయానందము తప్పిపోవుచున్నది. కనుక నాకు కలహము వలదనుచున్నాడు. అట్టివాడు ప్రకృతిచే నియోగింపబడి రాగాది గుణములచే బద్ధుడై విషయవాగురయందు దగులుకొనుచున్నాడు. అందువల్లనే బాహ్యాంతరములనెక్కడ జూచినను శత్రువులేర్పడుచున్నారు. తుదకు వలదనుకొన్నను కలహములలో డిగక తప్పదు. నేను యుద్ధముచేయనన్న నిశ్చయము వ్యర్థమగుచున్నది.

"కామము మనోబుద్ధీంద్రియముల నాశ్రయించి పురుషుని మోహింపజేసి అతనిచే పాపముచేయించుచున్నది. పాపముచేయరాదని తెలిసియుండియు కామముచే బలవంతముగ నియోగింపబడి చేయుచున్నాడు. కామమనునది జ్ఞానికి నిత్యశత్రువు" అని యిరువదియేడవ అధ్యాయము 36 మొదలు 40 వఱకు శ్లోకములలో జదివియుంటిమి. అందువలన అంతశ్శత్రువుల గెలువని వాని కెల్లను కలహము తప్పదని నమ్మవలయును.

మూ॥ స్వభావజేన కౌంతేయ! నిబద్ధః స్వేన కర్మణా।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్॥ 60.

తా॥ ఓయర్జునా! (నీవు) దేనిని చేయుటకు అవివేకమువలన ఇష్టపడకున్నాడవో దానిని స్వభావజన్యమైన స్వకర్మచే బద్ధుడవై అప్రయత్నముగనైన జేయగలవు. (పూర్వజన్మములలో జేయబడిన యోగాభ్యాస బలముచే ఆకర్షింపబడి పురుషుడు అప్రయత్నముగనైన పైదారికేగుచున్నాడని భీష్మప. 30అ. 44శ్లోకమువలన వ్యక్తమగుచున్నది.)

మూ॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥ 61.
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥ 62.

తా॥ ఓ యర్జునా! జనన మరణములకు హేతువైన సంసృతిచక్రము నధిష్ఠించియుండు జీవులనన్నిటిని స్వకీయమైన మాయచే ఆచక్రమువెంట పరిభ్రమింపజేయుచు సర్వనియామకుడైన ప్రభువు పరిశుద్ధాత్మ సమస్త భూతముల హృదయసీమయందు నిలిచియున్నాడు.

ఓభారతా! సర్వము తానేయన్నభావముతో నీవా పరిశుద్ధాత్మనే శరణొందుము. (ఆశ్రయింపుము) అట్టి యాత్మప్రసాదమువలన ఉత్తమమైన చిత్తోపశమమును, శాశ్వతమైన మోక్షపదమును పొందగలవు.

వివ॥ "నాహృదయమున ఈశ్వరుడున్నాడు. నేనాయనను శరణొందుచున్నాదను" అనగా ఈశ్వరుడొకడు, నేనొకడను కావలసివచ్చును. దీనిని అద్వైతు లంగీకరింపరు. "సర్వభావేన" అనుటచేత సర్వమీశ్వరుడే ఐన పుడు నేనుసైతమీశ్వరుడనే యగుదును. దేహేంద్రియములు, సర్వవస్తువులు ఈశ్వరుడేయగును. ఈశ్వరునకంటె వేఱువస్తువేదియు కనబడదు. అప్పుడీశ్వరుని శరణొందితినన్నను, నన్నేనేను శరణొందితినన్నను ఒకటే యర్థము. ఆస్థితికి వచ్చినప్పుడు శరణొందుటయనగా స్వస్వరూపము జెందుట యని యూహింపవలయును. ఈస్థితియందే మోక్షస్థానము సిద్ధాంతము.

"ఏకాగ్రమనసా యో మాం ధ్యాయతే హరిమవ్యయమ్।
హృత్పంకజేచ స్వాత్మానం స ముక్తో నాత్ర సంశయః"

తనహృదయ కమలమునందు అంతరాత్మ స్వరూపమైయుండునట్టియు అస్మత్పదలక్ష్యార్థమైయుండునట్టియు, నాశములేనట్టియు శ్రీహరిని ఏకాగ్ర చిత్తముతో ఎవడైతే ధ్యానించుచున్నాడో వాడు ముక్తుడు. ఇందు సంశయము లేదు. (వాసుదేవోపనిషత్తు)

శ్లో॥ పుండరీకంతు తన్మధ్యే ఆకాశో దహరోఽస్తి తత్
స శివస్సచ్చిదానందస్సోఽన్వేష్టవ్యో ముముక్షుభిః।

(భగవత్తత్త్వనిధానము) హృదయకమలము. దానినడుమ ప్రకాశ మానమైన దహరాకాశమనునది యున్నది. ఆయాకాశమే సత్యజ్ఞానానంద స్వరూపుడైన శివుడు, మోక్షము నభిలషించినవారు వెదకి కనిపెట్టదగినది ఆ యాకాశమే. (పంచ బ్రహ్మోపనిషత్ 35 శ్లో)

శ్లో॥ సుషుమ్నాసుషిదే సూక్ష్మే దహరాకాశమండలే।
జ్యోతిరూపధరం సాక్షాద్గురుదేవం సమర్చయేత్॥

సూక్ష్మమైన సుషుమ్నానాళమునందు దహరాకాశమండలమున జ్యోతి రూపమును ధరించియుండు సాక్షాద్గురుదేవుని లెస్సగ పూజింపవలయును. (విశ్వగీత 75)

"అష్టదళములుగల హృదయ కమలమధ్యమున సూర్యమండల మున్నది. సూర్యమండల మధ్యమున చంద్రమండలమున్నది. దానినడుమ మంచిప్రకాశమున్నది. ఆప్రకాశములో నానారత్నయుతమైన పసిడివర్ణ మున్నది. అందు రాగాదిగుణవర్జితుడైన పరమాత్మయున్నాడు. ఆమహావిష్ణు వును ధ్యానింపవలయును" (ధ్యానబిందూపనిషత్తు 26 మో॥)

శ్లో॥ అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః
హృదామనీషీ మనసాభిక్లృప్తో య ఏతద్విదురమృతాస్తే భవంతి॥

అంతరాత్మ పరమపురుషుడు అంగుష్ఠమాత్ర స్వరూపుడై హృదయ ముచే ప్రజ్ఞగలవాడై మనస్సుచే సంగ్రహింపబడి యెల్లప్పుడును జనుల హృదయమునందు ప్రవేశించియున్నాడు ఆపరిశుద్ధాత్మను ఎవరెఱుగుదురో వారు ముక్తులగుచున్నారు. (శ్వేతాశ్వతరోపనిషత్తు 3. అ. 13. శ్లో.)

శ్లో॥ సమస్తసాక్షీ సర్వాత్మా సర్వభూత గుహాశయః।
సర్వేంద్రియ గుణాభాసః సర్వేంద్రియ వివర్జితః॥

సర్వత్ర "నేను నే" నని పేర్కొనబడు పరిశుద్ధాత్మ సమస్తభూతము ల హృదయములయందున్నాడు. సర్వేంద్రియములను, గుణములను ప్రకా శింపజేయుచున్నాడు. సర్వేంద్రియములకు వేఱైయున్నాడు. సమస్తము చూ చుచున్నాడు. (బ్రహ్మవిద్యోపనిషత్తు 107 శ్లో.)

శ్లో॥ హృత్పుండరీకమధ్యేతు భావయేత్పరమేశ్వరమ్।
సాక్షిణం బుద్ధివృత్తస్య పరమ ప్రేమగోచరమ్॥

బుద్ధియొనర్చు కార్యమునకెల్ల సాక్షియైనట్టియు, ఉత్తమమైన ప్రేమతో కనుగొన దగినట్టియు పరమేశ్వరుని హృదయకమలమధ్యమున భావింపవలయును. (మైత్రేయుపనిషత్తు 1-8)

మూ॥ ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు॥ 63.

తా॥ అనియిట్లు నీకొఱకు కేవలము గోప్యమైన జ్ఞానము నాచే జెప్పబడినది. దీనిని కొఱతలేకుండ విమర్శించి నీయిష్టమెట్లో అటులజేయుము.

మూ॥ సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః।
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్॥ 64.

తా॥ నాకు నిశ్చయముగ ఇష్టుడవైయున్నాడవని నీకొఱకు మఱియు హితమును చెప్పబోవు చున్నాడను. అందువలన అన్నిటికంటె రహస్యమైనట్టియు శ్రేష్ఠమైనట్టియు నామాటవినుము.

మూ॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే॥ 65

తా॥ అంతరంగమున ''నేనునే''నని పేర్కొనబడు పరిశుద్ధాత్మయందు చిత్తమునిలుపుము. అయంతరాత్మనే సేవింపుము. పూజింపుము. నమస్కరింపుము. అట్టి నన్నే చెందగలవు. నాకుప్రియుడవై యున్నాడవు ఇది సత్యము. నీకు ప్రతిజ్ఞచేయుచున్నాడను. (భీష్మ ప. 33అ. 34 శ్లోకములోను ఈభావము వచ్చినది.)

మూ॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥ 66.

తా॥ ప్రవృత్తిలోజేరిన సమస్త ధర్మములు బంధహేతువులే. వానినన్నిటిని వదలివేసి అస్మత్పద లక్ష్యార్థమైన భగవత్తత్త్వమును ఒక్కదానినే శరణొందుము. నేననెడు అభగవత్తత్త్వము సమస్త కిల్బిషములనుండి నిన్ను విడిపింపగలదు. శోకింపకుము. ( ఈశ్లోకము శివగీత 14 అధ్యాయములో చూచినట్టు జ్ఞాపకము.)

శ్లో॥ విహాయ ధర్మార్థకామాన్ మహాత్మా సమర్చయేత్స్వస్థమీశానమీడ్యమ్।
తతస్సమస్సర్వ పాపైర్విముక్తః పరం నిధానం సమాప్నోతి దివ్యమ్॥

మహాత్ముడైన యోగీశ్వరుడు (ప్రవృత్తిలోజేరిన) ధర్మార్థకామములను వదలి తనయందేయుండు స్తోత్రపాత్రుడైన పరమేశ్వరుని లెస్సగ పూజింపవలయును. అందువలన సమదృష్టి గలవాడై సమస్తపాపములచే విడువబడి లోకాతీతమైన మోక్షపదమును పొందుచున్నాడు. (విశ్వగీత 79.)

మూ॥ ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన
న చాశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి॥ 67.

తా॥ ఇందాక నీకు జెప్పబడిన యీబ్రహ్మజ్ఞానము తపస్సుచేయనివానికిని, భక్తిలేనివానికిని, విననిచ్ఛలేనివానికిని, అస్మత్పదలక్ష్యార్థమైన అంతరాత్మనుగుఱించి యెవ్వడైతే అసహ్యపడుచున్నాడో అట్టివానికిని ఎప్పుడైనను చెప్పదగినదికాదు.

"తదితం నాప్రశాంతాయ నాదాంతా యాతపస్వినే
నా వేదవిదుషే వాచ్యం తథా నానుగతాయ చ
నాసూయకాయానృజవే నచానిర్దిష్టకారిణే
న తర్కశాస్త్రదగ్ధాయ తథైవ పిశునాయ చ"

ఈజ్ఞానము ప్రశాంతుడు కానివానికి, ఇంద్రియనిగ్రహము లేనివానికిని తపస్సుచేయనివానికిని, వేదము నెఱుగనివానికిని, అదేవిధముగా గురుధర్మము ననుసరింపనివానికిని, అసూయాపరునకును, ఋజువర్తనములేనివానికిని, శాస్త్రదిష్టములుకానికార్యము లొనర్చువానికిని, తర్కశాస్త్రజ్ఞానముచేగర్వితుడైనవానికిని, లేనిపోని చాడీమాటలతో కలహముల బుట్టించువానికిని చెప్పదగినదికాదు. (భారత శాంతి. 246అ. 16-17-18)

శ్లో॥ ఇదం రహస్యం హృదయం మహాత్మనో
మయైవ సాక్షాత్కథితం తవానఘ
మద్భక్తిహీనాయ శఠాయ న త్వయా
దాతవ్యమైంద్రాదపి రాజ్యతోఽధికమ్॥

పాపరహితుడవైన అంజనేయా! శ్రీరామచంద్రవాచ్య పరమాత్మనైన నాహృదయరహస్యమైనట్టియు, ప్రత్యక్షముగా నాచేతనే నీకు జెప్పబడినట్టియు

స్వర్గసామ్రాజ్యమునకంటె అధికమైనట్టియు ఈ జ్ఞానమును నాయందు భక్తిలేని దుష్టునకు ఉపదేశింపరాదు. (అధ్యా. బాల. 1స. 52)

శ్లో॥ అశ్రద్దధానాయ న నాస్తికాయ న నష్టధర్మాయ న నిర్ఘృణాయ।
న హేతుదుష్టాయ గురుద్రుహేచ నానాత్మభూతాయ నివేద్యమేతత్॥

(జ్ఞానమునందు) శ్రద్ధలేనివానికిని, భగవద్విశ్వాసము లేనివానికిని, ధర్మముతప్పి వర్తించువానికిని, జీవకారుణ్యము లేనివానికిని, బీజోత్పత్తిచేతనే దుష్టుడైనవానికిని, గురువులను హింసించువానికిని, ఆత్మప్రాప్తిలేనివానికిని ఈజ్ఞానము తెలుపదగినదికాదు. (భారతము అనుశాసన. 134 అ. 16 శ్లో)

శ్లో॥ శాంకరీయం మహాశాస్త్రం నదేయం యస్యకస్యచిత్।
నాస్తికాయ కృతఘ్నాయ దుర్వృత్తాయ దురాత్మనే॥

ఈశ్వరాధీనమైన యీమహాశాస్త్రము ఏలాటివాడో యొకడు తటస్థించినంతనే వానికెల్ల ఈయుదగినదికాదు. భగవద్విశ్వాసములేని వానికిని, చేయబడిన సత్కార్యములను చెడగొట్టువానికిని, చెడుప్రవర్తనము గలవానికిని చెడుమనస్సుగలవానికిని ఈయదగినదికాదు (తేజోబిందూపనిషత్తు6అ 108)

"గుహ్యాదపి గుహ్యతరం నాదీక్షితాయోపదిశేత్ నానూచానాయ నాయజ్ఞశీలాయ నావైష్ణవాయ నాయోగినే నబహుభాషిణే నాప్రియవాదినే నాసంవత్సరవేదినే నాతుష్టాయ నానధీతవేదాయోపదిశేత్"

రహస్యమునకంటెను అతిరహస్యమైన యీజ్ఞానము దీక్షలేని వానికుపదేసింపరాదు. గురువులయొద్ద షడంగయుక్తముగ వేదము నేర్చుకొనని వానికిని, దేవపూజాది కార్యములయందు పాల్గొనని వానికిని, విష్ణుభక్తిలేనివానికని, యోగాభ్యాసము లేనివానికిని, అధికప్రసంగము చేయువానికిని, అప్రియముగా వాదించువానికిని, కనీసమొక సంవత్సరకాలమైనను గురువులచే దెలియబడనివానికిని, తృప్తిపడు స్వభావము లేనివానికిని, వేదాధ్యయనము లేనివానికిని, ఉపదేసింపరాదు. (ముద్గలోపనిషత్తు)

శ్లో॥ పైప్పలాద! మహాశాస్త్రం నదేయం యస్యకస్యచిత్।
నాస్తికాయ కృతఘ్నాయ దుర్వృత్తాయ దురాత్మనే॥
దాంభికాయ నృశంసాయ శఠాయానృతభాషిణే।

ఓపైప్పలాదమునీంద్రా! గొప్పదైన యీశాస్త్రము ఎవడుతటస్థించినను వానికెల్ల ఈయదగినగినదికాదు. దేవుడు లేడని నమ్మినవానికిని జేయబడిన

సత్కార్యముల జెఱుచువానికిని, చెడ్డప్రవర్తనముగలవానికిని, చెడ్డమనస్సు గలవానికిని, బడాయిగుణముగలవానికిని, హత్యాప్రచారము జరుపువానికిని, కపటచిత్తునకును, కల్లలాడు స్వభావముగలవానికిని ఈయదగినది కాదు.
(శరభోపనిషత్తు 32-33)

శ్లో॥ ఇదమష్టోత్తరశతం నదేయం యస్యకస్యచిత్॥
నాస్తికాయ కృతఘ్నాయ దురాచారరతాయవై।
మద్భక్తివిముఖా యాసచ్ఛాస్త్రగర్తేషుముహ్యతే।
గురుభక్తివిహీనాయ దాతవ్యం న కదాచన॥

నూటయెనిమిది సంఖ్యగల యీవేదాంతగ్రంథము ఏలాటివాడు తట స్థించినను వానికెల్ల ఈయదగినదికాదు. నాస్తికునకు, కృతఘ్నునకు, దురాచార పరునకు, భగద్భక్తి లేనివానికి, బురదగుంటలవంటి దుష్టశాస్త్రముల లోబడి మతిహీనమైపోయిన వానికి, గురుభక్తిలేనివానికి, ఎప్పుడైనను ఈయ దగినదికాదు. (ముక్తికోపనిషత్తు 1. అ 47-48)

మూ॥ య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తింమయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః॥ 68.
నచ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః।
భవితా నచ మే తస్మాదన్యః ప్రియతరో భువి॥ 69.

తా॥ శ్రేష్ఠమైనట్టియు, రహస్యమైనట్టియు, ఈజ్ఞానమును అస్మత్పద లక్ష్యార్థసేవా పరాయణులయందు ఎవడైతే లెస్సగ అవగతము చేయుచు న్నాడో అట్టివాడు నేననెడు అంతర్యామి తత్త్వమునందు ఉత్తమమైన భక్తి సలిపినవాడై నన్నే చెందగలడు. సంశయములేదు. మనుష్యులయందు నాకు ప్రియముచేయువారిలో అంతకంటె శ్రేష్ఠుడు ఒకానొకడైననులేదు.

నాకు మిగుల ప్రియమైనవాడు అతనికంటె నితరుడు లోకములో ఇక మీదనైనను కలుగబోడు.

మూ॥ అధ్యేష్యతేచ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః
జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టస్స్యామితి మే మతిః॥ 70.

తా॥ ధర్మమునకు సంబంధించిన యీ మనయిరువుర సంవాదమును ఎవడైతే చదువగలడో వానిచేత నేను జ్ఞానయజ్ఞముచే పూజింపబడినవాడనని నాతలంపు.

మూ॥ శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః
సోఽపి ముక్తః శుభాఀల్లోకాఀ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్॥ 71.

తా॥ ఏమానవుడైతే శ్రద్ధగలిగి అసూయలేక (ఈ జ్ఞానమును) వినుచున్నాడో అతడు సైతము ముక్తుడై పుణ్యకర్మానుష్ఠాన పరులు పొందదగిన శుభలోకములను పొందును.

వివ॥ భగవత్తత్త్వమునందు విశ్వాసము కలిగినమీదట అసూయయుండదు. ఆ పిమ్మట పెద్దలవలన జ్ఞానవాక్యములు వినుచురాగా కొంతకాలమునకు దురాచారములు తొలగిపోయి చిత్తోపశమము కలుగుచున్నది అందువలన అభ్యాసయోగులు పొందిన ప్రయోజనమునే ఇతడు పొందవచ్చును కాని అభ్యాసయోగులు పొందినంత సులభముగ పొందుననిచెప్పరాదు.

మూ॥ కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా।
కచ్చిదజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ॥ 72.

తా॥ ఓ యర్జునా! ఇట్లు చెప్పబడిన యోగశాస్త్రమంతయు ఏకాగ్రచిత్తముతో నీచేత ఆలకింపబడినదా? ధనంజయా! అజ్ఞానమువలన గలిగిన నీమనోవైకల్యము నశించినదా?

అర్జునుడు చెప్పుచున్నాడు:-

మూ॥ నష్టోమోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత!
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనంతవ॥ 73.

తా॥ స్థానభ్రంశములేని ఓ భగవంతా! నీయనుగ్రహమువలన నా (ప్రయత్నము) చెత మనోవైకల్యము నశించినది. మంచిప్రజ్ఞకలిగినది. సుస్థిరుడనైయున్నాడను. సంశయము తీరిపోయినది. నీమాట (ప్రకారము) చేయబోవుచున్నాడను.

వివ॥ పూర్వసుకృతము కలిసివచ్చినప్పుడు గురువుల యనుగ్రహము కలుగుచున్నది. ఐనను పురుషుని ప్రయత్నము చేతనే కార్యము సాగవలయును కనుక నీయనుగ్రహము వలన నాచేతనే మోహము నష్టపఱుపబడినది. జ్ఞప్తిపొందబడినది. సుస్థిరుడనైయున్నాడను. అనిచెప్పబడినది. మఱియు

"విను పురుషుడుగావింపనిపనులకు దైవమది యెట్లుఫలమొనరించుఁ" అనియు "పౌరుషంబు దైవంబు తోడ్పాటులేక ఫలముపొందంగనేరదు పార్థివేంద్ర" యనియు ఆంధ్రభారతములో జదివినట్లు జ్ఞాపకము. కాబట్టి శిష్యుడు గురువులవారి యాజ్ఞానుసారము వర్తించుచు, స్వప్రయత్నముతో సాధించి శుభోన్నతుడు కావలయును.

సంజయుడు చెప్పుచున్నాడు:-

మూ॥ ఇత్యహం వాసుదేవస్య పార్థస్యచ మహాత్మనః
సంవాదమిమమశ్రౌషమద్భుతం రోమహర్షణమ్॥

తా॥ అని యిట్లు సర్వభూతాంతరస్థుడైన భగవంతునకు, ఆత్మరక్షణార్థియైన మహాత్మునకు జరిగిన యీసంవాదము శరీరమునకు గగుర్పాటొందించునదియు, అద్భుతమునైయుండ నేను వింటిని.

మూ॥ వ్యాసప్రసాదాచ్ఛ్రుతవానేత ద్గుహ్యతమం పరమ్।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయత స్స్వయమ్॥ 75.

తా॥ ప్రత్యక్షముగా వ్యాఖ్యానము చేయుచుండు యోగేశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్మవలన కేవలరహస్యము, శ్రేష్ఠమునైన యీయోగమును వేదవ్యాసమునిందుని యనుగ్రహమువలన స్వయముగ విన్నాడను.

మూ॥ రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామిచ ముహుర్ముహుః॥ 76.

తా॥ ఓరాజా! శ్రీకృష్ణార్జునులయందు వర్తించిన అద్భుతమైన యీ పుణ్యసంవాదమును తలచితలచి మరలమరల సంతోషించుచున్నాడను.

మూ॥ తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామిచ పునఃపునః॥ 77

తా॥ ఓరాజా! శ్రీహరివలన జూడఁబడిన అత్యాశ్చర్యకరమైన ఆవిశ్వరూపమును సైతము తలచితలచి మరలమరల సంతోషించుచున్నాఁడను. నాకు గొప్ప విస్మయముకలిగినది.

మూ॥ యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ॥ 78.

తా॥ సమస్తయోగములకు నియామకుఁడైన శ్రీకృష్ణపరమాత్మ యెచ్చట నుండునో, పుణ్యక్రియాసాధనము (అభ్యాసయోగము) ధరించిన ఆత్మరక్షణార్థి యెచ్చటనుండునో అచ్చట సంపద, విజయము, ప్రాప్తి స్థిరమైన నీతి యుండునని నాయభిప్రాయము.

ఇది శ్రీమహాభారతము భీష్మపర్వములో మోక్షసన్న్యాసయోగమనెడు నలువదిరెండవ అధ్యాయము.

